

- డా॥ అంబడిపూడి నాగభూషణం

# బాల వ్యాకరణ సూక్తులు

MOHAN PUBLICATIONS

Mohanpublication.com

Granthanidhi.blogspot.in

ఆధ్యాత్మిక, జ్యోతిష, వాస్తు, ఆరోగ్యాది అనేక విషయాలు తెలుసుకోండి... ఫేస్‌బుక్

మోహన్ పబ్లికేషన్స్

కోటగుమ్మం, అజంతా హోటల్ ఎదుట,
రాజమహేంద్రవరం – 533 101.

# బాలవ్యాకరణసూక్తులు

(బాలవ్యాకరణోద్ద్యోతసంజీవనీవిషయానుశీలనము)

తృతీయభాగము

## సమాసతద్ధితక్రియాకృత్ప్రకీర్ణకపరిచ్ఛేదములు,

డాక్టర్ అంబడిపూడి నాగభూషణం

బాలవ్యాకరణసూక్తులు
— తృతీయభాగము

ప్రతులు : 1000

ప్రచురణ : జూన్ 1988

ప్రకాశకురాలు : అంబడిపూడి లక్ష్మీదేవి

మూల్యము : రూ. 58/-

---

మూడుభాగముల 'బాలవ్యాకరణసూక్తులు'

ముద్రణకు తెలుగు విశ్వవిద్యాలయము, హైదరాబాదువారిచే

రూ॥ 5,000/-లు ఆర్థిక సహాయ మందింపఁబడినది.

---

డాక్టర్ అంబడిపూడి నాగభూషణం

డాక్టర్ కె.వి.కె. సంస్కృత కళాశాల,

8/8, అరండల్ పేట,

గుంటూరు-2.

ముద్రణ :

గౌతమి ప్రింటర్స్

బ్రాడీపేట, గుంటూరు-1.



బావ :
మల్లాది శేష గిరిరావు

సోదరి :
అంజనాదేవి

వీరు నా రసనవట్టిభేద పింపమంత్ర చేత
యెల్లవారల గణియించుం మమత
జనసర వైంనవు దాదరంబునఁ దోడు
గా నిల్చు సాష్టాంగదిము మెఱయు
దప్పి కొఁకలియు నిద్ర యుంలనతయు చేత
తనవెగా నెల్లరవనులఁ దీర్చు
బావ, మల్లాది సద్వంశయంశఃపుంజ
సంవర్ధకుండు శేష గిరిరావు

చెల్లి, అంజనాదేవియు, శేష కాంతు
శ్రీనివాసుఁడు, శైలజా ప్రియంధవుండు
నధికసుఖసంపదానుకూల్యములఁ గనఁగ
స్వీకరించుదురు గాత విహాచిఅంతకాన్న

# కృ త జ్ఞ త లు

జననీజనకు లాదిలక్ష్మీప్రసాదులకుఁ బాదాభివందనములు.

లక్షణాక్షరభిక్షపెట్టి యాదరముతో నన్ని విషయములఁ బ్రోత్సహించుచున్న మాపూజ్యగురువర్యులు డాక్టర్ బేతవోలు రామబ్రహ్మంగారియెడ సదా కృతజ్ఞుఁడ.

ఇం దుద్ధరింపఁబడిన, ఉద్ధరింపఁబడకయు సాధారము లనఁదగిన యాయా గ్రంథములకర్తలకును.

ప్రథమరచనముగా నాదరమునకుఁ బాత్ర మైన యీగ్రంథ మిన్నాళ్ళ కేని మూఁడుభాగములుగా ముద్రించు ప్రయత్నమున బూన్పిఁ యయిదువేల రూపాయల యార్థికసహాయమందించిన తెలుఁగు విశ్వవిద్యాలయమునకును. కృతజ్ఞతలు

ఈప్రయత్నములో సహకరించిన మా విద్యార్థులు పాలగుళ్ళశ్రీనివాసరెడ్డి, ఘటం భావనారాయణ ప్రభృతులకృషి యెన్నఁదగినది.

ముద్రణమున నాకు శ్రమ చాలవఱకుఁ దగ్గించి శ్రద్ధతోఁ బ్రాధాన్యమిచ్చి ముద్రించిన గౌతమిప్రింటర్స్ మేనేజింగ్ పార్టనర్ శ్రీగుడిసెట్టినందశేఖర్ గారికి, తగు సలహాలతో నందముగా 'ఆట్టహాసము'తో గ్రంథమునకు సౌముఖ్యమునుగూడఁ గల్పించిన ప్రముఖకళారచయిత శ్రీవల్లూరు శివప్రసాద్ గారికి అభినందనలు.

పెక్కురవలెఁ గాక సమర్థముగా నీగ్రంథముల కూర్పరులు నేర్పరులు పి. చంద్రశేఖర్, టి.వి. రామారావులను ప్రత్యేకముగా నభినందింప వలసినదే.

ఇటు గొన్ని విశేషములను వీ రిట్లు వివరించిరి. 'వినవర్ణకముల (న.తద్ధితము) తుదిస్వరము లోపించి సరళాదేశసంధి జరుగుట గలదు. కమ్మని+దేనె కమ్మందేనె. (నై.ష.2.99) చక్కని+పడు చక్కంబడు (ఉద్యో.1.312) [ఉ.288]

ఇట 'వినవర్ణకములు' అనంగా నిగాగమమును. సవర్ణకము నని యర్థము సెన్నందగును.

చక్కంజాయ మున్నగురీతిగా నన్నకవి సాధించినరూపము లసాధువు లే [ఉ.288] యనుటకు సందేహము లేదు. కాని ప్రస్తుతవివరణమున వీరును దానికిసన్నిహితముగ నవరూపములనె సాధించుచున్నారు. వినవర్ణము లలో స్వరలోప మెట్లో చేసికొనంగా తెల్లందమ్మి నల్లందొర యిత్యాదిరూపములు గాక తప్పునా? 'సరళాదేశసంధి' యని వివరించుటో సరళాదేశమును మాత్రమె ప్రస్తావించినను ద్రుతకార్యము తెల్ల నగును. కమ్మందేనె యనుచో నిట్లే కదా. ఈవివరణమునకు లక్ష్యముగా 'కమ్మందేనె' యున్న దొక్కటియె కన్పించుచున్నది. ఇట్టియెడలం బ్రౌఢ.కొన్నియెడల [సమా.18]నని చెప్పుటయె యెంతవఱ కుచితమో నిర్ణయింపరాకుండంగా వీ రింకను సామాన్యముగాం జెప్పుట సంగతము కా దనక తీఱదు గదా.[చూ.ద్రు.]

## ద్విత్వపరకహ్రస్వము :

'ద్విరుక్తం బగుహల్లు పరం బగునపు డాచ్ఛికం బగుదీర్ఘంబునకు హ్రస్వం బగు' [18]ననుసూరిసూత్రమును వీరు ద్విరుక్తం బగుహల్లు పరం బగునపుడు పదద్వయసంధిలో నాచ్ఛికం బగుదీర్ఘంబునకు హ్రస్వం బగు [ఉ.76సూ] నని వివరించిరి. "పదద్వయసంధిలో" ననుదానిని వీ రధికముగాం జేర్చిరి. సూరిలక్షణము ననుసరించి యేకపదమునందును [సంధికి భిన్నమైనదశలో] ద్విరుక్తహల్పరకత్వమున హ్రస్వము రావలసియుండంగా నది సరి కా దని యీవివరణముచే వరుబవారియభిప్రాయము నెన్నవలెను. తెన్నిళ్ళు మూన్నాళ్ళు [నాన్నాళ్ళు] పీళ్ళు ఱాళ్ళు కాళ్ళ విళ్ళు మున్నగు స్థలములందును గల్గుహ్రస్వమును వైయాకరణులు సమ్మతింపరు. [వ్యా. సం.స.1215]నిట్లు మున్నగునేకపదముల హ్రస్వమును పాటించుటకయి యిట్లు పదద్వయసంధి యని చెప్పి రేమో.

# బాలవ్యాకరణసూత్రములు

## తృతీయంభాగము

## విషయసూచిక



| విషయము | బాల.సూ. | ఉ.సూ. | పుట |
|---|---|---|---|
| సమాసపరిచ్ఛేదము | 26 | 91 | 1-105 |
| 1. సమాసము | 1 | (1) | 1 |
| 2. రామునిగుణములు | | | 1 |
| 3. సమాసభేదములు | 2 | 2,70 | 2 |
| 4. తత్పురుషాదులు | 3 | 69 | 4 |
| 5. దొంగభయము | | | 7 |
| 6. రామునిబాణము | | | 12 |
| 7. సమాసకాదులు | | | 13 |
| 8. జ్ఞాపకసిద్ధములు | | 71 | 15 |
| 9. త్రికము | 4 | 74 | 17 |
| 10. కర్మధారయము | 5 | — | 18 |
| 11. అనేకమాటలు | | | 30 |
| 12. బిరుదోత్తరపదకసమాసము | | 76 | 31 |
| 13. బహువ్రీహి | 6 | 87 | 35 |
| 14. కలకంఠుడు | | | 37 |
| 15. ద్వంద్వము | 7 | 89 | 37 |
| 16. సంబంధము-సమాసము | 8 | — | 38 |
| 17. ధాతుజవిశేషణములు | 9 | — | 39 |
| 18. అద్దియనుప్రయోగము | 10 | — | 43 |
| 19. ముగాగమము | 11 | — | 44 |

| | | | | |
|---|---|---|---|---|
| 20. | విగాగమము | 12 | 81 | 45 |
| 21. | వల్లాదులు | | | 46 |
| 22. | ద్విత్వపరకహ్రస్వము | 13 | 76 | iv |
| 23. | ద్విత్వము | 14 | 77 | 51 |
| 24. | ముప్పట్లు | 15,16 | 78,79 | 53 |
| 25. | మూఁడు-డులోపము | 17 | 85 | 54 |
| 26. | ద్విగువు-ఏకవచనము | 18 | 80 | 58 |
| 27. | గసడదవలు | | | 61 |
| 28. | వప్పులు | 19 | 73 | 62 |
| 29. | నిక్కాదులు | 20 | 81 | 64 |
| 30. | అయి-ఆయి | 21 | 60 | 66 |
| 31. | సమాసాంతకార్యాలు | 22 | 88 | 67 |
| 32. | ఆభాసబహువ్రీహి | | | 70 |
| 33. | మిశ్రబహువ్రీహి | | | 71 |
| 34. | బోఁడి | 23 | 84 | 72 |
| 35. | ఋకారము-రవర్ణము | 24 | 26-అ | 74 |
| 36. | సామాసికవిభక్తిలోపము | 25 | — | 76 |
| 37. | షష్ఠీ-ద్వితీయాతుల్యత | — | 72 | 89 |
| 38. | గోఁగునార | | | 100 |
| 39. | వైరిసమాసములు | | | 102 |
| 40. | పారకావతబంధవారు | | | 103 |
| 41. | ఉపమానవాచకసమాసములు | | | 104 |
| 42. | కర్మాదులతో సమాసము | 26 | 82* | 105 |


* సూ.3, 26 సూత్రములు సిద్ధసమాసములనుగూర్చి వివరించునవి. ఇందుఁ గొన్ని సూత్రములు బాల.2.సూ.వివరణమున గమనింపవచ్చును. సూ 26.అ.సూత్రము (సిద్ధసమాసములందు జీవ్రత్యయము దీర్ఘము పాక్షికముగా హ్రస్వ మగుటయుఁ గలదు) హ్రస్వో దీర్ఘః సమాసే౽పి క్వచిద్ జీవః ప్రయోగతః అను వి.వి.వచన మాధారముగాఁ జెప్పిరి. సూ.27నుండి 63వఱకు సూత్రములు సంస్కృతసంధికార్యములను గూర్చి చెప్పునవి. సూ.33.సూత్రముఁగూర్చి బాల.క్రి.116సూ.వద్ద చర్చింపఁబడును. సూ.30.సూ.ప్రౌఢ.సమా.3.

| | | | |
|---|---|---|---|
| తద్ధితపరిచ్ఛేదము | 28 | 33 | 107-141 |
| 43. తనము | 1 | 1 | 107 |
| 44. విశేషవిధులు | 2 | 2 | 108 |
| 45. ఈకము | 3,4 | 3,4 | 109 |
| 46. కడిమి | 5 | 5 | 110 |
| 47. వల్లాదులు | 6 | 6 | 111 |
| 48. మగంటిమ్యాదులు | 7,8 | 7,8 | 112 |
| 49. స్వార్థికములు | 9,10 | 9,10 | 115 |
| 50. శాక త్రియులు | 11-14 | 17-20 | 116 |
| 51. ఈ | 15,16 | 21,22 | 120 |
| 52. అరి-ఇ | 17,18 | 23,24 | 120 |
| 53. త | 19 | 26 | 121 |
| 54. చెంధిత | 20 | 27 | 125 |
| 55. గుబ్బెత | 21 | 28 | 125 |
| 56. అండి | 22 | 25 | 128 |
| 57. అ | 23 | — | 128 |
| 58. ఎఱు | 24-26 | 29-31 | 131 |
| 59. బంటి,కొండి | 27 | 32 | 133 |
| 60. తనమయము | | | 138 |
| 61. వర్ణకాంతరములు | 26 | 33 | 140 |
| క్రియాపరిచ్ఛేదము | 124 | 121 | 142-328 |
| 62. ఉదంతములు | 1-26 | 1,10-33 | 141 |
| 63. ఇదంతములు | | | 144 |
| 64. చేసినాను మొగ | | | 146 |
| 65. ద్వ్యదంతములు | | | 147 |
| 66. దుగాగమము | | | 148 |
| 67. ఎదుగెడిక్కులు | | | 148 |
| 68. భూతము-లొట్టు | | | 149 |
| 69. ఉన్న | | | 150 |

| | | | | |
|---|---|---|---|---|
| 70. | ఊదంతములు | 26 | 34 | 150 |
| 71. | ఏకము | | | 155 |
| 72. | విధి | 27 | 35 | 158 |
| 73. | ద్రుతము-మకారము | 28 | — | 164 |
| 74. | కావృతము | | | 166 |
| 75. | ఇంద | 29 | 36 | 169 |
| 76. | వండుదము | 30 | 37 | 170 |
| 77. | ముజ్జు | 31,32 | 38,39 | 176 |
| 78. | ఆధాదులు | 33 | 40 | 177 |
| 79. | వినవె-వినరె | 34 | (41) | 178 |
| 80. | వినకువె | | 42 | 183 |
| 81. | చూచె-చూరె | | 43 | 185 |
| 82. | వినకురె | | | 188 |
| 83. | చెప్పుడయ్య | | | 191 |
| 84. | రా-ర | | 44 | 192 |
| 84. | కావి | | 45 | 196 |
| 85. | అంటె | | | 196 |
| 86. | కడ | | | 197 |
| 87. | కదవె-కదరె | | | 197 |
| 88. | పో-పే | | | 198 |
| 89. | ఉవర్ణకలోపము | 35 | 46 | 199 |
| 90. | భావార్థము-ఉవర్ణము | | | 201 |
| 91. | భావార్థము-కజీ | 36 | | 202 |
| 92. | మిజీ | 37 | 48 | 206 |
| 93. | క్త్వార్థకము | 38 | 49 | 208 |
| 94. | కొని-క | | | 211 |
| 95. | మిక్కిలి | | | 212 |
| 96. | వ్యతిరేకక్త్వార్థము | 39 | 50 | 214 |
| 97. | చాల-చాలా | 40 | 51 | 215 |

| | | | |
|---|---|---|---|
| 127. సంకోచించు | 67-69 | 6-8 | 256 |
| 128. ప్రేరణేంచుకు- | 70 | 73 | 258 |
| 129. ప్రేరణము-వేయు | | | 259 |
| 130. పాటలు | 71 | 74 | 260 |
| 131. ఇంద్రగోపము | 72 | 75 | 260 |
| 132. మృగాగమము | 73,74 | 76,77 | 260 |
| 133. ఇత్వము | 75 | 78 | 261 |
| 134. పెక్కు-దెలుగుడు | 76,77 | 79,80 | 262 |
| 135. వనుచు | | | 263 |
| 136. కొంచు | | | 265 |
| 137. చిత్తగించు | 78,79 | 81,82 | 267 |
| 138. ఆడోదుకూడుల | 80 | 83 | 268 |
| 139. ఉత్వమున కిత్వము | 81-85 | 84,88 | 269 |
| 140. చకారము-వత్వము | 86,87 | 89,90 | 270 |
| 141. గర్హింపుచున్ | — | 93 | 271 |
| 142. వ-వ | 88,89 | 91,92 | 272 |
| 143. ఆకర్షింపుదురు | 90 | 94 | 273 |
| 144. ఈ | 91,92 | 95,96 | 274 |
| 145. ఈవృత | | | 276 |
| 146. నేటుడు | 93-97 | 97-101 | 276 |
| 147. ఔర-వద | 98 | 102 | 278 |
| 148. అంటు | 99,100 | 103,104 | 282 |
| 149. పిలుచు | 101,102 | 105,106 | 283 |
| 150. అయియవులు-బల్లాలు | 103 | 107 | 284 |
| 151. కలుగు-కల | 104 | 108 | 285 |
| 152. త్రస్థము-కల | 105 | 109 | 286 |
| 153. కలుగు-చే | 106 | 110 | 293 |
| 154. ఒల్లధాతు | 107 | 111 | 295 |
| 155. బిడ్-తకారము | 108 | 90 | 295 |

| | | | |
|---|---|---|---|
| 156. చేతులు | | | 298 |
| 157. పుటక్రియలు | 110,113 | 112 | 299 |
| 158. తెంపు | 109 | 113-115 | 301 |
| 159. అరుగుదెంపు | 111 | 116 | 302 |
| 160. దులోపము | 112 | 117 | 303 |
| 161. లజీ-అగు | 114 | 118 | 304 |
| 162. కాను | 115,116 | 119 | 306 |
| 163. తచ్ఛబ్దవలోపము | 117 | సమా.33 | 311 |
| 164. శబ్దపల్లవములు | 118 | 120 | 314 |
| 165. ల్యబ్వత్తులిట్లు | 119 | 53 | 322 |
| 166. భావము-మజి | 120-122 | 121,3,47 | 323 |
| 167. అనభిహితకర్త-భక్తి | 123,124 | కార.3,4 | 324 |
| కృదంతపరిచ్ఛేదము | 22 | 34 | 330-339 |
| 168. కృత్తులు-అర్థములు | 1 | 1 | 330 |
| 169. లోపము | 2 | 2 | 332 |
| 170. ప్రేరిమి | 3,4 | 3,4 | 333 |
| 171. పోలాలు | 5-7 | 5-7 | 334 |
| 172. పవర్గకాంతములు | 8,9 | 8,9 | 334 |
| 173. ఆహ్వాదులు | 10-13 | 10-13 | 335 |
| 174. పుట్టువు | 14-17 | 14-17 | 336 |
| 175. కిత్వాదులు | 18-20 | 18-20 | 336 |
| 176. మరికొన్నికృత్తులు | 21,22 | 21,22 | 336 |
| 177. కోలు | | 34 | 337 |
| 178. ఇంపు-అట | | | 338 |

| | | | | |
|---|---|---|---|---|
| | ప్రకీర్ణకపరిచ్ఛేదము | 25 | * | 340. |
| 179. | ఋకారాంతతుల్యత | 1 | సంధి.2 | 340 |
| 180. | నల్లఱు | 2 | అచ్చు.32 | 340 |
| 181. | ఉమ్మ్యళ | 3,4 | 33,34 | 341 |
| 182. | అక్క-టాములు | 5,6 | 35,36 | |
| | | 7,8 | 26,27 | 342 |
| 183. | మనసైకాగ్రత | 9 | 27 | 342 |
| 184. | అష్టై | | | 343 |
| 185. | తాలిహల్లోపము | 10 | 28 | 344 |
| 186. | పూసు-పోదవు | | | 346 |
| 187. | పెంట | 11,12 | 37,38 | 347 |
| 188. | పీడకోళ్ | 13-16 | 39-41,24 | 347 |
| 189. | నీకే ప్రాంతము | | | 353 |
| 190. | పదమధ్యస్వరలోపము | 17-19 | 29 | 353 |
| 191. | ప్రత్యయపరకస్వరలోపము | | | 359 |
| 192. | అద్రుము | 20 | 30,31 | 362 |
| 193. | వళిప్రాసలు | 21 | 42 | 366 |
| | | 22(23) | సంధి.37 | „ |
| | | 24 | సంజ్ఞా.19 | „ |
| 194. | దేశలు | 25 | | 366 |


* ఈలక్షణములు చాలవఱకు తార్కికపరిచ్ఛేదమునను వితరములు కొన్ని యితర స్థలముల యందును ఉ.లో. జెప్పఁబడియున్నవి.

# బాలవ్యాకరణసూత్రములు

## తృతీయభాగము

## సమాసపరిచ్ఛేదము

### సమాసము :

సమర్థంబు లగుపదంబు లేకపదం బగుట సమాసంబు. (1) ఈ సూత్రమును వ్యాఖ్యలవా రుద్ద్యోతమునఁ బరిహరించిరి. 'సమర్థంబు' లని లక్షణమునఁ బ్రస్తావింపఁబడుటచే సూరి పిదప సామర్థ్య మన నేమో వివరించెను. వీ రావివరణము సూత్రముగా నిట్లు చెప్పిరి. "పృథక్ప్రసిద్ధార్థంబు లగు పదంబుల కేకార్థీభావంబు సామర్థ్యంబు. ఇది సమాసములందలిసామర్థ్యము. వాక్యములందలిపదములయన్వయము (రాముఁడు రావణుని జంపె) వ్యపేక్షాసామర్థ్యము." వరుసవారియీసూత్రమునం దాలక్షణములు గానరావు. సమాస మన నేమో చెప్పకుండుటచే నది యితర గ్రంథములనుండి తెలియవలయు నని వారియభిప్రాయమా? ప్రధాన మైనసమాసలక్షణమును వీరు వ్యాఖ్యానములోఁ దెల్పిరి. వ్యపేక్షాసామర్థ్యమును గూడ నుదాహరణముతో సూత్రముననే తెల్పుట యిందలిమిక్కిలివిశేషము.

### రామునిగుణములు :

"అంత సాధ్యము లగునలుక్సమాసములు, రామునిగుణములు, రాముల గుణములు. (ఉ.245) రామునియొక్క గుణము లని యుండఁగా 'సమాస విభక్తికి లోపం బగు.... (సమా.25) అనుసూత్రముచే యొక్క విభక్తి లోపించును గావున సూరిమతమున వీని నలుక్సమాసము లనరాదు.

వీ రిట సూరిప్రణాళికను విడచి చిం. ననుసరించుచు షష్ఠికి ద్వితీయా తుల్యత్వము విధించికొన్నవా రగుటంజేసి రామునియొక్క గుణములు, రామునిన్, గుణములు, రాముని గుణములు. అనురీతిగా షష్ఠీస్థానిక మగుద్వితీయ

నిల్చియేయుండును గావున వీని నలుక్సమాసము అందురు. ఇది యసంగత మని పైని గమనింపఁగలము.

రాములగుణము అనునది వీరిమతము ననుసరించి దైన నిట నలుక్సమాస మనుటకు వీలు లేకున్నది. కూర్చిలనునయో ఋవేద్ద్వితీయా తు. లు ఆసో లతశ్ఓఒలా స్త్రా త్తవియుఁ జిం. 'ల' అనుదానిని ద్వితీయావిభక్తిగాఁ జెప్పినది. కావున షష్ఠీ ద్వితీయా(ల)తుల్యరూపము నంది యది లోపింపమిఁ జిం.లో నిట్టివి యలుక్సమాసములు గావచ్చును. కాని యీవ్యాకరణమున ల ద్వితీయావిభక్తి కాదు. సూరి ననుసరించి వచ్చులవారు సుద్యోతమున నువర్ణ మొక్కటె ద్వితీయగాఁ జెప్పిరి. ఇంక బహుత్వమున సూరి వలెనె ద్వితీయయందును లుదాగమమును జెప్పిరి. కావున రాములయొక్క గుణములు, రాములనున్ గుణములు అనుచో నువర్ణము ద్వితీయయును, లువర్ణ మాగమము నై యున్నవి. అట్టియెడల నువర్ణరూప మైనద్వితీయాకారము గలషష్ఠి లోపించినది గదా. మఱి యిది యలుక్సమాస మగుట యెట్లు? (ను ద్వితీయ లోపించినను) లట్టు (ద్వితీయా)విభక్తి కైనయాగమము గావున యదాగమన్యాయముచే విభక్తివంటి దగును. అట్టి 'ల' వర్ణము లోపింపమిఁజేసి యిది యలుక్సమాసమై యగు నని వచ్చులవా రభిప్రాయ పడి రేమో తెలియదు. కాని యట్టియెడల రాములయొక్క గుణము అనుచో యొక్కవిభక్తి లోపింపఁజేసినసూరిలక్షణమున 'ల' నిల్చియే యున్నను వీని నలుక్సమాసము అనువ్యవహారము లేనట్లే షష్ఠ్యర్థక మైనద్వితీయ లోపించు టనుబట్టి యిటను నీయవి యలుక్సమాసము లనరాకున్నవి. వీ రట్లు చేయ్యకునుట సరి గా దనవచ్చును.

## సమాసభేదములు :

'సాంస్కృతికాచ్ఛికమిశ్రభేదంబుచే సమాసంబు త్రివిధంబు' (2) అనుసూరిసూత్రమును మార్చి వీ రిట్లు సూత్రించిరి. "సిద్ధసాధ్యభేదమున నీసమాసము రెండువిధములు. సంస్కృతమందే సిద్ధించిన దనఁగా సంస్కృతవిభక్త్యంతవిగ్రహము గలది సాధ్యము." సూత్రము వ్యాఖ్యానప్రాయ

మైయుండుట వీరిగ్రంథమున సాధారణమే. కాని సూరి సాంస్కృతికసమాసమునే సిద్ధము సాధ్యము ననురీతిగా విభాగించెను. సూరిలక్షణము ననుసరించి సాధ్యసమాసములుగాఁ దత్సమములకుఁ జేయఁబడినదే. ఆచ్ఛికమిశ్రసమాసములకు సాధ్యసంజ్ఞ లేదు. ఆచ్ఛికమిశ్రసమాసములు (సంస్కృత వ్యాకరణ) సిద్ధము లగుట యసంభవము. అట్టిభేదము కేవలము సాంస్కృతిక సమాసములందే. అందుకే సూరి సాంస్కృతికసమాసమునే సిద్ధసాధ్యములుగా వింగడించెను. సూరిపద్ధతిని మార్చుటలోఁ బ్రయోజనము గాని సూరి పద్ధతిలో దోషము గాని వచులవారు నిరూపింపరైరి. సూరిలక్షణమును మార్చుటవలన నాయభిప్రాయమును సాధించుటకై పై రెం కొకసూత్రము రచింపవలసివచ్చినది. "సాంస్కృతికమిశ్రాచ్ఛికభేదంబులచే సాధ్యసమాసములు మూఁడువిధములు." (సూ. 70) ఇందును సూరిమతముకంటె భేదము గలదు. సూరి సాంస్కృతికసమాసమును సిద్ధసాధ్యములుగా విభాగించుట చేత సిద్ధసమాసము సూరిమతమున సాంస్కృతికమె యగుచున్నది. వీరు సాధ్యసమాసమును మాత్రమె యటులు పేర్కొనుటచేత సిద్ధసమాసమును సాంస్కృతిక మనుటకు వీలు లేదు. సూరి సిద్ధసమాసమును సాంస్కృతిక సమాసముగాఁ జెప్పుటలో దోసఁ గేమియో చెప్పక దానిని సవరించుట వీలకో యర్థము గాదు. సూరిలక్షణము దురుక్తము గాదు. కాని పై రాసూరి సూత్రమును దొలఁగించి 2 మఱియు. 70, రెండు సూత్రములుగాఁ జెప్పుటలోఁ బ్రయోజనమును లే దని మాత్రము గ్రహింపఁదగును.

అసలు సమాస మెల్లపుడును సాధ్యమే. కాని తెలుఁగుభాషలో నున్న సాంస్కృతిక సమాసములలోఁ గొన్ని సంస్కృతభాషయందే యేర్పడి. సమాసమే తెలుఁగునఁ బ్రాతిపదికగా నిలుచుచుండుటచే నట్టిచోటఁ దెలుఁగున సమాసము చేయుప్రసక్తి లేదు. కావున సిద్ధ (సాధ్య)మను భేదము సాంస్కృతికములందే యుండును. అందుకే సూరి సాంస్కృతికములనే యట్లు విభాగించెను. ఇంక వీరు సిద్ధసమాసమును గొంతవఱకు సూరివలెనే చెప్పియును సిద్ధసమాసములప్రక్రియను గూడఁ దమవ్యాకరణమున నుపదేశించు

చుండుటచే నద్యాది యిట్టి దమగ్రంథముచే సాధింపఁబడుట సాధ్యమె యగు ననిపించును. అందుకే యొకవేళ వీరు సమాసలక్షణమును సూరికి భిన్నముగా 'సంస్కృతవిభక్త్యంతవిగ్రహము గలది, ఆంధ్రవిభక్త్యంత విగ్రహము గలది' యని చెప్పియుందురు. తెలుఁగుసమాసము విగ్రహమున సంస్కృతవిభక్త్యంత మైయుండుట యసంగతము గదా. కాఁగా నీలక్షణమున విగ్రహము ప్రసక్తియే కేవల మనవసర మని గ్రహింపఁదగును.

బాల వ్యాకరణవారు 3 మొదలు 48 సూత్రములవఱకు సిద్ధసమాసము ననుగూర్చి చెప్పియుండిరి. 'సిద్ధసమాసలక్షణము సంస్కృతవ్యాకరణాదులవలననే తెలిసికొనవలయును' (ఉ.246) కావుననే సూరి యట్టివానిని వివరింపలేదు. కాని వీ రట్లని నిర్ణయించియును సాధ్య మాంధ్రవ్యాకరణసాధ్య మని చెప్పి తమయాంధ్రవ్యాకరణములో సిద్ధసమాసముల సాధించుట స్పష్టతకుఁ గావలెను. సంస్కృతవ్యాకరణము నెఱుఁగకయె తెలుఁగువారలు తెలియుటకు వీలుగాఁ గావచ్చు నిట్లు సిద్ధసమాసములతోపాటు సంస్కృతసంధులు గూడ వివరించిరి.

'సిద్ధసమాసములందు జీప్రత్యయము దీర్ఘము పాక్షికముగా హ్రస్వమగుటయుఁ గలదు.' (ఉ.245) అనువీరిసూత్రము "హ్రస్వో దీర్ఘసమాసేఽపి క్వచిన్ జీపః ప్రయోగతః" అనునథర్వణోక్తి ననుసరించి చెప్పఁబడినట్లు వారును సూచించిరి. కాని 'కుంతీదేవి' దీనికి సరియైనలక్ష్యము గా దని యింతకు ముందు పేర్కొనియు (వ్యా.సం.న.1194) నిట దీనికి లక్ష్యముగాఁ జూపుట విశేషము. మాద్రిదేవి, గౌరిదేవి (ఉ.265) ఇట్టివే.

## తత్పురుషాదులు :

'తత్పురుషాదులకు లక్షణంబు ప్రాయికంబుగా సంస్కృతోక్తంబ యగు' (3)నను సూరిలక్షణమును వీరు "సాధ్యసమాస మవ్యయీభావము లేదు. తక్కినతత్పురుషాదులు సాధారణముగా సిద్ధసమాసలక్షణములతోనే సాధ్యసమాసములను వర్తిల్లును' (సూ.49)అని సూత్రించిరి.

సాధ్యసమాస మనునామాంతరముచేతనే సాధ్యసమాసవిషయక మగుట స్పష్టమగుచుండఁగా వీరు తమసూత్రమునఁ బైని రెండవవాక్యమునను 'సాధ్యసమాసములను' అని పేర్కొనుట మిగుల స్పష్టత కని యెంచుదము. సూరి ప్రాయికమనఁగా వీరు సాధారణముగా ననిరి. సూరి సంస్కృతోక్తంబు లనఁగా వీరు 'సిద్ధసమాసలక్షణము' అనిరి. 'సిద్ధసమాసలక్షణముతోనె' యున్న వీరిలక్షణముకంటె 'లక్షణంబు సంస్కృతోక్తంబు' యనుసూరివచనమె సమాటిగను నుద్దిష్టార్థమును స్పష్టముగా నిర్దేశించుచు నున్నదని గ్రహింపఁదగును. విశేషముగా నేమి సాధింపఁ దలఁచి వీ రీలక్షణముచే సాధించిరో తెలియదు. సూరివివరణము ననుసరించి తెలుఁగున సవ్యయీభావాభావస్థితి స్పష్టము. వీ రాయంశమును సూత్రమునఁ జేర్చిరి.

సూరిలక్షణమున దోషము అని వీ రిట్లు వివరించిరి. "సూరి యీ సందర్భమున మిక్కిలిగఁ బ్రమాదపడెను. తత్పురుషాదులకు.... అని సూత్రించియు, దాని కాచ్ఛికసమాసములను మాత్ర ముదాహరింపక లక్ష్యములు కొని మిశ్రసమాసములను సాంస్కృతికసమాసములను గొన్నిటి నుదాహరింపసాగెను." (ఉ.276)

'ఆచ్ఛికసమాసములను మాత్ర ముదాహరింపక' యనుటలో నాచ్ఛికసమాసములను మాత్రమే యుదాహరింపవలసియుండఁగాఁ దదితరములను గూడ నుదాహరించె నని వీరియభిప్రాయ మూహింపఁదగును. అంతే కాని యాచ్ఛికసమాసము లసలే యుదాహరింపలే దని యభిప్రాయముగాఁ దలఁపరాదు. ఏ లన నెలతాల్పు, దేవరమేలు, మాటనేర్పరి, తల్లిదండ్రులు ఇత్యాదిగా సూరి చూపినయుదాహృతు లాచ్ఛికసమాసములే కదా. కావున మిశ్ర సాధ్య(సాంస్కృతిక) సమాసములను గూడ సూరి చూపుట దోష మని వీరియభిప్రాయము నెన్నఁదగు.

మిశ్రములును, సాధ్యసాంస్కృతికములును సూరిసూత్రమునకు లక్ష్యములు గాకుండు టెట్లో తెలియకున్నది. ఎవరో వ్రాసినసూత్రములకు

సూరి యుదాహరణము లిచ్చిన నేమో, కాని తాను జెప్పినలక్షణమునకు నయ్యవి యుదాహృతము లని తానే చెప్పుచుండ లక్షణమునభిప్రాయ మది కా దని తల్లక్షణకర్త వితరులు విమర్శించుటలో నిసామంజస్యమేమి?

మొదట సమాసమును నిర్వచించి పిదప సాంస్కృతికాదిగా దానిని విభజించి యందు పిమ్మట తత్పురుషాదుల కని యిట్లు సూత్రించుటచేఁ బూర్వోక్తము లయినసాంస్కృతికాచ్ఛికమిశ్రసమాసములు మూఁడింటి యందును దత్పురుషాదిలక్షణము సంస్కృతోక్తమగు నని సూత్రార్థ మగుట సక్రమము గదా. సిద్ధ(సాంస్కృతిక)ములు సంస్కృతముననే యేర్పడిన వగుటచే నవి సంస్కృతలక్షణయుక్తము లగుట వేఱ విశేషముగాఁ జూప నక్కఱ లేదు గదా. కావున సాధ్య(సాంస్కృతిక)ఆచ్ఛిక,మిశ్రసమాసముల నీసూత్రమున నుదాహరణములుగాఁ జూపవలసియున్నది. సూరి యట్లే చూపెను. అది యుచితము.

వీరు నాచ్ఛికమిశ్ర(సాధ్య)సాంస్కృతికములు సాధ్యసమాసములుగాఁ జెప్పియున్నారు గదా. మఱి వీరిసూత్రమునకు మాత్ర మవి యెల్ల లక్ష్యములు గాకుండు టెట్లు? ఆచ్ఛికసమాసములు మాత్రమె యుదాహార్యము లని తలఁచినవీ రయినను దమసూత్రమునం దిచట సాధ్యసమాసము (ఉ.69.సూ) మొదలుగా నేల పేర్కొనిరి? ఆచ్ఛికసమాసముల కవియే యునక పోయిరా? కాఁగా వీరిలక్షణము ననుసరించి చూచినను మిశ్ర (సాధ్య) సాంస్కృతిక సమాసము లిచట నుదాహరింపవలసినవే. వరుల వారు తద్భిన్నముగా సూరిలక్షణమును విమర్శించుట వారిలక్షణమునకును విరుద్ధమే. వీరు సంధిత మిట "మూల్లోకము ము న్నగుద్విగువులును సాధ్యములు సాధువు లగు" (ఉ.276) నని పేర్కొనిరే కద. మఱి సూరిని విమర్శింప నేల?

"షష్ఠీతత్పురుషకర్మధారయద్విగువులు సాధ్యసాంస్కృతిక మిశ్ర సమాసములు గావచ్చును". (ఉ.276) అన్న వీరిపలుకులను బట్టి యైనను సూరి యాచ్ఛికములనే యుదాహరింపవలె ననుట యెట్లు?

పయువాక్యమం దొకవిశేషము గమనార్హము. సూరికి భిన్నముగాఁ వేరొక్కన్నవయులవారిలక్షణమునుబట్టి సాంస్కృతికసమాస మనఁగా సాధ్యమె. సూరి సాంస్కృతికమును సిద్ధసాధ్యములుగా విభాగించెను గావున నాతనిమతమునఁ దత్సమములకుఁ జేసినసమాసమును సాధ్య సాంస్కృతిక మనక తీఱదు. వీరు సిద్ధసమాసమును సాంస్కృతికసమాసము గాఁ జెప్పలేదు. కాఁగా సాంస్కృతికసమాస మన్నచో సూరిమతమునందలి సాధ్యసాంస్కృతిక మనునర్థము వీరిలక్షణముచే సిద్ధ మగుచుండఁగా వీరు 'సాధ్యసాంస్కృతిక' మనుట సూరిలక్షణప్రభావమునకు లోనగుటచేఁ గావలయును.

## దొంగభయము :

షష్ఠీతత్పురుషేతరసాంస్కృతికమిశ్రసాధ్యతత్పురుషములు సాధువులు కావు. దొంగభయము అనునది సూరి వ్రాసినట్లు పంచమీతత్పురుషము కానేరదు. అదియు షష్ఠీతత్పురుషమె. (ఉ.276) ఇట్లిది షష్ఠీసమాస మని నిర్ణయించియును వీరు "దొంగభయము అనునది మిశ్రసమాసము. ఇది చోరభయము అనుదానివలెఁ బంచమీతత్పురుషము గానేరదు. ఇది షష్ఠీ తత్పురుషము కానోపు" (ఉ.276) అనిరి. కానోపు ననుటలో నిశ్చయము గానరాదు. ఏమైన నీవివరణమువలన దొంగభయము పంచమీతత్పురుషము గా దనుట కయ్యది మిశ్రసమాస మగుట కారణ మని తెలుచున్నది.

సంజీవనిలోఁ గూడ దొంగభయ మనుదానిని మిక్కిలి వివాదాస్పదము చేసిరి. సూరి తత్పురుషాదుల కనుసూత్రమును, వివరణమును ద్విగుకర్మధారయో యనుచిం.లక్షణము సాధారణము చేసికొనిచో వ్రాసెననియు, సూచిం. సూత్ర మాచ్ఛికవిషయకమె యనియు నందువలన సూరి యిట సాధ్యసాంస్కృతికమిశ్రసమాసములను జూపుట సరి కా దనియు వివరించిరి. (వ్యా.సం.స.1156) చిం.విషయము గ్రంథాంతరమున స్పష్ట మగును. ఒకవేళఁ జిం. ద్విగుకర్మధారయో యనుదానిచే సాధ్యసాంస్కృతికమిశ్రసమాసముల

నుద్దేశింపలే దని లక్షణమున నాధారము లేకయు నంగీకరించినను సూరి యట్టి వానిని గూడఁ దెల్పుటలో నసాంగత్య మేమి? చిం.కి భిన్నముగాఁ జెప్ప రాదా? చిం.లో విరసపువచనము అనురీతిని జ్ఞాపకసిద్ధము అని వీరును గుర్తించిరి. అట్టిసమాసము లుండఁగా వానిని సూరి యంగీకరించి వివరించు టలో నిద్మాలత యెట్టిది?

దొంగభయ మనుసమాసమును వీ రందుకే తిరస్కరించిరి. ఇంకను నొకవింత యిది. 'దొంగభయము అనునది పంచమీతత్పురుష మనుట చింతామణివిరుద్ధము. సూరి నిర్బాధ మగురామునిబాణము అనునది తప్పఁ దక్కిన యుదాహృతు లెల్ల సమాసపరిచ్ఛేదతృతీయసూత్రవివరణమున నాచ్ఛిక తత్పురుషసమాసములనె యుదాహరించుట సరయఁగాఁ జింతామణివిరుద్ధము కాని దొంగబయము అనునాచ్ఛికసమాసమునె యుదాహరించె నని తోఁచుచున్నది'. (వ్యా సం.స.1012) దొంగభయ మన్నది (వీరిమతమున) చిం. విరుద్ధము గావున సూరి దొంగభయ మని యుదాహరించినట్లు తద్గ్రంథము లం దున్నను దొంగబయ మనియే సూరి యుద్దేశించె నని చెప్పుట తాత్పర్యము. దొంగభయ మని చూపుట సరి కా దనుటకంటె దొంగబయ మని చూపియుండు ననుట మిక్కిలియనుచిత మనకతప్పదు. పిదప నట్లు చెప్పుకుంట కొంతవఱకు బాగే.

కాని భయం బెట్టిన దగునో దానికి వలనవర్జక మయిన (చోరుని వలన భయ మన్నట్లుగనె) దొంగవలన (నితరులకు) భయ మని యర్థము సముచితముగనే కుదురుచున్నది గదా. పైఁగా వీ రింతకు ముందు దొంగవలనిభయ మనుచోఁ బంచమి చూపియే యుండిరి. (పు.245) దొంగవలని భయ మనుచోఁ గలపంచమ్యర్థము దొంగభయ మనుచో నుండకుండుటకు హేతు వేమి? మాటయందలినేర్పు. మాటనేర్పు అన్నట్లుగా, దొంగవలని భయము దొంగబయము అని పంచమియు లోపించుట నంగీకరించిన దొంగభయ మనునది పంచమీసమాస మనుటలో దోష మేమి? పైని వీరే దొంగబయము (దొంగవలనిభయము) (పు.277) పంచమీతత్పురుషముగాఁ జూపి

యున్నారు. దొంగబయు (దొంగవలనిబయు) మనుచోఁ గుదిరినట్లుండ మ్యర్థము దొంగభయ మనుచోఁ గుదురకుండు టేమి?

సంజీవనిలో నిట్లు వ్రేర్కొనిరి. "చింతామణిపద్ధతులచొప్పున దొంగ భయము అనుపంచమీతత్పురుషసమాసము సాధువు కాదు. ఎల్లకారకము లందును శేషషష్ఠీవివక్ష నిర్బాధము గావున దొంగయొక్క భయము దొంగనుఁ, దొంగన్ దొంగభయము అని షష్ఠీతత్పురుషము మాత్రము సిద్ధించును" (వ్యా.సం స.1158, 1012) 'ఎల్లకారకములందు శేషషష్ఠీవివక్ష' అను వీరివివరణమువలననే యొక్కడియొక్క షష్ఠ యుపాదానపంచమ్యర్థమున నైన దనియు నట్లు వలనప్రత్యయార్థమున యొక్క యగుట నిర్బాధ మనియు వరులవారిసమన్వయము స్పష్టమే. దీనినిబట్టి దొంగవలన నని యుంచి నను జిం.లో సమాసము గుదురదు. కావున నాయర్థమునందు దొంగయొక్క యని యుంచుకొని సమాసమును నిర్వహింపవలెను.

పంచమీతత్పురుషసమాసము చిం.పద్ధతులచొప్పున సాధువు గాక పోయిన నటుఁ బంచమ్యర్థమున యొక్క షష్ఠిని జేసి (పంచమ్యర్థక) షష్ఠీతత్పురుషము లందురు గాక. బాల.లో నట్టిసమన్వయమే యుండవలె ననుట యేల? బాల. ననుసరించి యట్టిపంచమీతత్పురుషములు సాధువు లగుచుండఁగా నది సరి గా దనియుఁ, బంచమ్యర్థమున షష్ఠి చేసికొని వీనిని షష్ఠీతత్పురుషములుగానె చెప్పవలయు ననుటయు సమంజస మగునా?

సమానేతరస్థలములందుఁ జిం. విభక్తిలోపము చెప్పక షష్ఠికి ద్వితీయాతుల్యత మాత్రమె చెప్పుటంజేసి వలనార్థమున యొక్క చేయవలసి వచ్చినది. అట్టియెడల సమాసమున సాధారణముగా విభక్తిలోపమును జెప్పిన నీప్రక్రియ యనవసరమే కదా! వ్యస్తతలో దొంగవలన భయ మనుచో దొంగయొక్క భయ మనురీతివ్యవహార మున్నదా? చిం.కంటె విశేషముగా సూరి సమాసమున సాధారణముగా విభక్తిలోపమును విధించెను గావున

పట్టివి బాల. వనుసరించి సాధువులే యవు చుండఁగా నేతద్గ్రంథమునందె యవి యసాధువు లనుట తగునా?

సూరి సమాసమున విభక్తుల కెల్ల లోపమును విధించెను. కాన దొంగగళదు మను మిశ్ర(సాధ్యసాంస్కృతికములను)పంచమీతత్పురుషము బాల. పక్షమున సాధు వగుటను వీరును స్పష్టము చేసిరి. (వ్యా.సం.స.1158) కాని సూరి విభక్తిలోపవిధానములోఁ గొన్ని యనౌచిత్యములు ప్రస్తావించిరి.

'సమాసవిభక్తికి లోపం బగు అనెడిసూరిసూత్రము నిర్మూలమగు టంచేసి యశాస్త్రీయము. లోపశ్చ.... అని యిట్లు చింతామణి సమాసకము లందే విభక్తిలోపము వచించెను గాని తత్సమసాధ్యసమాసములలో విభక్తి లోపము నంగీకరించలేదు.' (వ్యా.సం.స.1158) సూరిలక్షణము నిర్మూలము (అందుచే నశాస్త్రీయమును) అగుటకుఁ గారణము చిం. అట్లు చెప్పకుండుట. చింతామణియం దేమి చెప్పఁబడినదో యది యట్లే చెప్పిన మాత్రమె సమూల మగు నన్నమాట. ఉద్ద్యోతమున వీ రట్లె చెప్పిరా? ఏయుద్దేశ్యముతోఁ జెప్పెనో కాని సూరి నకారంబు ద్రుతం బనఁగాఁ జిం.లో నట్లు యుండుటచే 'చింతామణివాసనచే' చెప్పుట సరి కా దని (ఉ.18) సూరిని విమర్శించిరే. ఆయ్యది లక్ష్యవిరుద్ధ మయిన నాకారణముచే నకారంబు ద్రుతం బనరా దని చెప్పవలె. 'చింతామణివాసన'ను హేతువుగాఁ జెప్పి రేమి? దీనింబట్టి తమ కిష్టమైనఁ జిం. కనుగుణముగనె చెప్పవలె. తమ కిష్టము గానిచోఁ జిం. కనుగుణముగాఁ జెప్పినను దప్పే. ఇది యనుచితము కదా. కాఁగాఁ జిం. సమాసకములందు మాత్రమే విభక్తిలోపము చెప్పినది గావున సూరియు నట్లే చెప్పవలె ననుటయు సాధారణముగా సమాసమున విభక్తిలోపము చెప్పుట సరి గా దనుటయు ననంగతము లనక తప్పదు. (సూరిప్రణాళికలోనివై శిష్ట్యము పైని గమనింతము.)

ఇట నెవ్వ రేని చిం.కర్త సమాసకములందు మాత్రమె విభక్తి లోపము చెప్పుట నిర్మూలమనియు నందుచే నయ్యది యశాస్త్రీయ మనియుఁ

జెప్పిన నెట్లుండును? తనయుతరదహ్యాతరణములలో గ్రహించియును సూరి బాల.లో సమాసకసంజ్ఞనే గ్రహింపలేదు.

'సూరిరచనమునందు నెలయవరుఁడు (నెలచేతన్ ఆవరుఁడు) నెల ప్రభష్టుఁడు (నెలవలనన్ ప్రభష్టుఁడు) మొ న్నగునసిష్టరూపములు దుర్వా చములగు' (వ్యా.సం.స.158) నని మఱి యొకదోషమును జూపిరి. మిశ్రకములందును విభక్తిలోప మంగీకరించెను గావున నిట్టిపరూపము లేర్ప డిన వన్నమాట. చిం. ఇటువంటియపరూపములను సాధింపదు. చిం. సమా సకములందు విభక్తిలోపము చెప్పినది గదా. అందుకె సూరి యిటఁ జూపిన నెలతక్కువవాఁ డిత్యాదులను వీరు విమర్శింపలేదు. నెలప్రభష్టుఁ డనరూ పమె. నెలవలనన్ పుట్టినవాఁడు అనుచో సమాసకమె. నెలపుట్టినవాఁ డని యగు నది సాధురూపమా? వరులవారు "సమాసకవిభక్తిలోపము నైతము కవిప్రయుక్తములందె చెల్లును' (వ్యా.సం.స.158) అని యిటనె చెప్పిరి. నెలపుట్టినవాఁ డని కవిప్రయోగము లేదు గావున నయ్యది సమాసకము యనఁదగినను విభక్తిలోపము రాలేదన్నమాట. మఱి యట్టిసమన్వయము సూరిలక్షణమున మాత్ర మేల చేయరాదు? నెలప్రభష్టుఁ డనురీతికవిప్రయో గములు లేవు గావున నట విభక్తిలోపము రా దని చెప్ప నవరూపములు వారింపఁబడునే కదా. చిం.సమన్వయమున కొంతమార్గము బాల.లో వే ఱుక మార్గము నేల?

కవిప్రయుక్తములందె విభక్తిలోపము వర్తిల్లు ననుటయు విచార్యము. నెలవలనఁ బుట్టినవాఁ డనుచో సమాసము చేయఁదలఁచిన విభక్తిలోపము రాకతప్పదు. సమాసమె కాని కవిప్రయోగానుసారముగా విభక్తి లోపింప దన్నచో నెలవలనఁ బుట్టినవాఁ డన్నది సమాస మగునా? ఇట విభక్తి లోపింపకుండుటకు సమాసము కాకుండుటయె హేతువుగా గుర్తింపవలసి యున్నది. కాఁగాఁ గవిప్రయోగానుసారముగా విభక్తి లోపింప దని కాక విభక్తిలోపమునకు మూల మయినసమాసమె లే దని చెప్పుట యుచితము. ఇట్లె నెలచేత నవరుఁడు, నెలవలనఁ బ్రభష్టుఁ డనురీతిస్థలముల సమాసమె

కా దనుట యుక్తము. కాఁగా విభక్తిలోపము ప్రాప్తించుటయు స్వరూపము లేర్పడుటయు నన్నస్థితి లేదు.

దొంగవలనిభయ మనురీతిగా చిం.మతమున నిత్య మగును. ఆ యుక్తత్వము సమాసవాక్యములయందే యనరాదు గదా. అట్టియెడ నెలవేతస్ + అపరుఁడు నెలవేతియపరుఁడు. నెలవలనస్ ప్రభవుఁడు. నెలవలని ప్రభవుఁడని చిం.ప్రకారమైనఁ గావలదా? అట్టివి గలవా? సమాససాధారణమున విభక్తిలోపము చెప్పినసూరిమతమున నేర్పడు నన్నయుపరూపములవంటివి ఋత్వస్థలమునఁ జిం.బాల.లు రెండింట నేర్పడుచున్నవే. కాఁగా విధానింబట్టియు నిట్టిచోట్లఁ దెలుఁగున సమాసమే లే దని గుర్తింపవలసియున్నది.

కాఁగా నెలయువరుఁ డనురీతియుపరూపము లేర్పడు ననునదియు సరియైనకారణము గాదు గావున సూరి సమాసమున సామాన్యముగా విభక్తిలోపము చెప్పుట నిర్దుష్టమె యని స్పష్టము. కాఁగా దొంగవలన భయ మనుచో సమాసము చేయఁగా విభక్తిలోపముచే దొంగభయ మనురీతిగాఁ బంచమీ తత్పురుషములను జిం.కంటె విశేషముగా సూరి సాధించుట యెంతయు నుచితము. 'దొంగభయము'నుగూర్చి వరుఁబవారు చేసినవివాదము బాల. మతానుగుణముగనె సరి కా దని గ్రహింపఁదగును.

## రామునిబాణము :

'రామునిబాణము అనునది తత్పురుషాదులకు అనుసీసూత్రమునకు లక్ష్యము గానేరదు.' (ఉ.276)వీరు దీనిని షష్ఠ్యలుక్సమాసముగా సాధించిరి. సూరిమతమున నీయది లుక్సమాసమె. ఒకవేళ వీరు తలఁచినట్లుగా నియ్యది యలుక్సమాసమె యనుకొన్నను ప్రస్తుతసూత్రమునకు లక్ష్యము గాకుండు టెట్లు? విభక్తిలోపింపనంతమాత్రమున నీయది సమాసమే కాదా? దీనిని షష్ఠీతత్పురుష మనరాదా? విభక్తి లోపింపలే దన్నను షష్ఠ్యంతమునకు మీఁదిపదముతో సమాన మవుట యను(వ్యధికరణ)లక్షణ మిందుఁ గలదే కదా. కావున నీయది ప్రస్తుతసూత్రమునకు లక్ష్యము గా దనుట సరి కాదు.

## సమాసకాదులు :

"సూరి 'సమాసకము - బిరుదాద్యుత్తరపదసమాసములు' అనువానిని గ్రహించినట్లే యగపడదు. చింతామణి షష్ఠీతత్పురుషపద్ధతి నీతఁడు గ్రహించినట్లు తోఁచదు" (ఉ.278) బాల.లో నివ్వానిని సూరి పేర్కొనలేదు. అంత మాత్రమున వీనిని సూరి గ్రహింపలేదనుట యసమంజసము. "సమాసంబు కేవలవికృతిపదంబులతోఁడిది సమాసకం బండ్రు.(5.12) కేవలవికృతిపదంబుతోఁడిది సమాసకంబు, ఆననామంబులకు రాజాదులు .... ఇత్యాదిగా శ.ల.సం.(ప్ర.21)లో వీనినిగూర్చి సూరి ప్రస్తావించియేయున్నాఁడు.

షష్ఠికి ద్వితీయాతుల్యత్వవిధానముకంటె మేల్తరమగు ప్రణాళిక నెన్నుకొన్నవాఁడగుటచే సూరి చిం. అనుసరించినషష్ఠీతత్పురుషపద్ధతిని, సమాసకసంజ్ఞను గ్రహింపలేదు. చిం. పేర్కొన్న బిజ్మధ్యసంజ్ఞాదులవలెనె పరిహరించెను. (వీరును బిజ్మధ్యసంజ్ఞను జెప్పినట్లు గానరాదు.) సూరి 'గ్రహించినట్లే' యనుటలో వజ్ఝలవారియభిప్రాయ మేమో. వానిని స్వీకరింపలేదనియా? తెలియలేదనియా? మఱి సూరికిఁ జిం.సూత్రము లర్థములు గాలేదనవా? బాలసరస్వత్యాదులవ్యాఖ్యలను జూచియైనను దెలిసికొనలేక పోయెనా? సూరియభిప్రాయము నెఱుంగమిచేతనె వజ్ఝలవారు తత్ప్రణాళిక నంగీకరింపలేకపోయి రన్న నెట్లుండును?

ఇంతకును సమాససంజ్ఞను వీరును సూత్రముచే విధించియుండలేదు. "కేవలాచ్ఛికపదములతో ఘటిల్లినసమాస మాచ్ఛికము. దీనిని సమాసక మనియు నందురు." (ఉ.277) అని సమాసకము అనుట గల దని వివరణమునఁ దెల్పిరి. చిం. విభక్త్యాదిలోపకార్యమును సమాసకములందుఁ జెప్పెను. అందుకయి యాచ్ఛికసమాసములకుఁ బ్రత్యేక మగువిభాగమును నొకసంజ్ఞయును, వ్యాకరణమున నవసర మైయుండవచ్చును. కాని సూరి యామార్గము ననుసరింపలేదు. సమాసముల నెల్ల సామాన్యముగనే విభక్తిలోపమును జెప్పెను. బాల.లో ఆచ్ఛికసమాసములను గూర్చినప్రత్యేకవిధులను

గానభావ్య. ఉన్నను ఆచ్ఛికసమాసములుగా వ్యవహరించినఁ జాలును. కాఁగా సమాసకసంజ్ఞావిధానమువలనఁ బ్రత్యేకముగాఁ బ్రయోజనము లేకుండుటచేతనె సూరి చిం. చెప్పినతిజత్ర్యర్థ్యసంజ్ఞాదులవలె దీనిని బరిహరించెను. అందు గుణమె కాని దోషము లేదు. దానిని వీరు ప్రత్యేకముగా గుర్తించిరి. కాని దానిచే వీరు సాధించినప్రయోజన మేమి? చిం.లో నున్నప్రయోజనము గూడ ఏ రీతి లేకుండఁ జేసిరి. అందుకే దూసంజ్ఞను సూత్రమున విధింపక వివరణమున చెప్పి రేమో. అట్లు వివరింపలే దనియూ సూరి దీనిని గ్రహింపలే దని విమర్శించుట?

ఇఁక షష్ఠికి ద్వితీయాతుల్యత్వవిషయము. ఇది పరిహరించినసూరి ప్రణాళికలోనిదొకప్రయోజనమును వీరే యిట సూచించియున్నారు. "షష్ఠీతత్పురుషేతరతత్పురుషములవలెనే (దొంగభయము?) కర్మధారయద్విగువులును చింతామణిసూత్రములచేతను, మహాకవిప్రయోగములచేతను జ్ఞాపితము లగునవి యత్యనుజ్ఞాతము లగును' (పు.277) ఆ ట్లత్యనుజ్ఞాతము లనఁదగినవానిని గూడ సంగ్రహించువట్టిసూరిప్రణాళిక సరిపడుచుండఁగా దానిఁ దిరస్కరింప నేల? చిం.సూత్రములు, మహాకవిప్రయోగములతోపాటు సూరిలక్షణము పైని గూడ నుచిత మగుప్రమాణబుద్ధి యుంచిన బాగు గదా.

షష్ఠికి ద్వితీయాతుల్యత్వవిధానము ననుసరించుటలో వీరివివరణము నను భేదము గమనార్హము.

కన్నులంగవ- (కన్నులయొక్క + కవ) పులుగు తేఁడు- (పులుగుల యొక్క + తేఁడు) ఇట్టియెడల కన్నులకవ అని యుండ నక్కఱలేదు. సమాససామాన్యలక్షణముచెప్పిన నలౌకికవిగ్రహమందే సమాససంజ్ఞ గలిగి కన్నులయొక్క మొదల లగురూపములు కలుగక ముందే విభక్తిలోపాదికమున సమాసప్రాతిపదికము సిద్ధించును.' (పు.277) సూరి యిట్టిపద్ధతి యనుసరింపనందువలన నీయవి గానేర వని వీరియభిప్రాయము గావచ్చును. కాని యిదే మార్గములో వీరిప్రక్రియలోఁ గూడ భేదము గలదు. సమా.72సూత్ర

ముచే వీరు సమాసములయందును షష్ఠికి ద్వితీయాతుల్యత్వమును విధించి యున్నారు. ఇది షష్ఠీతత్పురుష మయియుండఁగా షష్ఠికి ద్వితీయాతుల్యత్వము రాకసుబ్విభక్తులు లోపించుటకుఁ గారణ మేమి? కంటిపాప మున్నగు చోట్ల ద్వితీయాతుల్యత్వము చేయక మానరు గదా. కానిచో నారూపము గాదు. ఏ మైనను షష్ఠీతత్పురుషములందును షష్ఠికి ద్వితీయాతుల్యత్వము నియతము గాదు. అట్టిదానికి వీ రాలక్షణమున నవకాశమును గల్పింపలేదు. షష్ఠికి ద్వితీయాతుల్యతనుగూర్చి పైని విపులముగాఁ జూతము.

## జ్ఞాపకసిద్ధములు :

వీ రిట విశేషముగా నొకసూత్ర మిట్లు వ్రాసిరి. "జ్ఞాపకసిద్ధసమాసములు సమాససామాన్యశాస్త్రముచొప్పున సాధ్యములు గావు. వానియందాయాసంధ్యాదిసూత్రములవిశేషవిధులచొప్పునఁ దత్తద్విశేషవిధ్యనుకూలముగా నాయాసమాసములప్రక్రియ నడచును." (సూ.71)ఇది యొకసూత్రముగాఁ జెప్పఁబడుట యాశ్చర్యమును గొల్పుటలో వింత లేదు. వివరణముగాఁ జూపఁదగినది.

'నిర్దయ + ఆలు నిర్దయురాలు. దీనికి సమాసమె సాధువు కాదు. అయినను సంధి 26సూత్రపువిధిచే దీనిసమాసము జ్ఞాపిత మై ఉత్వమును సిద్ధించు' (ఉ.278) ననిరి. ఇట్టి సమాసము సమాససామాన్యశాస్త్రముచే సిద్ధింపదు. కర్మధారయమునఁ బూర్వపదము క్రియత్త్రిసమముగంతధాతుజ విశేషణముల నెడి యే నొకటి గావలె. ఇది యేదియుఁ గాదు. నిజమే. కాని సూరి ఇల్లిదాదిసూత్రమున వివరణములోఁ జెప్పఁగా వీరు సూత్రమునందే (సంస్కృతతుల్యము లనుటతోపాటు) మహతీవిశేషణము లగునపు డాలు శబ్దముతో సమసించు ననిరి. (అచ్చి.3) ఆసూత్రమునను సంధి 26సూత్రమును బ్రస్తావించిరి గాని 'సమసించు' నని సమాసము నచ్చటనే (అచ్చి.3) విధించియే యుండిరి గదా. సంస్కృతతుల్యత్వమునుబట్టి యీసమాసము సిద్ధింపఁజేయఁగా నది సంస్కృత(సమ)ములకు సిద్ధింపదా? వీరు ఉ.తత్పు.74

సూత్రమున శ్రీమంతుఁడాలు (బాల. తత్స. 71) అని యుదాహరించిరి. దానిం బట్టియు నీసమాసము గుర్తింపఁదగియున్నది. కావున సంధి. 26సూత్రము చేతనే యిట్టిసమాసము జ్ఞాపిత మవు నను ట విచార్యము.

శోకార్తములు + ఒడలులు శోకార్తపుటొడలులు మొ న్నగుచోట్ల సంధి. 30వసూత్రముచొప్పున పిదపసమాసాదికము జ్ఞాపిత మై తత్సూత్రాను గుణముగా ముగాగమము నిల్చుట దానికి పుంప్వాదేశము మొ న్నగునవి యగుట సంభవించును." (పు.278) సూరిప్రణాళికను మార్చుకొనుటచేతనె వీరు సమాసములు పెక్కింటిని జ్ఞాపకసిద్ధములుగాఁ జెప్పవలసివచ్చినది. సూచిపత్రమున శోకార్తములు + ఒడలులు అని యుండఁగా సమాసవిభక్తి (లు) లోపింపఁగా మువర్ణమునకు పుంపు లగుట మొద లగునవి సామాన్యముగనె సిద్ధించును. ప్రాతిపదికకు విహితమైనముగాగమము నిగాగమము వలెనె విభక్తి కాదు గావున సమాసమున లోపింపక పైరూపములు సాధారణముగనె యేర్పడును. పరుపలవారు మిశ్ర (సాధ్య) సంస్కృతికసమాసము లలో షష్ఠీతత్పురుష మొక్కటియె సామాన్యశాస్త్రసిద్ధముగా భావించిరి గావున నిట్టి వనేకము వీరికి సమాససామాన్యశాస్త్రసిద్ధములు గావు. ఇట్టివాని నెల్ల సూరి సమాససామాన్యవిధిచేతనె సంగ్రహించుచుండఁగా నాప్రణాళికను ప్రమాదముగా నిరసించి పెక్కుస్థలములు జ్ఞాపకసిద్ధములు చేయు టేల? శాస్త్రగౌరవ మును మర్దింపఁజేయుటకుఁ గాఁబోలును.

కృష్ణ + రాయఁడు. కృష్ణరాయఁడు. మొ న్నగు చోట్ల సమాస (71వసూత్ర మని ముద్రణమున నున్న దది యచ్చుపొరపాటు. ప్రస్తుత సూత్రమె 71.) 75సూత్రముచొప్పున శుద్ధసంస్కృతపదముతోఁడిసమాసము సాధు వగుచున్నది. (పు.278) 'శుద్ధసంస్కృతపదముతోఁడి' యన్నను సయ్యాది యిటఁ బూర్వపదమై యుండు. అసలు శుద్ధసంస్కృత మనుట యుఁ బొరపాటు. ఈసమాసమును జ్ఞాపితము చేయుచున్న 76సూత్రమునొద్ద వీరు దీనిని కృష్ణుఁడు + రాయఁడు అని తత్సమముగాఁ జూపియున్నారు.

అదియు యుచితము. కావున నిటఁ దత్సమ మనక శుద్ధసంస్కృత మనుట సమంజసము గాదు గదా. 75సూత్రమున నిట్టిచోట్ల సమాసమె విధింపఁబడి యున్నది. కావున నిద్దానిని వీరు జ్ఞాపితసమాసములఁదోఁ జూపవలసినయవసరము గానరాకున్నది. ఇందు విశేషాంశ మేమియు లేమి వఝులవారి యీసూత్రము వ్యర్థము.

## త్రికము :

ఆ ఈ ఏ యనుసర్వనామంబులు త్రికంబు నాఁబడు (4) ననుదానిని వీరు తమగ్రంథమున సూత్రముగాఁ జెప్పలేదు. త్రికంబుమీఁది (ఉ.77సూ.) అని యీసంజ్ఞ నుపయోగించి యట వివరణమునం దీసూరిసూత్రము నుదాహరించిరి.

ఆ ఈ ఏ అనుసర్వనామప్రాతిపదికములు త్రిక మనఁబడును. (బా. సమా.4) (ఉ.284) త్రికమునుగూర్చి చెప్పినవఝులవారివాక్యము స్వీయమె. బాల.సూత్రసంఖ్య నిచ్చుటచే నది సూరిసూత్ర మనుకొనరాదు. సూరిసూత్ర మాధారముగా నట్లు స్వయముగాఁ జెప్పి రనవలె. ఏ అని సూరి సర్వనామము లనెనే కాని 'సర్వనామప్రాతిపదిక' లనలేదు. అన నక్కఱ లేదు గనుక. ఆ ఈ ఏ యనునవి ప్రాతిపదికములే యయియుండఁగా మఱలఁ బ్రాతిపదిక లనుట వివరణమె యగును. సూత్రమున వివరణ మేల? అవసర మైనఁ బిదపఁ జేసికొనవచ్చును వ్యాఖ్యానము. సూరిసూత్రము నిర్దుష్టమె. వఝులవారును సూత్రముగాఁ జెప్పలేదు. వివరణమునఁ జూపిరి.

ఇది సూత్రముగాఁ జెప్పుటలోనిదోష మేమో వారు వివరింపలేదు. సూత్రముగాఁ జెప్పవలసినది యగుట నిర్దుష్టము.

## కర్మధారయము :

కర్మధారయంబు త్రికస్త్రీసమముగంతధాతుజవిశేషణపూర్వపదంబయి

యుండుట (ప) సమాసాంతసూత్రము దుష్ట మని వదులగా నిట్లు ప్రతిపాదించిరి.

'ఆ ఈషత్' అనునవి పదములు కావు. కావున నట్టి త్రికమునకు సమాస యోగ్యతయే లేదు. కావున సమా. 7వసూత్రముచే చెప్పిన వానిసమాసము ప్రత్యేకముగా సూత్రింపనగును. (త.283) (వ్యా.సం.స.1198) కావునఁ ద్రికము పైసూత్రమునఁ జెప్పరా దని పిడిపర్తియము.

ప్రత్యేకముగా విధింపవలయు నన్నపి రది యెట్లు సాధించిరి? ద్వ్యరుక్తం ఖగు- అను 76సూత్రము గాని, త్రికంబుమీఁదిహల్లునకు- అను 77సూత్రము గాని ప్రత్యేకముగా వీనికి సమాసము విధించుట లేదు. ఇట్లు వివరించిరి.

ఆ ఈ ఏ అనుసర్వనామప్రాతిపదికములు త్రిక మనఁబడును. (బా. సమా.4) ఈసూత్రజ్ఞాపకముచేతఁ ద్రికాదిమిశ్రసమాస మభ్యనుజ్ఞాత మగుచున్నది. (త.284) ఈసూత్ర మనఁగా 76,77సూత్రములు గావచ్చును. బాల. సమా.4సూత్రమును వీరు సూత్రముగాఁ జెప్పలేదు గదా. త్రిక సంజ్ఞను జెప్పినయాసూత్రముచే సమాసము జ్ఞాపిత మవుటయుఁ గేవల మసంభవము. హ్రస్వము చెప్పిన76సూత్రముకంటెఁ ద్రికంబుమీఁది- అను77 సూత్రముచే వీనసమాసము జ్ఞాపిత మయిన దను టొప్పును. ఇంతకును దీనిచే నభ్యనుజ్ఞాత మగున దేమి సమాసము? త్రికమునకు మీఁదిపదముతో సమాసమా? మిశ్రసమాసమా? అ...ఆది అయ్యది యనురీతిగా వాచ్ఛికసమాసములయెడ వీవిధి సార్థకమై యగుచుండఁగా నియ్యది మిశ్రసమాసములకు జ్ఞాపక మగుట యెట్లు? అట్టి వాచ్ఛికసమాసములు లేనప్పుడే మిశ్రసమాసము లందు మాత్రమే యుండవలయుటం జేసి త్రికాదిమిశ్రసమాస మభ్యనుజ్ఞాత మవునట్లు చెప్పవచ్చును. అచ్ఛికసమాసములు గలవు కావున వీట వదుల వారు మిశ్రసమాసములను బ్రస్తావించుట యసంగతము. సూరిప్రయోగాదికము దిరస్కరించుటచే నెట్లైన మిశ్రసమాసములు జ్ఞాపకసిద్ధములు చేసికొనవల సినస్థితిచే వీరు మిశ్రములను గలుపుచుండిరి.

త్రికము మీఁది హల్లునకు ద్విత్వము గల దనుటచేఁ త్రికము పూర్వపదముగా నుండుట గల దని యర్థముతో నీసమాసము జ్ఞాపిత మయిన దందము. కాని యిట మాత్రము త్రికమునకు మీరు ప్రత్యేకముగా సమాసమును విధించిరా? ఇంకను 'త్రికంబు పూర్వపదం బయియుండు' ననుసూరిలక్షణమె ప్రత్యేకవిధానముగా నున్నదే. ప్రత్యేకవిధానము నంగీకరింపక ప్రత్యేకవిధానము చేయవలె ననుచు జ్ఞాపితము చేయువయ్యలవారిమార్గ మెంత సక్రమముగా నున్నదో వేఱ చెప్ప నక్కఱ లేదు.

అసలు మీ రనుసరించినపద్ధతిలో నీసమాసమును ప్రత్యేకముగాఁ జెప్పవలసినయవసరము గానరాదు. 'అది + కన్య - అక్కన్య. వానికిన్ + పురుషునకున్ - అప్పురుషునకున్ మున్నగుచోటులందు అది. వానికిన్ మున్నగు రూపములు సిద్ధింపకముందే సమాససంజ్ఞ కలిగి విభక్తిలోపాదికము గల్గుటచేత ఆ ఈ ఏ అను ప్రాతిపదికలు నిల్చుటయు సంభవించెను' (పు.245) సూరివలెఁ గాక మీరు సమాసములలో నలౌకికవిగ్రహమును, నందు సంస్కృతవిభక్తులే లోపించుటయు ననుమార్గ మెన్నుకొంటిరి. కావున వాఁడు కొడుకు అనుచో ఆ + సు కొడుకు + సు - ఆకొడుకు అనురీతి నేర్పడుటలో విశేష మేమి? (పు.242) కావున నీసమాసమును ప్రత్యేకముగా సూత్రింప నగు నని మీరు చెప్పుట మీప్రక్రియావిధానమునుబట్టియె యనవసర మని నిర్ణయింపఁదగును.

సూరి యిట్టిప్రక్రియామార్గము ననుసరింపలేదు. మఱి యాతనిమతమునఁ ద్రికమునకు సమాసము ప్రత్యేకముగా విధింపవలసినయవసర మున్నదా? ఉన్న దన్నఁ 'ద్రికంబు పూర్వపదం బయియుండు' నన్నయీలక్షణ మట్టి దనుట యింతకుముందే గుర్తించియుంటిమి. కాని యిట నింకను బరిశీలించి నిర్ణయింపవలసినయంశ మొండు గానవచ్చుచున్నది.

'కర్మధారయంబు త్రిక - పూర్వపదం బయియుండు' ననుసూరిలక్షణమున (ద్వంద్వాదులవలె) త్రికాదులకు మీఁదివిశేష్యముతోఁ గర్మధారయ

ముగ విధించుట ప్రధానముగాఁ దోఁపదు. కర్మధారయస్వరూపాభివర్ణనమై యుండుఁ గలదు. 'ఆకన్య-అను కర్మధారయసమాసమున 'ఆ' అనునది పూర్వపదముగా నున్నది' యనురీతిగాఁ జెప్పుటయె కాని 'ఆ అనుదానికి కన్య యనుదానితోఁ గర్మధారయ మగు' నని చెప్పుట సూత్రాభిప్రాయము గాదేమో. అవ్యయమున నెయవి పదములు కావు కావున సమాసయోగ్యత లేదిత్యాదిగా వజ్ఝలవారు వివరించుట సరి కాదని చెప్పవచ్చును. రాముబాణ మనుటో రాము అన్నది పూర్వపద మనుటో అది పదము గాదు గావున నట్లు చెప్పరా దనుట యెట్లు యుక్తము గాదో యట్లే యిదియును. అయిన సూరిమతము ననుసరించి ఆకన్య యని చేర్పఁదగు నెట్లు? అది + కన్య అనియే యుండఁగా (మిశ్రసమాసము సూరిమతమున జ్ఞాపితము చేసికొన నక్కఱ లేదు.) ప్రస్తుతవిధానముచేతనె అది యనుదానికి 'ఆ' యను (సర్వనామ) త్రికరూపము గల్గు నని చెప్పఁదగు. ఈయంశ మింకను విశదముగాఁ బరిశీలింపవలసియున్నది.

అట్లు గాక ఆ ఈ ఏ యను ప్రాతిపదికలకే సమాసము వివక్షిత మైన దన్నపక్షమునను సందష్టాంగత్వ మేమి? సమాసయోగ్యత లేదు గావునఁ బ్రత్యేకముగా విధింపకొనవలె ననిరి వీరు. ప్రత్యేకముగా విధించినఁ బ్రాతిపదికమున కైనను సమాస మగును గదా. అట్టి గుణవంతురాలు ఇత్యాదు లెట్లయినవి? అష్టలోరాలుకట్టిన సమానార్థకతా యదియ- అని చెప్పుటచేతనే కదా. (వ్యా.సం.స.857) 'కర్మధారయంబు త్రిక- పూర్వపదం బయియుండు ననునీలక్షణమై యట్టిప్రత్యేకవిధానముగా గుర్తింపఁగా నీప్రాతిపదికలకు సమాస మగుటలో వింత యేమియు లేదు గదా. త్రికంబు మీఁదియసంయుక్త హల్లునకు ద్విత్వంబు' అనుదానిచే జ్ఞాపితము చేసినవజ్ఝలవారిమార్గముకంటె 'కర్మధారయము త్రిక- పూర్వపదం బయియుండు ననుసూరిలక్షణముచేతనె యిట్టిసమాసములు సముచితములుగా సాధింపఁబడును.

కావున నీసూరిసూత్రమునఁ 'త్రిక'శబ్ద ముండుట యవసర మని గుర్తింపఁదగును.

'స్త్రీసమముతోడి కర్మధారయమును వేఱు చెప్ప నేల?' (ఉ.283) యని ప్రశ్నించిరి. అనఁగా సూరిసూత్రమందలి స్త్రీసమదళము వ్యర్థ మని భావము. అందుకే కాఁబోలుఁ దమలక్షణమున వీ రద్దానిని దొలఁగించిరి. వేఱు చెప్ప నేల యందు రేమి? స్త్రీసమమునకు సమాసము మఱి యే దేని శాస్త్రముచే సిద్ధించుచున్నదా? దాని నుదాహరించిన బా గుండెడిది. స్త్రీసమమునకుఁ గర్మధారయము గుదు రనిచోను, అట్లు సమాస మగుట వే ఱొకసూత్రముచే సిద్ధ మైయున్నచోను మాత్రమె యీసూత్రమునను స్త్రీసమశబ్దము వ్యర్థ మగును. అట్లు గాకుండుటచే సూరిలక్షణమున స్త్రీసమశబ్ద మవసర మని గుర్తింపక తప్పదు గదా.

కర్మధారయసామాన్యలక్షణము ననుసరించి విశేషణము లెల్లఁ బూర్వపదములుగా నుండఁదగినవే. అవి త్రికస్త్రీసమముగంతధాతుజవిశేషణములు మాత్రమె యనియు నితరము లుండ వనియు సూరిలక్షణము నియమించుచున్నట్లు గ్రహింపవచ్చును. వీరు దమసూత్రమున 'దుమంతములు గా' వని చెప్పిరి. ఏవి యుండునో కాక యేవి యుండవో తెల్పుట యుక్త మని వీరియభిప్రాయము గాఁబోలును.

స్త్రీసమములు పూర్వపదములుగా నుండుట సహజసిద్ధమె కాన వేఱు చెప్పఁ బని లే దని భావించుచో మఱి వీరు తమసూత్రమునఁ బూర్వపదము 'మువర్ణకాంతము గావచ్చు' నని యేల చెప్పిరి? మువర్ణకాంత మగుటను వీరు చెప్పుట యుచితమె. కాని స్త్రీసమ మగుటను సూరి చెప్పుట యుచితము గాదు, పూర్వపదము లేవి యగునో చెప్పుటలో లాఘవముతోపాటు సమగ్రత కూడ సూరిలక్షణమున సిద్ధించినది. అట నట జ్ఞాపితములు చేయుటకంటె సూత్రమున స్పష్టముగా నిర్దేశించిన సూరిమార్గ ముచితము.

ద్వంద్వాదులలో నేది కూడదో యది చెప్పక సూరివలెనె వీరును నేది యుండునో యదియే పేర్కొనిరి. ఇట సూరి స్త్రీసమమును పేర్కొనుట

ననుసరము, సంప్రదాయానుగుణము నని గమనింపఁదగును.

“వర్ణకాంత- అనినచో ముగంతసిద్ధి యగును గాని ముగంత- అనుటచే మువర్ణకాంత అనునర్థము రానేరదు గదా. అప్పట్టున సరసప్రవచనము అనుదానిసిద్ధి యెట్లు?” (పు.288) కావున సూరిసూత్రమున 'ముగంత' అనుట సరి గా దనియు మువర్ణకాంత అనవలయు ననియు వీరియభిప్రాయము. ఇది యుచితముగానే కన్పించుచున్నది.

కాని యిట ముగంతశబ్దముచే సూరి యాగమమునే యుద్దేశించె నని భావించుట కవకాశము గానరాదు. సూరి దీనికి లక్ష్యముగా బెడిదపుటడిదము అనుపది చూపెను. బాల.చే సాధ్యము గా దని వఝలవారు పేర్కొన్న 'సరసప్రవచనము' వంటిదే బెడిదపుటడిదము. 'అడిదము' అను నేకవచనాంత రూపమునుబట్టి పూర్వపదము మువర్ణకాంతమె కాని ముగాగమాంతముగాదు. అసలు ముగాగమాంత మనుటయె సమర్థింపవలసిన దై యున్నది. మువర్ణకేతర మగునవిభక్తి పర మగునపుడు ముగాగమ మగును. అట్టియెడల మువర్ణకేతర మగునయా విభక్తియే యంతమం దుండును గాని ముగాగమ మంతమం దుండదు గదా. ఇంక సమాసమున విభక్తి లోపించును గావున ముగాగమమే చివరి దగుటవలన ముగంత మని యుండు నని సమర్థించుకొనవలసియుండును. అది యెంతవఱ కుచితమో చెప్పఁజాలము.

ఇంక బెడిదపుటడిద మనులక్ష్యము ననుసరించి 'ముగంత' శబ్దముచే మువర్ణకాంతమునే సూరి యుద్దేశించె నని చెప్పకతీఱదు. అట్టియెడల మువర్ణకాంత- అను దైర్ఘ్యమును, మ్వంత అనుదాని నస్పష్టక్లిష్టతలను వారించుటకై యుచ్చారణసౌకర్యమునకుఁగాను మువర్ణముపై అకారమును జేర్చి సూరి ముగంత-యని ప్రయోగించె నని యెన్నఁదగును. మొత్తముపై ముగంత అనుటలో నాగమమె సూరి యుద్దేశించె ననుట (అతఁడు చూపిన లక్ష్యము ననుసరించియు) విరుద్ధమే. మువర్ణకాంతమునె సూరియుద్దేశించె ననుట స్పష్టము.

అయ్యాను-మువర్ణకాంతంబులయు బహువచనంబునకు (కార.20) అనుచో వలె నిచటఁ గూడ సూరి మువర్ణకాంత- అనియు చెప్పిన నింకను స్పష్టముగా నుండెడి దనవచ్చును. ప్రయోజనాంతర మెది చూచి సూరి యుద్దేశించె నేమో తెలియకున్నది.

'ధాతుజవిశేషణములును క్లీబసమములె. అట్లంగీకరింపనిచో వానికిఁ బ్రథమైకవచనలోపము గల్గు నెట్లు? కల్గనిచో వానికి వాక్యప్రయోగయోగ్య మగుపదత్వము సిద్ధించు నెట్లు?' (ఉ.289) అనిరి. అనఁగా ధాతుజవిశేషణములు వేఱుగాఁ జెప్పఁబడ నక్కఱ లే (అవి క్లీబసమములు గాన క్లీబసమశబ్దముచే సంగ్రహింపఁబడును.) దని వీరియభిప్రాయము.

ధా.వి.లు క్లీబసమములు గావు. (చూ.ద్రు.) ధాతుజవిశేషణములకు విభక్తి వివక్షించునపుడు తచ్ఛబ్దం బనుప్రయుక్తం (సమా.8) బయి విభక్తితో వచ్చినవాఁడు. వచ్చినది మున్నగురీతిగాఁ బదత్వముతో వాక్యప్రయోగయోగ్యములగుచునే యున్నవి. ఇట్లు ప్రథమైకవచనము నిల్చియుండుటచే వీనిని క్లీబసమము లనుట కుదురదు. వరుసలవారిమతముచొప్పున నివి క్లీబసమములు. కావునఁ బ్రథమైకవచనలోపముతోఁ బ్రయోగయోగ్య మగుపదత్వము కల్గఁగా రాముఁడు వచ్చిన, సీత రాఁగల, లక్ష్మణుఁడు రాని- మున్నగురీతిగాఁ బ్రయోగింపఁబడుచుండవలయును. కాని యట్టి వుండదు.

వీరు సూరిలక్షణము నింకను విస్తృతపఱచి "విశేషణములకు విభక్తి వివక్షయందుఁ దచ్ఛబ్దం (అది,వాఁడు-అవి-వారు మొ॥ఆశబ్దరూపములు) బను ప్రయుక్తం బగు-చేయుచున్నవాఁడు' (ఉ.289) అని చెప్పిరి. విభక్తివివక్షలో ననుప్రయుక్త మవ్వు ననుటచే చేయుచున్న- అనువిశేషణమునకుఁ బ్రథమావిభక్తి వివక్షింపఁగాఁ దచ్ఛబ్దము విశేషణముపైఁ జేరి యేకత్వమున మహాదర్థమునందు చేయుచున్నవాఁడు అని యవుచున్నది. ఇది ప్రథమైకవచనాంతరూపము.(ద్వితీయాదులలో చేయుచున్నవానిన్. చేయుచున్న వానిచేత ననురీతిగా నగును.) ఇటఁ బ్రథమైకవచనలోపప్రసంగమే లేదే.

వీనిని స్త్రీసమము లనుట యెట్లు. ఉమంతకార్యము అవుచుండఁగా. వఝల వారియభిప్రాయము పైని విపులముగాఁ బరామర్శింతము.

కాఁగా ధా.వి.బ స్త్రీసమము లనుట సూరిప్రణాళికకే గాక వఝల వారిప్రక్రియావిధానమునకును విరుద్ధమె. ఇట్లు ధా.వి.బ స్త్రీసమములకంటె నితరము లగుటచేఁ బై సూరిసూత్రమందలి స్త్రీసమశబ్దముచే నివి సంగ్రహింపఁబడనేరవు గావున వానిని బ్రత్యేకముగఁ బేర్కొనుట యవసరము. సూరి యట్లు చెప్పుట యుచితము.

సంజీవనిలో మఱియుఁ గర్మధారయమే యన నేల? మూఁడులోకములు నాలుగువిధములు మున్నగుద్విగువులు సయితమి ట్లుదాహరింపఁ దగినవే కద.' (వ్యా.సం.స.1198) యనిరి. అనఁగా మిశ్రములు కర్మధారయములె గాక ద్విగువులను గలవని యుద్దేశ్యము. అట్టిచో 'కర్మధారయమే యన నేల?' యనుట చింత. వీరు చూపిన మూఁడులోకము అన్నది కర్మధారయేతరమా? 'ఇయ్యది సంఖ్యాపూర్వంబు ద్విగువు నాఁబడు' నని సూరి పూర్వపదము సంఖ్యావాచక మగుకర్మధారయమె ద్విగు వనఁబడు నని స్పష్టము చేసెను గదా. అట్టియెడల (సుద్యోతమున వీరు చెప్పినట్లు) కర్మధారయముకంటె వేఱుగా ద్విగువును బ్రత్యేకముగాఁ బ్రస్తావింపవలసిన యవసర మేమి?

ఇంతియ కాక 'సూరి యీసూత్రమున నాచ్ఛికసమాసములనే యుదాహరించుటలో నభిప్రాయ మేమో తెలియకున్న (వ్యా.సం.స.1188) దనిరి. ఇట సూరి యుదాహరించిన 'పెట్బృందము' అన్నది యాచ్ఛికసమాసమా? బృంద మనుతత్సమముచే నీయది (మూఁడులోకము లనువిధముగనె) మిశ్రమె కదా.

మొత్తముమీఁద నీసూరిలక్షణము వఝలవారు తలఁచినట్లుగా దుష్టముగా దని స్పష్టము.

ఇంక నిర్దుష్టముగా నుండు నని వీరు నూతనసూత్రస్థానమును గల్పించినసూత్రము పరామర్శింపవలసియున్నది.

“సమానాధికరణము లగుకర్మధారయద్విగువులలో సమాసపూర్వావయవము డుమంతము కారాదు. ఉవర్ణాంతము కావచ్చును. కాని యాయువర్ణమునకు పుంపులాదేశము కావలయును. ఉవర్ణకవిరహితము కారాదు.” (ఉ.71సూ.)

ఇది సూత్ర మగుటంగూర్చి చింతపడ నక్కఱ లేదు. వచులవారి సూత్రము లిట్లు వ్యాఖ్యానప్రాయముగా నుండుట సాధారణమే. ఇందు ‘సమానాధికరణము లగు’ అనుదళము కేవలము వివరణప్రాయము. సమానాధికరణములు గానికర్మధారయ ‘ద్విగు’వులు లేవు గదా. అట్టియెడల ‘సమానాధికరణము లగు’ అని చెప్పుటవలనఁ బ్రయోజనమే మున్నది? చెప్ప నక్కఱ లేదు.

రాముఁడు రక్షించినభృత్యుఁ డనుచో రక్షించినది రాముఁడు కాఁగా రక్షించిన అనుధా.వి. భృత్యు డనుదానితోఁ గర్మధారయము నందినది. ఇది కర్మధారయ మయ్యును సామానాధికరణ్యము లేదు గదా? అందుకే వీరు ‘సమానాధికరణము లగుకర్మధారయద్విగువు’ లని చెప్పి రందమా? అట్టి యుద్దేశ్యము వీరికి లేదు. ఐనను నిట్లు చెప్పనిసూరిమతమున దోష మున్నదా? ఇట సామానాధికరణ్యము గుదురకుండఁజేసినది కదా సూరి యిట్టిసమాసమును ‘కర్మాదులకుం బ్రాధాన్యవివక్షయందు ధాతుజవిశేషణంబులు కర్త్రర్థంబులై వానితోడ సమసించు’ (సమా.23) అని ప్రత్యేకముగా విధించెను. వీరు గూడ నదేపద్ధతిలో (ఉ.82.సూ) సూత్రించియే యుండిరి. ఈ ట్లీసమాసము ప్రత్యేకముగా విధించుటచే నిట సమన్వయవిరోధ మేమియు లేదు. పయిఁగా నట్టిప్రత్యేకస్థలములలోనికర్మధారయములందును బూర్వపద మిట సూరి పేర్కొన్నలక్షణమున కనుగుణముగా ధా.వి. అగుట గమనింపఁదగు. కావున ‘సమానాధికరణంబులగు’ ననువచులవారిసూత్రమునందలిదళము వ్యర్థమే.

సంఖ్యాపూర్వక మైనకర్మధారయమే ద్విగువు నాఁబడును. కర్మధారయ మనఁదగినద్విగువు కలదా? అయిన ద్విగువును వేఱుగాఁ బరిగణింప నేల? సమానాధికరణంబులగు, ద్విగువు అనువానిని చెప్పుటవలనఁ బ్రయోజనవిశేష మేమియో తెలియకున్నది. వలయువారు వివరింపలేదు. 'కర్మధారయంబు' అనున దొక్కటి పేర్కొనఁదగియున్నది. సూరి యట్లు చెప్పుటి మాత్రలక్షణయుక్త మైయున్నది.

ఇవి రెండ్లు సమాసములై యుండఁగా మరల 'సమాసపూర్వావయవము' అని సమాసశబ్దమును జేర్పనవసర మేమి? కర్మధారయంబునఁ బూర్వావయవం బన్న మాత్రమువనే వలయువా రుద్దేశించినయర్థము సిద్ధ మగుచున్నది. సూరి 'పూర్వపదంబు' అనుటలో దోష మున్నదా? లాఘవ మును గలదు. అది సూత్రమే కదా.

ఇట్టిసమాసమునఁ బూర్వావయవము 'డుమంతము కారాదు' అనిరి. దీనికిఁ బ్రయోజన మేమి? ఇట్లనుటవలన 'బల్లిదుఁ డగుమగఁడు అను విగ్రహము గల బల్లిదమగఁడు అనురీతివి యుండరాదు.' (సూ.283) ఈ యంశము సూరి తనలక్షణమున స్పష్టము చేసియుండెను. 'త్రికస్త్రీసమమ్మగంతధాతుజవిశేషణపూర్వపదం బయియుండు' ననుటచేఁ ద్రికాదిభిన్న మగుడుమంతము పూర్వపదముగా నుండ దని యీయర్థము సూరిలక్షణసిద్ధమే. కాన నిందు వలయువారు విశేషముగాఁ జెప్పినది గాని యందుకయి సూరిలక్షణమును మార్పవలసినయవసరము గాని లేదు. కాని వీరిసిద్ధాంతమునకు వీరిలక్షణముకంటె సూరిలక్షణమే సాధక మైయుండుట గమనింపవలసియున్నది.

వీ రొకచో 'వానికిన్ + పురుషునకున్' ..అప్పురుషునకున్' (సూ.285) అని చూపిరి. ఇట 'వానికిన్' అనుచోఁ బూర్వావయవము డుమంతము గాదా? డుమంత మగుట నుదాహరించుచు డుమంతము గా దని లక్షణము చేయుట యొప్పునా? ఇంక వానికిన్ అనురూపము సిద్ధింపకముందే (అలా

కికవిగ్రహమునందు) విభక్తిలోపముచే అపురుషనకున్ అని యున్నను గాన నయ్యది దుమంతము గాదందురా? పురుషనకున్ అనుదానికి విశేషణ మగు 'అ' శబ్దము ప్రథమైకవచనమున వాఁడు (అతఁడు) అని కాక తప్పదు. కావున 'వానికిన్' అనురూపము గాక ముందే యయిన నిప్పటి 'అ' శబ్దము దుమంతము కాకపోవు టెట్లు? అది యట్లు యనుకొన్న-వీ రెల్ల యెడల నిట్లే లౌకికవిగ్రహముననో విభక్తిలోపము చూపుచుందురు. కావున బల్లిదుఁడైన మగఁడు అనుచోఁ గూడ బల్లిద + ను, మగ + ను అను రీతిగాఁ జూపవలె. అప్పు డియ్యదియుఁ బైని 'అ' శబ్దమువలె దుమంతము గా దనవలె. అట్టిచో బల్లిదమగఁ డని యగుటలో విప్రతిపత్తి యేమున్నది? ఇంకను నెల్లయెడల నలౌకికవిగ్రహముచేఁ బ్రాతిపదిక దుమంత మనరా కుండుటచే దుమంతము కారా దను నిషేధము వ్యర్థము కాదా?

ఇఁక 77 (వదులవారు 78కి అనుట ప్రమాదము) సూత్రముఁ బ్రత్యేకవిధివలన అపురుషుఁ డనురీతిస్థలములఁ బూర్వపదము దుమంత మగుట జ్ఞాపిత మందురా? అట్లని వీరు స్పష్టము చేయలేదు. ఇంకను నాసూత్రముచే ద్రికమునకు సమాసమునా? (లేక మిశ్రసమాసమునా?) కాక పూర్వావయవము దుమంత మగుటనా? దేనిని జ్ఞాపితము చేయుదురు?

సూరిమతమున నన్న వాఁడు + పురుషుఁడు అపురుషుడు, వచ్చిన వాఁడు + రాముఁడు వచ్చినరాముడు అనురీతిగాఁ బూర్వావయవము దుమంతము లైనఁ గావచ్చును. త్రిక.ధా.వి.లకు సూత్రమునఁ బ్రత్యేకగ్రహణము కలిమిం జేసి యిట విరోధ ముండదు. కాఁగా (సూరి సిద్ధాంత మేయదియో పరిశీలించి కనుఁగొనవలసియున్నది కాని) ఇట్లు. పిడిలక్షణముకంటె సూరి లక్షణమే వీరి ప్రక్రియాపద్ధతికి సాధక మైయున్నది గదా.

కాఁగా వదులవారు 'దుమంతము కారాదు' అని సూత్రించుట వారి ప్రక్రియావిధానమునుబట్టియే సమంజసము గా దని విశ్వసింపవచ్చును.

సూత్రమునఁ బిదప వీరు 'ముపర్ణకాంతము గావచ్చును' అనిరి సూరి 'ముగంత' అని చెప్పుట సరి గా దనుటకే వీ రిట్లు చెప్పిరా? సూరి

లక్షణమునందలిమిగిలినభాగమువలెనె దీనిని వివరణముననే స్పష్టము చేయ వచ్చునే. కాక మువర్ణకాంత మగుటను సూత్రమునఁ జెప్పవలసియున్న దనుసుద్దేశ్యముతోనే వీరు చెప్పియుందురు. అపుడు 'స్త్రీసమ మగు నని వేఱు చెప్ప నక్కఱలే' దని (పు.283) వీరు సూచిని విమర్శించుట సంగ తము గాదు. అంతే కాక స్త్రీసమములను వీరు సూత్రమునఁ జెప్పకుండు టయు సరి కాదు. అపుడు ఉమంతము కాదా దని వేఱ చెప్ప నవసరము లేదు. ఈ స్త్రీవాక్యముచే వీరిలక్షణమున ననౌచిత్యములు పెక్కగుచున్నవి.

ఆపిదప వీరు 'కాని యామువర్ణకమునకు పుంపు లాదేశము కావల యును' అనిరి. ఇదియు సూత్రమునందే చెప్పుట కేవల మనవసరము. కర్మధారయమునఁ బూర్వపదము మువర్ణకాంత మగుటను జెప్పినఁ జాలు. ఆమువర్ణకమునకు 'కర్మధారయంబులందు..(సంధి.32) అనుసూత్రముచే పుంపు లెట్లు నవును. ఆసూత్ర మిచ్చుటిమువర్ణమునకే గదా పుంపులను (నిత్యముగా) విధించుచున్నది. కావున పుంపులు కాక తప్పదు. అట్టియెడల నిట విశేష మన్నట్లుగా పుంపులు గావలయుటను వేఱొక్కన నవసర మేమి? కావున సూత్రమం దీవాక్య మనవసరము. వివరణమునఁ జెప్పుకొన నిబ్బంది లేదు.

ఇట వీరు 'మువర్ణకముగాగమములకు పుంపులు వచ్చిన బల్లిదపు కొలము బల్లిదంపుకోలము అనునవి నిర్బాధము" (పు.283) అనిరి. వీరు చెప్పినట్లుగనే పుంపు లయినవి గావున నివి నిర్బాధము లని తలఁచియుం దురు. కాని యివి సాధువు లనరాకున్నది. సంధి.25.సూత్రముచే పుంపు లకుఁ బరుష (సరళ)ములు పర మైనపుడు నుగాగమము రావలెను. పుంపుల వల్ల సంస్కృతసమములమీఁదను మిశ్రసమాసములందును నుక్కు వచ్చును. వరపదపుంజరిత్రము' (పు.54) అనియే వీరు చెప్పిరి. పుంపులపై నుగాగమము లేకుండుట వీరును వేఱొక్కనలేదు. రాకుండుటకు నవకాశము లేదు గావున నిటఁ గూడ నుగాగమ మయి బల్లిదపుఁగొలము బల్లిదంపుఁ గొల మనురీతిగాఁ గావలె. కావున నుగాగమము లేని పదములవా రుదాహ

రించిన- ఇల్లిదపుకోల మనురీతిని విధ్యాధము అనుట సరి కాదు.

'సంధి31సూత్రముచొప్పున జ్ఞాపితము లైనసాంస్కృతికమిశ్రములును సాధువులె. సరసపుమాట, సరసంపువచనము' (ఉ.283) అనఁగా మువర్ణకాంతము గావచ్చు నను ప్రస్తుతలక్షణ మాచ్ఛికసమాసములకు మాత్రము పరిమితము. వజ్ఝలవారిమతమున మిశ్ర(సాధ్య)సాంస్కృతికసమాసములు జ్ఞాపితములు గావలసినదే గాని సామాన్యశాస్త్రముచే సాధింపఁబడరాదు.

సంధి31సూత్రము కర్మధారయమున మువర్ణకమునకు పుంపులు చెప్పునది. దీనిచే మిశ్రసాంస్కృతికసమాసములు జ్ఞాపిత మగుట యెట్లు? పుంపు లాచ్ఛికసమాసములందు రావా? అట పుంపువిధానము సార్థకము కాదా? సామాన్యశాస్త్రము ననుసరించి సాంస్కృతికమిశ్రసమాసము లభ్యనుజ్ఞాతములు గానప్పు డననుజ్ఞాతము లైనయాచ్ఛికసమాసములందే యాపుంపు లవును. బెడిదపుటడిదము ఇత్యాద్యాచ్ఛికసమాసములయెడఁ బుంపువిధానము సార్థకమె. కావున దానిచే సాంస్కృతికమిశ్రసమాసములు జ్ఞాపితము లగు ననుట సక్రమము గాదు.

పుంపువిధానముచేఁ బూర్వపదమువర్ణము లోపింప దనునర్థము గ్రహింపవలెను. బెడిదము ఆడిదము అనుచో సమాసమున ము(ను?)విభక్తి లోపింపవలసియుండఁగా నది లోపింపక దానికి పుంపు లగును. కావున నద్దానిచే మువర్ణకము లోపింప దనునర్థము సిద్ధించుచున్నది కావున వజ్ఝలవారు ప్రస్తుతసూత్రమునఁ జివర 'మువర్ణకవిరహితము గారాదు' అని చెప్పుట యనవసర మని స్పష్ట మగుచున్నది.

మొత్తముమీఁద మిశ్ర(సాధ్య)సాంస్కృతికకర్మధారయములు జ్ఞాపితము లయ్యెడునవకాశము లేమి నట్టివి వజ్ఝలవారిమతమున సముచితముగా సాధింపఁబడ వనవలెను. రక్షణ మొనర్చువేళ్వుఁడు, రక్షించువేళ్వుఁ

ననురీతిస్థలములు నిల్చె. సూరిప్రణాళికను మార్చి వజ్ఝలవారు సాధించిన ప్రయోజన మొకటి గానరాకున్నది.

'మువర్ణకవిరహితము గారాదు' అన్నది వీరియీసూత్రమునఁ జివరి యంశము. ఇదియు ననవసరమె. మువర్ణకంబునకుఁ బుంపు లగు ననుటచేతనే పుంపు లగుటవలన మువర్ణము లేకపోవుట యనఁగా లోపించుట నివారింపఁ బడుచున్నది. కావున మఱల మువర్ణకవిరహితము గారా దనుట పునరుక్తియె. అట్టియెడలఁ దీనిచే మువర్ణకమున కొకవేళఁ బుంపులు రాకున్నను నామువర్ణము నిలిచియే యుండును గాని లోపింప దని వీరియభిప్రాయ మేమో. మత్స్య స్త్రైణరూపంబున (సూ.౫౧) మొద లగువాని నుద్దేశించి యిట్లు చెప్పిన నది కేవల మసంగత మగుట సంధి.౨౯సూత్రమునొద్ద స్పష్టము.

అచ్చము + తెల్పు- అచ్చతెల్పు, దట్టము + కెంపు దట్టకెంపు ఇత్యాదు లలో మువర్ణకవిరహితత్వము గలదు. ఇది ప్రత్యేకస్థలము గావున బాధ లే దని చెప్పుటకు వీలు లేదు. ప్రత్యేకస్థలముల నెట్లును లోపించునపుడు 'మువర్ణకవిరహితము కారా' దని యిట విశేషముగాఁ జెప్ప నేల? ఇట్లు ప్రత్యేకముగాఁ జెప్పకున్న మువర్ణము నిల్చియుండునా? ప్రత్యేకముగాఁ జెప్పినను నెల్లయెడల లోపింపకుండుటయె గలదా?

కాఁగా నీసూత్రమునందలిచివరివాక్యమును జెప్పఁదగినది కా దని గుర్తింపఁదగును. ఇట్లు వజ్ఝలవారికర్మధారయసమాసలక్షణము సముచితముగా లేమి సుగ్రాహ్యము. సూరిలక్షణ మెంతయు పూర్ణ మగుటయు స్పష్టము.

## అనేకమాఱులు :

"ఆంధ్రవిభక్త్యంతము కానిశుద్ధసంస్కృతశబ్ద మాచ్ఛికశబ్దముతో సమసింపదు. ఉదా. అనేకమాఱులు- మొద లగునవి యసాధువు" (సూ.284) లని వీ రిట వివరించిరి. సూరి చెప్పెను గదా యని వీరును నట్లు చెప్పిరి. కాని వీరు చెప్పుట యనవసరము. సూరివలెఁ గాక మిశ్ర(సాధ్య)

సాంస్కృతికసమాసములు సమాససామాన్యశాస్త్రసిద్ధములు గా వని విశ్వసించుకొని యీ లేనొకసూత్రమునకు నెట్లో ముడిపెట్టి వానిని జ్ఞాపితములు చేయుట గదా వీరిమార్గము. అట్టియెడల నీవివరణ మేల? ఆంధ్రవిభక్త్యంతము కానిశుద్ధసంస్కృతమున కాచ్ఛికశబ్దముతో సమాసము లే దనుట కస లాంధ్రవిభక్త్యంత మైనసంస్కృతశబ్దమున కిట్టిసమాసము నంగీకరించిరా? (జ్ఞాపకసిద్ధస్థలములు నిట్టివానికిఁ బ్రసక్తియే లేకుండుట స్పష్టమే) షష్ఠీసమాసము లంగీకరించిరి. కాని యిట అనేకమాఖు లిత్యాదిగా నన్నియుఁ గర్మధారయములే యుదాహరించిరే. ఇఁక వీరు నిట్లు చెప్పుటచే నాంధ్రవిభక్త్యంతమయినచో సంస్కృతశబ్ద మాచ్ఛికముతో సమసించు ననునర్థ మేర్పడుచున్నది. ఎట్టియర్థమువలన వీరు సూరిలక్షణమును విమర్శించిరో యట్టియర్థమే వీరు వివరణముచేఁ జెప్పుట వింత. బాల.ప్రభావమునకు లో నగుటచే నిట్లు చెప్పియుందురు. కాని యిది వీ రనుసరించినసమాసలక్షణ విధానమును బట్టి వీరు చెప్ప నవసరము లేనిది.

వీ రలౌకికవిగ్రహమున సంస్కృతవిభక్తులకె లోపము చేయుదురు. మృదు వయినబట్ట యనుచో మృదు + సు బట్ట + సు అని యుండ విభక్తి లోపించి మృదుబట్ట కాకతప్పదు. సంస్కృతవిభక్తి లోపింపఁజేయువీరి మార్గములో నాంధ్రవిభక్త్యంత మగుట యన్న నది యెట్లు? వీరి సామాసిక విభక్తిలోపవిధానమును నీవివరణ మనవసర మని తెల్పును.

ఆంధ్రవిభక్త్యంతము కానిచో సమసింప దని బల్లిదపురుషుఁ డన్నది యుదాహరించిరి. ఆంధ్రవిభక్త్యంత మై బల్లిదుఁడు పురుషుఁ డన్న సమాస మగునా? కర్మధారయమునఁ బూర్వపదము డుమంతము కారాదు. కావున సమసింపదు. ఇది యిట నుదాహరించుట యింకను ననవసరము.

## బిరుదోత్తరపదకసమాసము :

"అన్న-అన, అమ్మ-అమ, రాయ రావు రెడ్డి మొద లగుబిరుద వాచకము లుత్తరపదములుగాఁ గలమిశ్రకర్మధారయములును సమ్మతము

లగుచున్నవి. (పంయిసూత్రములన కపవాదము) అట్టిసమాసములలోఁ బూర్వావయవ మగుసంస్కృతశబ్దముతుదిని ఆ,ఇ,ఏ,మ ము న్నగునవి చేరుటయుఁ గలదు" (త.75.సూ.)

ఈసూత్రము వివరణమువలె స్పష్టము. "(పంయిసూత్రమున కపవాదము)" సూత్రమున నుండ నక్కఱ లేదు. అన్న-అన, అమ్మ-అమ అనుచోఁ, అన, అమ అనునవి అన్న అమ్మ అనువానిరూపాంతరములే కాని ప్రత్యేకశబ్దములు గావు. అట్టియెడల వానిని వేఱుగాఁ జూపవలసిన యవసరము లేదు. బిరుదవాచకములు మొత్తము సూత్రమున నిర్దేశింపఁబడ లేదు. 'మొదలగు' శబ్దము తప్పలేదు. కాక బిరుదవాచకము లెల్ల నిర్దేశించి నను నవి యెల్ల సూత్రముననే పట్టికగాఁ జూపుట యనవసరము. అన్నాదు లగుబిరుదవాచకము లని చెప్పుట లాఘవము గదా. ఇతరములు వివరణమునఁ జూపఁదగును. వివరణమును సూత్రమున కెక్కిన నందు సూత్రలక్షణము సరిపడునా ?

అన్నాదు లగుబిరుదవాచకము లుత్తరపదములుగాఁ గల మిశ్రకర్మధారయములును సమ్మతము లగు ననుటకంటె నట్టిబిరుదవాచకములతోఁ గర్మధారయమును విధించిన బాగుండెడి దేమో. (లాఘవముతోపాటు విధానము సూటిగ నుండెడి దనిపించు.)

'మిశ్రకర్మధారయములును' అనుచోటి 'ను' శబ్దముచే నాచ్ఛికసమాసములును సంగ్రహింపఁబడవలసియున్నది. తిమ్మన్న. సుబ్బమ్మ యిత్యాదులు గలవు గదా. సుబ్బారావు సుబ్బారాయఁ డని వజ్ఝలవారు నుదాహరించిరి. మిశ్రము అసామాన్యము అని యెంచుటచే వీ రిట్లు చెప్పియుందు రనఁదగు.

'ఆ,ఇ,ఏ,మ' ము న్నగునవి పూర్వావయవ మగు 'సంస్కృతశబ్దముతుదిని' జేరుటయుఁ గల దనుట సరి కాదు. దీనివలనఁ బూర్వావయవ మొకవేళ నాచ్ఛిక మయినచో దాని కాకారాదులు వచ్చుటకు వీలు లేదు.

సుబ్బారావు సుబ్బారాయఁ డనుచో నాచ్ఛికముల కౌత్వము చేసి వీ రుదాహ రించిరి. సంస్కృతశబ్దముతుదిని నిల్చు నని సూత్రించి యాచ్ఛికములందును నుదాహరించుటలోని వైరుధ్యమును బరిహరించునవకాశము లక్షణమునఁ గానరాదు. కాఁగా నీసూత్రమున సంస్కృతశబ్దముతుదిని అనుట లక్ష్య విరుద్ధము.

లోపస్స్యాత్ద్వాదివర్ణానాం శబ్దే రాయాదికే పరే-త్వభిదత్వ మిత్రత్వా దిగా వి.వి. పూర్వావయవము తువర్ణాదులకు లోపమును జెప్పి యత్త్వ మును గూడ విధించినది. వీరు ఆ-ఱ అనురీతిగాఁ బ్రారంభించుటనుబట్టి హ్రస్వాకారము విధింప నక్కఱ లే దని భావించి రనవలె.

కృష్ణుఁడు + రాయఁడు అనురీతిస్థలమున నలౌకికవిగ్రహముచే కృష్ణ + సు, రాయ + సు అని యుండఁగా సమాససంజ్ఞచే విభక్తి లోపిం పఁగా కృష్ణరాయ అని యగును గావున నత్త్వము ప్రత్యేకముగా విధింప నక్కఱ లే దని వీరు భావించియుందురు. అందుకే వి.వి. చెప్పినడ్వాదిలోప మును వీరు విధింపలేదు. అథర్వణునికంటె భిన్నమగుమార్గము నెన్ను కొనుట విశేష మనవచ్చు. కాని వీరు తమయభిప్రాయమును వి.వి.కర్త యందును జూపుటయె విశేషము.

డ్వాదివర్ణానాం — సువిభక్తులకు- డ్వాదు లనునది మూలభూత సుప్పులకే వాచకము. (వ్యా.సం.స.1182) అని వి.వి.వాక్యములకుఁ దమమతములో నర్థము చేసిరి. లోపశ్చ విభక్త్యాదేః అనుచిం లక్షణమున సంస్కృతవిభక్తులకు లోపము చెప్పిరి. వి.వి. స్పష్టముగా డ్వాదివర్ణానాం లోపః స్యా త్తని చెప్పుచుండఁగా నిందుఁ గూడ సువిభక్తులకే లోప మని యర్థము చేయుట యెట్లో తెలియకున్నది. వీరివలెనే 'సుపోధాతుప్రాతిపది కయోః' అనుసంస్కృతలక్షణముచేతనే విభక్తిలోపము చేయనుద్దేశ్యమే చిం.,వి.వి.కర్తల కున్న వారు లోపశ్చ విభక్త్యాదేః అనియు లోపస్స్యా

ద్ధ్వాదివర్ణానా మ్మనియు నేల చెప్పుదురు? కావున వీరిమార్గము చిం.,వి.వి. సమ్మతము గా దనఁదగును. వీరియర్థమునఁ బ్రయోజనము లేకపోఁగా వైరుధ్యము గల్గుటయు గుర్తింపవచ్చును.

వి.వి.లో నిట్టియెడల 'క్వచిదత్త్వమ్' అని యత్త్వమును విధింపఁబడినది. అత్త్వము విధింపఁబడుట వ్యా.సం.స(118వ)లో వీరును గుర్తించిరి. కాని యందు నుదాహరణము చూపలేదు. కృష్ణుఁడు + రాయఁ డని యుండఁగా లోపస్స్వ్యద్ధ్వాదివర్ణానా మ్మనుదానిచే డుజ్వర్ణము లోపింపఁగా కృష్ణ + రాయ అని యుండఁగా నత్త్వ మయి కృష్ణరాయఁ డని యగును. ఇట్టియత్త్వమె వి.వి. సాధించినది. దీనినిబట్టి వి.వి.మతమునఁ దెలుఁగు విభక్తులే లోపించు నని (వి.వి.లక్షణానుగుణముగనె) గుర్తింపవచ్చు. కాని వసులవారు సంస్కృతవిభక్తులకు లోపము చేయుటంబట్టి (కృష్ణ + సు రామ + సు) యిట నత్త్వము చేయ నవసరము లేకపోయినది. కావున నత్త్వ మగునన్న వి.వి.వచనమునకు వీరికి లక్ష్యము దొరుకలేదు. అందుకే కాఁబోలును ప్రస్తుతసూత్రమందు హ్రస్వ మైనయకారమును విడిచిపుచ్చిరి. మఱి యథర్వణుఁడు ద్వ్యాదిలోపము చెప్పుటయు నత్త్వమును విధించుటయు సరి గా దని వసులవారియభిప్రాయ మగు నేమో.

ఈలక్షణమునకు వసులవారు కృష్ణమరాజు అనునదియు నుదాహరించిరి. ఉహాళః ఇందలి 'రాజు' తద్భవ మని వారియభిప్రాయముగా నెంచుదము. ఇది తత్సమమె యైన కృష్ణ, రాజా రెండుశబ్దములును సాంస్కృతికములే యగుటచే కృష్ణమరాజు అనున్నది (సాధ్య)సాంస్కృతికసమాస మగును. వీరి లక్షణమున మిశ్రసమాసములును సమ్మతము లనుచో (సాధ్య)సాంస్కృతికములను బేర్కొనలేదు గదా. (సాధ్య)సాంస్కృతికములలో లేనివిశేషము మిశ్రసమాసములం దేమి? కావునఁ గృష్ణమరాజు అనుచో రాజు వైకృత మనియె వసులవారియభిప్రాయముగా నెన్నఁదగును. అపు డీయది మిశ్రకర్మధారయ మగుచు లక్షణానుగుణ మగును.

కాని దీని నిట్లు సమర్థించినను నిట్టివి (సాధ్య) సాంస్కృతికము లనలే లే వని చెప్పలేము. 'రామశాస్త్రి' మొద లగునవి (సాధ్య)సాంస్కృతికములే కదా! కావున వయ్యలవారు తమలక్షణమున (సాధ్య)సాంస్కృతికములను పేర్కొనవలసియున్న దనవచ్చును. 'మిశ్రకర్మధారయములును' అనుచోటిచార్థకసముశబ్దముచే నాచ్ఛికములతోపాటు (సాధ్య)సాంస్కృతికములును బరిగ్రహింపఁబడు నని వీ రెంచిరా? అచ్ఛికములు మాత్రమె సమానసామాన్యశాస్త్రముచే సిద్ధించు నని తలఁచినవీరు విశిష్టము లగు (సాధ్య)సాంస్కృతికమిశ్రములలో నొకటి విశేషముగాఁ జెప్పి యొకదాని నట్లు చెప్పకుండుట యుచితమా? వివరణమున నైన నిట్లు పేర్కొనలేదు గావున (సాధ్య)సాంస్కృతికసమాసము లిచట వయ్యలవారిదృష్టిలో లే వనియె చెప్పవలె. కాఁగా సాధ్యసాంస్కృతికములును గలవు గావున వీరు వానిని బ్రస్తావింపకుండుట సమంజసము గా దని నిశ్చయింపఁదగును.

## బహువ్రీహి :

త్రిసమఘటితంబ యొకానొకండు బహువ్రీహి చూపట్టెడు (౬) నను సూరిసూత్రమును యథాతథముగనే గ్రహించిరి.

'పూర్వోత్తరపదంబులు రెండును నాచ్ఛికము లగుటయె కాక యవి త్రిసమము లై యుండవలెను. అచ్ఛికబహువ్రీహులు గవిప్రయుక్తములై గ్రాహ్యములు. తెల్లకంటి అని ప్రయోగింపరాదు.' (294) ఈవివరణ మనుచితము. అచ్ఛికబహువ్రీహులు కవిప్రయుక్తములై గ్రాహ్యము లనఁగా మిశ్రాదులు కవిప్రయుక్తములు గాకయు గ్రాహ్యము లని యర్థము చేయ రాదు. ఇంక స్వతంత్రముగాఁ గల్పింపరా దని యభిప్రాయము. సూత్రము 'చూపట్టెడు' ననుటచే నీయర్థము సూత్రోక్తము యగుచున్నది. అట్లు సూరియు వివరించెను. 'ఒకానొకం' డనుటచేఁ దెలుఁగున బహువ్రీహులు విరళము లనియుఁ జెప్పనగును. వింటివా తెలిగంటి (శుక.2.323) నిను వంటి తెలిగంటి (సమీ.2.6)

ఇట విశేషము, మచ్చెము + కన్ను - మచ్చెకంటి అని ప్రయుక్త

మగుచున్నది. ఇందలిపూర్వపదము నపుంసకసమము. అయినను సమాసములలో నట్టిమువర్ణకము లోపించి మచ్చె అనుస్త్రీసమమువంటిరూపమె నిల్చును. కవిప్రయుక్తము కాన సాధువె. (సూ.204)

మువర్ణకము లోపించినది గావున నిది స్త్రీసమమువంటి దనుట సంగతము గాదు. బల్లిదుఁ డగుమగఁడు అనుచోఁ గూడ సమాసమున విభక్తి లోపింపఁగా బల్లిద + మగ అని యుండఁగా బల్లిద స్త్రీసమమువంటిదే కావున నటఁ గర్మధారయము నిర్బాధముగా సిద్ధించు నని చెప్పుదురా? సమాసమునం దెల్లెడల విభక్తి లోపించును గావున నట్టియవి యవి స్త్రీసమముల వంటి వనుట యసంగతము. అసలు విభక్తి లోప మగునది సమాస మయిన పిదపఁ గదా. మచ్చెము + కన్ను అనుచో ముందటిపదము స్త్రీసమము గాకుండుటచే సమాసమె కుదురకపోవుచుండఁగా విభక్తి లోప మెట్లు? విభక్తి లోపించినపిదపఁ గదా స్త్రీసమమువంటి దగుట? విభక్తి లోపించినఁ గాని స్త్రీసమమువంటి దయి సమాస మేర్పడదు. సమాస మేర్పడినఁ గాని విభక్తి లోపించి స్త్రీసమమువంటిది గాదు.

అసలు 'స్త్రీసమమువంటిది' యని చెప్పుటచేతను నీయది స్త్రీసమము గా దని వఝలవారు ననుమానించి రేమో. కాకున్న అయిన స్త్రీసమము కావలె. లే కున్న మ దొకటి గావలెఁ గాని స్త్రీసమమువంటి దగుట యేమి? కాఁగా వఝలవా రీసమాసమును సాధించినతీరు సక్రమముగా లే దనక తప్పదు.

'కవిప్రయుక్తము కాన సాధువె' యనుటలో నిందుఁ బూర్వపదము స్త్రీసమము గాకున్నను నీయది కవిప్రయుక్తమై యున్నది గావున సాధు వని యెంచిన నది యుక్తమె కొంతవఱకు. కాని స్త్రీసమమె యయ్యునుఁ గవిప్రయుక్తములె గ్రాహ్యము లగు నను దాని ననుసరించి కవిప్రయోగము ప్రమాణముగా నెంచిన మాత్రము కుదురదు.

మచ్చెము అనుచో మువర్ణము ప్రాతిపదికావయవ మయిన నియ్యది

స్త్రీసమ మనఁ జెల్లును. కాని మువర్ణము ప్రథమైకవచనమె యునక తీఱదు. కాఁగా సూత్రమునందలి 'యొకానొకండు' అనుదళముచే నె ట్లైన నిటఁ గ్లీబ సమమునకు (స్త్రీసమమునుతో) బహువ్రీహి యైనట్లు గుర్తించుటయె యొప్ప యని తోఁచు.

ఏ రిటు వివరణమున 'మువర్ణకము లోపించి' యనుటవారి సిద్ధాంత మునకు విరుద్ధము. అలౌకికవిగ్రహమును జూపి యందలిసంస్కృతవిభక్తులకు లోపము చేయుట వఝలవారిప్రక్రియామార్గము. దాని ననుసరించి మచ్చెము + కన్ను అనుచో మచ్చె + ను కన్ను + ను అని యుండఁగా నువిభక్తి లోపించును. తెలుఁగువిభక్తి యగుమువర్ణకము లోపించిన దనుట యెట్లు? కాన సూరిమతమున మువర్ణకమె లోపించును గాని వీరట్లు పేర్కొనుట వారిమార్గమునకు విరుద్ధ మని గుర్తింపవలయును.

## కలికంఠుఁడు :

కలికంఠుఁడు అన్నది నన్నయప్రయుక్తము గా దనియు నన్నయ కలికంటు అనియె ప్రయోగించె ననియు వఝలవారిసిద్ధాంతము. (పు.294) దీనినిగూర్చి విపులముగ త్రి.శే.లోఁ జర్చింపఁబడినది గాన నిటఁ బునరుక్తము చేయ నక్కఱ లేదు.

## ద్వంద్వము :

'అచ్చికశబ్దంబుతోడ స్త్రీసమంబు ప్రాయికంబుగా ద్వంద్వం బగు' (7) ననుసూరిసూత్రమును 'అచ్చికంబుతోడ స్త్రీసమంబు ప్రాయికంబుగా ద్వంద్వం బగు'నని చూపిరి. అచ్చికశబ్ద మనుటలో సూరివచనమున దురుక్తి లేదు. 'శబ్ద'మును దొలఁగించుట వఝలవారిలక్షణమునఁ గొంత లాఘవము గల దని తోఁచెడు. ఇది పరిగణింపఁదగినదా?

'మగఁడును బిడ్డలును, పల్లవమును గర్భమును ఇత్యాదులు సమసింపవని యూహింపఁబడును నెఱుఁగునది' (ఉ.౨౯౧) అని సూరివచనమె వర్యుల వాదను చెప్పు టుచితముగా నున్నది. ఇంతకుఁ బూర్వము మచ్చేకంటి యనుచోఁ జెప్పినట్లుగా నిటఁ బ్రథమైకవచనము లోపింపఁగా మగ, పల్ల అనునవి స్త్రీసమములవంటివె యగును గావున లక్షణానుగుణముగ ద్వంద్వసమాస మేర్పడు నని చెప్పుచుండుట యుచితమె కదా.

ఇటు వీరు వివరణమునఁ బ్రౌఢ. పేర్కొన్న (సమా.౨౯.౩౩) కొన్ని విశేషద్వంద్వములను జూపిరి. (ఉ.౨౯౮) ప్రస్తుతసూత్రమునందలి ప్రాయిక శబ్దమువేఁ గ్వాచిత్కముగాఁ బ్రయోగదృష్టము లగుచున్న అందచందము లనురీతివానిని సంగ్రహించుట యుచితము. అవసరమక్కఱ అనువానిని ప్రత్యేకముగాఁ బేర్కొన నవసరము గానరాదు. (చూ.త్రి.శే.)

ద్వంద్వమును ఇతరేతరయోగద్వంద్వము సమాహారద్వంద్వ మను రీతిగా సంస్కృతసంప్రదాయము ననుసరించి విభాగించిరి. సూరిప్రభృతులు తెలుఁగున నిట్టివిభాగము నుద్దేశించినట్లు గానరాదు. కూడుసీర ఇత్యాదుల నేకత్వమును బ్రౌఢ.ప్రత్యేకముగా విధించుటయు (సమా.౩౦) గమనార్హము. "సిద్ధసమాసములవలెఁ బ్రాణ్యంగాదులందె కాక స్థలాంతరములందును బైరీతి సమాహారద్వంద్వము లుండును" సమాహారద్వంద్వములు నితరేతరయోగద్వంద్వములుగాను బ్రయోగింపనగును." (ఉ.౨౯౮) కావుననె సూరిప్రభృతులు సంస్కృతసంప్రదాయము తెలుఁగుద్వంద్వమున సరిపడకుండుటచేతనె యట్టివిభాగమును నుపేక్షించి రేమో యనఁదగును.

### సంబంధము-సమాసము :

'సర్వశబ్దంబులు సంబంధంబునందుఁ దచ్ఛబ్దంబుతోడ సమసించు' (౮) సను సూరిలక్షణ మనవసర మని వీరు తొలఁగించిరి. అది సరి కాదు. (చూ.కౌ.౧౫)

## ధాతుజవిశేషణములు :

'ధాతుజవిశేషణంబులకు విభక్తి విభక్తివివక్షించునప్పుడు తచ్ఛబ్దం బనుప్రయుక్తం బగు' (9) అను సూరిసూత్రమును వీ రొకసూత్రముగాఁ జూపలేదు. కాని "విశేషణములకు విభక్తివివక్షయందుఁ దచ్ఛబ్దం (అది వాఁడు అవి వారు మొ॥ అశబ్దరూపములు) బనుప్రయుక్తం బగు. (బాల. సమా. 9) అట్టివానియందును విశేషణవిశేష్యభావ మాధానరూపమే కాన షష్ఠీ సమాసములును గర్మధారయాభాసములె. చేయుచున్నవాఁడు వాఁడు-- (ఉ. 289) అని వివరించిరి. సూరిసూత్రమునందలియంశమును వివరణమునఁ జెప్పిరి. సూత్రముగాఁ జెప్పుటలోనిదోష మేమియో వీరు పేర్కొనలేదు. ఈయర్థము ప్రధాన మయియుండుటచే సూరిసూత్రము సూత్రముగాఁ జూపి పైయంశములు దానికి వివరణముగాఁ జెప్పుట యుచితము.

సూరి తనసూత్రమున ధాతుజవిశేషణములకు మాత్రమె విభక్తివివక్షలోఁ దచ్ఛబ్దానుప్రయోగమును జెప్పెను. వీరు విశేషణము అని సామాన్యముగాఁ జెప్పుటవలన ధాతుజేతరములకును దచ్ఛబ్దానుప్రయోగము సిద్ధించుచున్నది. కాని యిది యాచ్ఛికవిశేషణములకే యగుటను స్పష్టము చేసిన బాగుండెడిది. బాల. సూత్రమును ప్రస్తావించునప్పుడు వజ్ఝలవారు దానితో భేదము నూహింపవలయు నని సూచించి యుందురు. ప్రౌఢ. తెలుఁగున విశేషణములు సాధారణముగా నవిభక్తికము లనియె. (ప్రౌఢ. శబ్ద.)

అయిన ధా. వి. లకు భిన్న మగునాచ్ఛికవిశేషణములకుఁ దచ్ఛబ్దానుప్రయోగము ప్రాయికముగాఁ జెప్పుట యవసరమే యనిపించుచున్నది. అల్లవాఁడు, అల్లువారు, మగవాఁడు, మగవారు, ఆఁడుది ఆడువారు ఇత్యాదులలోనితచ్ఛబ్ద మిట్టిదే యనిపించును. 'నల్లనివాఁడు కృష్ణాలసంబుష్టెఁ బెల్లెడువాఁ డనుచో నివి యెల్ల విశేషణములె. చల్లెడువాఁ డనుచోవలె నల్ల అను విశేషణమునకుఁ గూడ విభక్తివివక్షలోఁ దచ్ఛబ్ద మనుప్రయుక్త మైన దన వలెను. వాఁడు నల్లనివాఁడు, నీవు నల్లనివాఁడవు, నేను నల్లనివాఁడ నను చోట్ల నీతచ్ఛబ్దము స్వార్థముతో నుండకుంట గమనింపవచ్చు. ఇఁక నిది

సమానము గాదు గావున నిగాగమము నా(సమా.12) సూత్రమునందలి బహుళశబ్దముచే సంగ్రహించుకొననగును. చక్కనితన మనియుఁ గాన వచ్చు.

పెద్దవార లగుమీరు పెద్ద లగుమీరు అనురీతిగాఁ గొన్నియెడల విశేషణములపైఁ దచ్ఛబ్దము చేరుటయుఁ, జేరకుండుటయుఁ గలదు. బాల యగువాఁ డనురీతిగాఁ గొన్నివిశేషణములపై నసలు చేరకుండుటయుఁ గలదు. వాలంబు వల్లి వేసితి రేని(ఆది.2.34) అనుచో వల్లి అనునది విశేషణమే. ఇటఁ దచ్ఛబ్దము చేరలేదు. కాఁగా సాధారణముగాఁ జెప్పక బహుళముగా విధింపవలెను. ధా.వి.లకు మాత్రము తత్సమములకును వాచ్యికము లకును నియతముగాఁ దచ్ఛబ్దానుప్రయోగము గలదు. బహుశః అందుకే సూరి యీగమముగనే సూత్రించియుండును. బహుళముగా విశేషణము లకు సామాన్యముగాఁ జెప్పిన ధా.వి.లయెడఁ బ్రవృత్తి మాత్రమె గుర్తింప నగును. అట్లు చెప్పుటలో నిబ్బంది గల దేమో పరిశీలింపవలె. తచ్ఛబ్దాను ప్రయోగము లేనవి దీయాచ్ఛికవిశేషణములు త్రీసమములో యితరములో యగుట గుర్తింపఁదగును. పెద్దవాఁడుఁ పెద్ద, (మగవాఁడుఁ మగఁడు)

వరులవా రిచట నప్రయుక్త మగుతచ్ఛబ్దమును 'అది- అవి. వాఁడు- వారు మొ॥ అశబ్దరూపములు'గా వివరించుట స్పష్టతకుఁ గాఁబోలు. తచ్ఛబ్ద మన-'అ'శబ్దము. సూరిలక్షణము ననుసరించి 'అ' అనునదే యప్రయుక్త మగును, దానిపైఁ బ్రథమ చేరిన నమహత్త్వమున అది. అవి యనియు, మహత్త్వమున వాఁడు వారు అనియు నగును. అంతియ కాని యీలక్షణముచే అది, అవి, వాఁడు, వారు అనుప్రథమాంతము లగుపదము లప్రయుక్తములు గావు. విభక్తివివక్షలో నివి చేరఁగా నప్పటి కింకను విభక్తి వివక్షిదశలోనే యుండుటచే- వివక్షిత మయినవిభక్తి పిదపఁ జేయ వలయును గదా. అది యన్నది చేరిన పిదప దానిపైఁ బ్రథమ చేరినరూప మె ట్లేర్పడును? ద్వితీయాదులవివక్షయం దెట్లు? ఉదాహరణమునకు వచ్చిన

అనుధా.వి.పై ద్వితీయైకవచనమును వివక్షింపఁగా నీసూత్రముచే (సముహత్త్వమున నది చేరఁగా వచ్చిన + అది అనుదానిపై నుద్వితీయ చేరి వచ్చినదిను అని యగునా? అది ప్రథమాంతమై యుండ దానిపై మఱల విభక్తి యెట్లు నిల్చును? కాఁగా ననుప్రయుక్త మగునది 'ఆ'అనుప్రాతిపదికమే. దానిపై విభక్తినిబట్టి తచ్ఛబ్ద మాయారూపము లందును. వచ్చిన+ఆ+ను. వచ్చినవానిని మొ॥ కాఁగా వదులవారు అది అవి వాఁడు వారు మొ॥ ఆశబ్దరూపము లనుప్రయుక్తము లగు నని కాక 'ఆ'అనుప్రాతిపదిక మనుప్రయుక్త మగు నని చెప్పుటయే సక్రమము.

వదులవారు 'చేయుచున్నవాఁడు, విదితం బగుదాని- అనురీతివాని యందు విశేషణవిశేష్య మాభాసరూపమే కావున నట్టిసమాసములు కర్మధారయాభాసములె' (ఉ.2.89) (వ్యా.సం.స.1175)యని నిర్ణయించిరి. ఇది సరి కాదు.

ఇందు విశేష్యమే లేదు. ఇయ్యవి సమాసములె కావు. కానఁ గర్మధారయాభాసము లనుట యసంగతము. విభక్తివివక్షయందు ధా.వి. కనుప్రయుక్త మగుతచ్ఛబ్దమునకు అగు అనుధా.వి.ప్రాతిపదికపై సప్తమ్యేకవచనమును వివక్షింపఁగా అగు+ఆ అని యగును. అనుప్రయుక్త మైనయా తచ్ఛబ్దముపై వివక్షిత మైన సప్తమ్యేకవచనము చేరఁగా సముహద్ధిమున అగుదానియందు అని యేర్పడును. ఇది అగు అనుధా.వి.యొక్క సప్తమ్యేకవచనాంత మగురూపమే. ప్రాతిపదిక కనుప్రయుక్త మైనతచ్ఛబ్ద మాప్రాతిపదిక కవయవ మగునే కాని యది విశేష్య మగుట యెట్లు? అట్టియెడల (రాము)- రామునిచే అనురీతిగా (అగు-) అగుదానియందు- మున్నగునవి సమాసము లగుట యసంభవము.

అనుప్రయుక్త మగుశబ్ద మర్థశూన్య మగు ననియు నర్థవత్త్వమును బట్టి శబ్దపల్లవాదులందు సూరి యనుప్రయుక్తము లనుట సరి గా దనియు

పిదే చెప్పఁబడె. ఇటు పేరును దవ్పక్షమున ప్రాతిపదిక కనుప్రయుక్తముగా పఠించిరి గదా. ఆ ట్లీడియు వర్ణకూస్వపే యగుచుండఁగా విశేష్య మగుట యెట్లు? 'విభక్తివిపక్షలో వచుటచే' ముందటివిశేషణము ప్రాతిపదికావస్థ లోనే యున్న దనుట స్పష్టము. ప్రాతిపదికకు సమాస మగు టెట్లు? క్రియను పూర్వపద మగుటను చెప్పినట్లయిన సూరిని విమర్శించినతి రేమి? వచ్చిన యెడ బాలవ్యా.వి. ప్రాతిపదికలకు అనుప్రయుక్త మైనతదర్థక మగు 'ప్రాతిపదిక'తో సమాసమా?'

అద్వ్రికవిశేషణములకు విభక్త్యంతరూపభేదము లుండవు. అవి స్త్రీసమములు గాన వానికి ప్రథమైకవచనలోపము గల్గి పదత్వము సిద్ధించును. అట్టివిశేషణము విశేష్యముతోఁ గర్మధారయముగ సమసించును. పడిపినవృత్తికము (వ్యా.సం.వ.1175) ఇతరము లట్లుంచి ధా.వి.లు స్త్రీసమములు గావు. అది పేరును గుర్తింపకపోలేదు. 'సూరిపక్షమున ధాతుజ విశేషణములు స్త్రీసమములు కావు. కావుననె (సమా.5.సూత్రమున స్త్రీసమములు) వేఱుగఁ జెప్పఁబడెను. ఇట్లగుటం జేసియె బా.సంధి25సూత్రమునఁజెప్పిన మడిసెడుచదములు అనుచో నుత్వము రాలేదని యెఱుంగునది' (వ్యా.సం.వ.1197,3(2)) 'మడిసెడుంపడములు అనునది యనిష్టరూప మని సూరితలంపు.' (వ్యా.సం.వ.1197) సూరితలం పనుటచే నట్టివి వీరి కిష్టరూపము అని తెలియవలె. కాని వాలా రంగారావు గారి యెదుదుగఁ గాన వలుసను మడిసెడుంచడము అని సమాసరూపములను సామాన్యముగా నంగీకరించుట యసంగత మనక తప్పదు.

ఇంక పీఠికమతమున నివి స్త్రీసమములె. "వాఁడి వేఁడి మున్నగు విశేషణములతోపాటు ధాతుజవిశేషణములును స్త్రీసమములె యైయుండఁగా వానిని వేఱుగా వఠించుటయు సరి కాదు. వికృతౌ సర్వే శబ్దాః అని చిం.ధా.వి.లను స్త్రీసమములుగాఁ జెప్పెను గాన సూరియు నట్లె చెప్పవలె" (వ్యా.సం.వ.1198) నవి పీఠిసిద్ధాంతము. చిం.మతమున నివి స్త్రీసమము లనుటకుఁ బ్రమాణము లేదు. అట్లుఁ గాక, స్త్రీసమము లని చెప్పినవి రెట, విభక్తి

వివక్షలోఁ దచ్ఛబ్దానుప్రయోగము నేల చెప్పిరి. స్త్రీసమములు గా వని తలఁచినసూరిమార్గము ననుసరించుటచే (విశేషణము) ధా.వి.లు స్త్రీసమములు గాకుండఁబోవుటు నది వీరిసిద్ధాంతమునకు విరుద్ధము గదా. ఇంకను వీరు విశేషణప్రాతిపదికలకుఁ దదర్థకముతో సమాసమును జెప్పుట యేని యగును గాని విభక్తివివక్షలో ననుప్రయుక్త మనరాదు. అట్లన్నచో నివి సమాసములే కావు. సమాసములే కాకుండఁగాఁ గర్మధారయసమాసము లనుట నిరాధారమే యగుచున్నది.

వచనబహువచనముల ననుసరించి చూచినను నీసూరిలక్షణము సూక్తమే యని గ్రహింపవచ్చును. 'వచ్చినవాఁడు'. అనునిట్టిస్థలముల యందుఁ దచ్ఛబ్దార్థము లేకుండుటచేఁ దచ్ఛబ్దము ననుప్రయుక్తము చేయవలయును. వచ్చినను వచ్చినచేత ఇత్యాదిని విభక్త్యంతప్రయోగములు లేవు. అట నెల్లయెడలఁ దచ్ఛబ్దాంతములె యగుచున్నవి. కాన విభక్తివివక్షలోఁ దచ్ఛబ్దము ననుప్రయుక్తము చేయుటయె యవసరము. ఇంక నీయవి సమాసము లనుటకుఁ దగినయాధార మందు లేదు గావున వీనిని సమాసములుగాఁ జెప్పకుండుటయు నుచితము. తత్సమములు సాధ్వికములు నగు ధా.వి.లపై నెల్లయెడలఁ బై స్థితి నియతముగా నుండుటచే ధా.వి.లకే యట్లు విధించుట యెంతయు యుక్తమైయున్నది.

అచ్చికవిశేషణములకుం గొన్నింటికి విభక్తివివక్షలోఁ దచ్ఛబ్దానుప్రయోగము బహుళముగా విధింపఁదగియున్నది. ఆయంశము పరిశీలించి సూరి దానికిఁ బ్రత్యేకముగా లక్షణము చేసిన నింకను బాగుండెడి దని మాత్రము చెప్పినఁ జెప్పవచ్చును.

## అట్టియనుప్రయోగము :

'ఎల్లయెడల ధాతుజవిశేషణంబుల కట్టియనుపదంబు విభాష ననుప్రయుక్తం బగు' (10) ననుసూరిలక్షణమును వీరుద్ద్యోతమునఁ దొలఁగించిరి. ఇందలి యుపసిద్ధాంత మేమో వీరు పేర్కొనలేదు.

సం.లో "ధాతుజవిశేషణములకు అట్టిశబ్దమువలెనె ఇట్టిశబ్దము అదిశబ్దమువలెనె ఇదిశబ్దము సమప్రయుక్తము లగుట గలదు. ధవళశ్చ ఇట్టిగుణ్ణములు...' (వ్యా.సం.ప.1175) అని పేర్కొనిరి. ఇట్టిశబ్దము గలది గాన వట్టిశబ్దమును మాత్రమె విధింపఁదగ దని యీసూత్రము దొలఁగించిరా? అట్టిశబ్దమువలెనె యిట్టిశబ్దము గూడ సమప్రయుక్త మగు ననియే తెల్పిరి గదా. అనుప్రయుక్తమైన 'అర్థవిశేషబోధము లేకర' (వ్యా.సం.ప.1175) యుండుగను. అట్టియెడల నట్టిశబ్దముతోపా టిట్టిశబ్దముఁ గూడ సమప్రయుక్త మగుటను విధింపవలెను గాని యట్టిశబ్దానుప్రయోగవిధానమును గూడఁ బరిహరించుట యెట్లు? అదిశబ్దమువలె నిదిశబ్దము గల దనిరి. కాని యదిశబ్ద మనుప్రయుక్త మగుటను విధించుట మానిం కాఁగా నట్టిశబ్దానుప్రయోగవిధిని దొలఁగించుట సరి కా దని నిర్ణయింపఁ దగును.

'ధవళ మైనయిట్టిగుణము' లనుచో నిట్టిశబ్దము స్వార్థమునం దుండుట గమనింపఁదగును. కాఁగా నిట్టిశబ్దము సమప్రయుక్తముగాఁ (తనయర్థము లేనిదిగా) జెప్పుట తగ దని గ్రహింపఁదగును. సూరిలక్షణము సూక్తమె.

'ఎల్లయెడల' నని ప్రారంభించి సూరి యట్టియనుప్రయోగవ సమస్తవ్యస్తస్థితులం దెల్ల నగుటను 'వచ్చినట్టిరాముఁడు, వచ్చునట్టివాఁడను నుదాహృతులచే స్పష్టము చేసెను. ఇట్లు తచ్ఛబ్దానుప్రయోగముతో నున్న వచ్చునట్టివాఁ డనురీతివి సమస్తములు గాక వ్యస్తములే యని స్పష్టము చేసెను. (బా.ప్రౌ.ప.185) వచ్చునట్టివా రివియుఁ గర్మధారయ సమాసములుగా సమస్తములుగాఁ జెప్పుట యసంగతము.

## దుగాగమము

యుష్మదస్మదాత్మార్థకంబుల కు త్తరపదంబు పరం బగునపుడు దుగాగమంబు విభాష నగు (11) ననుసూరివిధానము సరి గా దని వచ్చులవ

రుద్ధ్యోతమునుఁ దొలఁగించిరి. తొలఁగించుట సరి కా దని కార.12.సూత్ర మునొద్ద స్పష్టము.

## నిగాగమము :

'గుణవచనంబు లగుసల్లాదులకుం గర్మధారయంబునందు నిగాగ మంబు బహుళంబుగా న' ననుసూరిలక్షణము నంతయు నట్లే గ్రహించి చివరలో బహుళ మనుటను మార్చి 'వైకల్పికంబుగా నగు.' (స.7.సూ) నని సవరించిరి.

వివర్ణకస్యాద్బహుళమదన్తాద్గుణవాచకా త్తసు వి.వి.లక్షణమునొద్ద అహో. "బహుళగ్రహణాత్ చక్కనివాఁడు ఇత్యేవ. ఉదన్తాదపి క్వచిత్. సవురనివాఁడు. ఇతి రూపం. తత్ర తోకారస్యోత్వం చ.' (కవిశి.502) యని వివరించె కాని వఝలవారు 'చక్కశబ్దమునకు నివర్ణకత్వము కవి ప్రయోగములందుఁ గన్పట్టుచున్నది. చక్కఁజాయ' కాశీ.2.121, 159. (వ్యా.సం.స.1220) అని నిరూపించిరి. కాని గు.ప్ర.ప్రభృతులు చక్క-చిక్క-శబ్దములకు నిత్య మనఁగా వీ రందు చక్కశబ్దమునకుమాత్రమె వఝ లీతిప విరుద్ధప్రయోగ ముండుటఁ బ్రస్తావించిరి. కావున చిక్కశబ్దమునకు నిత్య మనుటను వీ రంగీకరించినట్లే కదా. చక్కశబ్దమునకు నిత్య మనెను. చిక్కశబ్దమునకు నిత్య మయ్యె నది బహుళగ్రహణముచేతనే కదా. బహుళ గ్రహణమునకుఁ బ్రయోజనముగా అహో. సవురు- సవురనివాఁ డను నదియుఁ జూపెను. వఝలవారు 'సవురు(సవురని) మనోజ్ఞము అనునహో బలపత్యంగీకృతశబ్ద ముకారాంత మగుటచేతను సూరి పఠించిన వెల్ల నకా రాంతములై యగుటచేతను నది సూరిచే నుపేక్షిత మేమో (వ్యా.సం.స. 1221) యనిరి. కాని యది సరి కాదు. సూరి యకారాంతములే యుదాహ రించి సూత్రమున బహుళ మనెను. వి.వి. 'అదన్తాత్' అని లక్షణమునఁ జెప్పియె బహుళ మన్నది. కాఁగా నుదంత మయిన సవురుశబ్దమునకు నివర్ణ

పద్వాదు లనుటను దిరస్కరించి యుద్వాదు అని మార్చిరి.) కాని క్రియా. 22. సూత్రమునఁ జెప్పిన అన్వాదులను క్రియా. 78 సూత్రమునఁ జెప్పినయున్వాదులు సమానములు కావు. మను అనునవి క్రియా. 22. సూత్రస్థలమునందలి యున్వాదులలోఁ గలవు. కాని క్రియా. 78 సూత్రస్థలమునందలియున్వాదులలో లేవు. అయిన రెండుచోట్ల వీరు నన్వాదు లనియె చెప్పిరి. అది వీరికి గోచరించియుండదు. ఉన్న మార్పేదివారే. గణాదిశబ్దమును వేఱుగాఁ బేర్కొన్న నింకను స్పష్టముగా నుండెడిది దానితో దొసఁగు లేదు. కాని గణాదిశబ్దము నొక్కటిగా ననేకముల మొదలఁ జెప్పిన నన్నిగణములయందునుశబ్దములు సమానములై యుండవలయు ననుట సరి గాదు. సంస్కృతమునను గణాదిశబ్ద మొక టుభయ యందలిశబ్దములు భిన్నస్థలముల వేఱుగా నుండుట 4-2-90 (పా.) సూత్రమునఁ గుముదాదిగణసందర్భమున వివరములను గమనింపఁదగును.

కాఁగా సూరి రెండుచోట్ల నల్లాదులను ప్రదర్శించినతీరును బట్టి ఆద్రి. (సూత్రముచోటివి, ప్రస్తుతస్థలమునందలివి యొక్కటి యయియుండవలయు ననుట సంగతము కాదు. వీరే 'ఒక్కగణమునే యిట్లు పరస్పరభిన్నముగాఁ బఠించుట వింత' (వ్యా.సం.ప.1222) యని భేదమును గుర్తించియే యుండిరి. కాఁగా ఉభయశబ్దమును సూరి యిచ్చటినల్లాదులలోఁ బేర్కొనమింతేసి దాని నిటఁ బ్రస్తావించుటయె తగ దని గ్రహింపఁదగును.

"ప్రేంక (ఖారపైంస) శబ్దము లేదు గాన ప్రేంకనబండివానికి. ప్రేంకనమోపు అనియె గ్రహింపనగును. ప్రేంకని. అనుశ.ర.సరి కాదు' (ఉ.287) ప్రేంకశబ్దమును గూడ సూరి యిచ్చటినల్లాదులలోఁ బ్రదర్శింపలేదు. అయ్యది నిందుఁ జేర్చుకొనఁదగినది. ప్రేంక లగుమ్రాఁకుల అను (భాగ.8.447)ప్రయోగముతో సూ.ని. ప్రేంకశబ్దమును జూపినది. ప్రేంకని బల్లము ప్రేంకనిచన్నులు ప్రేంకనిభూలము మున్నుగా తిక్కనాదిప్రయోగముల నెల్ల (సూ.ని.) ప్రేంకన యన్నదే కవిప్రయుక్త మనురీతి వచుల హారిసమన్వయ ముచితముగాఁ దోఁపదు.

సూ.వి. ఇంకను దీనికి విగాగమము నిత్య మని పేర్కొన్నది. ప్రేంకశబ్దమును జూపని శ.ర.కూడ 'విశేషణ మగుచో ప్రేంకని మోవు' అని పేర్కొన్నది. ప్రేంకనివిభవంబు (శబ్దం.కా.4.156)

ఇట్లు ప్రేంకశబ్ద మంగీకృత మగుటంజేసియు ప్రేంకనిమో పనురీతిగా విగాగమమె కానగుటంజేసియు ప్రేంకశబ్దము ఇటు సూరి స్పష్టముగాఁ జూపకున్నను నాదిశబ్దముచే నల్లాదులలోఁ బరిగణింపఁదగియే యున్నది.

'సూరి చామశబ్దము నిందుఁ జేర్చెను గాని యది శ్యామలశబ్దభవము; చామనచాయ. చామని అనుప్రయోగము లేదు' ఉ.287) విగాగమముతోఁ ప్రయోగము లేదు గాన దీనిని నిట నల్లాదులలోఁ జేర్పరా దని వీరియభిప్రాయము గుర్తింపఁదగును. శ.ర. చామనము అని దీనిని మువర్ణాంతముగాఁ బేర్కొని (చామనపుమేని) 'వృత్తియందు హల్లు పర మగుచో అంత్యవర్ణము వికల్పముగా లోపించు' నన్నది. చామనమైన చాయ చామనచాయ యనుచో మువర్ణము లోపించిన దనవలయును. వఝలవారు(ఉ. సమా.74సూ) మువర్ణకవిరహితము గాఁగా దందురు. కాని చామనచాయ యనురూపమును జూపిరి. చామనము (చామనపుమేని) అనుదానితోపాటు చామన అనుస్త్రీసమరూపమును గూడ నంగీకరింపవలయు నేమో. వఝలవారు మువర్ణాంతరూపమును ప్రస్తావింపలేదు. శ్యామలకు. చామన(ము) అని సూ.వి.

శ.ర. శ్యామాశబ్దభవముగా 'చామ' చూపినది. కాని 'చామ. చామని అనువిశేషణరూపములను నిర్వహించు ప్రయోగములు గాని ప్రామాణికలాక్షణికోదాహృతులు గాని(కవి ప్రయుక్తము గాకున్నను నన్నయాధర్వణులవంటివారు పేర్కొన్నచో గ్రహింపవలసినదే.) లే (వ్యా. ౦.స.1222) వని వఝలవా రనిరి. శ.ర. 'చామ'కు ప్రయోగము నీలేదు. ఏనశబ్దమునె చూపలేదు. వ్యస్తస్థలమున చామన అనుదానికిఁ ప్రయోగ ౦ పేరును జూపలేదు. సూరి నిరాధారముగా 'చామ'శబ్దము నిందుఁ జేర్చె నకంటె దాని కాధారములను వెదుకుట యుచిత మని తోఁచుచున్నది.

అయినను వీరు అయొ.. అయ్యొ (ఉ.418)ఊయెల.. ఉయ్యెల (ఉ.179)మున్నగుస్థలముల నేకపదములయందును (ఇవి సంధికార్యము లనుటకును వీలు లేదు) నీహ్రస్వ మీసూత్రముచే నగు నని వివరించిరి. 'పదద్వయసంధి'యందు, జెప్పినయీహ్రస్వ మటు. పదద్వయసంధి కాని స్థలముల నె ట్లయినది?

'....ఊయేల-ఉయ్యేల ...మున్నగుసమానపదములందును హ్రస్వ ద్విత్వములు వచ్చు నని విశదపడుటకయి మార్గాంతరమున సూరి సూత్రిం చుచున్నాఁ.' (వ్యా.సం.స.1214) దని సం.లో, జెప్పిరి. మఱి యిట సమాన పదములందు హ్రస్వము సాధించుటను వీ రేల తిరస్కరించిరి? వేఱుగా విధింపనులేదే. పైసం.లో వీరు హ్రస్వముతోపాటు ద్విత్వమును గూడ, జేర్కొనుట పొరపాటు. ఉయ్యెల ఇత్యాదులందు ద్విత్వము బా.ప్రకీ.6 సూత్రమున, బ్రత్యేకముగ విధింపఁబడినది కదా. ఇట్లే ముజ్జగము దా మున్నగువానియందు ద్విత్వము వేఱుగా విధింపఁబడినది.

ఇట నొకవిశేషము 'వేఁడి+నీళ్ళు, వే+నీళ్ళు వేన్నీళ్ళు- మూ న్నాళ్ళు అనురీతి గలచోటులందు వర్ణలోపనిమిత్తక మగుద్విత్వము హ్రస్వము గల్గింపదయ్యె.' (ఉ.సంధి.35 సూ.285) ఇది వీరిలక్షణమున కను గుణము గాదు. వర్ణలోపనిమిత్తక మగుద్విత్వము పరమయినచో హ్రస్వము రా దని వీరిసూత్రము మాత్రము చెప్పుచున్నదా? 'పదద్వయసంధి' మొద లుగా నీసూత్రమున, జెప్పఁబడినలక్షణము లన్నియుఁ గలవా వే. హ్రస్వము రాకుండుట నిట్లు సమర్థింపరాదు.

ఈవివరణము ననుసరించి వర్ణలోపనిమిత్తక మయినద్విత్వము పర మైన హ్రస్వము రా దని చెప్పవచ్చునా? సంధి.35సూత్రముకడ పూఁపు+విలుకాఁడు- పువ్విలుకాఁ డని చూపిరి. అట వర్ణలోప (ద్విత్వ)

మున్నగు హ్రస్వ మయిన దేమి? ఇట్లే పూవు + బోడి- పువ్బోడి, (క్రిందు + ఊట- క్రీయూట క్రియ్యూట) నాలుగు మూఱు పన్నాఱు మున్నగుస్థలములు గలవు కదా.

మీ రిట 'మూన్నాళ్లు' అనుపదియుఁ జూపుట విశేషము. ముక్కంటి -ముజ్జగములు ముల్లోకము లిత్యాదిగా నిటువంటిస్థలములలో నెల్లెడల హ్రస్వము ప్రసిద్ధమే కదా. "సమా.78చొప్పున లుప్తదువర్ణం బగుమూ శబ్దంబునకు హ్రస్వంబు (ఉ.292).

ఇంకను వేన్నాళ్లు ఇత్యాదుల నన్యములలోఁ జేర్చినచో లుప్తశేషము నకుఁ బర మైనపుడె ద్విత్వ మగును గావున ద్విత్వమునకు వర్ణలోపము నిమిత్తముగాఁ జెప్పినఁ జెప్పనగు నేమో. కాని మూన్నాళ్లు అనున దట్టిది కాదే. సూరిమార్గములోనె వీరును 'డులోపమును ద్విత్వమును జెప్పిరి. అంతే కాని ద్విత్వమునకు డు(జ్)లోపమును నిమిత్తముగాఁ జెప్పలేదే. అట్టియెడల వీనిని వర్ణలోపనిమిత్తకద్విత్వము అనుట మాత్రము గుదురునా?

కాఁగా వేన్నాళ్ళు ఇత్యాదులందు హ్రస్వమును సాధించుటకు సూరి లక్షణమే కాక వజ్ఝలవారి(సవరించిన)లక్షణము గూడ సమర్థము గాదు.

వజ్ఝలవారే సూరిగారినిక్కులాదిసూత్రమునకు మూలముగాఁ జెప్ప భాషేయమితేత్యాదివి.వి.లక్షణసంగ్రహమున 'నిక్కుల మూన్నాళ్లు, నాన్నాళ్ళు (వ్యా.సం.స.1258) అని చూపిరి. కావున వీనిని నిక్కులాదులలోఁ జేర్చి సాధించుట యొప్పును. ఇంతేల మీ రట వి.వి.లక్షణమునొద్ద జూపిన మూన్నాళ్ళు, నాన్నాళ్ళు, అనువానిలో నాన్నాళ్ళు అనుదానిని నిక్కులాదిసూత్రమునొద్దఁ బ్రస్తుతగ్రంథమునందును [ఉ.298] జేర్చియున్నారు. కాన వేన్నాళ్ళు మూన్నాళ్ళు ఇత్యాదుల నటనే చూపఁదగును. కాన హ్రస్వాభావమును వజ్ఝలవారు సమన్వయించినది యుచితముగా లేమి వీనిని నిక్కులాదులలోఁ బఠించి సాధించుకొనుట తగు నని గ్రహింపఁదగును. వజ్ఝలవారిసవరణము దీనిని సాధింపక ప్రయోజనము లేకుండఁగా ఉయ్యెల

ఇత్యాదిసిద్ధికి బాధక మై యసర్థక మైనది. సూరిలక్షణమె సముచితము.

## ద్విత్వము :

'త్రికంబుమీఁదియసంయుక్తహల్లునకు ద్విత్వంబు బహుళంబుగా నగు'[14] ననుసూరిలక్షణమును "త్రికంబుమీఁదిహల్లునకు నూష్మరేఫభిన్నమునకు ద్విత్వంబు విభాష నగును" [ఆ.77లూ] అని సవరించితి.

సూరిసూత్రమందలి 'అసంయుక్త' మనువిశేషణమును దొలఁగించుట యిందలి మొదటిమార్పు. 'అనుష్మరేఫాన్వినాద్విత్వమయుక్తస్య హలోమత' మ్మని వి.వి. అసంయుక్తమునకె యగు నన్నది. దీనింగూర్చి 'సంయుక్త హల్పరకత్వమున త్రికహ్రస్వము హల్ద్విత్వము గల్గవని యథర్వణుఁడు చెప్పినను నట్టిహ్రస్వద్విత్వములకుఁ దదనంతరమహాకవిప్రయోగములు గలవు. సివిప్రభావము ...ద్విత్వముతో నొకటి హలంతరసంయోగమున లోపించినది. [ఆ.285][ఇటః త్రికహ్రస్వమును ప్రస్తావింపకున్నను బాధ లే దనిపించును] అఱ్ఱప్పేముడిపలుకు [అ.ర.2.88] అని తిక్కనప్రయోగము ముద్రితప్రతులందుఁ గానరావు. ముత్తెపు ఇత్యాదిగా మూఁడుశబ్దము పై నిట్టికార్యము గలదు. కాని త్రికముపై నప్రసిద్ధము. బా.సా.పే. ఇట్టివి ద్వ్యర్థికావ్యములందే కల వనఁగా వీ రది సరి గా దని 'అక్షత..,అక్షీణంబులు.. ననురీతిబసవపురాణప్రయోగములు చూపిరి. దీనినుండి ప్రౌఢవ్యాకర్తయు? ప్రయోగము నుద్ధరించినజాడ లేదు. అది యట్లుండఁగా వీరే అక్షత-లక్షణంబున అని యిట్లు కవి ప్రయోగించె నన్నను క్షతి గానరా (వ్యా.సం.ప.1213) దనిరి. వేఱుప్రయోగములను వీరు చూపలేదు. ద్వ్యర్థికావ్యమున నభిందునిర్భిందుమేళన మాదిగాఁ జెక్కు పెదులుబాటులు గలవు. ఇట ద్విత్వమయిన దన్నమ హలంతరసంయోగముచే నొకహల్లు లోపించుటను వీరు ప్రస్తావించిరి. అనఁగా నిదట ద్విత్వము హ్రస్వముకాఅకే యన్న మాట. ద్వ్యర్థికావ్యములలో నిట్టిస్థితిని బట్టించుకొన నవసరము లేదు.కావున ద్వ్యర్థిస్థలములు మాత్రమె యాధారముగా భాషాసామాన్యలక్షణమును జెప్పుట

యుచితము గాదు. వీరు విభాష యనిరి గదా. అవ్యాధుఁడు అవ్యాధుఁ డను రీతిగా నెల్లెడల సంయుక్త మగుహల్లున కీకార్యమును గుర్తించుట యుక్తమా? ఎట నే మున్నను వయ్యవి మిక్కిలివిరళము అని విస్పంశయముగాఁ జెప్పవచ్చును. అరు దైన యట్టిస్థలములను సూరిసూత్రమునందలిబహుళపదముచే సంగ్రహించుకొనవచ్చును. కాఁగా సామాన్యముగా సంయుక్తస్థలమునను ద్విత్వమును జెప్పుటకంటె నరు దగుటను విశేషముగా గుర్తించుటయే భాషాస్వరూపనిరూపణమున కుచిత మైయుండును. కాన సూరివచనముచితమే.

వసులవారిసూత్రమున 'ఊష్మరేఫభిన్నమునకు' అన్నది సూరిసూత్రముకంటె నధిక మై యున్నది. సూరి బహుళముగా నగు నని చెప్పి 'బాహుళకముచే నూష్మరేఫములకు ద్విత్వము లే' దని వివరించెను. వీ రా విషయమును సూత్రమునఁ జేర్చిరి. తప్ప సూరిలక్షణమున దురుక్తి లేదు. ఇంతను సూరిసూత్రముచే నిష్టార్థసాధనముతోపాటు లాఘవము విశేషప్రయోజన మనఁదగియున్నది.

బహుళపదప్రయోజనమును సూత్రముననే చేర్చుటచేఁ గాఁబోలును వసులవారు బహుళపదమును దొలఁగించి విభాషగాఁ జెప్పిరి. సూరి యీ బహుళశబ్దముచే సూత్రమున లాఘవమును సంపాదించెను. ఇంకను సంయుక్తస్థలమున నిది యన్యకార్యముతోఁ బ్రయోజనవంతము ననవచ్చు.

కాఁగా వసులవారిసూత్రముకంటె సూరిలక్షణమే లక్ష్యానుగుణముగా గ్రాహ్యమై యున్నది.

'ఆయెడ-ఆడ, ఈయెడ-ఈడ, ఏయెడ-ఏడ అనుచోటులందు ఎడశబ్దపుఎకారము లోపించిన గాన ప్రకృతసూత్రముచొప్పున హ్రస్వద్విత్వములు గల్గనేర' (ఉ.285) వని యొకవిశేషము దెల్పిరి. ఎడశబ్దపుఎకారమేసూత్రముచే లోపించినదో వీరు పేర్కొనలేదు. ప్రత్యేకవిధానము లేమి నిక్కలాదిసూత్రముచే నయిన ననవలెను. ఆసూత్రము యథాప్రయోగంబు

గ్రాహ్యంబు లనుచున్నది గావునఁ బ్రయోగానుసారముగా నైత్వలోపమాత్ర ముచేతనె యట గ్రహింపఁబడును. కావున ద్విత్వము రాకుండుటనుగూర్చి యిటఁ బ్రస్తావింప నక్కఱ లేదు. వీరిసూత్రమునను నీయంశము స్పష్టముగాఁ జెప్పఁబడలేదు. (ఇఁక నీయర్థమును వీరు వికాసకు వ్యవస్థ చేయవలెను- కాని వీరు సూత్రముచే సాధారణముగనె సిద్ధించుచున్నట్లు తలఁచి రేమో యనిపించును.)

అయ్యు ద్విత్వము మాత్రము రా దని చెప్పఁగా సరిపోవుదానికి హ్రస్వమ్ముఁ గూడఁ బ్రస్తావింప నేల? ద్విత్వము పర మయినపుడు గదా హ్రస్వము వచ్చునది. ద్విత్వము రాకున్న హ్రస్వ మె ట్లగును? ద్విత్వము రా దన్నఁ జాలు. (అదియు ననవసరము.)

## ముచ్చట్లు :

బాల.సమా.15.16.లక్షణములను వీరు యథాతథముగనె గ్రహించిరి. ముచ్చోటులు.ముచ్చోటులు.ముచ్చటులు ముచ్చట్లు అనురూపములు ప్రయోగ దృష్టము లగుచున్న వనుచు సూరి వ్రాసెనే కాని యట్టి ప్రయోగములను జూపలే" (వ్యా.సం.1217) దనిరి. కేంధూరి కేంజడప్రభృతులకును సూరి కవిప్రయోగములను జూపినట్లు లేదు. ఇట విశేష మేమో స్పష్టము కాదు అయ్యు వీరు 'ముచ్చట్లు చఱచి-' అను ప్రయోగమును జూపిరి. ముచ్చటఁ అనునది ముచ్చోటులసంక్షేపరూప మని తోఁపకుండుటచే బా.సా.పే. గ్రహింపలే దనిరి తప్ప విం కేమి విచారింపలేదు. కాఁగా విశ సూరివివరణ మునకు సరిపడు ప్రయోగమె యగుచున్నది గదా. (ఇంతకును సూరి 'ముచ్చట్లు' అనుదాని దనవివరణమునఁ జూపలేదు. అవసరము లేదు.) ఉద్ద్యోతమున వీరు సూరివివరణమును విడచ నీప్రయోగమును జూపి, సూరి తలఁచుగా ననుసరించినమార్గములోఁ గవిప్రయోగమును జూపకున్నను దద్వివరణ ముచితమె యని నిరూపించిరి.

## మూఁడు-డులోపము :

'సమానాధికరణం బగును త్తరపదంబు పరం బగునపుడు మూఁడు శబ్దము డుజ్వర్ణంబునకు లోపంబును, మీఁదిహల్లునకు ద్విత్వంబు నగు' (17) ననుసూరిలక్షణమును వీరు సవరించి యిట్లు పేర్కొనిరి. 'సమానాధికరణం బగును త్తరపదంబు పరం బగునపుడు మూఁడుశబ్దపుతుదిబిందుపూర్వకడువర్ణంబునకు లోపంబును మీఁదిహల్లునకు ద్విత్వంబును విభాష నగు' (ఉ.85సూ.) సూరి మూఁడుశబ్దముడుజ్వర్ణంబున కనఁగా వీరు 'మూఁడుశబ్దపుతుదిబిందుపూర్వకడువర్ణం' బనిరి. 'శబ్దపుతుది' యనుచోఁ బుంప్వులపై మగాగమము చేయవలసియున్నను సూత్రమున స్పష్టతకై మాని యుందురు. అసలు 'తుది' యనువిశేషణమే స్పష్టత కనవసరము. అది లేకున్నను జివర నున్నడువర్ణమే కదా లోపించునది? 'మూఁడు'శబ్దములో (బిందుపూర్వక) డువర్ణము లెన్ని యున్నవి? 'తుది'- అనుటకు? కావున సూరికంటె విశేషముగా వీరు 'తుది'శబ్దమును జేర్చి సాధించినప్రయోజన మేమియు లేదు. అది లేనిసూరిరచన యెంతయు నసందిగ్ధము.

సూరి 'డుజ్వర్ణ' మనె. 'జిత్తు బిందుపూర్వం బగు' (తత్స.19) ననులక్షణము ననుసరించి 'డుఙ్' అనఁగా బిందుపూర్వకడువర్ణ మనియ యర్థము. కాన వరుఖలవారు సూత్రమునఁ జెప్పిన 'బిందుపూర్వకడువర్ణంబు నకు' అన్నది సూరి 'డుజ్వర్ణంబు'న కనుదళమునకు వ్యాఖ్యానమే. (వ్యా.సం.వ.1226)లాఘవముతోఁ జెప్పుట సూరిలక్షణమున గుణమెకాని యందు దోషము లేమి స్పష్టము.

సూరి 'ద్విత్వంబు నగు' నని యీకార్యము నిత్యముగనె విధించెను. వీరు 'విభాష నగు' ననిరి. 'సూరి యుపదేశింపకున్నను నీవిధి బహుళమె యనఁదగు' (వ్యా.సం.వ.1228) నని సం.లో ననిరి. మూఁడుజగములు, మూఁడగ్ను లనురీతిప్రయోగములనుబట్టి (వ్యా.సం.వ.1228)విభాష యని రన్నమాట.

మధ్యమపదలోపి కానట్టిద్విగువున హ్రస్వద్విత్వములు వైభాషికములు.

మూఁడగన్నులు. మూఁడాకృతులు. (ఉ.292) అని యిందును స్పష్టము చేసిరి. 'మధ్యమపదలోపిద్విగుసమాసము లగుమయ్యేడ్వాదులందు హ్రస్వద్విత్వములు నిత్యముగా నగును. (ఉ.295) ఈనిత్యత్వస్థలములను వీరు తమ సూత్రమందలి విభాషాపదమునకు వ్యవస్థ చేసి సాధింతు రనవచ్చు. ఇట్లై వ్యవస్థ చేసికొని 'మూఁడుశబ్దము సమాసపదాది నున్నపుడు మాత్రమే వైకల్పికముగా నైన హ్రస్వద్విత్వము లగును. పదుమూఁడేడులు' (ఉ.292) అనునదియుఁ జెప్పవలె; బహుశః ఇట్టిస్థితులనుబట్టియె సం.లో బహుళ మని భావించియుండుదు.

నిత్యముగాఁ జెప్పుటలో సూరియభిప్రాయ మేమో గమనింపవలెను. రెండుగుణ్ణములకు, గుణ్ణములు రెండింటికి అనుసూరిస్థలాంతరోదాహృతులను గమనించిన రెండుగుణ్ణములు అనురీతిగా మూఁడుజగము లనురీతివి వ్యస్తస్థలములుగా గుర్తింపవచ్చును. 'లోకములు మూఁడు' అనువిధముగా మూఁడు లోకములుఅని వ్యస్తము లై యుండుటలో వింత యేమి? ఎల్లయెడల సమాసమే యగు నని నిర్ణయింప నేల? కావున సమాస మయినపు డీకార్యములు నిత్యమే యనియు (నిత్యోద్యము లేనిరూపము సమస్తమే కా దనియు) సూరియభిప్రాయము నెన్నఁదగును.

ఈసూత్రమునొద్ద మూఁడుజగములు, మూఁడులోకములు అనురూపములు మొట్టమొదటనే సూరి చూపియున్నాఁడు. ఇట్టిరూపములను గుర్తించినాఁడు గదా. ఈసూత్రముకడనె చూపుచు నవ్వాని నసాధువులు చేయునా? కాన నీయవి వ్యస్తము లనియె సూరిమత మనఁదగు.

ఇందు కింకొకయాధారమును లేకపోలేదు. ద్విగువున నేకవచనంబు ప్రాయికంబు (సమా.18) గదా. మూఁడైనచిచ్చులు- మూఁడుచిచ్చులు- ముచ్చిచ్చు, 'మూఁడుచిచ్చులు' అను (లోపద్విత్వములు లేని) నదియును సమాసమె యన్నచో నాద్విగువు గూడ 'మూఁడుచిచ్చు' అనురీతిగా నేకవచనాంతమ కావలయును గదా. అట్టివి గానరావు. ఇట్టిలోపద్విత్వములు రాని

స్థలము సమస్తము గా దని సూత్రించుచో నట నేకవచనము లేకుండుట సరి పడును. లేనిచో బహువచనమె నియతముగా నుండుట యెట్లు గుదురును? కాఁగా వాచ్నికద్విగువున లోపద్విత్వములు రానిస్థల మేకవచనాంతము గాకుండుటయె నియత మగుటంబట్టియె యీయవి వ్యస్తములే యని స్పష్ట మగుచున్నది. లోపద్విత్వములు లేనిస్థల మేకవచనాంత మగుటకు వరుఁలవారు నొక్కప్రయోగమును జూపలేదు. (వ్యవహారమున మూఁడుగాల మనుచో నేకవచనమె వినిపించు నది సమాస మన్న మిశ్రము నగు. దీనికిఁ గవిప్రయోగప్రామాణ్యము మృగ్య మైయున్నది.) కాఁగా మూఁడుజగములు వ్యస్తము, ముజ్జగములు సమస్తము. కావున నిందుకయి సూత్రమున నిత్యార్థము విభాష యని చెప్పరాదు.

మనుష్యాద్యాదులందు మూఁడేడు లనురీతివ్యవహారము లేదు గదా. అది యెట్లు? అనవచ్చును. (మూఁడేళ్లు మూఁడార్లు మూఁడొకట్లు మున్నగు తీరుగా లోపద్విత్వము లేని(వ్యస్త)రూపములు లోకవ్యవహారమునం దున్నవి.) కాని వీరిలక్షణము ననుసరించి యైనను సమానాధికరణ మగు నుత్తరపదము పర మగునపుడే గదా యీకార్యము నిత్యము. సమాసమె చేయకున్న నీకార్యములకుఁ బ్రాప్తి యుండ దేమతమునను. మూఁడేడు లను రీతిరూపము (వ్యస్తముగా నైన) నుండదా దని నిర్ణయించుపక్షమున సమాసమె నిత్య మనవలసియుండును, ఎల్లయెడల నిత్యముగా విధించినసూరి మతమునను నిట బాధ లేదు గదా.

పదుమూఁడేడు లనుచోఁ గూడ వ్యస్తముగా నీరూపము సూరిమత విరుద్ధము గానేరదు.

దీనింబట్టి "పయిరీతిని నన్నయతిక్కనల ప్రయోగము లుండఁగా ద్విగుమాత్రమున హ్రస్వద్విత్వములకు నిత్యత్వమును సూరి సూత్రించుట పొరపాటు' (ఉ.292) అని వీరు సూరి నిత్యతావిధానమును దిరస్కరించుట యనుచితము.

ఇంక నీ రీతి ద్విగుమాత్రమున నగుట విశేషము. మధ్యమపదలోపిద్విగువులలో నిత్య మనియుఁ దద్భిన్నము లగుద్విగువులలో విభాష యనియుఁ జెప్పవలె నని వీరితాత్పర్యము. 'ముయ్యేఁడ్వాదులు మధ్యమపదలోపసమాసములు. మూఁటిచే గుణిత మగునేడు మూఁడు + ఏడు- ముయ్యేడు ఇరువదియొకటి' (వ్యా.సం.స.1228) 'గుణిత మగు' అను మధ్యమపద మిట లోపించిన దన్నమాట. ఇరువదియొకటి యనునర్థము రావలె నన్న మధ్యమపదలోపియే గావలయునా? ఒకయే డనుచోఁ గూడ ఒకటిచే గుణిత మగునే డనియె యర్థము. చేయక తప్పదా? మూఁ డైనయేడు లనుచో 'ఏడు'శబ్దమునకు 'మూఁడు'విశేషణముగా (మూఁడేళ్లు- ఇరువదియొకటి) నీయర్థము సిద్ధింపదా? (పదుమూఁ డనుచో పది యధికముగాఁ గలమూఁ డన్నట్లుగా ముయ్యే డనురీతి'మధ్యమపదలోపిసమాసములలో' మూఁ డధికముగాఁ గలయే డని యర్థము చేయరాదు.) కాఁగా నీద్విగువులు మధ్యమపదలోపులుగానే చెప్పవలసినయవసరము గానరాదు.

ఇంకను నీసూత్రముచే ద్విగుమాత్రమున లోపద్విత్వము లగు ననుటయు విచార్యమే. మూఁడు + కన్ను- ముక్కన్ను- ముక్కంటి యనుచో నీసూత్రముచేఁ గాదా లోపద్విత్వము లవునది. (ఉ.295)

సూరిలక్షణమునిర్దుష్ట మై నన్నయాదులప్రయోగములకు సంగ్రాహకమై యున్నది.

వచ్చులవా రీలక్షణమును 'మిశ్రద్విగువు'గా సూచించిరి. ముక్కంటి యనుచో బహువ్రీహియం దీసూత్రముచేతనే లోప(వచ్చులవారు హ్రస్వమనుట ప్రమాదము) ద్విత్వములు వచ్చు నని (ఉ.295) పేర్కొనియే యుండిరి. ఇంకద్విగువులలో ముక్కారు ముత్తోవ ముమ్మొగము మున్నగు రీతిగా నాచ్ఛికసమాసములందు నైత మీకార్యము గలదు. అట్టియెడల మిశ్రద్విగువుగాఁ జెప్పుట యెట్లు గుదురును? మిశ్రసమాసము పేరిమతమున

నసాధారణము. అది యిట్లుఁ జెప్పఁబడుచున్న దనుటకై (ఈలక్షణము వానివి గూడ సాధించుచున్న దనుటకై యట్లు పేర్కొనియుందురు.)

"ముల్లోకములు మున్నగుమిశ్రసమాసములు ప్రకృతసూత్రజ్ఞాపకముచే సాధువులు." (ఉ.292) మిశ్రసమాసములకు నేదియో యొక సూత్రముచే జ్ఞాపకము చేసికొనకతప్పదు. కాని యట్టిజ్ఞాపనమున కాయా సూత్రముల నవకాశము గల్పించుటమాత్రము గానరాకున్నది.

ప్రస్తుతసూత్రమున లోపద్విత్వములు విధింపఁబడినవి. ఆచ్ఛికసమాసములవఱకు వీరు సాధారణముగ సామాన్యశాస్త్రసిద్ధములుగనె చెప్పుదురు. ముక్కారు, ముప్పాతిక మున్నగునాచ్ఛికసమాసములయందు లోపద్విత్వములను సాధించుచు నీవిధి సార్థక మగుచునే యున్నది. 'మీఁదిహాల్లున కనుచోఁ దత్పుహాల్లును గావచ్చు నని విశేషముగాఁ జెప్పుట కం దాధార మేమి? మీఁదితత్పుహాల్లునకును' అని యున్న మిశ్రసమాసము నీసూత్రముచే జ్ఞాపితములు గాఁగలవు. వీ రట్లు చెప్పలేదే. కాఁగా నీసూత్రముచే మిశ్రసమాసములు జ్ఞాపితము లవు ననుట కం దాధార మేమియు లే దనక తప్పదు.

సూరిమతమున విట్టికల్పనమే యనవసరము గాన నందు బాధలేదు. ఆచ్ఛికసమాసములవలె మిశ్రములును సమాససాధారణలక్షణసిద్ధము లని గదా సూరిమతము.

### ద్విగువు-ఏకవచనము :

'ద్విగువున నేకవచనంబు ప్రాయికంబుగా నగు మిశ్రంబునకుఁ గాదు' (18) అనుసూరిలక్షణమును సవరించి వదులవా రిట్లు పేర్కొనిరి. 'ద్విగువున(తు) [ఆచ్ఛిక] సమాహారంబున నేకవచనం బగు' [ఉ.88లా]

'సమాహారంబున' నని వీ రధికముగాఁ జెప్పిరి. ఏల? 'సంస్కృత

మునందలి ద్విగురేకవచనమ్ అను సూత్రము చెప్పిన సమాహారద్విగువునకుఁ గల్గునేకవచనమాచ్ఛికసమాసమందుఁ బ్రాయికముగాఁ గల్గు ననియుఁ బ్రాయిక మనుట నాచ్ఛికసమాసమందును గ్వాచిత్కముగా బహువచనము వచ్చుట గల దనియుఁ దాత్పర్యము' [వ్యా.సం.సూ.1229] అని వీరు 'ద్విగోరమిశ్రకాయాం ప్రాయఏకత్వమిష్యతే. మిశ్రకాయాం బహుత్వం స్యాత్' అను వి.వి.వాక్యమును సమర్థించి తుది కిట వ్యర్థము చేసిరి. అయ్యది నావివరణము ననుసరించి వరుసలవారియాసూత్రము కేవలము వ్యర్థ మని నిర్ణయింప నగుచున్నది. ద్విగురేకవచనమ్ అను సంస్కృతలక్షణముచేతనె యేకవచనము సిద్ధించినను నాచ్ఛికముల కరుదుగ లేకుండుట. మిశ్రముల కసలు లేకుండుట యను విశేషములను బట్టి యథర్వణుఁడు విధించుట సమంజసమే యని వీరి యభిప్రాయము. ఆదేవిధముగఁ జెప్పఁబడినయీసూరిలక్షణముగూడ నట్లే సమంజస మగుచున్నది.

ఇంక వీరు 'ప్రాయిక' మనక 'ఏకవచనం బగు' నని నిత్యముగనె చెప్పిరి. మిశ్రములందు లే దనియు వీరు విధింపరైరి. [మిశ్రములు జ్ఞాపితములె యైనను నున్న వని వీరును జెప్పకతప్పలేదు గదా.] అట్టియెడల సమాహారమున నేకవచనము సంస్కృతవ్యాకరణముచేతనె సిద్ధ మవుచుండఁగా నింతకంటెఁ దెలుఁగున విశేష మేమియు లేకుండఁగా [ఉన్ననుదానిని వీరు చెప్పలేదు గనుక] సిద్ధ మగునర్థమునే వీరు విధించుట వీరిమాటల ననుసరింపనే వ్యర్థ మని స్పష్ట మగుచున్నది.

'నల్గడ ఇరుగడ అనునవి సమాహారద్విగువులు నల్గడలు, ఇరుగడలు... ఆచ్ఛికములె యైనను సమాహారద్విగువులు కావు' [ఉ.283] ఇట్టివీరివివరణమునుబట్టి ప్రస్తుతయీసూత్రమె కొత యింతకు మూం దుచిత మని వీరే సమర్థించినవి.వి.వచనము గూడ వ్యర్థమె యని నిర్ణయించి న ట్లయినది. పై వివరణమునుబట్టి యేకవచనాంత మయినపుడు సమాహారముగాను, బహువచనాంత మయినపుడు సమాహారము గానిదిగాను జెప్పవలె నన్నమాట.

సంస్కృతమున నేకవచనము సిద్ధించుస్థలముతో సమాసముగాఁ దెలుఁగునను సమన్వయించుటయుద్దేశ్యము మాత్రమె యిందుఁ బ్రధానముగాఁ గన్పట్టును. అయిన నీయంశము ద్వంద్వతత్పురుషములలింగమువలె (ఉ.) సంస్కృత వ్యాకరణసిద్ధ మగుచుండఁగా మఱల వీ రేల చెప్పినట్లు?

మిశ్ర మయిన రా దనుటకో? ఆవిషయము సూరిలక్షణమున నున్నను వీరు దానిని దొలఁగించిరి. అచ్ఛికములకె యగు నన్న మిశ్రములకుఁ గాదని వేఱ చెప్ప నక్కఱ యుండ దేమో. కాని వీరు సూత్రముననే అచ్ఛిక శబ్దము కుండలీకరణములఁ గూర్చిరి. అది ప్రధానముగాఁ జూపిన దీనిచేత నైనను మిశ్రద్విగువులు జ్ఞాపిత మగుచు, మిశ్రములం దేకవచనము లే దను నంశము తెల్పుచు నీవరుసలవారిసూత్రము కొంతవఱకైన నుచిత మయ్యెడిది. అయ్యు సిద్ధించుదానిని (అచ్ఛికముల నేకవచనము) విధించుదానికంటె నవసర మైనదానిని (మిశ్రములకు లేకుండుట) పేర్కొనుటయె యుచిత మనఁదగును.

ద్విగుద్వంద్వములలో నేకవచనము విధించినవారలప్రౌఢ(వి.వి.) వ్యాకర్తలు సమాహార మనుభేదమును దెలుఁగున స్వీకరింపలే దని నిశ్చయింపవచ్చు. అది తెలుఁగునఁ గుదుర దని వారియభిప్రాయము గుర్తింపఁదగు. నల్గడ (నాలుగుదిక్కులమొత్తము) నల్గడలు (నాలుగుదిక్కులు) అనుచో వరుసలవారు చూపినయర్థభేద మందుఁ గానరా దనుట యహోబలాదులవివరణమునుబట్టి (కవిశి.§21) గూడ స్పష్టమె. కాఁగా వరుసలవార 'సమాహారంబు' అని విశేషముగాఁ గల్పించుటవలనఁ బ్రయోజనము లేదు.

కావున వి.వి.వచనమువలెనె యీసూరిలక్షణమును సూక్తమె యని గుర్తింపఁదగును.

ముల్లోకము, నల్దిక్కులు అనురీతిగాఁ బ్రౌఢవ్యాకర్త చూపిన[సమా. 20]మిశ్రద్విగువులందలియేకత్వము నిపాతగా సాధువులుగాఁ జెప్పుటనుబట్టి వరుసలవారును మిశ్రద్విగువున నేకత్వము లేమి నంగీకరించి రనవచ్చును.

సామాన్యముగా నంగీకరింపకున్నను జ్ఞాపితములుగా నైనను మిశ్రద్విగువు లను గ్రహించినవీరు సూరిలక్షణమునందలియీయంశమునుదమసూత్రమున న్దొలఁగించుట యసమంజసము.

## గసడదవలు :

'నల్లఁడ, నల్లఁడలు, ఇరుగడ,... మున్నగుస్థలములందలిగసడదవా దేశములు ద్విగుసమాసాశ్రయవిధులు కాని యవి సంధి.14సూత్రపులక్ష్యము అని భ్రమింపరా' [ఉ.293] దనిరి.కాని యీయాదేశము కర్మధారయమున నితరస్థలములందును గనిపించును. మాఱుదల్లి [హరి.పూ.1.182,2-170] వెలిదమ్మి [హరి.పూ.7.112] ఇల్లెయిందు నెఱగత్తులు [8-80], తెల్ల దామరతేకులు [9.47]మొ॥ అఱగన్ను వెట్టి [మను.3.58] పేసుట్టంబులు- [కాశ.3.85]మొ॥ ఇట్టిగసడదవాదేశకార్యమును ద్వంద్వేతరసమాసములం దలిదానిని సంధి.14.సూత్రమునందలిబహుళపదముచే సాధించుకొనుటలో దోసఁ గేమియుఁ గానరాకున్నది. తెల్లదామర, నలువది, వేగంటి,మున్నగు చోట్ల గసడదవాదేశము నిత్యమై యునఁదగియున్నది. సూరియు బహుళశబ్ద సాధ్య మనియె యెంచె నేమో స్పష్టముగా నిర్ణయింపరాకున్నది. సంధి.14 సూత్రము కేవలము వ్యస్తవిషయకమై యని చెప్పు టెట్లు? ఉత్తున కచ్చు పరం బగునపుడు సంధి యగు నన్నఁగా వ్యస్తసమస్తస్థితులు రెంటఁ గావుఁ దగదు. చిగురాకు అనురీతిగా నవుట లేదా? పూర్వపదము ప్రథమాంతము గాఁ జెప్ప నగు చోట్లఁ బ్రయోగానుసారముగా నీసూత్రముచే గసడదవాదేశ ము బహుళశబ్దముచే నిత్యముగాను దదితరస్థలముల నప్రవృత్తిగాను జెప్పఁ దగును గదా. అవరోధములు గాన్పడవు, పరిశీలింపఁదగు.

పద్యులబారివలె నిది సమాసాంతకార్యముగాఁ జెప్పుటకు సూరి యట్టి వానిని జేర్కొనలేదు. వీరును సూరివలెనె బహువ్రీహియందలిసమాసాంత

కార్యములనె సూత్రమున, దెల్పిరి. సంధి 14 సూత్రముచే రాఁగూడ దనియును నిది సమాసాంతకార్యము [నడుమ నైనయంతకార్యము] గానే చెప్పవలె ననియు నెంచిన దీనిని వీ రైనను ప్రత్యేకముగా సూత్రించిన వీరిమతమున కనుగుణమై యుండెడిది గదా యనిపించు.

### పజ్ప్రాలు :

'కొండొకచో సమాసంబులందు సామ్యాదికసమ్యాదులముపర్ణంబులు పజ్ప్రవర్ణంబు లగు' [19] ననుసూరిలక్షణము నట్లె గ్రహించుచు "ముపర్ణకంబులు పజ్ప్రవర్ణకంబు లగు' ననిరి వీరు. సూరి ము, పజ్ప్రలు వర్ణములుగాఁ జెప్పఁగా వీరు వర్ణకము లనుట మాత్రము విశేషము. 'పజ్ప్రవర్ణకములు' అని ఈయంశవుసూచిక నుంచిరి. పజ్ప్రలను వర్ణకము లన నక్కఱ లేదు. వానిని ప్రత్యయములుగనె చెప్పవలె ననునుద్దేశ్య మున్నను సనవసరమె. 'ముపర్ణకంబులు' అనుట స్థానిప్రత్యయమె. కావున దాని కగుపజ్ప్రలెల్లను ప్రత్యయముల య్యెను. సూరి వీనిని ప్రత్యయము లనలేదు. వీరు ప్రత్యయములుగాఁ జెప్పి సాధించినప్రయోజన మేమి? సూరిమతమున మరుక్తి లే దనుట స్పష్టము.

నాము కనుమ పొంద లగునిచ్చటిశబ్దములలోని ముపర్ణము ప్రాతిపదికావయవమె కాని ప్రత్యయము గా దని సూరిమతము స్పష్టము. ఈము వర్ణాంతములు స్త్రీసమములు. వరుఖవారు తుదిని ముపర్ణము రాదా పెల్లి యెదలఁ బ్రథమైకవచనముగనె యెంచిరి. కావున వీరు స్వమతానుగుణముగా ముపర్ణమును ప్రత్యయముగాఁ జెప్పిరి. [ప్రత్యయమె యైనను ముపర్ణము గాఁ జెప్పినను లోపమె గాని యిబ్బంది లేదు. వర్ణ మన్నఁ బ్రత్యయము ను గావచ్చును గదా.] కాని శబ్దాంతముపర్ణ మెల్ల సామాన్యముగాఁ బ్రథమైకవచన మనుట యసంగత మని గుర్తించియుంటిమి. కావున సూరి ముపర్ణమును వర్ణకముగాఁ జెప్పకుండుట యెంతయు సముచితమైయున్నది.

'ఈషష్ఠ్యర్థకములు నౌపవిభక్తికములై యీయుష్మ సమాసములందు మాత్రమె వచ్చును గాన నౌపవిభక్తికప్రకరణమునఁ జేర్పఁబడలే' (ఉ. 283) దనిరి. షష్ఠీ ప్రత్యయము అనుచునే వీ రౌప లనిరి. కాని సూరి యౌపలను ప్రత్యయములుగాఁ జెప్ప లెక్కడను గానరాదు. ఆదేశాగమాత్మకములు నగుటనుబట్టి సూరి వీనిని ప్రత్యయేతరములుగనె యెంచియుండనగు. అది యుచితము. 'పాముపకు, పాఁపతేఁడు, వేమునకు, వేఁపచెట్టు ఇత్యాదౌ సమాస ఏవ' (కవిశి.329) నహో.పంక్తులనుబట్టి (సమాసేచ యని చిం.) వీరు షష్ఠ్యౌపలుగాఁ జెప్పియుందురు. చిం.లక్షణమునుబట్టి యట్ల చెప్పవచ్చును. ఔపవిభక్తికప్రకరణము'నఁ జెప్పక స్థలాంతరమునందుఁ జూపినసూరి వీని నౌప.లని తలఁచె ననలేము. ఔప.లనుగూర్చి సూరి 'విభక్తి నిమిత్తకము' లయినవిగాఁ జెప్పెను. ఈషష్ఠ్యలయం దాలక్షణమె లేదు. సూరి షష్ఠ్యల నౌప.లుగా నెంచలే దనియు నింకను దర్పిన్నము లనియె యెంచె ననియుఁ జెప్పవచ్చును. చిం.,కవిశి.ప్రభృతులను గాంచియు సూరి వీని నౌపవిభక్తికత్వమును సూచింపలే దనఁగా నివి యౌప. లనుట సరి కా దనియే సూరితలంపుగాఁ జెప్పవలెను గదా.

వీరిలక్షణమునుబట్టి యైన నివి యౌప. లగునా? ఔప.సందర్భమున సూరిలక్షణము సరిగా లే దని వీరు 'ఇవి ద్వితీయాద్యేకవచనంబులు పర మగునపుడు మాత్రమె యాచ్ఛికస్త్రీసమజడవాచకములకు బహుళముగా నగు ను.' (ఉ.అచ్చి.71సూ) అని సూత్రించిరి. కాన నౌప.లు ద్వితీయాద్యేక వచనములు పర మగునపుడు మాత్రమె రావలయును. (నాముము, నామునకు ననురీతిగా ధ్వనపు డివి లేవు. సమాసమున మాత్రమె యగు ననిరి. కాని యాలక్షణ మిటఁ జెప్పలేదు.) 'నాము + చేను = నాఁపచేను (కర్మధారయము)' (ఉ.282) కదా. ఇట నాముప్రథమైకవచనాంత మయినది. మఱి ఔప.అగు టెట్లు? దాని కయినషష్ఠ్య లౌప. లగుట యెట్లు?

ఇంక ఔప. లాచ్ఛికస్త్రీసమజడవాచకముల కలగు ననిరి కదా. సూరి

మతమున నీముపర్ణము ప్రత్యయము గాదు గావున నాతనిమతమున నీయవి స్త్రీసమములే. కాని మీరు 'మువర్ణకంబులు' అనిరి గదా. కావుగా నివి యైచ్ఛికములె జడవాచకములె యైనను స్త్రీసమములు గావు. క్లీబసమములు. క్లీబసమములపై ఔప. లగు టెట్లు? క్లీబసమములపైఁ గూడ ఔప. లగుచుండఁగా మీరు స్త్రీసమములపై మాత్రమె చెప్పుట తప్పు గాదా.

'పాములయొక్క తేఁడు పాఁపతేఁడు, అమ్మలయొక్క కయ్య అమ్మకయ్య' (ఉ.282) అనుచో నీయవి బహుత్వస్థలమున నయినవి. ఔప. లు బహుత్వమునం దగుట కల దని మీ రేల జెప్పరా? ఇంకను 'గోతులు నేతులు మున్నగు బహువచనస్థలము లౌపవిభక్తికవిషయములు గామింజేసి యచట తివర్ణమును వేయుఁగ' (ఉ.203) సూత్రించి సూరి 'బహువచనమం దలితివర్ణకమును (సూరి వర్ణక మనలేదు) నౌపవిభక్తికమె యనుతలంపున నౌపవిభక్తికములసందర్భమున నేకవచనముతోపాటుగ' (ఉ.203) విధించుట పొరపా టనిరే.

ఔప. లకు మీరు చెప్పినలక్షణ మేదియు షట్పువర్ణములందు లేదు. అట్టిచో నివి ఔప. లనుట కాధార మేది? అట్లనవలె నన్న నాసూత్ర మందలి (ఉ.అచ్చి.71) బహుళపదము నాశ్రయింపవలె. సామాన్యలక్షణ విరుద్ధమైయుండఁగా బహుళపదముచే సంగ్రహించుకొన్నను వీనియౌప విభక్తికత్వమువలనఁ బ్రయోజన మే మేని మీరు చూపఁగలరా?

కాఁగా నీవట్టి లౌప. లు గావు. అందుచేతనే వీని నౌపవిభక్తికప్రక రణమునఁ జెప్పుట తగదు.

అమ్మహైన పల్లితరంగలు గ్రమ్మఁగన్ (హరి.ఉ.1,36)

## విశ్వాలాదులు :

విశ్వాలాదులు యథాప్రయోగంబుగ గ్రాహ్యంబులు (20) అనుదాని నట్లు గ్రహించిరి. (ఉదా.లు చూపినపిదప సూరి 'ఇత్యాదులు' అన వీ రది

తొలఁగించిరి. అయ్యు నిక్కలాదు లింకను గలవని ప్రౌఢ అనుసారముగా వీరు చూపినయుదాహృతులనుబట్టి గ్రహింపవచ్చును.)

ప్రౌఢ.సమా.౩౯సూత్రమునుదాహరణములతో నీసూత్రమునకు వివరణముగాఁ జూపి వర్ణులవా రాసూత్రము బాల.సూత్రమునకు వివరణప్రాయముగా సూచించు టెంతయు నుచితము.

ఉదా.లలో -నాలుగు + నాళ్లు నానాళ్లు అనుదానివలె మూనాళ్లు, వేనీళ్లు అనుమున్నగునవియు నిటఁ జేర్పఁదగినవే. అందాక, ఇందాక, ఎందాక, సాఁటాలు పెత్తనము అనునవి సంధి.౩౪సూత్రముచే సాధింపఁదగినవి. పెను + ధూళి-పెంధూళి (ఉ.౮౩)అనుచోఁ బెనుశబ్దమును వీరు ప్రాంతాదులలోఁ జేర్చియేయుండిరి. కావున పెనుపు + తుటుము-పెందుటు మన్నవియు వీరు ప్రాంతాదిలక్షణముచేతనె సాధింపఁదగు.

కావునఁ బైవానిని నిక్కలాదులలోఁ జేర్ప నక్కఱ లేదు. సం.లో నిక్కము + కల- ఇటఁ బ్రాంతాదిసంధిచొప్పున నిక్కల అని కానేరదు. లు ప్త శేషమునకు బా.సంధి.౩౭సూత్రముచొప్పున నుగాగమము రాఁగా నింగల అనునవిష్టరూపము సిద్ధించు" (వ్యా.సం.స.౧౨౫౮) నవిరి. దీనిని బ్రాంతాదులలోఁ జేర్చినపుడే యాద్యక్షరశేష మగుట మున్నగుకార్యము లగును. అట్టి కార్యములు లే వని గుర్తించినపుడు ప్రాంతాదులలోఁ జేరదు గావున లోప ప్రసక్తియే లేమి నవరూపములనుగూర్చినసందేహమే యనవసరము. అయ్యు 'నన్యంబులకు సహిత మికార్యంబులు గొందొకచోఁ గానంబడియెడి' ననుదానిచే నిక్కము + కల- నిక్కల అని కాఁగలదు. నెఱ + తావి నెత్తావి యనుచోవలె నిటఁ గూడఁ బరుషమె పర మైనను నుగాగమము కల్గవలె ననునిబ్బంది లేదు. ఇట్లే కవ + వడి కవ్వడి, పూవు + విలుకాఁడు పువ్విలుకాఁడు మొ॥ అన్యంబుల కనునాసూత్రముచే నేల రాదని శంకించిన వర్ణుళవారు ఆసూత్రమునై తము ప్రయోగములకమె కావున విది? ప్రస్తుత

సూత్రపుఁబ్రపంచమె యని గ్రహింపనగు.' (వ్యా.సం.వ.1259) ననిరి. అన నాసంధిసూత్రము వ్యర్థమె యన్నమాట. ప్రస్తుతసూత్రము సమాసమునం దాగమాదేశాదులను తెన్కు-దెలుఁగులుగాఁ జెప్పుటచే సమాసమునందలివికారములను జెప్పిన సూత్రము లెల్ల దీనికి వ్యాఖ్యానప్రాయము లగును. అట్టి యెడల శాస్త్రప్రయోజనమె విరుద్ధ మగును. కాని 'విశ్కృల' యనురీతిగా విడఁ జెప్పుటతో సూరిమత మేమో పరిశోధించి గుర్తింపవలసియున్నది.

రెండు + వారు ఇరువురు. మూఁడు + వారు-మూవ్వురు, మూగురు, ముగ్గురు. నాలుగువారు-నలుగురు. వేయివారు-వేవురు, వేగురు. (ఉ.298) వరుసలవారి యీవిభాగ ముచితముగాఁ దోఁచదు. అంత + వారు అనురీతి ప్రౌఢవ్యాకర్తృప్రక్రియామార్గములో వీని విట్లు సాధింప నెంచియుండుదురు. రెండు ఇత్యాద్యమహత్సంఖ్యావాచకశబ్దముల మహద్రూపములె ఇరువురు ఇత్యాదులు. ఒక + లు-ఒకరు అని యున్న నట్లే రెండు+లు ఇరువురు అని సాధింపవలె. అంద అనుదాని నట్లు సాధించినప్రౌఢవ్యాకర్తయు ఇరువు రిత్యాదుల నిమ్మార్గముననే సాధించుట గమనార్హము. సూత్రాంధ్రాదీతర వ్యాకరణములలో సూరియును రెండు+లు-ఇరువు రనురీతిగనె ప్రక్రియను నడపెను.

వీరు చూపినమార్గములో నీయవి సమాసములుగా వీరు తలఁచిన ట్లున్నది. ఈయమహత్సంఖ్యలమహద్రూపము సమస్త మయి మాత్రమె ప్రయోగింపఁబడు నని చెప్పు టుచితముగాఁ గానరాదు. ఏఁబండ్రు ఎనమండ్రు ఇత్యాదులలో నీరీతిప్రక్రియ యనుసరణీయమో కాదో వీరు స్పష్టము చేయలేదు. (త.197) ఇంక నీచోటి తచ్ఛబ్దము తదర్థకము గాకుండుటయు, ఇరువురను ఇత్యాదిద్వితీయావ్యంతరూపములనుబట్టియు వీరి ప్రణాళిక యుచితము గా దని నిశ్చయింపఁదగును.

**ఆయు-ఆయి:**

'ఆకారంబున కామ్రేడితంబునకుం దదర్థకంబున కయియాయియను

శబ్దంబులు విభాష నగు' (21) ననుసూరిలక్షణమును 'అయి-ఆయి అను శబ్దంబులు' అనుతీరుగా సంధికార్యము లేక చూపుట మాత్రమె వరులవారి మాత్రములో విశేషము. స్పష్టత కయ్యెను నది యవసరము గాదు.

'ఈసూత్రమ్మజ్ఞాపకముచేత నిట్టియామ్రేడితమును, వానితోడిమిశ్ర సమాసమును సత్యసుజ్ఞాత మగుచున్నవి' [సూ.286] సూరిప్రణాళికను చిర స్కరించుటచే వీరెల్లయెడల మిశ్రసమాసములను జ్ఞాపకసిద్ధములు చేసికొనవల సిప్పుడు. మిశ్రసమాస మత్యసుజ్ఞాతము చేయుటకు లక్షణమున నాధార మేమియును లేకుండుట స్పష్టమె. ఇంక నిది మిశ్రసమాసములందు మాత్రమె ప్రవర్తించు ననుటకును వీలు లేదు. అయయివాటికి, అయాయివనులు ననురీతి గా నీవిధాన మాచ్ఛికసమాసములయందుఁ జరిగార్హ మగుచునే యున్నది. మొత్తముపై వీరిలక్షణముచే మిశ్రసమాసముల కసుజ్ఞ లభింపదు. సూరి పద్ధతిని మార్చుట తగ దని యుట మఱియొకసారి నిరూపిత మగుచున్నది.

ప్రక్రియను వీరు 'అది+అది+కాలము అయాకాలము, వాఁడు+ వాఁడు+పురుషుఁడు-అయాపురుషులు' (సూ.286) అనురీతిగాఁ జూపిరి. అది వాఁడు అనుతీరుగాఁ జూపి యట్టిరూపములు గాకముందే యలౌకికవిగ్రహము నందు విభక్తి లోపాదికము గల్గుటచేత 'అ' అనుప్రాతిపదికము నిల్చు (సూ.287) నందురు. అలౌకికవిగ్రహమున లోపము చేయునపు 'రూప ములు సిద్ధింపకముందే' యనుట స్పష్టత కసుకొనవలెను. ఇట్టియలౌకిక విగ్రహమార్గము తెలుఁగున ననుచిత మని పైని గుర్తింతము. వాఁడు+ వాఁడు అని చూపుటవలన వీరికర్మధారయలక్షణమునకు నిది విరుద్ధ మగుట యుట గుర్తించితిమి.

## సమాసాంతకార్యాలు :

'బహువ్రీహిని సమాసాంతకార్యంబులుం గాసంబడియెడి' (22) ననుసూరిలక్షణమును మార్చి' బహువ్రీహి సౌవవిభక్తికాదులవంటివి సమా

సాంతము లగును' (ఉ.౪౪సూ.) అని సూత్రించిరి. ఔపవిభక్తికవదన్యవిధ యశ్చ' యనుచిం.లక్షణము ననుసరించియే వీ రౌపవిభక్తికాదులవంటివి' యని సూత్రమునఁ జేర్చి రనుట స్పష్టము. ఆదిశబ్దముచే నౌప.వంటివి కానివియుఁ జేరు నని యుద్దేశ్యము. ఇది చిం.కంటె విశేషము.

'అచ్చిక.70సూత్రమున పేర్కొనఁబడిన ఇ,టి,ంటి,తిప్రభృతులు బహువ్రీహిని సమాసాంతప్రత్యయములుగా వచ్చును. ఆదిశబ్దముచే అఇఉ మున్నగుమత్వర్థీయప్రత్యయములును బహువ్రీహిని సమాసాంతప్రత్యయ ములుగా నిల్చు' (ఉ.295) సూత్రమునకు 'దౌపవిభక్తికాదులవంటివి' యన్న ను వివరణము ననుసరించి యౌపవిభక్తికాదుల'వంటివి'గాక యౌపవిభక్తి కాదులే చేరు నని యొప్పవలెను. అట్టియెడ నీవివరణము సూత్రమునకు విరుద్ధము గదా. విపుల మయినవివరణమునుబట్టి సూత్రమునందలి (ఔప విభక్తిక'వత్' అనుచిం.వాసనచేఁ జెప్పిన)'వంటివి' యనుట వ్యర్థము.ఔప విభక్తికాదులే యవు ననుట యే సుచితమా? ద్వితీయాద్యేకవచనము పర మగునప్పు డగుట మొ॥ఔప.లక్షణము వీనియం దుండదు. ముక్కంటి, ముక్కంటులు మొ॥ ఇట్టి మత్వర్థీయము సమాసాంతమున నగు ననుట యుచి తము గాదు. ఈభేదమునుబట్టియె చిం. 'ఔపవిభక్తికవత్' అన్నది.వీ రౌప విభక్తికములే యగు ననుట యింకను ననుచితము. కాఁగా వివరణమె కారవా టనియు సూత్రానుగుణముగ ఔప.లవంటివె యగును గాని ఔప.లు గా వని చెప్పుదుమా?

ఔప.లతో వీనికి సామ్యము కేవల మాకారమునందు మాత్రమె యనఁదగును. ఆకారమునఁ బోలికనుబట్టి ఔప.లవంటివి యనుటవలన విశేషార్థసిద్ధి యున్నదా? ముక్కంటి యనుచో 'ంటి' యవుచున్నది. ఇది ఔప.వంటిదిగాఁ జెప్పకయె సమాసాంతప్రత్యయముగాఁ జెప్పిన నష్టమేమి? ఆదిశబ్దముతో నౌపవిభక్తికేతరములు నగుట వీరును గుర్తించిరే కద. నలువ యని యుదాహరించి సూరి యది స్పష్టము చేసె.

ఆదిశబ్దముచే మత్వర్థీయములు అ-ఇ-ఉలు గ్రహించిరి. ఇందు 'అ'వర్ణ మౌపవిభక్తికము నగును. 'కదలికరాచూలి' యనుచో పిత్వ మయు నది. ఇది ఔప.వంటిదా? లేక మత్వర్థీయమువంటిదా? గట్టువిలుతుఁడు అనుచో 'తి'పై 'ఉ' (మత్వర్థీయమె కావచ్చును) అగు ననిరి. కేవలము 'ఉ'ప్రత్యయ మొక్కటి యయినచో నొక్కదానిని జూపిన బా గుండెడిది. ఉత్వ మిత్వం తథైవాత్వం సమాసే మతుబర్థకమ్' అనఁగా నహో. వృత్వ సిద్ధి (కవిశి.౮౨౪) దాని నుదాహృతిగాఁ దలఁచెను. కాని యది సరిగాఁ దోఁపదు. సూరి యుత్వమును మత్వర్థీయముగా విధించినజాడ లేదు. ఇంక మిగిలినది యుత్వ మొక్కఁడె.

ముక్కంటి యనుచో 'ంటి'వర్ణ మౌపవిభక్తికమె.(లేదా'వంటిది') కాని గోతుల అనుచో 'తి' ఔప. అనరాదు. పరుఖలవారియీనిర్ణయము సక్రమమా?

పరుఖలవారు 'ఔపవిభక్తికాదులవంటివి' అని చెప్పుటచేత గట్టు విల్తుఁ డనుచో గట్టు + విల్లు + తి + ఉ - గట్టువిలుతుఁడు అని 'తి'వర్ణము చేసి మఱల ఉవర్ణము చేయవలసివచ్చినది. 'తి' అనుఔప.(వంటిసమాసాంతము)పై 'ఉ' అనుమత్వర్థీయము సమాసాంతప్రత్యయ మైన దన్న మాట. సమాసాంతము లిట రెండు వచ్చినవి. ఔప.లప్రసక్తి లేనిసూరిమత మున 'తు' అనునదే సమాసాంతముగాఁ జేసిన నిట్టియనవసరకల్పన ముండదు గదా.

కాఁగా ఔపవిభక్తికాదు లవి గాని, ఔపవిభక్తికాదులవంటివి యని గాని చెప్పుటవలన నిచ్చట విశేషముగా సిద్ధించునర్థ మేమియును లేదు. అదె యుచితము. ప్రయోజనము లేకుండుటతోపాటు కొన్నియెడల ననవసరకల్పనము నవసర మగుట నౌపవిభక్తికాదులవంటివి యని పేర్కొనుట తగ దని గ్రహింపఁదగును.

సూరి 'సమాసాంతకార్యములు' విధింపఁగా వీరు 'సమాసాంతములు' ఔపవిభక్తికాదులవంటి వగు ననిరి. వివరణమున నౌపవిభక్తికాదులు సమాసాంతప్రత్యయములుగాఁ జెప్పిరి. ఇట్లు సమాసాంతములను ప్రత్యయములుగాఁ జెప్పుటవలన సమాసమునకుఁ బరముగా నీప్రత్యయము లుంచి మిగిలిన సమాసాంతకార్యములను నిక్కాదిసూత్రముచేఁ జేసికొనవలసిన యవసరము వీరికిఁ గల్గినది. ఉదాహరణమునకు— 'నాలుగు+వాయి+అ నలువ. ఇట సమా.92సూత్రమునె యుపయోగించునది.' (ఉ 285) ఇందు 92సూత్ర మనుట యచ్చుపొరపా టందము. (అంతకు ముందువాక్యమున నిట్లు 'పేర్కొనిరి) ఆది యీపరిచ్ఛేదమున వచులవారి గ్రంథమునను లేదు. 91 కావచ్చును. అయ్యది నిక్కాదిసూత్రము. ఆసూత్రముచే 'వాయి'లో 'ఆయి' లోపించు నని వీరియభిప్రాయముగా నెన్నవచ్చు. కాని నిక్కాదిసూత్రము నాశ్రయించునెడల 'నలువ' యనురూప మద్దానిచేతనె సిద్ధింపదా? ఈసూత్రముచే నత్వము విశేషముగాఁ జేయవలయునా? అని సందేహము.

సూరిమతమున నిట్టియనవసరగౌరవము లేదు. 'సమాసాంతకార్యము' గాఁ జెప్పుటచే నాగమాదేశాదు లే మయినను గ్రహింపనగును గదా. కావున 'నలువాయి' యనుచో 'ఆయి' అనుదాని కీసూత్రముచే 'అ'త్వ మాదేశ మయినట్లుగాఁ జెప్పుటలో లాఘవము గలదు గదా. ఇట్లే మోటబరువు 'ఉవు' అనుమొత్తమునకు ఇత్వ మాదేశ మగుట సమాసాంతకార్యము.

కాఁగా 'సమాసాంతకార్యములు' అనుసూరివిధానమె సూక్తము.

### ఆభాసబహువ్రీహి :

"షష్ఠీతత్పురుషసమాసమున బహువ్రీహ్యర్థము లభించును. అట్టివి బహువ్రీహిలక్షణలక్షితములు కావు గాన బహువ్రీహ్యాభాసము లనిపించుకొనును. ఉదా. పీతాంబరమువాఁడు (పీతాంబరముయొక్క.....వాఁడు) పీతాంబరము గలవాఁ డని యర్థము" (ఉ.295) ఇవి బహువ్రీహిలక్షణలక్షిత

ములు గానపుడు ఆభాసములుగ నైనను బహువ్రీహులుగాఁ జెప్పఁబూనుట యర్థము ననుసరించి కావలయును. కాని యిది యవసరము గాదు. 'తెలుఁగున శేషషష్ఠి యర్థవిశేషబోధక మగుచున్నది. (వ్యా.సం.స.1033)"బాహువీర్యములయొక్కవారు. బాహువీర్యములు గలవారు. కవలవారు, బలము వాఁడు, పేదమనసువాఁడు" (వ్యా.సం.స.1034) అనురీతి వివరణము ననుసరించి యిట నన్యార్థము యొక్క ప్రత్యయమువలనన సిద్ధించుచున్నది. అట్టియెడల వీని(నాభాస)బహువ్రీహులుగాఁ జెప్ప నవసర మేమి? 'స్యాద్ బాభాసబహువ్రీహిః ప్రథమాదిప్రయోగతః' (కవిశి.629) అని వి.వి. చెప్పినను సూరి వానిని బాల.లోఁ బ్రస్తావింపలేదు.

## మిశ్రబహువ్రీహి :

వరుసలవారీస్థలము నారంభమునందు 'ఆచ్ఛికబహువ్రీహి-మిశ్రబహువ్రీహి' యని సూచించిరి. బహువ్రీహిలోఁ బూర్వోత్తరపదములు రెండు నాచ్ఛిక(స్త్రీసమము)లు గావలసియుండఁగా(ఉ.294)నిఁకమిశ్రబహువ్రీహి యెక్కడిది? అహో. కలకంఠుఁడు మిశ్రబహువ్రీహి యనె. కాని వీ రట 'కలకంఠు'శబ్దమును గల్పించిరి. కాఁగా వీరిమతమున బహువ్రీహులు మిశ్రములు లేనేలేవు.

పీతాంబరమువాఁ డన్నది బహువ్రీహ్యాభాసముగాఁ దెల్పిరి. ఆభాస బహువ్రీహులు మిశ్రములు నుండనగును గావునఁ బైనట్లు పేర్కొనిరా? ఇవి మిశ్రము లని వీ రిటఁ జెప్పలేదు. పైఁగా వీరిమతమున మిశ్ర(సాధ్య) సాంస్కృతికములు జ్ఞాపకసిద్ధములు గావలసినదే కాని సమాససామాన్య శాస్త్రసిద్ధములు కావు. మిశ్రబహువ్రీహులను జ్ఞాపకము చేయుస్థల మేది? వీరియీవివరణమ యగునా? పైనట్లు పేర్కొనకున్న బాగుండెడిది.

పీతాంబరమువాఁ డిత్యాదులు బహువ్రీహులె కావు. కలకంఠుఁడు విశిష్టస్థలము. కాఁగాఁ దెలుఁగున మిశ్రబహువ్రీహులు మృగ్యములు.

'బహువ్రీహిని స్త్రీ వాచ్యం బగుచో నుపమానంబు మీఁది మేనునకు బోఁడి యగు' (23) నను సూరిసూత్రమును దొలఁగించి 'అలరుఁబోఁడి త్యాదు లుపమానపూర్వపదకర్మధారయంబులు' (బా.84సూ) అను ప్రౌఢ లక్షణమును చేర్చిరి. ఇది బహువ్రీహి కాదనియుఁ గర్మధారయమె యనియుఁ దలఁచినవా రగుటచే దీనిని గర్మధారయసమాసప్రకరణముననే చూపిరి.

"సూరి 'మేనునకు బోఁడి యగు' నని సూత్రించెను. పిదప సంస్కర్తలు 'మేనునకుఁ బోఁడి యగు' నని సవరించిరి. ఇట్లు సవరించినదియు సరి గాదు. సంస్కర్తలు సవరించుటచే బోఁడి పోఁడి యైనది. కాని ప్రథమ ముద్రణము ననుసరించి యాదేశము 'బోఁడి'యే కదా. సంస్కరించినపాఠమును వీరు విమర్శించిరి. అంతకు ముందు సంస్కరించుపద్ధతినె తిరస్కరింప వలసియున్నను నాయాగ్రంథములందు 'గవిప్రయోగములతోఁగూడ వీరిట్లు సంస్కరించుచుందురు. కావున నది వీ రంతగాఁ బట్టించుకొనలే దనవచ్చును. పోఁడిశబ్దమె యుండఁగా బోఁడి యనునాదేశ మసంగతము గదా. (బా.291) అట్లయిన సూరి యథార్థముగా నాదేశము చేసిన 'బోఁడి' యనునది ప్రత్యేకముగా లేదు గావున బోఁడి యాదేశము సుసంగతమె యని వీరిమతము ననుసరించియు గుర్తింపవచ్చును.

ఒకవేళ బోఁడి యన్నదే యాదేశము చేసినను, నాశబ్దము ప్రత్యేకముగా నుండుటకును, నిట నాదేశము చేయుటకును సంబంధ మేమి? మేనున కాదిష్టమైనపోఁడిశబ్దము మేను అనునర్థము నిచ్చుచుఁ బ్రత్యేకప్రయుక్త మగుపోఁడిశబ్దముకంటె భిన్న మని స్పష్టము చేయుచున్నదే కదా. అయ్యు సూరి యాదేశించినది 'బోఁడి' కావున నట వఝులవారు చూపినటగని యనుపపత్తియును లేదు.

'మఱియు చిగురుంబోఁడి యున్న గురూపము లీపక్షమున సిద్ధింపనేరవు' (బా.291) ఈపక్షమున నన నేపక్షమున? బోఁడిపక్షముననా? పోఁడిపక్షముననా? పూర్వవాక్యము పోఁడిపక్షమునకుఁ జెందినది. కావున పోఁడి నాదేశించి

నచోఁ బూర్వోక్త మగునసంగతియె కాక 'మంజీరముఁ జిగురుంబోఁడి యను రీతిరూపములు గానేర వని యిచటియభిప్రాయ మగును. కాని యిత్వ మేల రాదు? 'బోఁడి' యదంగ్యాదులలో సూరిచేఁ బరిగణింపఁబడియే యుండెను గదా. (ప్రకీ.19) తద్భిన్న మగు 'బోఁడి' యే యాదేశింపఁబడినను, లేదా, బోఁడి యాదేశింపఁబడినపక్షమునను జిగురుంబోఁడి యనురీతిరూపములు గా వనరాదు. అదంగ్యాదిగణ మాకృతిగణమె యైయుండఁగాఁ బ్రయోగానుసారముగా నిత్వ మయినస్థలముల నందుఁ జేర్పఁదగును గదా.

కావున నాదేశ మేది యైనను (బోఁడియే యాదేశింపఁబడినను) నిత్వ మగుటలో బాధ లేదు. కానఁ జిగురుంబోఁడి యనురీతిరూపములు గానేర వనునదియు సరి యైనహేతువు గానేరదు. కావున బోఁడియాదేశము లో నవరోధము లేదు.

సం.లోఁ జూపిన కొన్ని యనుపపత్తులు గ్రంథాంతరమునఁ బరామృష్టములు. (త్రి.శే.)

ఇది కర్మధారయ మగు నన్నది ప్రౌఢ.లక్షణము; అది సరి కాదు. (చూ.త్రి.శే.) అలరుఁబోఁడి యనుదానికి అలరువలె మనోజ్ఞురాలు(ఉ.291) అని యర్థము చెప్పెరి. ఇది యెట్లు? బోఁడి యనుదానికి ఒప్పు. ఒప్పిదము అని యర్థము. అలరువంటిబోఁడి పూవు(విశేషణము) వంటిఒప్పిదము (విశేష్యము) అనియే యర్థ మగును. కాని పూవువంటియొప్పిదము గలది యనురీతిగా నన్యపదార్థప్రాధాన్య మెట్లు? జంటిమోవి యిత్యాదుల నిట్లు గలదా? అందుకే కొంౘోలును పేరును అలరువంటియొప్పిదము గలది అనెడి విగ్రహము గలయుపమానపూర్వపదబహువ్రీహి గ్రహించినను సరియె' (ఉ 291); [మూరి చెప్పినది మాత్రము గ్రహింపరాదు.] అనిరి. కాఁగా నీవివరణమునుబట్టి యిది కర్మధారయమె యనిపేరును నిశ్చయింపలే దనుట స్పష్టము. అట్టియెడల సూత్రమున నట్లును నిర్ణయించి చెప్పు టేల?

ఉపమానపూర్వపదబహువ్రీహి యనునంశమునకు సూరియభిప్రాయ మంగీకరింపఁబడినట్లే. కాఁగా నుత్తరపదము మేను (దానికి బోఁడి యాదేశము) అని సూరి పేర్కొనఁగా 'బోఁడి' కావలె ననుటయే వీరిమతము.

తీయంబోఁడియను నర్వాచీనస్థల మొండు దక్కఁ నుదంతేతరములపైఁ బూర్ణబిందువు గానరాకుండుట. బోఁడిశబ్దపరకతయందుమాత్రమే యుదంతేతరములపై నుగాగమము గానవచ్చుట యున్నగువిశేషములనుబట్టి బోఁడి శబ్దముతోఁడిసమన్వయము కేవలము సహజ మనలేము. ఈయంశమున బోఁడి యాదేశము నాక్షేపింప నక్కఱ లేదు.

అర్థమునుబట్టి చూచిన మేనుశబ్దముతోడిసమాసమే యుచితముగా నుండు నని నిర్ణయింపఁదగును. అర్థానుగుణముగా శబ్దస్వరూపమును లాఘవముతో లాక్షణికుఁడు నిరూపించునప్పు డందు సహజత్వమో శబ్దచరిత్రమో తప్పక యనుసరింప నవసరమును లేదు.

బోఁడ్యాదేశపక్షమునఁ జూపినయనుపపత్తులు సముచితములు గాకుం డుటనుబట్టియును సూరిలక్షణము దుష్ట మనుటకుఁ దగినప్రమాణము లేమి నయ్యది నిర్దుష్టమై గ్రాహ్య మయ్యున్న దని విశ్వసింపఁదగును.

## ఋకారమునకు-రవర్ణము :

'ద్వంద్వంబునందు ఋకారంబునకు రవర్ణంబు విభాష నగు' (24) అను సూరిలక్షణమును మార్చి వీ రిట్లు పేర్కొనిరి. 'సిద్ధఋదంత(పుత్ర శబ్దోత్తరపదకత్వమందును)ద్వంద్వంబునందలిఆనఙ్ ఆదేశముచోఁటఁ దెల్గున విభాషగా రేఫాదేశ మగును' (ఉ.26సూ) ముందుగా వీరిలక్షణమునుగూర్చి పరామర్శింతము.

'సిద్ధ' అనువిశేషణము వివరణాత్మకమే కాని ప్రయోజనము గలది కాదు. 'ఋదంతద్వంద్వ' మనుటచేతనే యయ్యది సిద్ధసమాస మనుట స్పష్ట ము. తెనుఁగున ఋకారమే లేదు. ద్వంద్వము తెలుఁగున సాధ్య మాచ్ఛికమే

కాని మిశ్రము లే దని వీరును స్పష్టము చేసియేయున్నారు. (సాధ్య)సాంస్కృతికము నుండదు. కాఁగా ఋదంతద్వంద్వ మనఁగా నద్య్వాది తప్పక సిద్ధసమాసమే కావలసియుండును. కావున వీరిసూత్రమున 'సిద్ధ' విశేషణము చెప్ప నక్కఱ లేదు.

“పుత్రశబ్దోత్తరపదకత్వమునందును” అని వీరు కుండలీకరణమునఁ జూపిరి. పుత్రశబ్దము ఋదంతము గామి దానితో ఋదంతమునకె ద్వంద్వ మయినను నది ఋదంతసర్వావయవద్వంద్వము గామిం జేసి వీ రిట్లు పేర్కొని రనఁదగు. కాని పుత్రశబ్దపరకత్వమునను సంస్కృతమున నానఙాదేశము' వచ్చును.(సి.కౌ.921సూ) వీ రీసూత్రమున “నానఙాదేశము”నకె రేఫమును విధించిరి. కావునఁ బుత్రశబ్దపరకత్వమున నయినయానఙ్ఞనకును రేఫము వచ్చుటలో బాధ లేదు. కాన నావిషయమును విశేషముగాఁ బ్రస్తావింప నక్కఱ లేదు. అందుకె వీ రప్రధానముగాఁ గుండలీకరణమునఁ జేర్చి యుందురు. కాని వివరణమునఁ జెప్పనగును. కుండలీకరణమున నైనను సూత్రమునఁ జేర్ప నవసరము లేదు.

ఉర్ద్వంద్వే రః అనుచిం.లక్షణము ననుసరించి సూరి ద్వంద్వమున ఋకారమునకు రవర్ణమును జెప్పెను. వీరు ఆనఙ్ఞనకు రేఫ విధించిరి. ఇది “ఆనఙస్స్వదృతో ద్వన్ద్వే రేఫశ్చారికవేర్మతే” యనువి.వి. ననుసరించి చెప్పఁబడిన దనఁదగు.

సూరి ఋకారమునకురవర్ణము విభాష యనుటవలన రవర్ణము రాని పక్షమున మాతృపితృ అనురీతిగ నుండఁగా మఱల (తెనుఁగువ్యాకరణ ప్రక్రియ నడచుచో నడుమ)సంస్కృతవ్యాకరణము నాశ్రయించిఆనఙాదేశము చేయవలసివచ్చుచున్నది. “ఆనఙ్ఞనకె రవర్ణమును విధించినచో- విభాష గావున రానిపక్షమునందు మాతాపితృ అనియె యుండును. అప్పుడు తెలుఁగు నఁ బ్రక్రియలో నడుమ సంస్కృతవ్యాకరణాశ్రయణావసర ముండదు.

అప్పుడు కావున ఋకారమునకుఁ గాక యాసజ్ఞకే రవర్ణము విధించు టుచిత మని తోఁచును.

కాని 'నేష్టోద్గాతలు' అనుచో నేష్టా + ఉద్గాతృ అని యుండఁగాఁ దెలుఁగున నాసజ్ఞకు రవర్ణము చేసినపిదప నేష్ట్రి + ఉద్గాతృ అనుచో 'నార్గుణ' యని గుణము మఱల సంస్కృతవ్యాకరణము నాశ్రయించి చేసికొనకతప్పదు. అందుచే వీనిని దెలుఁగులోనికిఁ దెచ్చినపిదప నిఁక సంస్కృత వ్యాకరణప్రసక్తి లేకుండఁ జేయుట కవకాశము లేదు. నేష్టోద్గాత లని కవిప్రయోగ మున్నదా యని సందేహము రావచ్చును. కాని మాత్రపిత లనురీతిప్రయోగములును గానరావే దని వఝలవారు స్పష్టముచేయుట గమనింపఁదగును.

కావున నాసజ్ఞకు విధించుటవలన సాధింపఁబడిన ప్రయోజనము లేమి ఋకారమునకు విధించినసూరిమార్గము నిర్దుష్టమై యగుట గుర్తింపవచ్చును.

వి.వి. ననుసరించియె వఝలవారు 'రేఫాదేశ మగు' నని రేఫను విధించియుందురు.

సూరి యధర్వణాహోతలులసమన్వయము(వ్యా.సం.స.1261)నకు భిన్నముగా రవర్ణమును విధించెను. దీనిచే న త్త్వసహిత మయినరేఫము అనఁగా 'ర' అనునక్షర మాదేశ మగుచున్నది. మాత్రపితలు. కాని వీరు రేఫను విధించుటచే రేఫ యనఁగాఁ బొల్లయిన 'ర్' (ఉ.341) అనునది మాత్రమె యగును. మాత్రీపితలు అని కావలె. ఇది యపరూపము గదా. కావున వఝలవారు రేఫమును విధించి 'ర'వర్ణమును జేయుటకంటె 'ర' వర్ణమునే విధించుట యుచితము. సూరిలక్షణమున నధర్వణాహోతలుల సమన్వయము జాడలేకుండుటచేతనె యది యుచితముగా నున్న దన్న మాట.

వీరిసూత్రమున 'అనజ్ఞనకు' అనుచోటిషష్ఠిచే నిందు విహిత మయిన రేఫము ఆనజ్‌స్థానమునకే యగు నమన్నర్థము సిద్ధించును. కావున 'రేఫాదేశము' అని 'ఆదేశము' సూత్రమునఁ జెప్ప నవసరము లేదు. రేఫం బగు నన్నఁ జాలు.

సం.లో 'అథర్వణాహో బలపతిసమన్వయములజాడ యీసూత్రము నందుఁ గానరా (వ్యా.సం.స.1251) దనిరి. అది యానజ్ఞనకు వచ్చు నవి చెప్పకుండుటయె యనవచ్చును. వఝులవారిలక్షణమునుబట్టి. యీద్వంద్వమున 1.శబ్దము లెల్ల ఋదంతములే కావలయుట 2.అనజ్ఞనకె వచ్చుననుట యను రెండంశములె సూరిలక్షణమున లేనివిగాఁ జెప్ప నగును. ఇఁక మూఁడవది రేఫము. రేఫము విధించుట సరి కా దనియు, సూరి 'ర'వర్ణమును విధించుటె యుచిత మనియుఁ బై వి గమనించితిమి.

ఇంక మిగిలినయంశములు. సూరి 'ఉర్ద్వన్ద్వేరః' అనుచిం.లక్షణము ననుసరించె ననుట స్పష్టము. అయిది ద్వంద్వము ఋదంతసర్వావయవము గావలె నని చెప్పుట లేదు. కావున రవర్ణ మానజ్ఞన కగు నని చెప్పఁబడు నవకాశమును లేదు. ఆసూత్రముచే మాంధాతృరఘుశిబిశయమరీతిసమాస మున సంయుతము ఋకారమునకు రవర్ణము వచ్చుట కవకాశము గలదు.వీరి లక్షణముచే నాయవకాశము లేదు. మాంధాత్రరఘుశిబీలు(ఆది.2.176)అని కొన్ని(వావిళ్ళ.)ముద్రణములం దిట రేఫ ముంటుటయు గమనార్హ మయి యున్నది. కాఁగా నిట్టిప్రయోగమును దృష్టియం దిడుకొన్నచో 'ఋదంత ద్వంద్వము- అనజ్ఞనకు' అనునదర్వణాహోబలపతులసమన్వయమును, దదనుగుణ మగువఝులవారియాలక్షణమును గ్రాహ్యములు గా వనక తప్ప దు. (అప్పకవికిఁ దరువాతివాఁ డగునహో. ఆకారికను సృష్టించె ననుట సాహసమే మో.)

కాఁగా సూరిలక్షణమున దోష మెన్నుటకు ఏల యైనయాధారము లేదు గావున గ్రాహ్యమె.

"దీనికి మంచికవిప్రయోగము దొరలే" [పు.265] దనిరి వీరు. మఱియొకరీతి దగుప్రయోగము దొరకిన దేమో. చూపిన బాగుండెడిది. మఱి వీ రేల సూత్రించిరి? చిం.,వి.వి.లు చెప్పియున్న వని యేమో. చిం., వి.వి.లు ప్రస్తావింపక సూరియె చెప్పియున్న హనుమానుఁ డిత్యాదులవలె నీరూపము లసాధువు లని చెప్పి యాలక్షణమును దొలఁగింపకుండు రని చెప్పఁజాలము.

ఇట్టిప్రయోగము లెట నే దొరకు నేమో వెదకుదము. ఇప్పటికిఁ బాఠాంతరము గల"మాంధాత్రరఘుక్షితీశు"లన్నది యొక్కటె కొన్నిమొదల' గానవచ్చు చిం,బాల.ల లక్షణములు సమంజస మని తెల్పుచున్నది.

## సామాసికవిభక్తిలోపము :

'సమాసవిభక్తికి లోపం బగు నట్టువలెఁ గాదు (25)అనుసూరి లక్షణమును వీ రంగీకరింపక విభక్తిలోపప్రక్రియను 'గంద్రగోళము'గా మార్చిరి.

వీరిమార్గమును బరిశీలించుటకు మున్ను సూరిలక్షణమున వీరు చూపినదోషములనుగూర్చి విచారింపవలసియున్నది.

'సమాసపూర్వావయవవిభక్తి మాత్రమె లోపమును సూరి యుద్దేశించెనన్నచో సమాసమున సముదాయమున కేకపదీభావమె దుర్ఘట మగును. విశిష్టైకార్థబోధమె లేదు. సమాసమునకుఁ బ్రాతిపదికత్వమె సిద్ధింపనేరదు. (పు.279,వ్యా.సం.స.1170)సూరిపూర్వపదావయవవిభక్తిమాత్రమెలోపించు నని యెంచెనా? తత్పు.21సూత్రమువొద్ద దీర్ఘ, రామ, భార్గవ రాజపురుష యని ప్రాతిపదికలను జూపుచో సమాసమును గూడఁ బ్రాతిపదికముగాఁ

ప్రత్యేకముగాఁ జూపెను. 'అనుప్రయుక్తం బయినయాంతశబ్దంబు ప్రాయికం బుగాఁ గ్లీబసమం బగు' (కృతి.7) మున్నగువివరణాదులనుబట్టి తెలుఁగు నను నట్లై కృత్తద్ధితసమాసములు ప్రాతిపదికము లవు నని యే సూరి యభి ప్రాయపడుట స్పష్టము.

సూరి పూర్వపదావయవవిభక్తిమాత్రమే లోపించు నని చెప్పలేదు గదా. కాఁగా పూర్వావయవవిభక్తి మాత్రమే లోపించు నన్నచో-నని వీరు చూపినయిబ్బందుల కిటఁ దావు లేదు.

పూర్వోత్తరావయవములు రెండింట విభక్తులు లోపించు నని సూరి యభిప్రాయపడుచోఁ గల్గునిబ్బంది వీ రిట్లు పేర్కొనిరి. 'గుణములప్రోకల చేతన్ మున్నగుచోటులందు (విభక్తి మాత్రము లోపించి బట్టునకుఁ గా దనుటవలన బట్టు విల్చి) గుణములప్రోకల మున్నగురీతిగల సామాసిక ప్రాతిపదికము లేర్పడవలసివచ్చును.' (ఉ.279 వ్యా.సం.న.1170)

కాని యిది సరియైనహేతువు గాదు. ఉత్తరావయవమును ప్రథమాంతముగాఁ జెప్పుటయే సంప్రదాయమైయున్నది. ఉదాహరణమునకు సంస్కృతమున 'రాజపురుషః' అనుసమాసమునుగూర్చి యెట్లు చెప్పుదురు? రాజన్ + ఙస్, పుత్ర + టా యని యలౌకికవిగ్రహమును జూపుదురా? రాజ్ఞః పుత్రః రాజపుత్రః తేన రాజపుత్రేణ అనురీతిగాఁ జెప్పుట గదా సంప్రదాయము.

చిం.మతమున 'శోకార్త + జస్, ఒడలు, శోకార్తములు + ఒడలు. శోకార్తపుటొడలు- శోకార్తపుటొడలులతో' (వ్యా.సం.స.1162) నని వివరించిరే. ఆదేపద్ధతిలో గుణములయొక్క- ప్రోక- గుణములప్రోక- (వానితో గుణములప్రోకలతో) యనురీతిగాఁ జెప్పఁగా నిం దనిష్టరూపోత్పత్తి యెట్టిది? గుణములప్రోకల యనుప్రాతిపదికరూప మేర్పడునవకాశ మేది? కాఁగా నుత్తరావయవమునఁ బ్రాతిపదికావస్థయందు

లదాగమము నిల్పియుండెడి ప్రమాదమే లేదు. [ఒకవేళ నట్టిదే మే మన్నను నాలోటును సవరించి పూర్వావయవంబు లట్టునకుఁ గాదు' ఇత్యాదిగ నెల్లో పేర్కొనుట యొప్పును గాని యసలు విభక్తిలోపవిధానమే సరి గా దనుట సమంజసము గాదు గదా.)

మీరు చిం.ప్రకాశికను బాల.లోఁ గలుపుటచేఁ గొన్ని భేదములు గల్గిన వనవచ్చును. అవి యెట్లో చూతము. చిం.మార్గములో గుణములయొక్క శ్లోకలతో ననుచో షష్ఠికి ద్వితీయాతుల్యతయు, ద్రుతలోపమును వచ్చి-గుణములశ్లోకలతో నని యగును. ఇట షష్ఠీసమాసము ప్రాతిపదిక మగుట యనుప్రశ్నయె లేదు. ఉత్తరపదలోపప్రసక్తి షష్ఠీతత్పురుషమునఁ జిం.లో లేదు. బాల.లో మీరు చూపినయనుపపత్తి ఉత్తరపదవిభక్తిలోపింపమి సామాసికప్రాతిపదికత్వము సిద్ధింపకుండుట యన్నది షష్ఠీతత్పురుషములందుఁ జిం.లో నున్నది.

"సాధ్యసాంస్కృతికమిశ్రసమాసములం దట్టిలోపాదికము (విభక్త్యాదిలోపము)ను" విధింపలేదు. కావున శ్లోకార్థపుటాదలులతో మున్న గుసమానాధికరణసమాసరూపములను సాధించునప్పుడు ముందుగాఁ బ్రథమాంతముతో విగ్రహము నిల్పి సమాసము చేసి సామాసికప్రకృతిరూపమును సంపాదించి పిదపఁ దత్తద్విభక్త్యనుకూలవిభక్తివచనములతోడిరూపములను యథాసందర్భముగా గ్రహింపవలయు నని ప్రకృతనన్నయాథర్వణసూత్రములచే విదిత మగుచున్నది." (పు.382)

నన్నయాథర్వణసూత్రములు గావున నేయర్థము నైన నెట్లయినఁ జెప్పఁగల వేమో. లేనిచో పుంపులను జెప్పునన్నయాథర్వణసూత్రములు సమాసమును జెప్పఁగల వేమో కాని శ్లోకార్థపుటాదలులతో ననుచోఁ బ్రథమాంతములకే సమాస మని యెట్లు చెప్పును? శ్లోకార్థములతో ఒడలులతో అనుచో సమాసము చేయ (బాల.లోఁ జూపిన) విరూపోత్పత్తి యగును గావునఁ బ్రథమలోనె చేయవలె. బాల.లో నట్లు చేయవలసివచ్చిన నది

నియ్మాత్రల మగుటచేఁ బహువ్రీహియగు నగును.

కాఁగా నదేమార్గమున విచ్ఛేదను నుత్తరపదము ప్రథమాంతముగా నుంచి గుణములయొక్క ప్రోక యనుచెప్పున సమాన మైనపిదప గుణములప్రోక యనుసామాసికప్రకృతిని సంపాదించి పిదపఁ దత్తద్విభక్తులను జేయ విభూపోత్పత్తి కాల.పక్షమున మాత్ర మెక్కడనుండి వచ్చును?

అట్లు గాక సంప్రదాయము ననుసరించియు గుణములయొక్క ప్రోక గుణములప్రోక- (పావితో- గుణములప్రోకలతో) అనుతీరుగా సమాసమును జేసినపిదప నాసమాసప్రాతిపదిక తత్తద్విభక్త్యంతరూపములు బొందును గాన వీరు చూపినయుదర్థము సూరిలక్షణమున లేదు.

“అలౌకికవిగ్రహవాక్యములోనే సమాససంజ్ఞ కలిగి యట్టిసమాసము నకుఁ బ్రాతిపదికత్వము సిద్ధించి తదవయవీభూతసుబ్విభక్తికి లోపము కల్గ నపుడు లట్టునకుఁ బ్రాప్తి యెట్లు? (వ్యా.సం.స.1170)

సూరిలక్షణమున లట్టునకుఁ గాదనుట సరి కాదని వరుఖలవారి భావము. కాని యప అలౌకికవిగ్రహము, సంస్కృతవిభక్తిలోపము నను విధానమును సూరి యనుసరించెనా? సుపోధాతుప్రాతిపదికయోః అని ప్రాతిపదికావయవము లగు విభక్తులకు లోపము చెప్పఁబడినది.సూరి ప్రాతిపదికములె యనలేదే. కావునను నెవరు నట్లు వ్యాఖ్యానింప వీలు లేదు.వీరే యీ తత్సూత్రవివరణమున రామునియొక్క బాణము అని విభాగించి యొక్క లోపము చేయుటయు అదాగమలోపనిషేధము సమస్వయించినవిధమును (వ్యా.సం.స.1189) సూరిమార్గమున కనుగుణము. కాఁగా వీరివ్యాఖ్య నను సరించియు సూరిమతమున సమాసములో లోపించునది తెలుఁగువిభక్తియే కాని సంస్కృతవిభక్తి కాదు. కావున నలౌకికవిగ్రహప్రసక్తి సూరిమతమున లేనేలేదు.

కాఁగా గుణములయొక్క ప్రాతిక యనుచోఁ తెలుఁగువిభక్తిని లోపించుచో నిడాగమము విభక్త్యవయవ మగుటచే నదియు లోపింపవలయుండుట వఘలవాదివివరణమువలననే స్పష్టము. కాఁగా వీరే లట్టునకు ప్రాప్తి యె ట్లని శంకించుట యసంగతము. చిం.మార్గము ప్రభావముచే నిట్లు పేర్కొని రేమో.

"కావున 'లట్టునకుఁ గాదు' అనువిధానసామర్థ్యముచే నది రాఁదగిన చోటివిభక్తులు లోపింపవు" (వ్యా.సం.స.1170) అనుటయు నసంగతమే. కాన నావలనున వీరు చూపినయనుపపత్తులు కేవలము నిర్మూలములు లగుచున్నవి.

అలౌకికవిగ్రహము సువిభక్తిలోపము అన్నదే సూరిమతమున: యంగీకరించినను లట్టునకు లేదనుటచే నది రాఁదగినచోట విభక్తులు లోపింపవనుట యెట్లు? అట సూరియె చూపిన రామునిబాణ మనుచో నిగాగమ మెట్లు నిల్చునది. వీరు జ్ఞాపితము చేసినయర్థము సూరిలక్ష్యలక్షణములకు విరుద్ధము గదా. ఇఁక లట్టునకు లోపము లే దనుటచే నంతకు ముందటి సూత్రభాగముచే లట్టునకుఁ గూడ లోపము ప్రాప్తింపవలెను. అనఁగ (అలౌకికవిగ్రహము, సంస్కృతవిభక్తిలోపము నని సంస్కృతవ్యాకరణ ప్రభావమునకు లోనయి యెవ్వ రే నర్థము చేసికొన్నచో నట లట్లోపప్రసక్తి యుండదు గాన లోపనిషేధసామర్థ్యముచే) సూత్రముపూర్వభాగముచేఁ దెలుఁగువిభక్తులకు లోపము గల్గు ననియుఁ దన్మూలమున లట్టునకును ప్రాప్తింప నీనిషేధము చరితార్థ మై రామునిబాణ మిత్యాదుల యొక్కాదుల లోపించి నిగాగమూదు లుండుట ప్రయోజనముగాఁ గుర్తింపఁదగును. కాఁగా విధానసామర్థ్యమును ప్రస్తావించినను సూరిమతమున నిటఁ దెలుఁగువిభక్తులకే లోప మనియు, నలౌకికవిగ్రహప్రసక్తి లే దనియు స్పష్టమే. అయిన నిట నట్విధానసామర్థ్యసమన్వయ మనవసరమే యనుట స్పష్టము.

'లట్టు లోపింపనపుడు దానికి పూర్వము లగువిభక్తులను లోపింప

వచనక తీఱదు గదా. ఇంక లట్టు రానిస్థలముల సమానవిభక్తులే లోపించు నని సూత్రమున కర్థము చేయవలసివచ్చును." (వ్యా.సం.వ.1170) ఇదియును నసమంజసమే. లట్టునకు లోపము లేదన్నఁ దన్మాత్రలకవిభక్తి లోపింప దనుట యెట్లో యర్థము గాదు. లణ్మాత్రలక మగువిభక్తికిని లోప మిష్టము గాకున్న లట్టునకు లే దని చెప్ప నేల? లట్టు బహుత్వమునఁ గదా యున్నది. అట్టియెడ బహువచనమునకు లోపము లే దని చెప్పు టుచితము గాని లట్టునకు విశేషించి తన్మాత్రలమున విభక్తిలోపము సాధుకొనుట యేల?

అన్నఁగాఁ బీ రింకను నలౌకికవిగ్రహము నుద్దేశించియే వివరించుచుండి రన్న మాట. గుణములప్రోక యనుచో గుణ + అమ్, ప్రోక + సు అని యుండఁగా అమ్ అనునది లట్టు రాఁదగినవిభక్తి కావున లట్లోపనిషేధముచేఁ దన్మాత్రలక మగు 'అమ్' విభక్తి లోపింపదు. అట్టియెడల లట్లోపమును నిషేధించి యందువలన 'అమ్' లోపింపమిని సాధించుటకంటె అమ్ (బహువచన)విభక్తి లోపింప దని స్పష్టముగాఁ జెప్పఁదగును గదా.

లట్లోపనిషేధముచే అమ్విభక్తి లోపింపకుండఁగా నచటఁ దెలుఁగు విభక్తియు లట్టు నగును. లట్టు విల్చి యున్నను దెలుఁగువిభక్తి యే మగును. వీరిప్రక్రియయం దౌచిత్యములేదు. ఇంకనీపక్షమునను లణ్మాత్రలోపనిషేధముచే అమ్విభక్తి లోపించియు లట్టుమాత్రము(వచ్చి) నిలిచియుండు నని చెప్పు టేని గొంతవఱకు యుక్త మగు నేమో.

కాని పిదప ని ట్లనిరి. "గుణములప్రోక అనునుదాహరణమునుబట్టి విభక్తిప్రత్యయము లోపించి 'ల' మిగులు ననుట దుర్ఘటము. ల అనుదానితోఁ గూడినమొత్తము విభక్తి యగునపు డందుఁ గొంతభాగము లోపించు ననుసర్థ మెట్లు లభించును? -(వ్యా.సం.వ.1170)

ఇది యింకను విచిత్రముగా నున్నది. 'విభక్తి లోపం బగు లటునకుఁ గా' దని లక్షణమునని చెప్పఁబడఁగా నుదాహరణమునుబట్టి విభక్తి లోపించి లట్టు మిగులు ననుట యేల? లక్షణమునుబట్టియె యట్లగును.

ఇంకను లక్షణము విభక్తి లోపించును గాని ట్టు లోపింప దని చెప్పకుం డఁగా న ట్లగుట దుర్ఘట మనుట విచిత్రము గాదా? ట్టు విభక్తిభాగమె కావచ్చును. లక్షణము కొంతభాగమునకు మాత్రమె లోపము చెప్పుచుండఁగా నది మాత్రమె లోపించును గాని మొత్త మేల లోపింపవలయును? కొంత భాగము మాత్రమె లోపించు నన్నర్థము సూత్రముచేతనె లభించుచున్నది. సూత్రము విధించుచున్న దదియే. కావున నాయర్థ మెట్లు లభించు నని సందే హింప నక్కఱ లేదు.

౭౦. లోపాదికమును విధించినసమాసకములం దెట్లు? అందపునడక లతో ననుచో అందములతో నడకలతో నని చెప్పి అంద + భిస్, నడక + భిస్ అని యుంచి విభక్తిలోపము చేసిన అందనడక లని యగును. అది యనిష్టము. కావున షుంపువిధానసామర్థ్యముచేఁ బూర్వపదము పువర్ణము నిలుచు ననవలె. పైవి విభక్తి సంస్కృతమో తెలుఁగో లోపింపవలె. అట్లు యుటఁ గూడ ట్టునకుఁ గా దనుచో ట్టును నిల్పి యాట్టుమీఁదివిభక్తి యేల లోపింపఁజేయరాదు. అందపులతో నడకలతో నని యట నగుచున్నదా? ఇట ట్టుతో మీఁదివిభక్తియు లోపింపవలె ననియు ట్టు మాత్రమె (కొంత భాగము) లోపింపక నిల్చుట దుర్ఘట మనియుఁ జెప్పుటకు (ఉత్తరపదము ప్రథమాంతముగా నుండుట నింతకు ముందే గుర్తించితిమి. కావున గుణ ములప్రోకల- యని ప్రాతిపదికరూప మేర్పడు ననుబాధ లేదు. అందపు నడకలతో ననుచోఁ గూడ అందమైననడక అందపునడక యని వైయూపిడ ప నందపునడకలతో నని యప్పు నని గుర్తింపఁదగును.

ఇటనే నూరి రామునిబాణము లని యుదాహరించెను గదా. ఇందు నివర్ణ మెక్కడిది? అలౌకికవిగ్రహమున నుబ్విభక్తి లోపింప రామబాణ మని గదా కావలె. ౭౦.వలె నూరి బాను షష్ఠికి ద్వితీయాతుల్యత విధింప లేదు. పైఁగా దీని నీసూత్రమున కుదాహరణముగాఁ జూపుచుండె. ఇటుఁ గూడ నుదాహరణసామర్థ్యమునుబట్టియె 'ని' యగు ననుకొనవలెనా? అన

లిట సూత్రమును జెప్పక యీరూపములు చూపివిడచిన లక్షణము నింక నుచితముగా నూహించుకొనలేము యనిపించును. లక్షణవిరుద్ధ మగువ్యాఖ్యానముచేతనె యిన్ని యనుపపత్తు లేర్పడినవి కాని లక్షణము నిర్దుష్టమె.

రామునిబాణము అనునుదాహరణమునుబట్టియే సమాసమున, దెల్గుగువిభక్తులు లోపించుటయే సూరిమత మని స్పష్ట మగుచున్నది. కాఁగా లల్లోపనిషేధావశ్యకతము స్పష్టమే. కాన సూరిలక్షణ మెంతయు నుచిత మనియుఁ దద్విరుద్ధముగా నలౌకికవిగ్రహప్రసక్తి తెచ్చినవరులవారివ్యాఖ్యానమె సూరిలక్షణమునకు విరుద్ధ మనియు నిర్ణయింపఁదగును.

సూరిలక్షణమున నింకొకదోషము నిట్లు ప్రస్తావించిరి.

'మఱియు సమాసపూర్వావయవవిభక్తిమాత్రలోపవిధానముచేత నుత్తరపదలోపిసమాసములు చలోపాదులు గలద్వంద్వాదులును సిద్ధింపనేరవు.' (ఉ.279,వ్యా.సం.స.1170)

చలోపాదిక మనఁగా నర్థకాదిలోప మని వీరియుద్దేశ్య మెన్నఁదగు. అన్నదమ్ము లనుతెలుఁగుద్వంద్వమున అన్న చ తమ్ముఁడు చ అను రీతి చశబ్దము నిల్వదు గదా. ఇంక చలోపప్రసక్తి తెలుఁగున నెక్కడిది? ఉత్తరపదలోపాదులు సూరి ప్రస్తావించినట్లు గానరాదు.

'లోపశ్చ విభక్త్యాదేః' అని చిం. ఆదిశబ్దమును బ్రయోగించుటచే విభక్తీతరము లగుమధ్యమపదాదులకును లోపము సిద్ధించుచుండఁగా సూరి సమాసవిభక్తికి లోపం బగు నని విభక్తికి మాత్రమె లోపము చెప్పుటచే నట్టిలోపము బాల.పక్షమున సిద్ధింప దని వీరితాత్పర్యము. కాని వీరే 'విభక్తికి. విభక్త్యాదులకు అని వ్యాఖ్య చేయవలయు ననియు సూరియాశయము (వ్యా.సం.స.1265) అనిరి. ఇట్టిసూరియాశయము నెఱింగియు వ్యా.సం.స. 728,730,761 మొదలగువుటలయందు సూత్రమున నాదిశబ్దము లేకుండుటను విమర్శించుట విశేషము.

నల్లని దైనకలువ, పూవు విల్లుగాఁ గలవాఁడు, మున్నగురీతిగాఁ గర్మధారయాదులందును నెన్నెన్నిపదములు లోపింపవలసియుండును? అవి యెల్ల నుత్తరపదలోపిసమాసములు గాక తప్పునా?

కావున నుత్తరపదాదులలోపప్రసక్తియేలేమి నది సాధింపక విభక్తికి మాత్రమెలోపము చెప్పుట యన్న దొకదోషముగా సూరిలక్షణమునఁ జెప్పఁ బూనుట నిరాధార మై యసంగత మని నిశ్చయింపఁదగియున్నది.

చిం. సమాసకము (ఆచ్ఛికసమాసము)లందు మాత్రమె విభక్తిలోపమును జెప్పఁగా సూరి తక్కినసాధ్యసాంస్కృతికమిశ్రసమాసములందును సాధారణముగా విభక్తిలోపమును జెప్పుట నిర్మూల మశాస్త్రీయము నని యీసూత్రమువిషయమున పక్షులవా రిం కొకయనౌచిత్యమును బేర్కొనిరి. (వ్యా.సం.స.1158) ఇది సరి కా దని 'దొంగభయము' ఘట్టమున గమనించితిమి.

దీనివలన మిశ్ర(సాధ్య)సాంస్కృతికసమాసములను జ్ఞాపితములు చేసికొనవలసివచ్చుటయు, నట్లు జ్ఞాపిత మగుచున్న వని పక్షులవారు చెప్పినచోట్ల లక్షణమున నట్టియవకాశము లేకుండుటయు గమనించి యుంటిమి.

చిం.,వి.వి.లలోను, దారార్థేఒత- మున్నగుసూత్రములచేనిట్టి వభ్యము జ్ఞాతము లగుటయు, ననుక్తన్యాయముచే నందు సుపోధాతుప్రాతిపదికయోః అని విభక్తులు లోపించుటయు (వ్యా.సం.స.1161) వీరే స్పష్టము చేసిరి. అం దనుక్త మగుటచే ననుక్తన్యాయము నాశ్రయించి యితరవ్యాకరణముచే విభక్తిలోపమును జెప్పిరి. సూరి యుక్తము చేసెను అది పొరపాటా? మిశ్ర (సాధ్య)సాంస్కృతికములు(షష్ఠీతరములును)గలవు.అందు విభక్తిలోపము గలదు. (వ్యా.సం.స.362) దానిని సూరి తెలుఁగువ్యాకరణముననే సాధింపఁగా నట్లు గా దిటఁ జెప్పకుండఁగా ననుక్తన్యాయముచే నితరవ్యాకరణములచే సాధించుట శాస్త్రీయ మని చెప్పుట యెంతయుక్తమో యర్థము గాదు.

అన లివి యుత్తరపదలోపసమాసము లనవలసినయావశ్యకమె లేదు. సిచేతన్ గలుగుశ్రోవు అనుచో 'కలుగు' అనుశబ్దము లేకున్న నాయర్థము గలుగదా? చేతన్ విభక్తి యేయర్థమున నైనదీ? ఇట్లె సివలనన్ నయ మనుచో మాత్రము నడుమఁ గలుగు అనుశబ్ద మేల? కాఁగా నూఢి యుపా హరించినచోట్ల నుత్తరపదలోపప్రసక్తియే లేదనియుఁ దత్తదర్థములం దయినవిభక్తులచేతనె యాయాయర్థములు సిద్ధమగుచున్న వనియు గుర్తింపఁదగును.

ఇట్లె చశబ్దము లేదా చార్థకములోపింపవలె ననుటయు నసంగతము. రామశ్చ కృష్ణశ్చ యనువిగ్రహము చెప్పునెడఁ జార్థమున ద్వంద్వ మేర్పడఁగా (ఉ.243) సంస్కృతమున 'చ'శబ్దము లోపించుట యున్నదా? తెలుఁగున మాత్ర మ ట్లేల కాదు? అన్నయును దమ్ముఁడును అనునర్థమున అన్న, తమ్ముఁడు అనుశబ్దంబులకు ద్వంద్వసమాస మేర్పడఁగా సమాసమున విభక్తి లోపించును. అంతే కాని చార్థకమైనను శబ్దము నిల్చుటయు నవ్యాది సమాసమున లోపించుటయు నన్నప్రసక్తి లేనేలేదు. కావున సమాసవిలోప మెట్లన్న సందేహమునకే యవకాశము లేదు.

ఇట్లె యుపమానవాచకాదులకును లోపప్రసక్తి లేదు. స్పష్టతకయి లౌకికవిగ్రహమున నట్టిశబ్దములు చేర్చినను నయ్యవి యాయాయర్థముల సమాస మేర్పడుటను బేర్కొనుననే. కాని వీరు చూపిన ట్లలౌకికవిగ్రహమున నవి నిల్చుటయుఁ బిదప లోపించుటయు నన్నప్రసక్తి లేదు. పురుషః వ్యాఘ్ర ఇవ యని లౌకికవిగ్రహమున ఇవశబ్ద మున్నను, నలౌకికవిగ్రహము పురుష + సు, వ్యాఘ్ర + సు అనియె కాని యట ఇవశబ్ద ముండునా? ఇవశబ్దలోపము విహితమా? తెలుఁగునను నట్లే కదా? జున్నువంటిమోవి యనునర్థమున జున్ను మోవి శబ్దములకు సమాసము కాఁగా నందు విభక్తి లోపించును 'వంటి'లోపప్రసక్తి లేదు. అట్లు యయిన భాషలో దాదాపుగా నెల్లవియు నుత్తరపదలోపసమాసములే యగును.

కాని విభక్తికి నన్నదానికి విభక్త్యాదుల కని యర్థము చేయుట సక్రమము గాదు గావున విభక్తీతరలోపస్థితి బాల. లోఁ జెప్పఁబడలే దనియె నిశ్చయింపఁదగు.

అయిన నుత్తరపదాదిలోప మెట్లు? ద్విగుకర్మధారయూ యనుసూత్రమునఁ జిం. అవ్యయీభావములను బేర్కొనలేదు. సూరియుఁ బ్రస్తావింపలేదు.కాన చిం.ఆధారముగనె సూరి తత్పురుషాదుల కిత్యాదిసూత్రవివరణము చేసె ననిరి. కాని చిం. చెప్పిన'లోప'(రూపక)సమాసములను గూడ సూరి యిటఁ బ్రస్తావింపలేదు. ఉత్తర పదలోపసమాసములను జెప్పని సూరియట్టి లోపమును సూత్రింపకుండుట వింత కాదు గదా.

కాని వజ్ఝలవారు 'నీచేతఁ గలుగుప్రోవు- నీచేతిప్రోవు, నీవలన నగుభయము నీవలనిభయము- -అని యిట్లంతటను నుత్తరపదలోపసమాస విగ్రహములను గల్పించుకొనవలయు' (వ్యా.సం.స.౩౯౭) ననిరి. సూరి యట్లు భావించె ననుటకుఁ దగినయాధారము బాల.లో లభింపకున్నది. చిం., వి.వి.లక్షణసందర్భమున వీరు (చేతన్ అగుప్రోవు) 'నీవలనిభయము' (వ్యా.సం.స.౩౯౫) చూపిరి. దొంగభయ మనుచో సమాసకము గామి (పంచమీ)విభక్తి లోపించె ననుటకు వీలు లే దన్న వీ రిట నీవలనిభయ మని చూపుట యెట్లు? సూరిమతమున నుత్తరపదలోపసమాస మనక తప్ప నప్పుడు చిం.మతమునఁ దప్పునా? నీవలనన్ గలుగుభయ మనుచో నుత్తర పద మెట్లు లోపించినది? లోపశ్చ విభక్త్యాదేః అని విభక్తి లోప మెటఁ జెప్పఁబడినదో యూసమాసకములందే యూదిపదముచే నుత్తరపదాదిలోపమును సమ్మతింపవలయును. కాఁగా సూరిలక్షణమునఁ జూపినయీలోటు చిం.మతమునను దదనుగుణముగ వజ్ఝలవారిమతమునను గల్గును. ఇంక నెన్నెన్ని లోపాదులు వీరు జ్ఞాపితము చేయుదురు.(ఇట్లు పెక్కెడలఁ గన్పించునీవిభక్తి(ఆది)లోపము నట నట జ్ఞాపితము చేసికొనుటకంటె సామాన్యముగా సమాసమున విభక్తిలోపమును జెప్పినసూరిమత ముచితముగదా.)

పై సూత్రముమీఁద మిశ్రాదిసమాసములయందు సాధారణముగ విభక్తి లోపమును జెప్పుచున్న యీసూరిలక్షణము నిర్దుష్ట మగుటతోపాటు ప్రసిద్ధములైన సమాసాదుల నెల్ల నెట్లో జ్ఞాపితము చేసికొను క్లిష్టతను దొలఁగించుచుఁ ప్రయోజనవంత మైయథాతథముగా గ్రాహ్య మైయున్న దని గుర్తింపఁ దగును.

## షష్ఠీ-ద్వితీయాతుల్యత :

సూరిలక్షణము సరి గా దని వఝలవారు చేసినలక్షణమునుగూర్చి పరామర్శింతము.

"సాంస్కృతికమిశ్రతత్పురుషము షష్ఠీసమాసమే సాధువు. అట్టిషష్ఠీ తత్పురుషమునందలి పూర్వావయవపుషష్ఠి ద్వితీయారూపమున నిల్చును. ఇది సమాసకములందును వర్తిల్లును. మధ్యమపదలోపాదిసమాసములందును నీవిధి వర్తిల్లుట గలదు. ఇట్టివి షష్ఠ్యలుక్సమాసము లనఁదగును. షష్ఠ్యర్థక దివిదుప్రత్యయపరకత్వమునందును ద్వితీయయే నిల్చును"(తె.72సూ)

ఇది వ్యాఖ్యానముగాఁ జెప్పఁదగినసూత్రము నీస్థానమున నుంచిన బాగుండెడిది గదా.

షష్ఠీతర మగుతత్పురుషము మిశ్ర(సాధ్య)సాంస్కృతికము అసాధువు అని వీరినిర్ణయము. మిశ్ర.(సాధ్య)సాంస్కృతికముల ద్వంద్వబహువ్రీహు లెట్లును లేవు. అట్టియెడఁ దత్పురుషములయెడనే యిట్టి వంగీకరించెను గావున సూరిమతమును దిరస్కరించుటయే వఝలవారిప్రధానలక్ష్యమేమో యని యీవాక్యముచేఁ జెప్పవలసియున్నది.

నిర్దయురాలు, శోకార్తవృద్ధోదకులు, ముల్లోకములు సరసపువచనము మున్నగురీతి మిశ్ర(సాధ్య)సాంస్కృతికసమాసములను వీ రంగీకరింపక పోరు. కాని యట్టి వాయాస్థలముల నెట్లయిన జ్ఞాపితములు గావలసినదే

కాని సామాన్యశాస్త్రసిద్ధములు గారా దని వీరిపట్టుదల. జ్ఞాపితముల యందును నట్టివి సాధువులే కదా. అట్టిసమాసములు ప్రయోగములం దుండుటను గుర్తించి వానిని మార్గాంతరమున గ్రహించుచునే యసాధువు లని నిర్ణయించుట యేలకో యర్థము గాదు. సామాన్యశాస్త్రముచేతనే సాధించినసూరిలక్షణమును గా దని వీరు సాధించినప్రయోజన మే దే సున్నదా? ఆయాస్థలముల వీరు జ్ఞాపితములు చేసినతీరు సక్రమముగా లేకుండుట గుర్తించితిమి. మరియు నట్లే యసంగతముగాఁ జెప్పవలెనా? సామాన్యశాస్త్రసిద్ధములు చేసినను నెల్లెడల నట్లు సమాసములు నియతముగాఁ జేయవలసియుండునా? పై దార్పికసమాసము నంగీకరించిరి గదా. అట విట్టిస్థితి గలదా? నెలప్రభవుఁ డని యుండ నట్లే నెలపుట్టినవాఁ డనియు నుండకుంట గ్రహించియుంటిమి. (సమా. ౩) ఏమయినఁ బ్రయోగానుసారముగా గ్రహించునపు డనుచితముగ జ్ఞాపితములు చేయుటకంటె సామాన్యశాస్త్రసిద్ధములు చేయు టుచితము.

అందులకే సూరి చిం. మార్గమును విడిచిపుచ్చెను. షష్ఠీతర మగు మిశ్రాదితత్పురుషము గల దనుటకే సూరి దొంగయలు కనుసహో; లక్ష్యమును దృష్టియం దుంచుకొని దొంగభయ మనుమిశ్రసమాసము నుదాహరించెను. వీరు దాని నంగీకరింపమిచేతనే దొంగవలనిభయము, దొంగయులు కన్నవి పంచమీతత్పురుషములుగనే చెప్పియు దొంగభయ మనునది షష్ఠీతత్పురుష మని సమర్థించుకొనవలసివచ్చినది. షష్ఠీతత్పురుషములు మిశ్ర (సాధ్య)సాంస్కృతికము లసాధువు లన నేల? అట్టివానిని గూడ నట్లే షష్ఠీతత్పురుషము లని సమర్థించుకొన నేల?

కాఁగా వీరిగులవారియీనిర్ణయ మనుచితము గా దనియు (సూరి మతమె సముచిత మనియు) స్పష్టము. ఈయంశము సూత్రముగాఁ జెప్ప నవసరము లేదు.

తమసూత్రమునఁ బైని రెండవవాక్యమునఁ బూర్వావయవపుషష్ఠి ద్వితీయరూపమున నిల్చు ననిరి. ఇది 'షష్ఠీ చేద్ద్వితీయాతుల్యా తత్పురుష

సంస్థితానామ్నా' వ్మనుచిం లక్షణము ననుసరించి చెప్పఁబడుట స్పష్టమే. (చూ.ద్రుత.షష్ఠికి ద్వితీయాతుల్యత)

పిదప సూత్రమున ఇట్టివి షష్ఠ్యలుక్సమాసము లనఁదగు ననిరి. ఇది యు సూత్రభాగమె యగుట విశేషము. అనఁదగు నేమి నిజముగా నలుక్స మాస మైన నట్లని నిశ్చయముగాఁ జెప్పరాదా? షష్ఠీవిభక్తి లోపింపనిచో నయ్యది యలుక్సమాసమె యగును. అట్లని సూత్రింప నక్కఱలేదు.షష్ఠి లోపించినచో నలుక్సమాసము గాదు. అవు నని సూత్రించుట తప్పు.మొత్త ముమీఁద నీవాక్యము సూత్రమునఁ జెప్ప నక్కఱ లేదు. షష్ఠీవిభక్తి ద్వితీ యారూపమున నిల్చుటచే నిది షష్ఠ్యలుక్సమాస మగు నని వీరియుద్దేశ్యము గుర్తింతము.

షష్ఠి ద్వితీయారూపమున నిల్చు ననఁగా షష్ఠీప్రత్యయమునకు ద్వితీ యాప్రత్యయము చేయవలయునా? రామునియొక్క+గుణములు, రాముని +న్+గుణములు, రామునిగుణములు (ఉ.53) అని వీరు లోఁగడఁ జూపిరి. దీనినిబట్టి యొక్కప్రత్యయము స్థానమున ద్వితీయాప్రత్యయము చేయవలె నని తలఁచి రనవలె. అట్టిచో ద్వితీయా(రూపమును బొం దినషష్ఠి) ద్రుతము సమాసంబున యందు (సంధి.24) లోపించినది. మఱి యది నిల్చుట యేది? సూరిమతమునవలె షష్ఠి సరాసరిగా లోపింపలేదు గాని యది ద్వితీయారూపమును బొందినపిదప లోపించినదే కదా. అనఁగా షష్ఠి లోపించినట్లే. (వీరిమతమునఁ బ్రక్రియాగౌరవ మొండ విశేషము.) అట్టియపుడు దీని నలుక్సమాస మనుట సరి కాదు గదా.

షష్ఠీస్థానమున ద్వితీయ యవుచో రామునియొక్క అని యుండ యొక్కస్థానమున (నువర్ణంబు ద్వితీయ) నువర్ణము నిలువవలె. మఱి 'రామునిన్' అనురీతిగా వీరు నకారపుఁబొల్లు నెట్లు చూపిరి. అవుఁ గాక. సూరిమార్గమును విడిచి వీరు ద్వితీయాదులకు నుగాగమమును(ఉ.తత్స.8)

చెప్పిరి. కాఁగా షష్ఠీస్థానమున ద్వితీయానువర్తకము చేసి దానిపై సమాసము జేయవలె. అప్పుడు రామునినిన్ అని యగును. సమాసమున (చి: ద్రుతము లోపింపఁగా ద్వితీయ నిల్చియే యుండును. అపు దలుత్వపె మనవచ్చును. కానీ యిప్పుడు రామునినిగుణములు అని కావలసియుండ అట్టిది భాషలో నుండునా? రామునియొక్క... రాముని గుణము లని కాఁగల కాని రామునియొక్క యని పేరు చూపించుట గమనింపవలయును.

ఇట్లే సీతయొక్క- సీతనున్- 'సీతనుగుణములు' అనురీతిగా లక్షణము సాధించురూపములు భాషలోఁ గానరావు.

మఱి యీవిధి ప్రవర్తించుట యెట్లు?

'ప్రకృతసూత్రజ్ఞాపకముచేత సమానపూర్వావయవషష్ఠి లోపిం ద్వితీయారూపమున నిల్చును. యొక్క లోపించిన షష్ఠియాకారము గలద్వి యారూపము మాత్రమె నిల్చు నని వ్యాఖ్యానము చేయనగును.' (ఛ.27 ఈసూత్రజ్ఞాపకముచేఁ బూర్వావయవషష్ఠి లోపింప దనుటకే సూత్రము బూర్వావయవషష్ఠి లోపించునో పేర్కొన్నటు గుండెడిది.

యొక్క లోపించినషష్ఠియాకారము గలద్వితీయారూపము వచ్చ నని సూత్రాభిప్రాయ మన్నమాట. అనఁగా షష్ఠీవిభక్తిస్థానమున ద్వితీయ యగుట కాక షష్ఠ్యంతరూపము పోయి ద్వితీయాంతరూపము నిల్చును. రామునియొక్క యనుషష్ఠ్యంతరూపము పోయి (యొక్క లోపించిన రాముని అనుదానివంటి ద్వితీయాంతరూపము రామునిన్ అనునది నిల్చును. ఇట్లు చెప్పు టేల? ద్రుతము లోపింపఁజేయుటకా? ద్రుతము తప్ప విశేషవ లేదు. ఆ ద్రుత మెట్లును సమాసమున లోపింపవలసినదే. స్పష్టముగాఁ జెప్పి యొక్కస్థానమున ద్రుత మై యది సమాసమున లోపించు ననవచ్చు. దీ కంటె యొక్కయే లోపించు ననుసూరిమార్గ ముచితము కదా.

కావున షష్ఠికి ద్వితీయాతుల్యత విధించుపేరిలక్షణము సముచితము గా దనవచ్చును.

యొక్క-విభక్తి లోపించినషష్ఠియాకారము గలద్వితీయ వచ్చు ననఁగాఁ బరోక్షముగా వీరు షష్ఠిలోపము నంగీకరించినట్లైనది. యొక్క-విభక్తి లోపించినయాకారము సాధించుచో నది ద్వితీయగాఁ జెప్ప వీలగు? యొక్క-విభక్తి లోపించినయాకారమును సూరి చెప్పెను. వీ రదే ద్వితీయగాఁ జెప్పిరి. ప్రయోజన మేమి? ద్వితీయ యనువిశేషకల్పనమువలన ద్రుతలోపరూప మైనప్రక్రియాగౌరవము గల్గినది. ఈపక్షమున నయినను నీయవి షష్ఠ్యలుక్సమాసము లగుట యన్నది సముచితముగా సిద్ధించుట లేదు.

ఈమార్గమున -రామునియొక్క- అనుదానిస్థానమున రామునిన్ అను నది నిల్చును. 'ఇందునిగాగమము గల్గదు. ద్వితీయాప్రత్యయము లోపింపఁగా దానిద్రుతము నిల్చినది' (పు.104) అనువీరివివరణము ననుసరించి యిట నివర్ణమును ద్వితీయావిభక్తిగా సమన్వయింపనవసరము లేదు. మఱి యీసమాసమున షష్ఠి యేరూపముతో నిల్చియున్న దని దీనిని షష్ఠ్యలుక్సమాస మందురు?

ఇట్లే బహుత్వమున రాములయొక్క- యనుచో రాములన్ అని కావలయును. వీరు సూరివలెనె ద్వితీయాదివిభక్తులకు బడాగమము చెప్పిరి. చిం.వలె 'ల'వర్ణము ద్వితీయావిభక్తిగాఁ జెప్పలేదు. అట్టియెడల రాములన్ అనుచో (షష్ఠ్యర్థక) ద్వితీయావిభక్తి నిల్చియుండు టెక్కడ? నిల్చిన రాములనున్ అని కావలయును. రాములను గుణము లనురీతిరూపము లుండదు. కాన నిట ద్వితీయావిభక్తి లోపించు నవి యెట్లును జెప్పకతప్పదు. సీతశక్తి యిత్యాదుల నిట్లే. అట్టియెడల షష్ఠి ద్వితీయారూపము నందిన నది నిలువలేదు గావున నీయవి షష్ఠ్యలుక్సమాసము లగుట యసంభవము. బహుత్వమునను, నేకత్వమున ద్రుమంతేతరస్థలములను నీయలుక్సమాస వ్యవహార మసలు గుదురకుండఁగా వఝులవారివివరణమునుబట్టి యేకత్వమున ద్రుమంతములయెడను నయ్యది గుదురదు. అచ్చికద్రుమంతములయెడ

విభాగమము నిత్య మగుట నటను గుదురదు.

కాఁగా పయులవారు వీనిని షష్ఠ్యలుక్సమాసములుగాఁ జెప్పుట పొరపాటవక తీఱదు. చిం. ద్వితీయతో విభాగమము చెప్పలేదు. బహుత్వమున అవర్ణము ద్వితీయావిభక్తిగాఁ జెప్పినది. కావున నట నలుక్సమాసములుగాఁ జెప్పుట కొంతవఱకు కేని సరిపడు నేమో. కాని వీరు చిం.బాల.విధానములు రెంటిని గలుపుటచే ననర్థములు గల్గిన వనఁదగును. కాఁగా దీనిమూలమున పయులవారు షష్ఠికి ద్వితీయాతుల్యత విధించుట తగ దని నిర్ణయింపఁ దగును.

తమవిధానమున నొకలోపమును వీరే స్పష్టము చేసిరి. 'సీనాబాదున శబ్దములపట్ల ద్వితీయాకాదస్థితి ప్రయోగవిరుద్ధము గాన షష్ఠీసమాసములతో నేకత్వమున సీనాతనశబ్దములను (మనశబ్దము నిత్యబహువచనము గాన నిటుఁ జెప్పుటుంట యుచితమె.) బహుత్వమున మీమాతమమనశబ్దములు విభ్బ నని వ్యాఖ్యచేయవలయును. సీగుణములు మీగుణములు' (చూ.280)

ఇట్లని యేసూత్రమునకు లేదా పైసూత్రములోనియేభాగమునకు వ్యాఖ్య చేయవలయునో యందుల కాధార మేదియో కూడ వీరు పేర్కొనన్నలే గుంటెడిది. ప్రయోగముల ననుసరించి వ్యాఖ్య చేయుట తప్పనరాదు. కాని ప్రయోగానుగుణ మగులక్షణమును దిరస్కరింప నేల? ప్రయోగములకు భిన్నముగా లక్షణము చెప్ప నేల? అలక్షణమున సాధారము లేకుండ వ్యాఖ్యానింప నేల యని సందేహము.

దీనినిబట్టి షష్ఠికి ద్వితీయాతుల్యత యనువిధానము తెలుఁగునకు సరిపడ దనక తప్పదు. యొక్క లోపించినషష్ఠ్యంతశబ్దముతో ద్వితీయాంత రూప మాకారమున సమానమైయుండుస్థలముల మాత్రమె ద్వితీయాతుల్యత సరిపడును. నా ప్రభృతిశబ్దములకు షష్ఠిలో నాయొక్క మాయొక్క యను రీతి రూపము లుండఁగా ద్వితీయయందు నన్నును మమ్మును అనురీతి రూపము లుండును. నాశక్తి యనునర్థమున ద్వితీయాతుల్యతచే నన్నుశక్తి

యని కావలె. ఇట్లు వైషమ్య ముండుటచేతనె ద్వితీయ తుదులకే దనుట స్పష్టము కదా. అట్లని సంస్కృతవిభక్తులు లోపించి ప్రాతిపదికమై నిల్చునటకును వీలు లేదు. నాసికశబ్దములఁ బ్రాతిపదికమై నిల్చునట్లు కన్పించును. (యొక్క లోపించినషష్ఠి యట్ల యుండును గావున) తా ప్రాతిపదిక ద్వితీయలోఁ దన్మున్ తమ్మున్ అనియు షష్ఠిలో తనయొక్క తమ యొక్క యనియు నుండును. తనగుణ మనుచో ద్వితీయాతుల్యతయె కాదు. ప్రాతిపదిక (తా) కూడ నిల్వదు. ఇంక యొక్క లోపించిన షష్ఠ్యంతరూపమె తన(యొక్క) తమ(యొక్క) నిల్చును. అనఁగా విశేషణతత్సమాసమున నవ్వునది యొక్కవిభక్తిలోపమె కాని ద్వితీయాతుల్యతయో మఱియొకటియో కాదు. కావుననె సూరి ౭౦.తల పెట్టినయట్టిమార్గము ననుసరింపక లక్ష్యాను గుణముగా సామాన్యముగ విభక్తిలోపమును జెప్పెను. అదియె యుచిత మని స్పష్టము. ప్రయోగవిరుద్ధ మని (స్వీయ)లక్షణమునకు భిన్నముగా వింతయర్థములు గల్పించుకొనవలసినయవసరమును దప్పెను. కాఁగా వీరి ద్వితీయాతుల్యతావిధాన మనుచితము గా దని నిర్ణయింపఁదగును.

పిదప వీరు సూత్రమున 'ఇది సమాసకములందును వర్తిల్లు' నని చెప్పిరి. సమాసక మనుసంజ్ఞను వీ రెచ్చటను సూత్రముచే విధించినజాడ లేదు. వివరణమునఁ దెల్పిరి. అనుక్తన్యాయమునఁ ౫౦.నుండి గ్రహింపఁ దగు నని వారియభిప్రాయము గానోవును. ఏ పైన సమాసక మన నాచ్ఛిక సమాసము. సమాసక మన్నది విశేషసంజ్ఞయె. దీనికి సమాస మనుసామాన్య సంజ్ఞ యొట్లును గలదు. అట్టియెడల సమాసకమున షష్ఠికి ద్వితీయాతుల్యత గల్గుట ప్రత్యేకముగాఁ జెప్పవలసినయవసర మేమి? సాధారణముగనే షష్ఠీతత్పురుషమున షష్ఠికి ద్వితీయాతుల్యత యగు నని చెప్పఁజాలరా? ఒకే కార్యమును సాంస్కృతికమిశ్రసమాసముల కొకసారియు నాచ్ఛికసమాసముల కొకసారియు వేఱుగా విధింప నేల?

సమాసకములం దిట్టివిధాన మనవసర మగుటయు పదములవారి వచనముల విరోధములును ౧౨౮.లోఁ జూడఁదగు.

పిదప సూత్రమున 'మధ్యమపదలోపాదిసమాసములందును నీ:
వ ర్తిల్లుట గల దనిరి. జవ్వాదియొక్క సెట్టి (జవ్వాది నమ్మెడిసెట్టి) జవ
దిన్ + సెట్టి జవ్వాదిసెట్టి - (పు.280) మధ్యమపదలోపిసమాస మను
యొక్కను జూపెడ దేమి? ద్వితీయాతుల్యతకా? లోపించినమధ్యమపద:
యొక్క యర్థమునందు యొక్క యయినదా? ఎట్లయినను యొక్కవిని
టచే నిష్పత్తి షష్ఠీసమాసమె యగును గదా. ప్రత్యేకముగాఁ జెప్పుట య
వసరము కాదా?

జవ్వాదిన్ (అమ్ము) సెట్టి - మధ్యమపదము లోపించి జవ్వాదిసె
ద్రుతము లోపించి జవ్వాదిసెట్టి యనురీతిగాఁ జెప్పఁదగును గదా. ఆ
యెడల షష్ఠి లేమి ద్వితీయాతుల్యత యను ప్రశ్నయే లేదు. (ఇట్టివి సు
బాల.లోఁ ప్రస్తావింప లే దనిపించు.)

పై రెట్లు షష్ఠిగాఁ జూపుటవలననే 'ఇరువదిటియొక్క అయిదు ఇ
వదియయిదు. ఇట్టియెడల సౌపవిభక్తికములబాహుళ్యముచేత టింటులు రా
ప్రథమ నిల్చె నని యెఱుంగ నగు' - (పు.280) ప్రథమయే నిల్చినపు
టింటుల బాహుళకముచే వారింప నవసర మేమి? పోవ. ప్రథమావిభక్తియే
దును నగునా? ఇట షష్ఠికి ద్వితీయాతుల్యతకు బదులుగాఁ బ్రథమ యైనది
లక్షణమున నవకాశము లేకున్నను ప్రయోగములకు విరుద్ధ మైనచో
ట్లయిన వ్యాఖ్య చేయవచ్చు నని వీరు సనాతనాదిశబ్దములప్రసంగము
సూచించిరి కదా.

'శాకముయొక్క పార్థివుఁడు (శక్తిప్రియుఁ డగుపార్థివుఁడు) శా
పార్థివుఁడు, (పు.280) ఇందు లోపించినమధ్యమపద మేమియో స్పష్టమ
గాకున్నది. అయినను యొక్కతో సమన్వయము గమనార్హము. శా
ప్రియః పార్థివః అనురీతిగా (పు.251) దీనిని వీ రింతకుముందు సిద్ధసమ
సముగాఁ జెప్పిరి. ఇట సాధ్యసమాన మయినది. (అయిన నిట్లె రామ + శ
రామకృష్ణ యనుతీరుగా సిద్ధసమాసములను గూడఁ గొన్నింటి విచట

జ్ఞాపితము చేసి సాధ్యములుగాఁ జెప్ప నగు నేమో.)

మోహముయొక్కతమ్మి- మో మనెడితమ్మి (ఉ.280) ఇట్లు (ఉపమానపూర్వపద)కర్మధారయములందును యొక్కషష్ఠితో పీరు ద్వితీయాతుల్యతను జెప్పుట విశేషమె.

ఇచట యొక్కతో సమన్వయము కేవల మసహజ మైయుండుట గమనింపఁదగును. కాఁగా సూత్రమునఁ జెప్పనమధ్యమపదలోపాదులద్వితీయాతుల్యతా వివరణ మనవసర మని గుర్తింపఁదగు.

పిదప సూత్రమున 'షష్ఠ్యర్థకదివిదుప్రత్యయపరకత్వమందును (కార.19)ద్వితీయయే నిల్చును' అనిరి. ఇట్లు చెప్పుట యవసరమా?

'ఈడివిప్రత్యయములు పర మగునపుడును తన అను తద్ధితప్రత్యయము పర మగునపుడును బూర్వావయవ మగుప్రకృతి (షష్ఠీతత్పురుషపూర్వావయవమువలె) ద్వితీయావిభక్తిరూపమున నిల్చును' (కార.19) అని యీ విషయము నింతకుముందే కారకపరిచ్ఛేదమునఁ జెప్పిరి. కాఁగా నిది పునరుక్తి యగును.

దివిదు అనునవి షష్ఠ్యర్థకప్రత్యయము లనిరి. కుయొక్కదివిలోపల షష్ఠీవిభక్తి (తత్స 6) అని పీరు డి.వి.అనువానిని షష్ఠీవిభక్తులుగానే పేర్కొనిరి. ఈనామవిభక్తులు ప్రాతిపదికములపైఁ గదా నిలువవలసినది. (ఉ.53) అట్టియెడల నివి పర మైనపుడు ద్వితీయయే నిల్చు నని చెప్పెద రేమి?

కార.19సూత్రమునఁ బూర్వావయవ మగుప్రకృతి ద్వితీయావిభక్తి రూపమున నిల్చు ననిరి. ప్రకృతి విభక్తిరూపమున నిల్చుట యెట్లు? కావునఁ బ్రకృతి ద్వితీయావిభక్త్యంతరూపమున నిల్చు ననవలె. ఇట్లనుటలో నిచట

షష్ఠికి ద్వితీయ యగుట లేదు. ప్రకృతి షష్ఠ్యంత మైనపుడు నా షష్ఠికి ద్వితీయావిభక్తి యగు ననుట లేదు గదా వీరు. ప్రస్తుతస్థలమునను షష్ఠ్యర్థకదివిదులు పర మగునపుడు ద్వితీయ షష్ఠి కగునది గా దన్నమాట. (షష్ఠ్యర్థకములు దివిదులు కావున దానికి ద్వితీయ కావలె. వాని పరకత్వమున నగుట కుదురదు.) కాఁగా నిట షష్ఠి పరకత్వమున ద్వితీయయే కాని, షష్ఠికి ద్వితీయాతుల్యత లేదని వఝులవారివచనములఁబట్టియె స్పష్ట మగుచున్నది. కావున వఝులవారిదివిదులప్రసంగము నిచ్చోటఁ జేయుట తగ దనుట నిశ్చయమె కదా. ఈవివరణము నిట ననవసరమె కాక యయుక్తము నైనది.

ఇంక నీలక్షణమున మిగులునది యేమి? 'సమాససామాన్యమున షష్ఠికి ద్వితీయాతుల్యత యగుట' యన్న దొక్కటియె. అదియు నసంగత మని పయిని స్పష్ట మయియున్నది.

కార.19సూత్రమున వీరు సంబంధార్థమున యొక్కప్రత్యయమును జెప్పి యయ్యది లోపించు ననియు నెచ్చటను నిలువ దనియు స్పష్టము చేసిరి. వ్యస్తతలోఁ గూడ యొక్క నిల్వదు. వచ్చినచోట్ల నెల్ల లోపించును. సమాసములందు లోపించు ననుట మాత్రమె సరి గా దని వీరియభిప్రాయము. అట నది ద్వితీయాతుల్యరూపము నంది నిల్చియే యుండును. అలుక్సమాసము లగుటకు బహుశః యొక్క లోపించిన వ్యస్తస్థితికిని నిచ్చటిసమస్తస్థితికిని భేదమును జూపుటయు నవసర మేమో.

ఇట్టి వీరు షష్ఠీసమాసమునందచ్చు పర మగునపుడు ద్వితీయాతుల్యరూపమునందలియుత్తునకుఁ బైని ద్రుతము లోపింప దని మాత్రము చెప్పినఁ జాలెడి దేమో ద్రుతమును జేసి దానిని లోపింపఁజేసి పుంబుల నాగమము చేయుట విశేషమె. సమాసకములందును ద్వితీయాతుల్యత చెప్పిరే కద.

ఏ మైన నీవిధానము లక్ష్యములసామాన్యలక్షణమును సరిగాఁ బ్రతిబింబింపఁజేయుట లే దనక తప్పదు.

## సమాసకమం - విభక్తిలోపము :

వీరు షష్ఠీతత్పురుషములందు ద్వితీయాతుల్యత దప్ప సమాసకము లందును విభక్తిలోపమును విధింపలేదు. చిం. 'లోపశ్చవిభక్త్యాదేః' అని చెప్పినదానిం గూడ వీ రిట విడిచిపుచ్చిరి. చిం., బాల. ఈ రెండింటికిని భిన్న మగుమార్గమును వీ రెన్నుకొని రన్నమాట.

లోపశ్చ యనుచిం.సూత్రము సంస్కృతవిభక్తులకే లోపము చెప్పు చున్న దనితలంచుటచే వీ రీలోపము సంస్కృతవ్యాకరణము ననుసరించియే చేయందగు ననిరి. 'ఏతత్సూత్రవిధానసామర్థ్యముచేతనె (ద్వితీయాతుల్యతా విధానము) సమాససామాన్యపద్ధతిచొప్పున నలౌకికవిగ్రహమునందే సమాస సంజ్ఞ గల్గి రాజయానమున్నగుననిష్టరూపములు గల్గనేరవు. ఇట్టిస్థితిలో నితర తత్పురుషములందు విభక్తిలోపమునకు విధియే లే దనుట స్పష్టమె కదా' (పు.279) యనిరి. ఈచివరివాక్యము దొంగవలనభయము దొంగభయ మను సూరిలక్ష్యము సరి గాదనుట కుద్దేశించినది. ఇతరతత్పురుష మన మిశ్రసాధ్య సాంస్కృతికతత్పురుషము. సమాసకముల నెల్లెడ విభక్తిలోపము గలదు. దొంగభయము కని వీర చూపిరి. కాఁగా సమాసకములందు సిద్ధసమాసములందు వలెఁ దెలుఁగున గూడ నలౌకికవిగ్రహమునందె విభక్తి లోపము గల్గు (పు. 243) నని వీరినిర్ణయము.

అనుక్తమన్యశబ్దానుశాసనవత్ అని సంస్కృతవ్యాకరణము నాశ్రయించి విభక్తి లోపింపఁజేయుట దుష్టము గాకపోవచ్చును. కాని తెలుఁగు సమాసమున విభక్తిలోప మవుట గుర్తించుచు, లోపశ్చ యని చిం. ప్రత్యేకముగా లోపమును విధించియుండఁగాఁ దమవ్యాకరణమునఁ జెప్పకుండుటయుఁ, జెప్పలేదు గావున ననుక్త మగునీయంశము సన్య(సంస్కృత)వ్యాకరణముచే గ్రహింపవలయు ననుటయును సక్రమమా? సంస్కృతవిభక్తికే లోప మిష్ట మయిన దానిని విధింపరాదా?

చిం. సంస్కృతవిభక్తులకే లోపము చెప్పె నను టెట్లు? బా.వ. ప్రభృతులు తెలుఁగువిభక్తులకే లోపము చేసిరి. షష్ఠికి ద్వితీయాతుల్యత యను

చోఁ దెలుఁగులుగా సమన్వయించి విభక్తిలోప మనుచో సంస్కృతవిభక్తి లోపముగాఁ జెప్ప నేల? వీరివలె నలౌకికవిగ్రహము మొదలగుప్రక్రియయే యుద్దేశించిన చిం. మఱల విభక్తిలోపము నేల చెప్పును? స్వస్వవిభక్తి వికారైర్బహవశ్చయథాయథం సమస్యన్తే- యన్నది గదా చిం.

జవ్వాదిని అమ్ము సెట్టి యనుచో జవ్వాదియొక్క సెట్టి జవ్వాదిసెట్టి యనువరుసలహారిసమన్వయము సరి గా దనుట స్పష్టము. జవ్వాది అమ్ము సెట్టి యని యుంచి 'అమ్ము' మధ్యమపదమును 'ని' ద్వితీయావిభక్తియును లోపించి జవ్వాదిసెట్టి యని యగు నని చెప్పుట యుక్తమా లేక జవ్వాది+ అమ్ అమ్ము సెట్టి+సు అని యుంచి ప్రక్రియ నడపు టుచితమా?

## గోఁగునార:

రేఁగు గోఁగు 'దీని రేకత్వమందలిపాక్షికగుజ్ఞన కాంధ్రభాషార్ణవము మాత్రమే యాధారము గోఁగునార మున్నగునవి యేకత్వగుజ్ఞసాధకము లనరాదు. గోఁగులయొక్క నార గోఁగునార రేఁగులయొక్క మ్రాను రేఁగుమ్రాను అని విగ్రహము సెన్న నగును. వేల్పుటావు. వేల్పుమ్రాను మున్నగునవి లేవా? (ఉ.164) యనిరి. ఇది వీ రనుసరించినయేపద్ధతిప్రకారమును సిద్ధింపదు.

ఇట షష్ఠికి ద్వితీయాతుల్యత చేసినః గోఁగులనార, రేఁగులమ్రానని యగును. లవర్ణము నిల్చియుండవలెఁ గదా. కావుననె వీరు వేల్పుమ్రాను వేల్పుటావు అనువానివలెఁ జేయఁదగు ననిరి. కాని యాపక్షమున వేల్పు+ఆమ్, మ్రాను+సు అనురీతి నలౌకికవిగ్రహముతో గోను+ ఆమ్+నార+సు అని యుంచి విభక్తిలోపము చేయఁగా వేల్పుమ్రాను అనుతీరుగా గోనునార (ఇట్లే రేనుచెట్టు) యని యగును. గుజ్ఞగుట యెట్లు?

వీ రేకత్వమునఁ గూడ గుజ్ఞనంగీకరించినను నలౌకికవిగ్రహముతోఁ

ప్రాతిపదికమాత్రమె నిలువవలయును గావున గుణాదివికృతు లగునవకాశమె లేదు. కాన పై రేపద్ధతి ననుసరించినను గుణతోడిరూపములు సాధింపఁ జాలరు.

అట్లు గాక గోఁగు + అమ్ అని చూపుదురా? వాఁడుకరీతిరూపము లేర్పడుటకు ముందే యలౌకికవిగ్రహముతో అప్పుడుపుఁ దని యవ్విధముగా నిట గోఁగునార అని సిద్ధించుటకై గుజ్జు వచ్చినపిదప అమ్విభక్తి లోపించు నందురా? అది సక్రమము గాదు గదా. ఇట్లైన ఇంటి + జన్ అల్లుఁడు ఇంటియా లగుఁ గాని ఇల్లాలు గాదు. పీగుణము లిత్యాదులఁ బ్రయోగాన గుణముగా న ట్లుండు నని చెప్పుకొన్నచో యిచటను జెప్పుకొను టొక్కటె మార్గము. కావున వేల్పుటావు, వేల్పుఁద్రిమ్మరు మున్నగునవి యున్నను వానితో గోఁగునార రేఁగుచె ట్టనువీనికిఁ బోలిక లేదు.

సంస్కృతవిభక్తులకు లోపము చెప్పుటచేతనె పీడ సమాసకమందును షష్ఠికి ద్వితీయాతుల్యత గొన్నియెడలఁ జేయవలసె. వేల్పుటావు, కన్నుంగవ ఇత్యాదుల విభక్తిలోపమన్నను తమ్మునికొడుకు కొడుకులబిడ్డలు మున్నగుచోట్ల ద్వితీయతుల్యత తప్పదు. సమాసమునఁ బూర్వపదము ప్రాతిపదికార్థమున నిల్చిన విభక్తిలోపమును షష్ఠి లోపించినశబ్దమువంటి యాకారముతో నున్న ద్వితీయాతుల్యతయుఁ జేయవలె నని చెప్పవలెను. వీనికంటె తనప్రభృతులకు మఱలఁ బ్రత్యేకవ్యాఖ్యాన మవసరము. ఇన్ని కృత్రిమకల్పనములకంటె నన్నింట సామాన్యముగా నున్నయొక్క విభక్తి లోపముగా నెల్లెడల నాంధ్రవిభక్తులే లోపించినట్లు చెప్ప టుచితము గదా.

అమ్మ(యొక్క) మాట, తమ్ముని(యొక్క) కొడుకు, ఇంటి (యొక్క) వెలుపల మున్నగురీతిగా నీసమాసము రూపములను బరిశీలించిన యొక్క లోపించుటయుఁ దన్నిమిత్తకముగాఁ బ్రాతిపదికకు వికారములు

వచ్చినవి నిల్పుటయు స్పష్టముగా గమనింపఁదగును. కన్నుంగవ, గోఁగు నార, వేల్పుఁబ్రమాను ఇత్యాదుల జాతినిబట్టి యేకవచనముతో నిరూపములు సులభసాధ్యములే యగు. ఇట్లు సముచితముగా గ్రహించినసూరిప్రణాళికను విడిచి వీ రేల యిన్నికృత్రిమమార్గముల నెన్నికొనిరో తెలియకున్నది. చిం.వీ.వి.లకుభిన్నమే యైనను లాఘవాదిప్రయోజనవిశేషముల ననుసరించి సూరిమార్గము స్వీకరింపవలసియుండఁగా దానిని తిరస్కరింప నేల? అట్లు తిరస్కరించుటకుఁ దగినప్రమాణములు లేకుంటయు గమనించితిమి గదా.

ఇంక నీసూరిపక్షమున షష్ఠీతత్పురుషములందును నుత్తరపదవిభక్తి లోపించి సమాసప్రాతిపదిక సిద్ధించుచుండఁగా, పూర్వపదషష్ఠికి ద్వితీయా తుల్యతామాత్రముచే (ఉ 279) నుత్తరపదవిభక్తి లోపింపకపోవుటయు మధ్యమపదలోపాదిసమాసములఁ గూడ షష్ఠితో నిల్చి సమన్వయించుచుఁ దెలుఁగున సమాసములు పెక్కింటి కిట్టిస్థితి కల్పించుటయు సమంజసములా?

## వైరిసమాసములు:

వీరు సంస్కృతవిభక్తులకు లోపము చేయుమార్గము నెన్నుకొనుటచే వైరిసమాసవివరణమునఁ గొంతవిరోధ మేర్పడినది. ఆంధ్రవిభక్త్యంతము గానిసంస్కృతశబ్ద మాచ్ఛికశబ్దముతో సమసింపదు. అనేకమాఱులు అల్ప దండులు, ఇల్లిదపుఁబురుషుడు మృదుబట్ట మొదలగునవి యసాధువులు. (ఉ.284) వీరు మిశ్ర(సాధ్య) సాంస్కృతికసమాసముల జ్ఞాపకసిద్ధములే కాని (షష్ఠీతత్పురుషము దప్ప) ఇతరము లంగీకరింపరా దని సూత్రించిరి. కావున వీరిపద్ధతినిబట్టి యీవివరణ మనవసర మనవచ్చును.

అనేకము లై సమాఱులు అనుచో అనేక + జస్ మాఱు + జస్ అనునలౌకికవిగ్రహములో సమాససంజ్ఞ కలిగి విభక్తి లోపించుట గదా వీరిప్రణాళిక అనేకము లై నమాఱు అని యర్థము చేయునపు డాంధ్రవిభక్త్యంతమే యైనది. అనేకములు-మాఱులు అని సమాసమునాంధ్రవిభక్త్యంత

మగుట వీరిమార్గమున సాధుసమాసములయెడతె కుదురదు. వేఱ్ఱుటావు 
అనుచోఁ గూడ వేఱ్ఱు + ఆవు అఱ్ఱు + ను అనియే చూపవలెను.

ఇట వీరు 'బల్లిదపురుషుఁడు' అని యుదాహరించుట విశేషము. ఇందు బల్లిదశబ్దము సంస్కృతతుల్యమె కాని శుద్ధసంస్కృతము కాదు. 'పురుషుఁడు' వైకృతము గాదు. ఉత్తరపద మైనది. ఉత్తరపద మగుటచే దానిపై విభక్తులు చేరును గావున నది శుద్ధసంస్కృతముగా నుండుట యసంభవము (ఇంకను గర్మధారయమునఁ బూర్వపదము డుమంతము గా రాదని చెప్పిరి గానఁ బరపదమును శుద్ధసంస్కృతము గాకున్ననుసమాసము కుదరదు. బల్లిదమగఁడని యగునా, బల్లిదపురుషుఁడని యగుటకు? వీరు చూపినసూత్రముబట్టి యున్నదియు వీరి కర్మధారయసామాన్యలక్షణము నకు ననుగుణము గాదు. అందులకే సూరి అనేకములు అల్పదండు అను 'మువర్ణకాంతపూర్వపదములనే' యుదాహరించెను.

సంస్కృతవిభక్తులకు లోపము చేయువీరు చేసిన వైరిసమాసము వివరణము సముచితముగా సరిపడదు.

## వారణావంతమునవారు :

వారణావతమునవా రెల్ల (ఆది.6) మున్నగుస్థలములందు నవర్ణకము సప్తమ్యర్థకము కాదనియు షష్ఠ్యర్థకమే యనియు నట్టి వెల్ల షష్ఠ్యలుక్సమాసములె యనియు గ్రహింపవలయును. (ఉ.279) సప్తమ్యలుక్సమాసము లెట్లో జ్ఞాపితము చేయలేకపోరు. మిగిలినవానివలె. కాని వీ రెందుకో దీనిని షష్ఠ్యలుక్సమాస మనిరి. కాని సప్తమీనవర్ణకము లోపింపని మధ్యమపదలోపిసమాసములను నలుక్సమాసములుగ నెన్నఁదగును. కవల యంబునవారు, వారణావతంబునవారు (వ్యా.సం.న.1166) అనిరి. దానిం బట్టి యియ్యవి సప్తమ్యలుక్సమాసములు. ఇట షష్ఠ్యలుక్కు లైన వెట్లో.

అట్లు కావలయు నన్న వారణావతముయొక్క వారు, వారణావత

మయ్ వారు, వారణావతమువారు అని కాఁగా షష్ఠియందు నగాగమ మయి నట్లు చెప్పవలె. షష్ఠిలో నప్రత్యయము లేదు గదా. అయిన నిట షష్ఠి కయిన ద్రుతము లోపించియే పోయినది. ఆగమ మయిననవర్ణము షష్ఠిగాదు, ఇంక నిది యలుక్సమాస మగుట యెట్లు? ప్రౌఢ. షష్ఠీతత్పురుషమున నుగాగమము (సమా.1) చెప్పెను. కాని యది అలుక్సమాసప్రకరణమునని పేర్కొనె. దానింగూర్చి వజ్ఝలవారు 'ఎలజవ్వనంబునవిలసనంబు, జవ్వనంబునన్ కలుగువిలసనంబు అనురీతిని సప్తమ్యలుక్కులుగానే సమర్థింపనగును', (వ్యా.సం.స.118) అనిరి. అట్టియెడల షష్ఠీసమాసమున నగాగమ మయిన, దన్న ప్రౌఢ. మతము సరి గా దన్నవీ రిట మఱల నదేసమన్వయము చేయు టెట్లు? పైఁగా 'జవ్వనంబున విలసనంబు' షష్ఠీతత్పురుష మన్న ప్రౌఢ. నైతము వారణావతంబునవారు (సమా.37) సప్తమ్యలుక్సమాసముగాఁ జెప్పె. వీ రది షష్ఠ్యలుక్సమాసముగాఁ జెప్పుట విపరీతము.

నవర్ణక (ప్రత్యయ)మనుచునే యిది సప్తమ్యర్థక మనుట మఱియు వింత. షష్ఠియందు నప్రత్యయము లేదు. (రాదు) ప్రౌఢ. కూడ షష్ఠీసమాసమున నవర్ణము నాగమముగనె చెప్పె. వీరు ప్రత్యయముగాఁ గాని యాగమముగాఁ గాని నవర్ణమును విధింపనేలేదు.

ఏ మయిన వీనిని షష్ఠ్యలుక్సమాసములుగాఁ జెప్పుట తగ దని గుర్తింపఁదగును. షష్ఠ్యలుక్సమాసము లనువజ్ఝలవారిసమన్వయ మెట్టుటను సంగతముగా లే దని యింతకు ముందు గమనించితిమి.

## ఉపమానవాచకసమాసములు:

పిదప వివరణమున 'ఉపమానవాచకసమాసములను వేర్కొనిరి. ఇవి ప్రౌఢ. సమా. 38-43 మున్నగులక్షణములఁ జెప్పినయంశములు.

వీరు 'ఉపమానవాచకశబ్దములతోఁ దఱచుగా షష్ఠీతత్పురుషమె యుపమేయము ప్రథమాంత మై యున్నపుడు సంభవించు'(ఉ.280)ననిరి.

దీనికంటె షష్ఠి యగును' మన్నరీతిగా మన్న ప్రౌఢ.లక్షణమె యుచిత మనిపించుచున్నది. షష్ఠిని విధించినచోఁ బిదప నవునది షష్ఠీసమాసమె కదా. సమాసము చేయక తప్ప దన్న నట్లు వివరింపఁదగు.

అట్లు-కదళీ-శబ్దములును-ఉపమానశబ్దములతో షష్ఠీతత్పురుష మగు ను' (ఉ.281) ఇట్లన్నను ఉపమానము పూర్వపద మైయుండుటయు,అట్లు ప్రకృతము లుత్తరపదములె యగుటయు గుర్తింపఁదగును. బకునట్లు- ఇట వీ రింకను సూరి చెప్పనికొన్ని విశేషములు పేర్కొనిరి. (ఉ.281) ఇందుఁ జెక్కు-ంశములు ప్రౌఢ. పేర్కొన్న వగుట నాలక్షణములను స్మరించిన బా గుండెడిది. సం.లోఁ గల దని యిట నుపేక్షించి రేమో.

మొత్తముమీఁదఁ జినటకు సారాంశముగా సూరి సామాసికవిత్రి లోపము సమురిత మని స్మరింతము.





## కర్మాదులతో సమాసము:

'కర్మాదులకుఁ బ్రాధాన్యవివక్షయందు ధాతుజవిశేషణంబులు కర్త తోడంబలె వానితోడ సమసించు' (26) ననుదానిని యథాతథముగ గ్రహించిరి.



ఏతద్విషయమును 'కర్మధారయాభాస(ము)'గా సూచించిరి. స్యాత్ కర్మధారయాభాసః కర్తృత్వే కారకాశ్రితే' యను వి.వి.లక్షణము ననుసరించి వీ రిట్లు గ్రహించి రనఁదగు. [రాముఁడు] రక్షించినభృత్యుఁడు అనుచో విశేషణవిశేష్యభావము కుదురుపడమింజేసియే సూరి యీపమానమును ప్రత్యేకముగా విధించెను. పరులవారు నట్లే చేసిరి.

వి.వి. చెప్పినఅభాసబహువ్రీహికిని నాభాసకర్మధారయమునకును భేదము గలదు. 'పట్టుపుట్టమువాఁడు' [అభాసబహువ్రీహిః] బహువ్రీహి సమాసలక్షణములక్షితము కాదు. [ఉ.286] ఇటు నట్లుగాక సమాసము లక్షణలక్షితమె. అర్థమున భేదము గలదు.

వర్తులవా రిట చేయుచున్నవాఁడు, నల్లవాఁ డనురీతిగా విభక్తివివక్షలోఁ దచ్ఛబ్దానుప్రయోగము గల విశేషణరూపములను గర్మధారయాభాసములుగాఁ బేర్కొనిరి. కాని యివి సమాసములె యనరామింజేసి కర్మధారయాభాసము అను టొప్ప దని గుర్తింపఁదగును.

ఈ సూరిలక్షణమునుగూర్చి సం.లో నిట్లనిరి. 'సూరి- నన్నయాథర్వణులు తలంచినయీప్రయోగములలోనియనుపపత్తులను గ్రహించినట్లగపడదు. గ్రహించియున్నచో నవర్ణకాదులప్రాప్తిని మాత్రము విధించియుండఁడా? [వ్యా.సం.ప.1206] నవర్ణకాదులను విధించినచో సూరి నన్నయాథర్వణులయభిప్రాయమును గ్రహించినట్లు అనగా వారు సూత్రించినట్లుగనె సూత్రించినపుడే సూరి కవ్వారియభిప్రాయ మర్థ మయినట్లు. లేనిచోఁ గాదు. రక్షించిన మున్నగుధా.వి.లు ఏర్పడుటలో బాధ లేదు. అవి కర్మాద్యర్థముల యం దయినవి కావు గదా. కావునఁ గర్మాదులతో సమసించుటయె విశేషము. కర్త్రర్థమునం దయిన నిప్రభృతివర్ణకాంతములు కర్మాదులలో సమసించుటను సూరి విధించినదియ యుచితము. వర్తులవా రుద్ద్యోతమునఁ జిం.లో వలె నిట నవర్ణకాదులను దిరిగి విధింపక సూరిలక్షణమును యథాతథముగా గ్రహించుటచే ని దనౌచిత్యము లేమి వారు పిదప గుర్తింపఁదగును.

ఇది సమాసపరిచ్ఛేదము

# తద్ధితపరిచ్ఛేదము

**తనము :**

తనవర్ణకంబు ద్వ్యర్థంబునం దగు(1) సమసూరిలక్షణము స్వీ గ్రహించిరి.

సూరికంటె వీరిమతము భిన్నముగానున్న దనుగుణముగా వీరు షష్ఠికి ద్వితీయాతుల్యత చేసిరి. రాముని యొక్క — తన — యొక్క — విభక్తిలోపము — తో రామునితనము అనరీతి నున్న సూరిప్రక్రియలో రాముననిదానపూర్వమై స్పష్టము.

"ఇది కార. 19 సూత్రముచే జ్ఞాపితస్థల మగుటచే నీతనప్రత్యయము తత్సమములపైని నయితము నిల్చుటయు—" (వ. 300) అని వివరించిరి. ఇటు రామునితన మని యుదాహరించుచు సూరి యిది తత్సమములపై నగు టను స్పష్టము చేసెను.

వీరికార. 19 సూత్ర మిది తత్సమములపై నగుట నెట్లు జ్ఞాపితము చేయునో స్పష్టము కాదు. అట 'తన అను తద్ధితప్రత్యయము పర మగునప్పుడును బూర్వావయవ మగుప్రకృతి (షష్ఠీతత్పురుషపూర్వావయవమువలె ద్వితీయావిభక్తిరూపమున నిల్చును' అని చెప్పిరి. ఈలక్షణమునం దత్సమములప్రసక్తి యేమియు లేదు. ప్రస్తుతతద్ధి. 1. సూత్రముచే తనప్రత్యయము రాంగా నది పర మైనప్పు డాకార. 19 సూత్రముచే షష్ఠికి ద్వితీయాతుల్యత యగును. ఇటం గూడం దత్సమములప్రసక్తి లేదు. ఈసూత్రముచే నగునప్పు డు కార. 19 సూ. చే జ్ఞాపిత మగు నమునక్కయు లేదు గదా. కార. 19 సూ. చే విధింపబడినతనపరకద్వితీయాతుల్యత మనుమనియొక్కభావము మనుమనితనము (దొంగతనము) మున్నగుసాధ్వ్యర్థకశబ్దములయందు చరితార్థ మగు

చున్నదే కదా. తత్సమములు దప్ప గతి లేనిస్థలము గాదు గదా యని. సమాసకములలో విభక్తిలోపమును జెప్పినను షష్ఠీస్థలమున నాచ్ఛికములకును ద్వితీయాతుల్యతయే చెప్పఁబోవిరి. లేనిచోఁ దమ్మునికొడుకిత్యాదులు వీరివ్యాకరణముచే సాధ్యములు గావు గదా. కావున ఇది సమాసకములందును వర్తిల్లును. (ఉ.సమా.72)

ఇట్లు కార.19సూత్రమునఁ జెప్పినకార్యము తనపరకాచ్ఛికశబ్దముల యెడ సార్థక మగుటచే నాలక్షణముచే దత్సమములపైఁ దనప్రత్యయము జ్ఞాపిత మగుచున్న దని వరుసలవారు పేర్కొనుట సరి కా దనక తప్పదు. వీరు మిశ్రసమాసములను లెక్కించి విశ్లే నిరాధారముగా జ్ఞాపితములుచేయుట సరి కా దనియు నట సూరిమార్గమె యుక్త మనియు గుర్తించితిమి.

తనప్రత్యయము సంస్కృతాంధ్రసాధారణముగాఁ బ్రసిద్ధ మైయున్నది. ఇతరములు కొన్ని తత్సమములపై నసలు లేకుండఁగాఁ గొన్నియరుదుగమాత్రము గానవచ్చును. ఇట సామాన్యముగా విధించుట నిది సంస్కృత సమాచ్ఛికశబ్దములపై సాధారణముగనె యగు నని సూరి యుదాహరణములతోను స్పష్టము చేసె.

"గొప్పవానితనము-గొప్పవానితనము- గొప్పతనము (బా.సమా. 84సూ.తద్బుద్ధిలోపము.) (ఉ.300)సూరి ధా.వి.లపై మాత్రమె విభక్తి వివక్షలోఁ దద్బుద్ధ్యనుప్రయోగము మాత్రింపఁగా వీరు విశేషణములపై నెల్ల సాధారణముగ వివరించి (ఉ.289) యని కర్మధారయాభాసములుగాఁ జెప్పిరి. కావున గొప్పవానితన మనియును వీరు చూపిరి. ఇట సూరిమతమునఁ దద్బుద్ధియె లేమిఁ దల్లోపప్రసక్తియు లే దనియె చెప్పవలెను. గొప్పయొక్క తనము గొప్పతన మనియె చెప్పవలె. ధా.వి.లపైఁ గూడ నిట్లు. (చూ. త్రి.శే.) వీరు విభక్తికి-విభక్త్యాదులకు- ననురీతిని సూరిమతమునను దద్బుద్ధి లోపము చేయుట విచార్యము. (వ్యా.సం.వ.1265)

దులలో నిది యనిసూరి తలఁచిన ట్లాతనివివరణము స్పష్టము చేయుచున్నది. టీకాదులు రాని పక్షమందుఁ దన్ప్రత్యయం బన్నింటికి గను నసుదానికిముందే సూరి దీనిని జూపుట గమనార్హము. మగఁటిమి- మగతనము అనఁగా నిట సూరి యర్థము వివరించె నని వీరు భావించి రేమో. కాని చిన్నతీకము మొదల లగుపూర్వస్థలములం దిట్లు చెప్పెనా సూరి?

ఇది మగఁటిమ్యాదులలో వీరును జేర్చుకొనకతప్పదు. కానిచో మనుమనియొక్క భావము మనుమనితనము అని యైనట్లుగా నిచట మగనియొక్క భావము మగనితనము అనియే కావలయును. మగతన మని యొకపక్షమున నయ్యేడునవకాశము లేదు. సూరి మొదటిసూత్రమునొద్ద 'రామునితనము రాముతనము' నని రెండింటిని జూపెను. పిదప మనుమనితన మనుచో (రాముతన మనురీతిని) మనుమతన మని చూపలేదు. అనుదంత మగుటచే తెనుఁగునుమంతమునకు నిగాగమము నిత్య మవ్వుటచేతనె యని స్పష్టమే. కాఁగా నక్కడ యిట మగనితన మని మాత్రమె కావలె. మగతన మనుమాత్ర మేయగుటకు నివర్ణము తొలఁగించు టెట్లు? అందు కిది మగఁటిమ్యాదులలోఁ జేర్పఁబడినది. 'ని'లోపము మగఁటిమ్యాదిత్వముచేత సిద్ధించినది యని తాత్పర్యము. మనుమనితనము, తేనితన మిత్యాదుల నివర్ణము తప్పక నిల్చి యుండుటయు నిట్లు స్పష్టమె.

షష్ఠికి ద్వితీయాతుల్యత చెప్పుకొన్నవీరిమతమున నైనను ద్వితీయలో 'మగని' (మగన్) అని యుండుటకు వీలు లేదు. కావున వీరును దీనిని మగఁటిమ్యాదులలోఁ, జేర్చుకొనవలసినదే. కావున వీరు మగతనమును కుండలీకరణమునఁ జూపుట సరి కా దని నిశ్చయింపఁదగు.

దీనినిబట్టియె సూరిమతమున మిండతీకము మిండతన మనుచో మిండశబ్దము స్త్రీసమ మని గ్రహింపవచ్చును. లేనిచో 'ని'గాగమలోపము నకై 'మగతనము'ను మగఁటిమ్యాదులలోఁ జేర్చినట్లె మిండతన మున్నదియుఁ

జేర్పకతప్పదు గదా. 'ముష్టము' అని స్త్రీలింగపదమును మువర్ణకాంతముగాఁ జూపె. ఎల్లెడల నాయాగణములందలిశబ్దములను ప్రథమాంతములుగాఁ జూపుట స్పష్టమె. మూపవలయుటయు స్పష్టమె. అట్లే చిన్న - దొంగ - మిండ ఇత్యాదులును స్త్రీసమప్రథమైకవచనాంతములే యని గుర్తింపవలెను. మిండ చేరొక్కము మిండలు మొ॥ దీనినిబట్టి చిన్నశబ్దముపైఁ దన్పద్ధముతోఁ జిన్నదానియొక్క భావ మనురీతిని జెప్పుట సూరిమతము కా దని గుర్తింప వలయును.

మగఁటిమి యనుచో వఝలవారు 'మగ + ట్ + ఇమి' (వ్యా. సం.న.1273) అని చూపుటలో నచ్చుపొరపాటు గల దేమో. మగంటిమి యనియుఁ జూపుచు టకారమునకు ముం దఱసున్న చూపకుంట యెట్లు? 'మగాదిభ్యష్టిమిజాదయః' అని సూరి సూత్ర.లోఁ జెప్పినట్లు ఇట టిమిజ్ ప్రత్యయ మై 'ని'గాగమము లోపించిన దనఁదగు. ఇట్టియెడల సూరి 'మగటిమిని' సం.14సూత్రమునొద్దఁ జూపుట విచార్యము.

అగ్గలంపుఁదన మని సూరి యిట నుదాహరించుటను దిరస్కరించుచు వీరు [వ్యా.సం.న 1276,1266 మొ॥] తనపరకత్వమున పుంపులను నుగాగమమును రా వని చెప్పుట కవిప్రయోగవిరుద్ధ మని సంధి.35సూత్రమువద్ద గుర్తించియున్నారము. ఇట నథర్వణకారికను సూరి పొరపాటుగా నర్థము చేసికొనె ననువఝలవారియభిప్రాయ మసంజస మని యచ్చోటితిక్కనాదుల ప్రయోగములే నిరూపించినవి.

బా.సా.పే. 'కోమలశబ్దంబుపై ఇకప్రత్యయము గలుగ' - ననుటను దిరస్కరించుచు వఝలవారు "సంస్కృతకోమలశబ్దముపై నాచ్ఛిక మగు ఇకప్రత్యయ మగుటయు నట నపదాదిస్వరసంధి వర్తించుటయు నసంభవములు" [వ్యా.సం.న.1274] అనుట విశదము. కోమలముయొక్క భావ మనుచో సంస్కృతపదముపైఁ బ్రత్యయ మైన దనవలె. అచ్ఛికతద్ధితము సంస్కృతపదములపై నగుట యసంభవమా? 'నావెఁడు అను ప్రయోగ

మనుబట్టి నాడ వైకృత మనుకొనరా దనియుఁ గటిబంటి యను రీతిగాఁ దత్సమంబులపైఁ దెలుఁగుప్రత్యయములు నిల్పుట క్వాచిత్కముగ లేకపోలే (వ్యా.సం.స.601) దని చెప్పరే కదా. ఇది యట్టిద యన్న నిం దసంభవత్వ మేమి? అది గాదన్న కోపగాఁడు మెం॥

ఇట వీరు ప్రత్యయ మగుటనుగూర్చి చెప్పినఁ జాలెతుదానికిపదాది స్వరసంధి యగుటయు నసంభవ మనుట విశేషము. ప్రత్యయము వచ్చు నంతవఱ కంగీకరించిన నిఁక సంధి యగుటలో బాధ లేదు. అపదాదిస్వర పరకత్వమున సంస్కృతీయస్వరమునకు సంధి యగుటలో బాధ లేదు గదా. అట సూరి 'అర్థ + ఇంచు – అర్థించు, నిర్జి + ఇంచు – నిర్జించు' అని యుదాహరించియే యుండెను. కావున నీపక్షము కేవల మసంభవ మనరాదు. వేఱే దేని గారణము చూపవలె.

ప్రౌఢ. పేర్కొన్న నాయఁకరము (తద్ధి.12) ఒంటి. (తద్ధి.15) యను వానిని వచ్చులవా రిటనే మగఁటిమ్యాదులలోఁ జేర్చుట యుచితమె యన్నఁ దగును. ఇందు లాఘవమును గలదు. ప్రౌఢ. స్పష్టము చేసె.

## స్వార్థికపంచులు :

బాల. తద్ధి. 9,10సూత్రము లట్లె గ్రహించిరి. (ఉ.9,10సూ) మెలఁత యనుచో "మెలఁత అనఁదగును' (ఉ.303) అనుటలో సూరి మెల్త యని చూపుట పొరపా టని తలఁపరాదు. దానిని పింగళి వేర్కొనిరి. చిఱుతాదులలో మెలఁతశబ్దముతోపాటు 'మెలుఁత' యనుశబ్దమును గల దనియే వచ్చువారి యుద్దేశ్యము. 'మెలఁతుక మెలుఁ తుక' యని వ్యా.సం.స.(1276)లో వీరిరెండింటిని జూపిరి. కావున నిట వివరణమున 'మెలుఁత' యనుపదముఁ జూపిన సరిపోయెడిది. 'మెలుఁత' యనఁదగు' ననుట వలన నపార్థమునకవకాశము గల్గినది.

ఇటఁ ప్రౌఢ. లోని స్వార్థికములు చూపిరి. (ఉ.తద్ధి.12–26)

బాల.తద్ధి.11,12సూత్రము లట్లు గ్రహించిరి. (ఉ.17,18సూ)

"కాగాప్రత్యయాంతములకుఁ బుంలింగసమత్వముచేతనె డు జ్జగు' (ఉ.30.4) ననిరి. కాప్రత్యయాంతము మగాదులలోని దనుసూరిమత ముచితముగాఁ దోఁచుచున్నది.కాన బుంలింగసమత్వముచేతనె డు జ్జగు నను వరుల వారివివరణము సమంజసమే.

కాని సూరి 'కాప్రత్యయాంత' మనఁగా వీరు 'కాగాప్రత్యయాంతము' లని 'గా'వర్ణము నధికముగాఁ జూపుట సమంజసము గాదు. 'కాఁడుర్గాడుఁ' అని వి.వి. కా,గాప్రత్యయములుగా వీనిని భిన్నములుగాఁ జెప్పినను వీరిటు సూరికివలెనె కాకత్తియులకకారమునకు గకారము చెప్పి 'గా' యనురూపమును సాధించిరి. కావున 'గా'యన్నది 'కా'కంటె వే ఱగుప్రత్యయము గాదు గదా. కాన వీరు వివరణమునన్నైనను భిన్నముగాఁ జూపుట సరి కాదు. కాప్రత్యయాంతమున కని చెప్పినను అంధగాఁ ఇత్యాదులకును బుంలింగసమత్వమువలన డుజ్జు రాకపోదు గదా.

"కాఁడుర్గాఁడుర్పేడీఁడుఃఅనునథర్వణవచనముచొప్పున గత్వము బే దనఁజాలము గాని యట్టిగకారమునకుఁ బ్రాసాదిగతప్రయోగము దొరకలేదు' (ఉ.304)దీనినిబట్టి యథర్వణుఁడు చెప్పఁబట్టి యంగీకరించిరి గాని కానిచోఁ 'బ్రాసాదిగతప్రయోగములు లేమిం జేసి యితరస్థలములం దున్నగత్వము కవిప్రయుక్తము గా దనియు [ముద్రణసంస్కర్తలె యట్లు దిద్ది రనియు] కవు లట్టిచో నందకాఁ దనురీతిగనె ప్రయోగించి రనియు నిర్ణయించి చెప్పెడివా రనవచ్చును. [వ్యా.సం.న.1287] 'కత్తియ నథర్వణుఁడు చెప్పలేదు. అయ్యు 'గాఁడు'అనుదానిసామాన్యమున నేని కత్తియలోను గత్వమును వరులవా రంగీకరించు టుచితముగ నున్నది.

అన్న మీతండ్రి కోపగాఁ డౌనా కాఁడో [కాశీ.4.60] మున్నగు ప్రయోగములనుబట్టి యీకాకత్తియవర్ణము లరుదుగా సంస్కృతశబ్దముల మీఁద నిల్చుటయుఁ గల దని కొందఱయాశయము. ఇట్టియెడల కోపకుండు

అనునది కవిప్రయుక్తపాఠ మనుట యుక్తము". (ఉ.305) ఇట్లు కవిప్రయోగములను దిద్ది యివియే కవిప్రయుక్తము లనుటకంటె సవ్యాని వట్లె విశిష్టస్థలములుగ నేని గుర్తించుట యుచితము.

'సంస్కృతశబ్దముల మీఁద నిల్చు' ననువరుఘలవారివచనమున నభిప్రాయ మస్పష్టము. 'కోప' అనుసంస్కృతశబ్దముపై 'కా' తెలుఁగు ప్రత్యయ మగుటలేదు. అందము + కా ఇత్యాదులవలె కోపము గలవాఁ డనునర్థమున కోపముశబ్దముపై కాప్రత్యయ మయి కోపము + కా అని యుండఁగా విభక్తి లోపించి కోపకా- అని యగును. ఇట 'కోప' యనుదానిపై నె కాప్రత్యయము నిల్చియున్నను ముకోపముచేఁ గోపశబ్దము సంస్కృతసమ మనుట యుచితము గదా. ఐహాంశపై నివరుఘలవారి యభిప్రాయ మదియ యగు నేమో.

వ్యా.సం.స.లో కోపకాఁడు, కోపకత్తె యనువానికిఁ బ్రయోగములు చూపి కవిప్రయుక్తము లనుచు సవ్యాని నిం కొకతీరుగా నూహించియుఁ బిదప 'కాని' తిక్కయజ్వయె తత్సమముపై 'కా'ప్రత్యయమును బ్రయోగించియున్నాఁడు. ఆమిషము గాలకాని కెట్లట్ల (అను.5.256) (వ్యా.సం.స.1289) ఇట్లనుచునే పిదప నిది యూహ్యక మనిరి.

గాలమువిషయమునను నిట్లె సూ.ని.అభిప్రాయమును బరామర్శించుచు పాం.లో 'గాలము'ను బ్రత్యాఖ్యానించుచు "ఆమిషము గాలకాని కె ట్లు (అను.5.256) అనుచో "సోమయాజిప్రయోగములోని'గాలకాఁడు' అనుచోటు కాప్రత్యయము తత్సమములపై నైతము నిల్చు నన్నపక్షము చొప్పున వర్గాని కౌచ్ఛికత్వము నంగీకరింపకతీర దనరాదు కదా -- పయి సందర్భమును బట్టి 'గాల' యనుధాతు వౌచ్ఛికము అగునంగలాదులలోఁ బఠించుట సరి కా దని తోఁచుచున్నది' (వ్యా.సం.స.1554,5మో॥)యనిరి.

గాలమువిషయము పిదపఁ జూతము. వీరివివరణముచొప్పున ఇటఁ

రికర్తన 'గాలకాఁడు' అనుచోఁ దత్సమముపై 'కా' ప్రత్యయము చేసె నని యుఁ దెల్పనుట స్పష్టమె కదా. ఇ ట్లంగీకరించుచునే కోపగాఁ డిత్యాదులఁ బరాంతరములను గల్పింప నేల? వ్యా.సం.స.లోఁ దామె యంగీకరించియు వికృతిఁ దత్సమములపై నగుట కొందఱయాళయ మనుటయు విశేషమె. అయిన సంస్కృతముపై విల్పు నని కొందఱయాళయము కాఁగాఁ దత్సమములపై విల్పు నని వీరిమతమా? అయిన వీరిమతమె యుచితము.

గాలకాఁ డనుచో నచ్చులవారి సమన్వయము తత్సమముపై నివి యగు ననుటవలనఁ గ్రహింపఁదగు కాని గాలకాఁ డనుచో కాప్రత్యయము తత్సమముపై నైన దనుట సరి కాదు. గాల మాచ్ఛికము కా దనియుఁ దత్సమమె యనియు వీరు పేర్కొనిరి. అయ్యు నాచ్ఛికగాలశబ్దము నంగీకరింప వలయు.

'గాలము' అనుపాం. ప్రయోగమున ఇది యేతాదులవంటిది గా దనియు, 'గాలము' అని భగణముతో నున్నను సీసపద్యమున గణభంగము లే దనిరి. ఛందోవిధుమానుసారముగా నైనను గవిప్రయోగములను దిద్దఁదలఁచుటయె సరి కాదు. ఇంక సూరి యేతాదులలో 'గాలము' శబ్దమును జేర్చియే యున్నాఁడు. వరుఁడువారును దమయాగ్రంథమున 'గాలాము అని' (ఉ.175) దీర్ఘము వచ్చినరూపమును జూపి యిది యేతాదులలోనిదిగా నంగీకరించియే యున్నారు. ఇటనే యేమి? తత్సమ మని చెప్పినవ్యా.సం.స.లోనె గాలము ఏతాదులలోనిదిగాఁ జూపియే (1768) యుండిరి. పాలారుగోరు మెల్లాలాము సేసె- పొండు. (వ్యా.సం.స.1768) అని సూ.వి.నుండి చూపిరి. ఇంకను పొండు ప్రయోగమునే దీర్ఘ మిందులకుఁ బ్రమాణముగాఁ జూపి యదే పద్యమున దీర్ఘమధ్య మగుపాఠము నంగీకరించిరి. కాఁగా వీదీర్ఘముంబట్టియు నిది యాచ్ఛికమే యని యంగీకరింపవలసియే యుండుట స్పష్టము. కావున "గాలము అనుశబ్దమును గాని గాలించు అనుధాతువును గాని వైకృతమనుట కవకాశము లేకున్నది. ఇంక వానిని దత్సమము లనియే చెప్పక

తీరకున్నది' (వ్యా.సం.స.1554) అనుట యసమంజసము గదా.

కాఁగా గాలించు అనునదియు నాచ్ఛికధాతువే యనియు నాచ్ఛికము లగునంగలాదులలో "గాల" చేర్చుట యుచితమే యనియు గుర్తింపవలెను. గాలించు (వియ్యమును) (ఉ.355)

అది యట్లుండఁగా "గాలించు" అనుధాతువునకు నీగాలము అనుశబ్దమునకు నెట్టిసంబంధమును లేదని గుర్తింపవలె. "గాలము"నుండి యేర్పడినచో నాయర్థము గాలించుధాతువున కుండవలయును. కరుణించు పయనించు ఇత్యాదు లట్టివే కదా. అట్టిదైనచో నియ్యది నామధాతు వగును. సూరి యంగలాదు లన్నది యాచ్ఛికధాతువులనుగూర్చి గాని నామము(ధాతువు)లను గూర్చి కాదు. నామంబుల కింపుగాగమము జ్ఞాపకసిద్ధ మని గదా సూరి క్రియా.65సూత్రమున జెప్పియున్నది. కావున సంగలాదులలోని "గాల" శబ్దము "గాలము"కంటె భిన్నము. ఇది ధాతువు. అంగల, అడక, అరగ ఇత్యాదిగా నిటఁ జూపిన వన్నియు ధాతువులే. న్వంతములు లేవు గదా. ఒకవేళ వరుసలవారు చెప్పినట్లు "గాలము" అన్నది తత్సమమే యైనను సంగలాదులలో గాలశబ్దము(ధాతువు)చేర్చుట విరుద్ధము గాదని స్పష్టము. తత్సమ మన్న "గాలము" ధాతువు గాదు కదా. అంగలాదులలోని గాల ధాతువు. తద్భిన్నము. (ఉ.355)

"గాలకాని" అనుతిక్కనప్రయోగమున వీరు తత్సమముపై 'కా' ప్రత్యయ మున్న దనరాదు. అయ్యునట్టిప్రయోగములు ప్రసిద్ధములు లేక పోలేదు.

విటకత్తెలయుల్కలు (హం.4.150)అరట్టలాని (ద్రోణ.4.248) మహామాయలాఁడు (హరి.ఉత్త.1854) రజ్జలానికి(కర్ణ.2.96)ఆయతికాఁడు (శాం.2.363)

బాల.తద్ధి.13,14సూత్రములట్లు గ్రహించిరి. (ఉ.19,20సూ.)

కొ౯ప్రత్యయాంతము లైనను దిక్శబ్దములకుఁ బుంలింగసమత్వము వలన దుక్కు రాదు. ఇవి యమహత్తులు గదా. కావున వీనికిఁ బుంలింగ సమత్వమె లే దనఁదగును. వీనిని గయిధాదులలోఁ జేర్చి దుక్కును సాధించు కొనవలెను. వరుభలవా రిట్లు చెప్పుచున్నను "ఏకార్థకాద్యమహత్తులలో (ఇవే సూరిపేర్కొన్నకయిరాదులు)కొమ్ము కొఁదు అనుదానిం జూపుటనుబట్టి వారియభిప్రాయము నదియే యని చెప్పఁదగు.

ఈ :

బాల.తద్ధి.15.16.సూత్రము లట్లగ్రహించిరి. (ఉ.2122సూ)

ఈప్రత్యయాంతములకు మగాదిత్వముచే దుక్కువు ననియె సూరి. "పుంలింగసమత్వముచేతనె దుక్కగు" (ఉ.306) ననువరుభలవారియభిప్రాయమె యుచితము. ఇయ్యవి మహత్తు లవుటచేఁ బుంలింగసమత్వముచేతనె దుక్కు సిద్ధించుచుండఁగా నందుకయి వీనిని మగాదులలోఁ జేర్పవలసినయవసరము గానరాదు.

"వీనికి మత్వర్థీయేతరప్రత్యయములు నగు" అటమటకొఁడు--(ఉ.306) అనువీరివివరణ ముచితము. మత్వర్థీయేతరప్రత్యయము లనఁగా మత్వర్థీయము లగునితరప్రత్యయములు. మత్వర్థీయములకంటె నితరము లైనప్రత్యయము లనుకొనరాదు. తద్ధి.2.సూ.చే విశేషవిధి యగుతద్ధి.15 సూత్రము సామాన్యవిధి యగుతద్ధి.11సూత్రమును విభాషను బాధింపఁగా నిట్టిద్వైరూప్యము సిద్ధించు. గణద్వయపాతమువలనఁ గొన్నింటికి. అటమటాదిత్వముచే నుంకీఁడు. లాలాదిత్వముచే నుంకరి.

అం_ఇ :

బాల.తద్ధి.17.సూత్ర మట్లు గ్రహించిరి. (ఉ.28.సూ.)

"అరిప్రత్యయాంతములు స్త్రీసమములు గాన, బ్రయోగానుసారముగా మహన్మహతీవాచకత్వము వీనికిఁ గలదు." [ఉ.306] అనఁగా మహత్త్వ

మునను మహాత్త్వమునను దూష మొకేతీరున నుండు నని వీరియుద్దేశ్యము గావలెను. మహన్మహాతివాచకము లగుటకు స్త్రీసమత్వము నిమిత్తము గానేరదు గదా.

చదువుకలది, లేదా చదువుకలవాఁడు అనురీతిగా స్త్రీత్వమునను, పుంస్త్వమునను రెండింట నీసూత్రముచే అరిప్రత్యయ మగు నని చెప్పుట సరిగా నుండును.

ఇటనే వీరు పూజ-పూజారి, పూజరి, సొన్నము సొన్నరి' అనియుఁ జూపిరి. దీర్ఘము నూహింపవలయును. ప్రౌఢ.తద్ధి.లక్షణమును సంస్కరించి చూపవలసినది. ప్రౌఢ. సొన్నారి యనియె చెప్ప వీరు సొన్నరి యనియుఁ జూపిరి. వ్యా.సం.స.లో దీనికిని దీర్ఘము వికల్ప మనినజాడ లేదు. ఇటఁ ప్రత్యేక మైనయాధారమును జూపలేదు. సొన్నారి యనియు చూపఁదగుఁ గదా.

'జూదరికత్తె జూదకత్తె జూజగాఁడు జూజకత్తె సిగ్గరికత్తె ఇత్యాది ప్రయోగములును గలవు.' (ఆ.307) జూదగాఁడు జూదకత్తె యన్నవి తద్ధి.11.చే సిద్ధించునవే. (ప్రకీ.21) జూదరికత్తె యన్నవి తద్ధి.18సూ.చే సాధ్యములు. (కల్లరీఁడు-తద్ధి.18)

బాల.తద్ధి.18.సూత్ర మట్లె గ్రహించిరి. (ఆ.24.సూ.)

త:

'తవర్గకంబు కులవాచకంబునకు స్త్రీ వాచ్యంబగునపుడు మతుబర్థంబు నం దగు' (19) ననుసూరిలక్షణమును సవరించి యిట్లు పేర్కొనిరి. "కుల వాచకములు మహద్వాచకములు నగు. బోయప్రభృతిశబ్దములపైని వానిస్త్రీ అను నర్థమున తప్రత్యయ మగును" [తద్ధి.26]

సూరిసూత్రమందలిదోషము నిట్లు చెప్పిరి. "చాకి బోయ ప్రభృతులు కేవలకులవాచకములు కావు. ...మఱవి పేకిన్ చాకిన్... చాకి అనఁగా నీటి రజకుఁడు. ఆట్లే బోయ..." [పు.308) కావున నియ్యవి మహత్తులు నగుట స్పష్టము.

"ఇత్యాదులు కులవాచకంబులు" అని సూరి పేర్కొనుటవలన బోయ వాఁ డనురీతిగా మహత్తగుబోయశబ్దము నిట గ్రహింపరా దనవలె. ఇట్లే తరములు. కాఁగాఁ గులవాచకములను మాత్రమే యిట గ్రహింపవలె నని సూరిమతము స్పష్టమే.

'ఇయ్యవి కులవాచకంబు' లనుటచే నివి కులమాత్రవాచకము లని సూరి తలఁచినట్లు భావించి వఱులవారు మహత్తులనయియుండను సూత్రించియుందురు. ఇయ్యవి కులవాచకములు మాత్రమె యగు నని సూరి తలఁచె ననరాదు. మగాదులలోఁ జేర్చి మహత్తుగాఁ జూపిన ప్రేశబ్ద మిందును సూరి చేర్చెను. ఇది కేవలము కులవాచకమె యగు నని సూరి తలఁచె నన్న మహత్తు లగుమగాదులలో దీనిని జేర్చుట విరుద్ధము కాదా?

'కులవాచకంబులు' అని ప్రత్యేకముగాఁ బేర్కొనుటనుబట్టియు నీ 'త' వర్ణకము వచ్చుసందర్భమున కులమాత్రవాచకములే కాని మహత్తులుగా వని సూరిమతమును గ్రహింపవలయును. సూరిలక్షణము నప్పుడ సమన్వయించును. 'స్త్రీ వాచ్యం బగునపుడు' అని గదా సూరి చెప్పునది. మహత్తయినచో స్త్రీ వాచ్య మగుట యెట్లు సంభవించును? బోయ, మహతి యయిన బోయత. మహతీత్వమున మహత్త్వ మసంభవము.

వీరు దమసూత్రమున 'కులవాచకములు మహద్వాచకములు నగు' ననిరి. కులవాచకము లన్న సూరిమతమును తిరస్కరింపఁదలఁచినవలనఁ దప్ప నీయంశము సూత్రముగాఁ జెప్పవలసినది కాదు. అర్థమునుబట్టి మహత్తో మహతియో యన్నను. మహదమహత్తులు చెప్పఁబడఁగా మఱల నీశబ్దము మహత్తు లేదా యమహత్తు అనురీతి వేఱుగా సూత్రింప నవసర మేమి?

సూరియభిప్రాయమున దోషము లేమి పైని స్పష్టము. ఇంక నీట పీఠిసూత్రమున 'మహద్వాచకములును' అనుచోటి బార్థకమను శబ్దముచే పిడ్యాది కులవాచకములు మాత్రమె కాక మహత్తులు గూడ నగు నని యర్థము. బాకి బోయ ప్రభృతులు కేవలకులవాచకములు కావు" (పు. 304) అనుటలో పరుులవారియభిప్రాయ మిదియే యగు. అనఁగా మహత్తులు గాని (కేవల) కులవాచకములు లే వన్నమాట. కావున మశబ్దమునకుఁ గులవాచకములు మహత్తు లగుటతోపాటు కాకుండుటయుఁ గల దనురీతిగా నర్థము చేయుటకు వీలు లే దన్నమాట.

శ.ర. కొఱవ, వాని, సాలెశబ్దములను కేవలము కులమాత్రవాచకములుగాఁ (మహదితరామహత్తు) జూపినది. వీరు 'కొఱవ బోయ మున్నగు నవియును కొఱవవాఁడు బోయవాఁడు మున్నగునవి పురుషులకును వాచకములె' (వ్యా.సం.ప.1300) అనిరి. కొఱవశబ్దము పురుషవాచకమగుట, శ.ర. కాని సూ.వి. కాని పేర్కొనలేదు. వీరు నుదాహరింపలేదు. కాఁగాఁ గులవాచకములు నియతముగా మహత్తు లగు నని నిర్ణయింపరా దని స్పష్టము.

సూరిమతము ననుసరించి యయ్యవి మహత్తు లెప్పుడుఁ గా వరాదు. కులమాత్రవాచకము లయినప్పుడె తద్వర్ణక మగు నని సూరిమతము. అది యుచితము. అట్లు గా దని వీరు 'వానియొక్క స్త్రీ' యనునర్థమునఁ జెప్పఁ దలఁచిరి. ఆపక్షమున నైనను వీని మహత్తు లగుటను వేఱుగా సూత్రింప నవసరము లేదు. బోయప్రభృతిశబ్దములు మహత్తులు గానిచో వానిస్త్రీ యనునర్థ మెట్లు కుదురును?

మొత్తముపై వరులవా రేపక్షము ననుసరించినను కులవాచకముల మహత్త్వమును సూత్రించుట యనవసర మనియుఁ గొండొకచో ననర్థకము (కొఱవ మొ॥) ననియుఁ జెప్పవచ్చును.

తమసూత్రమునఁ బిదప వీరు 'వానిస్త్రీ' యనునర్థమున తత్ప్రత్య

యము వచ్చు ననుట యుం గొంతసవరణము. సం.లోనే "తత్తజ్జాతిపురుష వాచకములకంటెఁ బరముగ తప్రత్యయము వచ్చు ననుట యుక్తము. చాకి యొక్క-చాకలవానియొక్క స్త్రీ-త- చాకిత. (వ్యా.సం.స.1300) అనిరి.

కులవాచకము లెప్పుడును మహత్తులే యగు నని భావించుట పూర్వమున పేరు 'వానిస్త్రీ' యనునర్థమును జెప్పుకొనిరా యని సందేహము. 'బోయత' యనుచో సూరిమతమున బోయజాతికిఁ జెందినస్త్రీ యనియర్థము. పరిమతమున బోయవానిస్త్రీ యని యర్థము. కోశములు సూరి నిరూపించిన యర్థమునే ప్రదర్శించినవి.

'ప్రేతలు గోపకులు రండీ' (సూ.ని) అనుచో ప్రేత లనఁగా గొల్ల కులమునకుఁ జెందినస్త్రీలు. (గోపకులు=పురుషులు) అనునర్థమె సముచితము గాని గొల్లవానిస్త్రీలు అనునర్థ ముచితమా? వివాహిత యైన 'వానిస్త్రీ'లన్నఁగా పెండ్లము లనియుఁ గాకున్నఁ గూఁతు లనియుఁ జెప్పవలె నేమో. సూరి చేసినయర్థమె సముచిత మని స్పష్టము గదా.

కొఱవ, వానె, మున్నగునవి మహత్తులుగాఁ గాన్పింపవు. అయ్యవి కేవలము కులవాచకములె. అట్టియెడల 'వానిస్త్రీ' యనునర్థము వివక్షించుటయే యట నసంభవము. ఆజాతి కలిగినస్త్రీ యనువిధముగా సూరి చెప్పిన మతమునర్థమె పొసఁగును.

'కొఱవత వానెత అనుశబ్దములు శ.ర. నుదాహరింపఁబడెనే కాని వానికిఁ బ్రయోగములు చూపఁబడలేదు' (వ్యా.సం.స.1301) అయ్యు వీరును సూరివలె శ.లో వానెత చూపిరి. (శ.308)

శబ్దస్వరూపమునను భేదము గలదు. 'వానిస్త్రీ' యనునర్థమును వివక్షించినపుడు తపర్ణకము షష్ఠ్యంతము లగుబోయప్రభృతిశబ్దములపైఁ జేరవలయును. ప్రేవియొక్క స్త్రీ యనుచో పరిపక్షము ననుసరించి షష్ఠికి ద్వితీయాతుల్యత యైన దన్నను 'ప్రేవిత' యని కావలె. ప్రేత యగు

యొక్క [గల]వాఁడు వగ + వాఁడు వగ + ఆఁడు 'వగాఁడు' అని కావలదా? ఇట్లె వన్నె + వాఁడు వన్నాఁడు ఇత్యాదిగాఁ గాదా? అయిన వన్నెయాఁడు అని యగును.

ఏకవచనముపై వకారము లోపింపదా? పూనికాఁడు (ఉ.305) అను నది మీర చూపిరి కదా?

అన బీతచ్ఛబ్దవకార మెట్లు లోపించినది? 'తచ్ఛబ్దవస్య లోపస్స్యాత్ దథాతోః' అని చెప్పినది. బి.వి.(వ్యా.సం.సూ.1305) ఆఁడు స్త్ర్యన్యథా మతః ప్రియామాఁడిఛ్ఛహాత్వే స్యాత్' అని సూరికి ముందే 'యథర్వణుఁడు' 'ఆ' ప్రత్యయమును మత్వర్థకముగా విధించెను. (వ్యా.సం.సూ.1281) ఇట సూరి యథర్వణసమ్మతి ననుసరించి కాక వికృతివివేకవాసనచే సూత్రించె ననవలె నేమో. మొత్తముపై వీరిప్రక్రియ సన్నయాథర్వణీయ (అథర్వణుఁడు చెప్పిన నన్నయ చెప్పి నట్లే యని వీరిమతము.) సమ్మతికి విరుద్ధము. అట్లయయిన వి.వి. అప్రత్యయమును విధించుట వ్యర్థము గదా. సూరిలక్షణమువలె నదియుఁ దొలఁగింపవలసినదే యగును.

తచ్ఛబ్దవకారమునకు మీ రేలక్షణముచే లోపము చేయుదురు? సూరి ఉన్నకలనవర్ణకములపై మాత్రమె యిట్టిలోపమును జెప్పెను. అందుకె మీరు తమసమా.81సూ.చే నగు ననిరి. కాని మీరు చెప్పుకొన్నయా సూత్రముచేఁ గూడ నీలోపము రానేరదు. అది మీరు గుర్తించినట్లు లేదు. ఏ లన నాసూత్రమున వీరు తచ్ఛబ్దవకారలోపమును, ఉన్నకలనవర్ణములపై మాత్రమె సూరివలెనె చెప్పిరి. అట్టిఇట్టిఎట్టిఅనువానిపై 'వా' లోపమును, కొలఁదిప్రభృతిపరకతలో నవుపా త్తచ్ఛబ్దలోపము, తనపరకతలోఁ దచ్ఛబ్ద లోపమును జెప్పిరి. ఆభాసటహాంప్రీహాంబలోఁ దచ్ఛబ్దవకారలోపమును వారు చెప్పలేదు. (పట్టుపుట్టమువాఁడు మొ॥) మఱి యాసూత్రముచే వగల+వాఁడు అనుచోఁ దచ్ఛబ్దవకారము లోపించు టెట్లు?

ఇటఁ దచ్ఛబ్దవకారము లోపించు నని వేఱుగా సూత్రింపవలెను. బాధితంబె 'ఆ' ప్రత్యయ మగు నను టుచితము గాదా?

అదర్వణుఁడే కాక కేతనయును 'ఆఁడును మీఁడును గత్తెయుఁ గాఁ దనుచో' - నని (ఆం.భా.భూ.) 'ఆ' మతుబర్థకముగాఁ జెప్పెను.

తచ్ఛబ్దవకారము లోపించిన వచ్చుచున్నాఁడు ఇత్యాదులలో ద్వితీయాదులలో వచ్చుచున్నానిని, వచ్చుచున్నారిని అనురీతిరూపము లప్రసిద్ధములు. ఉన్న వేమో వెదుకవలె. అట్టియెడల నిట మాత్రము వగలానిని, వగలానికి ఇత్యాదిగా రూపములు ప్రసిద్ధములే. వీరే సమా.9.సూత్రము చెప్పిన—— ప్రకృతసూత్రము (క్రియా.117)చే వాఁడు వాడు శబ్దముల మొదటిహల్లు లోపించి (వ్యా.సం.న.805) అనిరి. (అది విచార్యము.)

తచ్ఛబ్దవకారము లోపింపనివగలవాఁ డనురీతివియునిట నప్రసిద్ధములె యగుట గుర్తింపవలెను.

కాఁగా బహువచనాంతములపై మాత్రమె యుండుటంబట్టియు, వీనికి ద్వితీయాద్యంతరూపములు ప్రసిద్ధము లగుటంబట్టియు, వగలవా, డనురీతివియు వగలాఁ డనురీతివానివలెఁ గానరాకుండుటనుబట్టియు నిటఁ దచ్ఛబ్దవకారలోప మనుట సరి కా దనియుఁ బ్రాచీనార్వాచీనలాక్షణికులు పేర్కొన్నట్లుగా 'ఆ' అనుమతుబర్థకతద్ధితప్రత్యయమె యయినట్లుగా నంగీకరించుట సమంజసము.

కావున వి.చి. చెప్పినయీవిధానమును లక్ష్యానుగుణముగా సూరి గ్రహించి చెప్పుట యుక్తమే. వజ్ఝలవారు దీనిని దొలఁగించుట సరి కాదు.

కాఁగా మాయలాఁడు (మహామాయలాఁడు హరి.ద్వి.1.1854) రజ్జులాఁడు (అర.6.63) అనురీతిగా నిది తత్సమములపై నగుటయు గుర్తింపఁదగును.

బాల.తద్ధి.24,25,26.సూత్రము లట్లి గ్రహించిరి (ఉ.29,30,31).

మతుబర్థంబునందు ఇఁడి అని సంధి వేఱు చేయుట యనవసరము. ఇట్లే ఉ.30.సూ.

నావెఁడు మద్దసంబు గొని (వ్యా.సం.స.609)

ఇట విశేషము. 'విభాగమందలిపరిమాణార్థమునఁ గొన్నిట ఏసి వర్ణక మగును. నాలుగేసి గంపెఁడేసి ...అంతలు పేసి గోరంత... అంతఇంత ఇత్యాదులు తద్ధితప్రత్యయములు గావు. అవి ప్రత్యేకశబ్దములె. (ఉ.310) అంతలు అనుచో 'లు' అనునదియుఁ దద్ధితము గా దనియె పీఠికయభిప్రాయ ము నెన్నఁదగు. [వ్యా.సం.స.1308)

అంత, ఇంత ఇత్యాదులు ప్రత్యేకపదము లనియు 'ఏసి' ప్రత్యయ మనుట విశేషము. దీనికి మూనార్థాబ్జెనిరత్రిప్యా త్తసువి.వి.వచనము మూల మనఁదగు. పై కారికార్థము గ్రంథాంతరమున స్పష్ట మగును.

గంపెఁడేసి యనుచో ఎఁడు, ఏసి అను ప్రత్యయములు రెం డైన వన్నమాట. ఇటఁ బరిమాణార్థమున 'ఎఁడు'ప్రత్యయము కాఁగా దానిపై విభాగార్థమున ఏసిపదము ప్రయుక్త మైన దనుట లెస్స.

'ఏసి' అనునది యవ్యయముగాఁ గోశములు పేర్కొన్నవి. ఇది యేన్యాదులవలె వాక్యమునఁ బ్రయోగమునందుఁ గ్రమాపేక్ష కల దని చెప్పఁదగును.

"ఎఁడుప్రత్యయాంతము లౌపవిభక్తికవర్ణములతో వ్యస్తముగా వాడఁబడును. బారెంట, మూరెంటన్ [బసవ.4.567]అడుగెంటనె[పాండు.1.114]పదాదిహ్రస్వము దీర్ఘముఁదవలెనె యుండును నిండునున్న మాత్రమె. [సంధి.22] బారెటన్, మూరెటన్ అని యుండరాదు." [ఉ.310] [వ్యా.సం.స.1309] పీఠికావివరణమునకుఁ బ్రయోజన మెఁడుప్రత్యయాంతము లౌప. లని చెప్పుటయె యనఁదగును. వ్యస్తతను బ్రస్తావించుటవలన నితర

తద్ధితాంతములు వ్యస్తముగాఁ బ్రయోగింపఁబడ వని యర్థము చేసికొనరాదు. ఏఁడుప్రత్యయాంతములు స్త్రీసమములు గావున ఆళ బారెఁడు అను రీతిగాను బ్రయోగింపఁబడును. బారెంటటన్, మూరెంటటన్ అనుచో సంధి.22 (అఁటయిఁక.) సూత్రమువలన ఖండబిందువు చే దనుట సరి కాదు. బారెఁడు అనుచో ఖండము నుడితొలిహ్రస్వముపై లేదు. ఉండదు. ఆపద మగు నీప్రత్యయము స్వతంత్రముగాఁ బ్రయోగింపఁబడదు గదా. నుడితొలి హ్రస్వ మనఁ బదాదిహ్రస్వ మని వారు నట (సంధి.22) వివరించియే యుండిరి.

అయినను మూరెట ననుచోనే నిషేధింపఁబడు టేమి? 'మూరెఁడు' అనుచో మాత్రము ఖండ మే ట్లున్నది. మూరెఁడు అనుచో నున్న ఖండము మూరెఁట ననుచో నుండుటకు మాత్ర మాసూత్రము విరోధించునా? వీరివివరణము విరుద్ధ మని 'మూరెఁడు' అనురూపమె నిరూపించును.

మూరెఁట, బారెఁట ననుచో ఖండ ముండును. (మూరెఁడు బారెఁడు అనుచోవలెనె) దానికి సం.14సూత్రముచే నిండుసున్న వచ్చినపుడు మూరెంట, బారెంట నని యగును. మూఁటికి, నిత్యాదులందువలె మూరెఁట ననురీతి నిట ఖండ ముండుట లక్షణవిరుద్ధము గానేరదు.

ఇంక నిట వీరు 'బారెటన్ మూరెటన్' అని యుండరా దనిరి. వీరిమతము ననుసరించి యిదియు నసంగతమే. వీరే వ్యాఖ్యానించినట్లు సంధి.22సూ.చే ఖండబిందు వుండుటకు వీలులే కున్నను ఖండము లేకుండ బారెట మూరెట నని యుండవచ్చునే కదా. వేసఁగి.. వేసవి యను మొదలగుచో ని ట్లుండుట లేదా? ఖండబిందు వుండరా దనుచో బారెఁటన్ అను రూపము లుండరా దనవచ్చు. కాని ఖండము లేనిరూపములు నుండ వనుటెట్లు?

కంటికి వంటికి ననుతీరుగా బారెంట మూరెంట నని మాత్రమె

యున్నవి తద్ధితాంతముల యనవలెఁ గదా. ఇట నొసవిత్తికి మెట్లు నిల్చినవి? (వ్యా.సం.స.1312) మోఁకాలియొక్క యనుషష్ఠ్యంతముపై నైన పదకతప్పదు గదా. మోఁకాలుపరిమాణముగాఁ గలది యనుచోఁ [మానెడు రీతిగాఁ] ప్రథమాంతముపై నిల్చి 'మోఁకాలుకొలఁది' యని పేరు చూపవలె. మోఁకాలికొలఁది యనుటచేతనె యది [పరిమాణమాత్రవాచకము గాదనియు] షష్ఠ్యంతముపై వగు ననవలె. కుత్తుకబంటి [శ్రీ.2.8]కుచంబులబంటి [భాగ.10.పూ.1093] కార.19.మా.తే తత్ప్రత్యయపరకతయందు మాత్రమె షష్ఠికి ద్వితీయాతుల్యత చెప్పిరి. కావున నీబంటికొలఁదిప్రత్యయములు పర మగుచో నాకార్యము లేదు. మోఁకాలిబంటి యని యగుట యెట్లు? వ్యస్తతలో యొక్కలోప మెట్లును సాధారణమె. కావున విట లోపించిన దనవలె. తత్పరకత్వమున ద్వితీయాతుల్యత యగుటకును బంటికొలఁదిపరకత్వమున మాత్రము వ్యస్తస్థితియందువలె లోపించుటకును భేదమేమి? వీరిప్రక్రియ యొక క్రమములోఁ గానరాదు.

మానార్థమునకు దఘ్నార్థకబంటికి [కొలఁది] భేద మిటను స్పష్టమె కుచములబంటి యనుచో కుచములయంత పరిమాణ మని యర్థము కాదు గదా. కుచములవఱకు, కటివఱకు ననురీతి నర్థమునుబట్టియుఁ బూర్వశబ్దము షష్ఠ్యంతమె యైయుండవలె. తెలుఁగున షష్ఠ్యంతముపై నవుటయు నిచటి విశేషము.

ఇఁక నీయవి షష్ఠీసమాసములవంటివి గాఁ దలఁచిన పేరు ముక్కుయొక్క బంటి. ముక్కునబంటి యనురీతి నవర్ణము నాగమముగాఁ [ప్రౌఢ. నవము.1] జెప్పుట ప్రత్యయ మనుట యేలో, అది కొలఁదిపరకత్వమునఁ గానరాదు. దీనిని సూరి పేర్కొనలేదు. 'తతః పూర్వత్ర నః క్వచిత్' అని వి.వి.

ఈప్రత్యయ[బంటి]పరతత్సమనపక్షమును జెప్పినది. వి.వి.లోని 'సవర్ణము' ప్రత్యయ మన్నచో బంటి షష్ఠీసమాసోత్తరపద మనుట యొప్పదు. వి.వి. మార్గ ముచితము.

ఇయ్యవి ప్రత్యేకపదములు గనుకనె షష్ఠీసమాసములుగాఁ దత్సమములపైఁ గూడ నిల్చుచున్న వనిరి. ప్రౌఢ.తద్ధి.17.సూ. వలె కా దని కలి బంటి యనుచో నిది తద్ధితప్రత్యయమె కా దనిరి. [వ్యా.సం.స.1312] కొలఁది యట్లు కావచ్చును. కాని 'బంటి' అపద మనియు కోశములు పేర్కొన్నవి. వీరనుదగినయాధారముఁ జూపలేదు. ప్రౌఢ. బంటిని మాత్రమె [తద్ధి.17] ప్రస్తావించుట సమంజస మై యుండ వీ రద్దానిని దిరస్కరించుటకుఁ దగినయాధారము లేదు. [ముక్కుపబంటి యనునదియు బంటిప్రత్యేక పద మని నిరూపింపఁజాలదు.]

## తనమయము :

వీ రీసందర్భముననె 'సంస్కృ-తసమయము' [ఉ.311] అని చూపుట విశేషము. (తద్ధి.18) మయట్ప్రత్యయార్థకమయశబ్దము ప్రత్యేకముగాఁ దత్సమముగాఁ గల దనివీరియభిప్రాయము. (వ్యా.సం.స.1313) మయట్ప్రత్యయార్థమున సంస్కృతమున మయపదము లేదు. తెలుఁగునఁ దత్సమ మగు టెట్లు? మయట్ప్రత్యయము తత్సమముగాఁ బర మయ్యె ననరాదు గదా.

'సంస్కృతమయట్ప్రత్యయార్థకమయశబ్దము పైతము ప్రత్యేకపదముగా నాంధ్రకవులచేఁ బ్రయోగింపఁబడసాగె నని చెప్పనగును. కరుణమయతన్ (శ్రీ.2.141)-మయము-ప్రచురము.' (వ్యా.సం.స.1313) ఆంధ్రకవులు ప్రయోగించి రనుటచే నిది యీయర్థమున సంస్కృతమున లేదని వారును స్పష్టము చేసినట్లే. సంస్కృతమున లేకయె తెనుఁగున సంస్కృతసమ మేర్పడుట యీయొక్కశబ్దమునెడలనె యనవచ్చు నిట్టిది భాషలో మఱొకటి గానరాదు.

ఇది యైన సంగీకరించుటుఁకు దీర్ఘాన్నప్రయోగము మూలము. 'కరుణ మయత' యనుచో నట మయశబ్దముపై 'తల్' సంస్కృతప్రత్యయ మైనది. తత్సమముగా నంగీకరించిన సంస్కృతప్రత్యయ మెట్లు? అనఁగా 'మయ'పదమును సంస్కృతముననే తెలుఁగుకవులు చేర్చి రనవలె. స్పష్టముగాఁ జెప్పవలె నన్న మయట్ప్రత్యయార్థమున 'మయ'పదమును దిక్కానయె సంస్కృతమున సృష్టించె ననవలె. సంస్కృతమునఁ బుట్టించినపిదప నిఁక దానినుండి తత్సమ మేర్పడుటలో బాధ లేదు. కాని తెలుఁగుకవులు సంస్కృతమునఁ బదమును సృష్టించి రనుటయే సముచితముగాఁ దోఁపదు. ఒకవేళఁ బొరపా టయిన నది తెలుఁగుకవులది యగు టుచితము కాని దీనికి ఫలము సంస్కృతమున కంటఁగట్టుట యెట్లు? సంస్కృతమున నీయర్థమున మయపదము ప్రయుక్త మగుట లేదే. తత్సమముగా సాధించినను దెలుఁగున్ గూడఁ దనమయ మనురీతిసమాసములందే కాని వ్యస్తముగా మయము పదము ప్రయుక్త మగుచున్నదా? అట్టిది గల దనుటకు నీ రొక్కయాధారమును జూపలేదు. సంస్కృతాంధ్రములు రెండింట లేనియీబాధిని గల్పింప నేల?

సమాసమునను నిది పూర్వపదముగా నెన్నటను లేదు. ప్రోవులమయ మనునర్థమున మయప్రోవులు (ప్రచుర మైనప్రోవులు) అనురీతిఁ జూపఁగలమా? మయ మనునది యుత్తరపదముగా మాత్రమె యుండుటకు హేతు వేమి?

కరుణమయత- కరుణామయత్వము. కరుణశబ్ద మాకారాంతస్త్రీలింగము కాన కరుణామయత యనవలె. హ్రస్వముతోఁ 'గరుణమయత' యని కావలె నన్న కరుణయొక్క మయత యని దీనిని సాధ్యసమాసముగాఁ జెప్పవలె. అప్పుడు 'మయ'పద మంగీకరింపవలె. నవి వయులవారిమతము. నదిసుత, మున్నగుచోట్ల సిద్ధసమాసములలో జీప్రత్యయమునకు హ్రస్వ

మగుటగాఁ (ఉ.సమా.26సూ) జెప్పరి గదా. అట్లే యిట లాప్రత్యయమునకు హ్రాస్వ మైనట్లు చెప్పుకొనవచ్చు. ఇట్టిది విశేషస్థలముగాఁ జెప్పఁ గొనుట యుచితము. లేనిపదమును సంస్కృతాంధ్రములఁ గల్పించుటకంటె భాషలో నొకానొకచోటఁ గన్పించువిశేషమును విశేషముగానె తలఁచుట సమంజసము గదా. (కరుణ-దయా యుక్త మను నర్థముతో నిది సంస్కృతమునను హ్రాస్వాంతము. అట్టియర్థము నెట్లేఁగుదుర్చుకొనుటయు నొక మార్గము కాకపోదు.)

కావున నీయొక్క ప్రయోగమును బట్టి మయపదము (నీయర్థమున) గల్పించుట సరి కాదు. దీనిని బట్టి ప్రౌఢ.లక్షణము సరి గా దనుటయు నట్లే సరి కాదు. ఇంకఁ బ్రౌఢ. తెలుఁగుశబ్దములపై (సంస్కృత)మయ ప్రత్యయ మగు ననుట యసంమజసము గావునఁ దెలుఁగునే 'మయ' (అపదముఁగా) ప్రాచుర్యార్థకతద్ధితప్రత్యయముగాఁ జెప్పఁదగును. ఇది యేర్పడుటలో సంస్కృతప్రత్యయమె మూలము కావచ్చును. కాని సంస్కృతప్రత్యయముగా విధించుట మాత్ర మిట శబ్దశాస్త్రసంప్రదాయానుగుణము కాదు. (చూ.త్రి.శే.)

కాఁగా సంస్కృతాంధ్రములం దెందును మయపదము నంగీకరించుట సరి కాదనియు, తనమయ మిత్యాదులలో 'మయ'యనునది తెలుఁగుతద్ధితముగాఁ జెప్పఁదగిన దనియు నిశ్చయింపఁదగును. మయప్రత్యయాంతము క్లీబసమము. కావున మువర్ణక మగును.

## వర్ణకాంతరములు:

బాల.తద్ధి.28.సూత్ర మట్లు గ్రహించిరి.(ఉ.33.సూ.)

ప్రౌఢ. సాధించిన చెడుగఁడు దుడుకఁడు విడుపఁడు అనువాని నిటనే వచులవారు చూపు టుచితము యనఁదగు. 'అడప' యనుచో నూఁగి మతు

బద్ధమునకు దప్రత్యయము చూపె. ఏతదంతము స్త్రీసమము. దుదుకడు ఇత్యాదుల దుదుక మొ॥ మగాదులలోఁ జేర్పవలసినవి. పుంలింగసమము లగుట కొంత భేదము గలదు. చెడుగు- దూర్తుఁడు (సూ.వి.) చెరుగుల్ కొందఱు (కాళ.శ.101) కాఁగాఁ జెరుగు (మహదమహాదర్థకము నగునుఁ. శబ్దముపై మహత్త్వమున స్వార్థమునందు దప్రత్యయము చెప్పఁదగు నని తోఁచు. (చూ.త్రి.శే.)

'సంఖ్యకుఁ బూరణార్థమున అవప్రత్యయ మగును' మున్నగునవియు నిందుఁ జేరఁదగినవే.' (ఉ.511) మున్నగున వేవో యిట వీరు దెల్పలేదు. 'అవ'నుగూర్చి ఆచ్చి.25.సూ.కథ స్పష్టము.

పిదప వీరు సంస్కృతతద్ధితములు గొన్ని ప్రదర్శించిరి.

ఇది తద్ధితపరిచ్ఛేదము

# క్రియా పరిచ్ఛేదము

బాల. క్రియా. లక్షణములు 1నుండి25 వఱకు వీరు దాదా పట్లుగనె గ్రహించిరి. (బా.క్రియా.1,11నుండి 33సూ॥) అట నట వరం బగునపుడు ఉన్న (బా.21) దుజ్ఞునకు ఎను (బా.24) అనురీతిగా సూరి సూత్రములందలి సంధిని వేఱుచేసిరి. స్పష్టత కైన నది యనవసర మగుట స్పష్టము.

ఉన్న యనునది యనుబంధ మగును (బా.21) ఉన్న యనెడి అనుబంధము నకు (బా.23) మున్న గురీతిగా (ఉన్నానుబంధంబు- సూరి) (బా.క్రి.31) మొదలవీరు సూత్రమును వివరణాత్మకముగాఁ జెప్పుటయుఁ గలదు. ఇదియు స్పష్టతకై కావచ్చును. వివరణముననె చెప్పవచ్చు. ఇందువలన సూరిలక్షణ ములందు దురుక్తి గల దని తలఁపరాదు. ఇట్లె బా.క్రియా.18 సూత్రవివ రణమున 'ఇందుఁ దుదిఇకారంబు ప్రత్యాహారార్థంబు' అని సూరివివరణ మున లేనితుదిశబ్దమును జేర్చుటయు స్పష్టతకుఁ గావలె. ఏ లన నాసూత్ర మునఁ జెప్పిన 'ఉఙ్ఞాన్వురునుము ఇః' అనువానిలో ఇకారము తుదినే తప్ప నాదిమధ్యములయందుఁ జెప్పుటను లేదు గదా సూరివివరణమును సూక్తమె.

## అదంతములు

ఉన్నాను- ఉన్నావు- ఉన్నాము- చేయుచున్నాను, చేయుచున్నాము చేయుచున్నావు అనురీతి గల ప్రయోగములు నన్నయభారతభాగమందే కాఁ తిక్కనశ్రీనాథాదుల గ్రంథములందును లేవు. అవి ప్రాచీనప్రామాణికకవి ప్రయుక్తములు కావు. వీనిని సూరి విడిచి తక్కినవానిని సాధించు టుచి తము' (వ్యా.సం.ప.1357) ఇట్టి వాంధ్రభాషలోనె లే వని పరుపులవారుని జెప్పలేదు. ఉన్నపుడు వానిని సాధించుటలోఁ దప్పేమి? "వచ్చినావు అనఁ రీతిరూపములు సైత ముత్తరాంధ్రకవులు ప్రయోగించిరి. ఇట్టిరూపము

నర్వాచీనకవులు ప్రయోగించుటచే నివి సంగ్రహింప నుచితమే - (వ్యా. సం.స.1357) అనిరి కదా. మఱి నేఁటిపై యాకరణుఁ డగుసూరి చేయఁ చున్నాను అనురీతిరూపములు సాధింపరా దను టెట్లు? "ధూర్జటి పెద లొక్కన్న మహాకవులు చదువుచున్నారు - మున్నగువానిని సైతము ప్రయోగించిరి. నేఁటికాలపుసూరియిట్టివానిని సంగ్రహించుట యుక్తమే కాని సూరి ప్రాచీనమహాకావ్యభాషను మాత్రమె సంగ్రహింప నుద్యమించినవాఁ డగుటంచేసి యిట్టిరూపములు సాధించుట సరి గా దనక తీరదు. (వ్యా.సం.స. 1958) అని సమర్థించిరి. అంతే గాక 'నన్నయ గారున్నాను దిక్కన యైనఁ బ్రయోగింపలేదు. సూరి సాధించుట యుక్తము గా' (వ్యా.సం.స.1480) దని మఱి యొకసిద్ధాంతము చేసిరి. సూరికి నన్నయతిక్కనలప్రయోగములు మాత్రమె సాధింపవలె నను నియమ మున్నట్లు చెప్పుట కాధారము చూపరైరి. భాషాసామాన్యలక్షణమును దిక్ప్రదర్శనముగఁ జూపఁబూనిన దగుటచే బాల. లో విశేషప్రయోగములు ప్రముఖముగా స్వీకరింపఁబడకపోవచ్చు నేమో. కాని నన్నయతిక్కనలప్రయోగములె కాని లేదా ప్రాచీనములె కాని మాత్రమె సూరి యుద్దేశించె ననుట నిరాధారము. పెద్దనాదులప్రయోగములను సూరి ప్రదర్శించియే యుండెనే. తెంపూరికొంజడ లనియుఁ జూపట్ల ప్రయోగములు నన్నయతిక్కనలు చేసిన వగునా? ఈకార్యము లాఁతిచోనహితము గా సంబడియెడి నని చూపిన 'గతానుగతికో లోకో' యటంచు, సన్నది కళాపూర్ణోదయమందలిదే. పద్యాదిసూత్రము నొద్ద తిక్కనప్రయోగమునుంచిరి పెట్టును జూపక యాముక్తమాల్యదలోని దుదాహరించె నని వీర చెప్పిరే. అకర్షింపుడురు మున్నగువానివిగూర్చి (వ్యా.సం.స.1625) వీ రిట్లు చెప్పలేదు ఇవి భాగవతాదులనుండి కల వనిరి.

నన్నయాథర్వణసమ్మతి లే దని కొన్నిచోటుల సూరిలక్షణములను దిరస్కరించి 'శుష్పటికివి ఓ,లో' వీరు పై లక్షణరూపములను సాధించిరి. ప్రౌఢవ్యాకర్త సూత్రించుట కనుమతించిరి కావునఁ దాము చెప్పుట యుక్తమె యని వీరియభిప్రాయము కావచ్చును. అయ్యు క్త్వార్థకేకారసంధివలె

నిట్టిరూపములు భారతాదులందు లేకుండుటను సూత్రింపక సామాన్యముగా సాధించి నన్నయకాలమునాఁటిరూపము లని వివరణమునఁ జేర్కొనుట యుచిత మైయున్నది. (ఉ.63)

విశేషణరూపములను సూరియుఁ బ్రత్యేకముగ సాధించెను. కావున లడంతక్రియాపదములుగా వీని నిట్లు. సూరి సాధించుట యుచితమె కాక యవసరము నని గుర్తింపఁదగును.

## ఏడంతములు :

"యకారము తుదిని గలకొన్ని ధాతువులప్రథమపురుషైకవచనమున 'ఎను' అనుదానితోపాటు అనుఅనునది బహుళముగా నిల్చుట కవిప్రయోగదృష్ట మగుచున్నది. అయెను. తన్నుకొని పోయన్. మొ॥ (ఉ.364) 'అద్యః'క్రియానుభూతార్థద్యోతిఁనమాద్యగం వినా" యనుచిం. లక్షణ మిట్టివానినే తిరస్కరించినది. నన్నయసమ్మతికి విరుద్ధ మయినను ప్రయోగములనుబట్టి గుర్తించుట యుచితమె. మిక్కిలియరు దగునిట్టివానికి సూత్రమున నవకాశము కల్పింపక వఝలవారును వివరణముననే ప్రస్తావించుట యుచితముగానె యున్నది. కానీ వీరు 'అను-బహుళముగాఁ గల దనుట సమంజసము గాదు. ఇట బహుళ మన నేమి? సూరిలక్షణములందు బహుళపదమును బెక్కుచోట్ల దిరస్కరించినవీ రిట సార్థకముగాఁ బ్రయోగించిరా? క్వాచిత్కముగా నిల్చుట గన్పించుటను జేర్కొనఁదగును. ఇది యేసూత్రముచేతను సాధింపఁబడునదియుఁ గాదు గదా.

వీరివివరణమును సరిగా లేదు. 'యకారము తుదిని గలకొన్ని ధాతువులు' అని పోయ ఆయ అని యుదాహరించు టేమి? ఇట ధాతువులు, అగు పోవు,అనునవిఇందుఁజివర యకార మేది? అగుపోవులకడ ప్రాతకిద్వక్రంబులు పరం బగునపుడు యకారం బగును (ఉ.క్రి.133) అయెను, పోయెను అని యకారము వ్యాకరణము సాధించినది. ఆసూత్రముచే నగుయకార మిద్వ

క్రములు పర మగునపుడె. 'అను' అనునది పర మైన యకారమే రాదు. పోయి అయి అని యగు నెట్లు?

తీయు పోయు మొదలగునవి యాంతములు. వీని కర్తృక్రియలు పర మగునపుడు సకార మగును. తీసెను. ఆట పీరు చెప్పినయీకార్యమునకుఁ బ్రసక్తియే లేదు.

కావున వీ రిట 'భూతార్థకప్రథమపురుషైకవచనములో యకారము పైని యుత్వమున కత్వ మొక్కచోఁ బ్రయోగదృష్ట' మన్న వనురీతిగా వివరించుట యుక్తము. వీనిని విశేషస్థలములుగా నెన్నఁదగును. ('గణానుగతి కోతోకోయటంచు' పనువాసినటె.

ఇట నొకవిశేష మిట్లు చెప్పిరి. "భవిష్యత్సామీప్యము మొదలగు కొన్నియెడల భూతార్థక్రియలు ప్రయోగింపఁబడుట గలదు. ఆ వచ్చె మద దృష్టాయుధుఁడు, మానవపతి న న్నెక్కడిదాసవు నీ వనిమె నేని అది యేల యవగుణ మయ్యెన్- ఇట అగున్ అని ప్రయోగింప నగును. విన్నెద్ది గఱ పిరి నెమ్మితోఁడ దావిన చేయుట ధర్మమె' -(ఉ.316)

ఇందు "నీ వనిమె నేని- అనుచోఁ జేదర్థయోగమున భావి ల్యర్థ నకు (క్రియా.119) వనుదానిచే లి ట్టయినది. విన్నెద్ది గఱపిరి యనుచో న్యూనవచోవాక్యమున వది యధ్యాహరింపఁబడఁగా వట్ల ల్యట్టునకు లి ట్టగును. భవిష్యదర్థమును జెప్పియుఁ బత్వాంతరమును పీరు లాడంతరూపముఁ (అగు అనురీతిని) జూపిరే కాని ల్యడంతమును జూపకుండుట గమనార్హము.

స్త్రీరత సూక్ష్మ మీ వ స్త్లైరూపున నైన వంశహీనత మమ్ముం జేరక యుండఁ దగఁ బరిహారము నేసి భరి యేల యవగుణ మయ్యెన్' అనుచోఁ బరిహారము నేసి యనుభూతక్రియ ననుసరించి 'అయ్యెన్' అని భూత

క్రియ ప్రయుక్తము. ఇట్టి బహిరంతరమున లాఘ్రూపమె. అద్యుక్త నిట భవిష్యదర్థము గల దనుట చింత్యము.

తా వచ్చె సుదర్శనాయుధుఁడు అనుచోఁ ద్వరితార్థమున భావిని భూతత్వము ప్రౌఢ. చెప్పుటను పై రీతి స్పష్టము చేసితి.

### చేసినానం మొ॥ :

చేసినాను- చేసినాము- చేసినావు అనునవి ప్రాచీనసమ్మతములు గావు. [ఒక్క రంగనాథరామాయణము దప్ప.] ఇవి సమాపకక్రియలవలెఁ జూపట్టును. వర్తమానభూతార్థములందె విధేయవిశేషణములం దిట్టిభేదము గల్గెను. భవిష్యద్విధేయవిశేషణములం దిట్లు చేయఁగలవు, చేయఁగలము, చేయఁగలను అనురూపములను మహాకవు లెవ్వరును ప్రయోగింపలేదు" [ఉ.365]

పోవఁగలా వనియు [సమీ.6.198] గోపాలుఁడు గలాఁడు [పాం.5.44], చావఁగలా రని శాప మిచ్చె [అను.1.198] మొ॥

చేసినావు అనురీతి వర్వాచీనకావ్యములం దఱచుగనే కలవు. సూరి వీనిని సాధింపలేదు. ఇవి విధేయవిశేషణము లనియుఁ గ్రియాపదములవలెఁ జూపట్టు ననియు వీరియభిప్రాయము. వచ్చినవాఁడను వచ్చినాఁడను- వచ్చినాను అనియే వీనియేర్పడినచరిత్ర అయ్యుండవచ్చును. కాని యిట్టియెడలఁ దచ్ఛబ్దవకారలోపముతోఁ దచ్ఛబ్దముపైని విభక్తియును లోపించిదాని కయిన యాగమములు [ను వు రు] మాత్రము నిల్చియున్న వని చెప్పుటకంటె శబ్దశాస్త్రోచితముగా లాఘవ మగుమార్గమునఁ గ్రియాపదములుగాసాధించుటయే యుచిత మనిపించు. పరులవా రన్నట్లివి క్రియాపదములవలెఁ జూపట్టుటయే కాక క్రియాపదములుగా నన్వయించుటలోనె సౌలభ్యము నధికము.

'వచ్చుచున్నవాఁడు' అనురీతిని విశేషణములుగా ప్రయుక్త మయినవే 'వచ్చుచున్నాఁడు' అని పై విధమ వర్తమానార్థకక్రియాపదములుగా

స్థిరపడినట్లే చేసినవాఁడు- అను క్తపదర్థకవిశేషణరూపములే చేసినాఁడు అని యై పిదపఁ గ్రియాపదములుగా స్థిరపడిన వనియు వీనిసామ్యమున చేసినావు చేసినాను- చేసినాము అనునవి మధ్యమోత్తమపురుషార్థములందుఁ గల్గిన వనియుఁ జెప్పఁదగును.

ఏ మైనను వచ్చుచున్నాఁ డనురీతిని వర్తమానార్థకక్రియాపదము అన్నట్లుగనే, చేసినాఁడు- చేసినావు- చేసినాను అనురీతిని భూతార్థకక్రియా పదములుగాఁ జెప్పుట సక్రమమె. చేసెను, చేసితివి- చేసితిని అనువానితో పాటు భూతార్థమున నీయవియుఁ గ్రియాపదము లగుట విశేషముగా గుర్తింపఁదగును.

'ఇట్టిరూపముల నర్వాచీనకవులు ప్రయోగించుటచే నేఁటి వైయాకర ణులు సంగ్రహించు టుచితమె' (వ్యా.సం.స.1357) యని గుర్తించిన వఝలవారైన సుద్ధ్యోతములో నీక్రియాపదములను సాధించిన బాగుండెడిది.

## లృదంతములు :

'కలనుకలము కలవు అన్నవి నన్నయభారతభాగమునఁ జూపట్టలేదు' (వ్యా.సం.స.1367) కావున చేయుచున్నావు అనురీతివానివలెనె చేయఁగల వనురీతివియు సూరి సాధించుట యుచితము గా దని పైరీతిగనె చెప్పిరి. (వ్యా.సం.స.1368) సూరి సాధించుట యుక్తము గా దనుచునే "చేయఁ గలను చేయఁగలము చేయఁగలవు అనురీతిరూపములు నేఁ డసాధువు లన రాదు. అట్టివి సయిత మర్వాచీనకవులచేఁ బ్రయుక్తము లయియున్నవి (వ్యా.సం.స.1368) [ఉ.367] యనిరి. ఇట్లు వీరు సూరి నన్నయభాషకు మాత్రమే లక్షణము చేయవలెఁ గాని యది మీర రా దని నియమించుటలో సామంజస్య మేమో తెలియకున్నది "ఎఱ్ఱాప్రెగ్గడ వందఁగలఁడు వందఁ గలరు అనురీతిని బ్రథమపురుషమునందుఁ బ్రయోగించెను. ..అమహాత్త్వ

మున నెల్లడను వండఁగలదు వండఁగలవు అనియె వాడిరి" (ఉ.366) (అమహదర్థమున విశేషణరూపముగ సాధించునవకాశమె లేదు.) అట్టి యెడల లృడంతములు ప్రథమపురుషలే కాని మధ్యమోత్తమపురుషక్రియలు లే వనవలెనా. తాము సాధించుచునే సూరిమాత్రము సాధింపరా దనుటయెట్లు? ఉ.లో సూరి సాధింపరా దని చెప్పకుండుట కొంత యుచితమ యగుచుసం.లో వీరు చేసినవిమర్శనమును విడిచిపుచ్చి రేమో. అది యుచితము.

ఆయుండఁగలను [శై.7.13]భేదంబు లె న్నైన, దెలుపఁగలము [రామా.2.120] నిర్వహింపఁగలనా నిను బాపి రఘూద్వహా [రామా.5.10] ఎట్లు వేడఁగలముయ్య [కాళ.3.129] ప్రీతి నాహారంబు పెట్టఁగలము [పం.1.252]మొ॥

## దుగాగమము :

'ఓడుదురు నీ విట వచ్చి యేల కదుస్'– దీనినిబట్టి ఉదు కాదు. దు అని విదిత మగును'– [వ్యా.సం.స.1375] దుగాగమ మనక ఉదుగాగమ మన్న స్వరయతి చెల్లవలయు నని యెంచి రేమో. కానిచో నీప్రయోగము 'ఉదు' గా దని నిరూపించు ననుట యెట్లు? ఎదు, ఎద మున్నగు నాగమస్థలముల నెత్వమునకె యతి గుదుర్చవలయునా? దీని గ–ప్పెద ఘనపాంశుజాలముల భీమశిఖావళి'– అని వీరే యుదాహరించిరే. ఇటవ్యంజన యతినిబట్టి ఎదగాగమము గా దన్న నారూఢ మగుట యెట్లు? ఉత్వము ధాత్వంతమున నిట నెల్లెడల సహజముగా నుండుటచే 'దు'వర్ణమునుమాత్ర మాగమముఁ జేయఁజాలము. కాన లాక్షణికులు 'దుతివర్ణకౌ క్రమాత్ స్తః' అను రీతిగా దువర్ణమును మాత్రమె విధించి రనఁదగును.

## ఎడుఁగెడిక్కులు :

ఎడుగెడిక్కులు కేవలవర్తమానార్థకము లనుసూరియాశయము సరి కాదు" [ఉ.385,వ్యా.సం.స.1378]అది సరి కాదు. ఇట సూరి వక్ష్యమాణ

విధిచేఁ బ్రాయికంబుగ వర్తమానంబునం దెడనాద్యాగమంబు అగు నని వివరించెను. ఇట నెడుగెడిక్కొలు మాత్రమె పేర్కొనఁబడలేదు. అవక్ష్యమాణవిధి [క్రియా.23] ఎదగాగమమును గూడఁ బేర్కొనుచున్నది. అదియుఁ గేవలము వర్తమానార్థమునసె యగు నని సూరియాశయమా? సూరి ప్రాయికంబుగా వర్తమానంబునం దనుచుండ నీయది కేవలము వర్తమానార్థమున నగు నని సూరియభిప్రాయముగాఁ జెప్పుట యసంగతము గదా. వర్తమానార్థమున వచ్చెదును వచ్చెదను అనురీతిని చటుదుగాఁ బ్రయుక్త మవుచున్న వనియు, ననఁగా వచ్చును. వత్తును అనురీతిని ప్రాయికముగా వర్తమానార్థమున లే వనియు [అరుదుగ నుండు ననియు] సూరివివరణవాక్యములవలనఁ దేలుచుండఁగాఁ దద్భిన్నముగా నర్థము సేసి యది సరిగాదను టుచితము గాదు గదా. కేవలవర్తమానార్థమునసే యగు నని తలఁచుచో సూరి యటులా క్రియా.28 సూత్రమున లాట్టురుఖపరం బగునపు డని సామాన్యముగా లాట్టని యేల చెప్పును వర్తమానార్థకలాట్టురుఖ అని చెప్పఁడా? ఇతరకాలములందు వీనిని వాడరా దని సూరియాశయము గానేరదు. (ఉ.367)

## భూతము-లాట్టు :

'వచ్యర్థంబుల కొకానొకచో భూతంబున లాట్టు గావచ్చి యొండు' నని సూరి యట వివరింపఁగా వీరు 'వచ్యర్థస్థలములందే కొక పెక్కుస్థలముల భూతమందును లాట్టురూపములు గన్పట్టుచున్న' (వ్యా.సం.స.1372) ననిరి. (ఉ.288) పెక్కువిరి కావి వించును- వింటివి (ఉ.268) ఒక్కటి సరియైనదిగాఁ దోఁచును. సం.లో 'నిత్యంబు నివేదింతురు తల్లికి'- నివేదించుచుండెడివారు. (వ్యా.సం.సం.వ.1376) అవి చూపిరి. వీ రర్థముగా నిచ్చిన 'నివేదించుచుండెడివారు' అనునదియుఁ దక్ష

ర్మార్థకవిశేషణరూపమే యగుట విశేషము. నివేదించినవారు– నివేదించిరి. అనురీతిగాఁ జూపఁదగును గదా. 'నిత్యము నివేదించి' యనురీతిభూతార్థకముగా నన్వయించుటకంటె నిత్యము నివేదింతు రనురీతి తద్ధర్మార్థకముగాఁ జెప్పుటయె యుక్తము గదా.

### ఉన్న :

చన్న, ఉన్న అనురీతివిశేషములను ప్రౌఢ. ననుసరించి వీరు చేర్కొనిరి. ఉంతుధాతువున క్రియావర్ణలోపరూపములు స్థలాంతరములందును గలవు. ఉండునది, ఉన్నది ఉండునేనిన్ ఉన్నేనిన్ ఉన్నన్– ఉండినన్– (ప.368) ఇందు. ఉన్నది, ఉన్నేనిన్ అన్నవి విశేషస్థలము లనవచ్చు. కాని ఉన్నన్ (ఉండినన్) అనున దట్లు గాదు. 'భేదార్థకనాంతం బయిన యుండుధాతువున కున్నాదేశంబు విభాష నగు' (క్రి.057) కావున నీరూపములు దానిచే సాధ్యము. వీరును ఉ.క్రి.87సూ.గా దీనిని చేర్కొనిరి. కావున నిట ఉన్నన్ అనునది చేర్కొనఁదలంచినను నాసూత్రసంఖ్య నీయఁదగును. ఇట వర్ణలోపము లేదు. 'ఉన్న' యున్నది మొత్త మాదేశము. ఉండునేని, ఉండునది యనుచోట్లఁ గూడ బిందుపూర్వకదువర్ణమునకు మొత్తమునకు నకార ద్విత్వమ్ము నాదేశము చేయుట లాఘవము.

### ఆశీరంతవచనాలు :

'ఆట్టుదున్ఙ్లాన కెరుతవర్ణంబులు ద్రుతాంతంబు లగు' (26)నను సూరిసూత్రమును మార్చి' ఆట్టుప్రథమద్విత్రాలకు ఎదురు, తన్ వర్ణకము లాశీర్వాదార్థములం దగును. (ఉ.37సూ)

సూరి యున్నాన కవిలయున్నపురుషలయం దన్నివచనములకును జెప్పఁగా వీరు ప్రథమపురుషయందు మాత్ర మేకబహువచనములు రెంటికిఁ జెప్పుట మొదటినవరణము. "లూఙాదేశము లగురుడుజాపురుషబోధకప్రత్యయము లన్నిటికిని నాదేశమును ఎదు–త– అది అనువానిని విధించుటచేత (ఇందు

అది సూరిదుర్జ్ఞానమునఁ జెప్పలేదు. బొట్టునకు మాఱుగా విధించెను.) సత్యాది పురుషత్రయమునందును ప్రయోగింప శక్యము లనునర్థము సూరిసూత్రమున దుర్వార మగుచున్నది. సూరిగారియుదాహరణస్వారస్యమును బట్టి ప్రథమపురుషమునందు మాత్రమె యేకత్వబహుత్వభేదము లేక ఎదుతలు వచ్చు ననియు..' (వ్యా.సం.ప. 1392) అని మొదలుగాఁ జెప్పుటంబట్టి వీరు సూరియుదాహరణముల ననుసరించి యీసవరణమునకుఁ బూనుకొనిరనవలెను. లక్ష్యములనుబట్టి లక్షణమునర్థము సంకుచితము చేయు టెట్లు గుదురును? ప్రథమపురుషయందు మాత్రమె యగునని సూరియుఁ దలంచినచో వీరివలె దుర్జ్ఞన కనక దుర్జ్ఞన కనుట యేల? అట్లనుటవలన నుదాహరణములయం దెట్టిస్వారస్య మున్నదో కాని సూత్రముమాత్ర మనర్థక మగుట లేదా? కాన సూరియభిప్రాయ మిది కాదు. ఏది యథార్థ మని వీరు పేర్కొనిరో యదియే సూరి లక్షణముచేఁ జెప్పినయర్థము. మధ్యమోత్తమపురుషలయందును నేకార్థ మున్నను రూపమె ల్లెడల సమాన మగుటం జేసియును సూరి ప్రథమపురుషకు మాత్రమె యుదాహృతు లిచ్చియుండవచ్చును.

దుర్జ్ఞలకు దుష్ట లగు నన్న 'పురుషము' లట్లే యుండునా? నీవు రాక్షసుఁడ వగుదువు మీరు అగుదురు అని మధ్యమపురుషయందు మాత్రము బహుత్వధ్యమపురులకు ముడుఙ్జా లవును గాన నిబ్బంది లేకపోవచ్చును. (కాని సూరిమతమున నొకపక్షమున నీవు రాక్షసుఁ డ వయ్యెదను రాక్షసుల రగుదురు అని యేర్పడురూపములు వీరిమతమున నసాధువు లగును.)

ఉత్తమపురుషయం దెట్లు? నేను దీర్ఘాయు వగుదును. మేము అగుదుము అని యుండునా? లేక యీయర్థములం దుత్తమపురుషక్రియారూపము లుండవా? నిర్ణయించిచెప్పమింజేసి దుర్జ్ఞల కన్న వీరిలక్షణము పై రీతి నప రూపములను సాధించుచున్న దనక తప్పదు.

సూరి 'లు' ట్టని సామాన్యముగాఁ జెప్పఁగా ఏ తాళెక్కాపార్థములందు

మాత్రమె చెప్పిరి. కాని లాడర్థములలో నొకటగు ప్రార్థనమునఁ బ్రథమ పురుషయందును ద్రుతము లల్లె యుండి హరి ప్రసన్నుఁ డగును, హరి హరులు ప్రసన్ను లగుదురు అనురీతిగా నుండవలెను. ఇవి యాశీరర్థకము లనుట కుదురదు గదా. (వ్యా.సం.ప.1393)(ప్రార్థనార్థమునఁ బ్రథమో త్తమపురుషక్రియ లుండ వని నియమింపలేదు.)

కావున వీరు ప్రథమయందె యగు ననియు, నాశీశ్శాపార్థములంద యగు ననియుఁ జెప్పుట సరి కా దని నిశ్చయింపఁదగును.

సూరి 'ఎడుతవర్ణంబులు ద్రుతాంతంబు లగు ననఁగా వీరు 'ఎడుమ తన్' అని విధించిరి. ఇందు తన్ సూరి విధించినదే. కాని భేద మొండు. (సూరివలె) వీరు ద్రుతము 'ను'వర్ణముగాఁ జెప్పిరి. ద్రుతాంత మగుచో 'తను' అని యుండవలె. వీరు పొల్లును (తన్) జూపిరి. నువర్ణమును జూపిన నం దవసానద్రుతస్వరలోపముతో 'తన్' అనునది సాధ్యమ యగును. కాక 'తన్' అని పొల్లనే విధించినపుడు 'నీబుద్ధి ధర్మైకనిష్ఠ గావుతను' (అను.5.442) (ఉ.360) అని నుస్వరూప మెట్లు సిద్ధించినదో వివరింపకయె వీ రుదాహరించుట విశేషము. 'తను' అని విధింపవలె నను టుచిత మె కదా.

సూరి 'ఎడును' విధింప వీ రది సరి కా దని 'ఎడుమ' విధించిరి. 'ఎడును' సరి కా దన్నమాట. (ఉ.370)

కలిగెడున్ మున్నరూపములు లోట్టుప్రథమపురుషైకవచనరూపములె యగుటచేతను లాడర్థములలో నాశీరర్థ మొకటి యగుటచేతను సూరి ప్రకృత సూత్రమం దుపదేశించిన 'ఎడున్' అనునది పునరుక్త మని శంకింపరాదు. నీకు బహుపుత్రులు కలిగెడున్ అనురీతివాక్యములందలికలిగెడున్ మున్న గునవి లాడ్రూపము లని సమర్థింపరాదు గదా. (వ్యా.సం.ప.1393) అని వీరు సూరి 'ఎడును' విధానమును సముచితముగా గుర్తించియును వీరు

బహుపుత్రులు కలిగెడున్ అనురీతివాక్యములు నన్నయాథర్వణసమ్మతములు గా మిలఁజేసియు సత్కవిమహాకవిప్రయోగములు లేమింజేసియు నయ్యవి సాధువులు కానేరవు. అట్టియెడల నీకు బహుపుత్రులుకల్గెదున అనియు ప్రయోగింప నగు నని దుమతాతావిత్యాద్యథర్వణవచనముచొప్పున గ్రహింపననగును' (వ్యా.సం.స.1384) అనిరి.

'ఎడును' లూట్టున రా దనుటకు వీరు చూపినవి రెండుకారణములు. అందు నన్నయాథర్వణసమ్మతము గా దన్న మొదటికారణము సరి యైనది కాదు. నన్నయాథర్వణులు సమ్మతింపలే దనుటకు వారు 'ఎడును' అని యుండరా దని నిషేధించిరా? అది గ్రామ్య మని చెప్పిరా? 'ఎడును' విధింపలేదు. అంతియ కదా. నన్నయాథర్వణులు చెప్పనిలక్షణభాగమై లేదా. వీరు ఉ.బో. జెప్పిన దెల్ల నన్నయాథర్వణులు చెప్పినదె యగునా? 'ఆ'మతుబర్థకము గా దనిరే. అది నన్నయాథర్వణసమ్మతముగాదు గదా. విరుద్ధ మైనది.

ఇంక రెండవకారణ మట్టిమహాకవిప్రయోగములు లే వనునది. వి.వి.కారికావివరణమున నింతకు ముందు ఇష్టసంసిద్ధి యయ్యెడు. పుట్టువు కొకుఁడెడు బ్రాహ్మణకులమునంద యయ్యెడు కాచుచుండెదున్ అని 'ఎడును చూపియేయుండిరి. (వ్యా.సం.స.1389) దీనినిబట్టి దుమాదులలో 'ఎడును' ప్రత్యయ మున్నట్లు వీరివచనములచేతనే చెప్పవలదా? ఇపు డివి యెల్ల ద్రూపము లందురా? 'దుమాదులకు' నుదాహరింప నవసర మేమి?

'పుత్రులు కలిగెడున్' వంటిప్రయోగములు లే వనుటయు నసంగతము. 'ప్రసన్ను లయ్యెడున్' అనునన్నయగారిప్రయోగమును వీరును ద్రు.ప్ర.బో. ప్రదర్శించిరి. అది తద్ధర్మక్రియ యని యట వారు విశదించిరి. అట్లనుట యసంగత మని మనము గుర్తించితి మటనే. ఇం కేల

వీరే వ్యా.సం.స.1382పుటలో, బైని జెప్పినసమన్వయ మది లాట్రూప మనుట యసంగత మని నిరూపించుచున్నది. అథర్వణుండు చెప్పిన గథ యని 'ప్రసన్ను లయ్యెదురు' యనియె నన్నయ ప్రయోగించియుండు ననియు సంస్కర్తలు ప్రక్షిప్తము చేసి రనియుఁ జెప్పుటకు నిట వీలు లేదు. అట్టియెడల గణభంగ మగును. ఇంక నది తిర్యక్కర్తృక మై బహువచన మునేకవచన మైనలాట్రూప మనుటకును వీలు లేదు. 'ప్రసన్నులు' అనుచోని మహత్త్వము బాధకమె కదా.

ఇట్లే "ఆశీరర్థమునఁ దద్ధర్మక్రియామాత్రమె ప్రయుక్త మవుచున్నది. వాసుకి మొదలఁ బ్రసన్నుఁ డయ్యెడున్" (ఆది.1.108) ఇట్లే 105, 107, 108 పద్యములలో నయితము ప్రయుక్త మయ్యె' (వ్యా.సం.స.1388) అనుట సరి కాదు. 'మహానుభావు లైరావత కోటిఫణిరాజులు మీకుఁ బ్రసన్ను లయ్యెడున్' (107పద్యము) అనునది లాట్రూప మగుట యెట్లు? పుత్రులు గలిగెదురనువంటిది కాదా యిది. 'వాసుకి ప్రసన్నుఁ డయ్యెడున్' అనునేకవచనము నుద్ధరించుటలో వీరు మిగిలినవానియందలి భేదమును గమనింపలే దేమో. ఇవి లాట్రూపము లనుట వారివివరణమునకును విరుద్ధమే.

గు.ప్ర. ఇట 'పతిహీన లైనభామినులు లతిధనవతు లయ్యుఁ గులజ లయ్యును ననలంకృత లయ్యెడు, మాంగల్యరహిత లయ్యెడుఁ గృపణ వృత్తి నిటియు మొదలుగాన్' (ఆ.ది4228) అనునన్నయ పద్యమును శాపార్థమున కుదాహరించె. ఇట 'అయ్యెడు' లాట్రూప మనుట గుదురునా? అసలు లాట్రూప మిటఁ గుదురునా? 'క్వచిద్ధర్మక్రియామాత్ర' మ్మనువి.వి. లక్షణమునకు 'నాశీర్వాదార్థమందు' (వ్యా.సం.స.1387) అని వీ రర్థము చేసిరి. మఱి శాపార్థమునఁ దద్ధర్మక్రియాప్రయోగ మథర్వణసమ్మత మన వచ్చునా? 'ఆశీరర్థేతు సమ్మతాః' అని చెప్పినదుమాదులను వీరు శాపార్థము నను జెప్పుట విశేషమె. అట్లే యిటఁ గూడఁ దద్ధర్మక్రియ శాపార్థమున నైన దందురు

అనలంకృతలు మాంగల్యరహితలు. తిర్యక్స్థదములు గాక, మహద్వాచకములు. వీనిబహువచనక్రియాపదము మహత్తునకువలెఁ గావలె. అట్టిచో 'లాతంత మగుస్త్రీక్రియ ప్రథమపురుషయందు బహుత్వమున అయ్యెదరు' అనురీతిగా నుండవలె. ఇది బహువచనమున కేకవచన మగుటెట్లు?

కాఁగా 'పుత్రులు కలిగెదున్' అనురీతిప్రయోగములు లేమింజేసి యనుట సరి కాదు. ఈనన్నయప్రయోగ మట్టిదె. ఇట్టిమహాకవిప్రయోగములకలిమి 'నన్నయాథర్వణీయ' లక్షణగ్రంథములు చెప్పకున్నను 'ఎదును' బూట్టునకు విధింపక తప్పదు. అథర్వణుఁడు చెప్పె నని ఎదుమ విశిష్టగణభంగము.

కాఁగా బహుత్వస్థలమునఁ గన్పించు 'ఎదున్' అనుదానివిభక్తియె వాసుకి ప్రసన్నుఁ డయ్యెదున్, అనంతుఁడు ప్రసన్నుఁ డయ్యెదున్ మన్నగురీతిగా నేకత్వస్థలములందలియెదున్నంతయుధాను లాత్రూపములు మాత్రమే యని నిశ్చయింప నక్కఱ లేదు. బూత్రూపము లనియుఁ జెప్ప వచ్చును.

'నాగపతుల నెల్ల నిట్లని స్తుతించి' (ఆది.1.108) అని ప్రారంభించుటనుబట్టి యాస్తోత్రమునందలియెదున్నంతయు ప్రార్థనార్థకములే యని వరుఖలవారు నంగీకరించిరి. కావున వీని నెల్లో యాశీరర్థకములుగా సమన్వయించుట సరి గా దని వారిపలుకులనుబట్టియె తెలియవచ్చును. కావున వీ రీసూత్రమునఁ బ్రార్థనార్థమును జేర్చకుండుట సరి కా దనుట స్పష్టము.

ఎదుమ :

ఎదుమ ప్రత్యయ మొకవేళ నంగీకరించినను, సూరి విధించిన ఎదును ప్రత్యయము చెప్పవలసియే యున్న దని స్పష్టము. వరుఖలవారు 'ఎదును' విధింపకుండుట యసంగత మనియు స్పష్టము.

'ఎదుము' అన్నది గల దనుటకు సాధార మథర్వణవచనము. 'పుత్రులు కలిగెదుము' అనియె యుంతవలె ననుటకు 'చంద్రాదిత్యులు... రక్షించెదు మెల్ల' నన్నది యాధారముగా (వ్యా.సం.స.1394) పరులవారు తలంచియుందురు. ఇక్కె 'సీతమ్మలందఱు లబ్ధజీవను లయ్యెదు మని (అర.7.459) కాని యిట స్వరపరకస్థితి గమనార్హము. సూరి 'ఎదును' ప్రత్యయము చెప్పి యచ్చు పర మగునపు డేఁతల ద్రుతమునకు మకార మును విధించెను. (కి.28) దానిచే పీరూపమునందలి మకారము బాల.సిద్ధ మగుచున్నది. 'ఎదుము' ప్రత్యయ మని చెప్పుటకు బల మైనయాధారము హలవసానపరకతయం దట్లున్న దానిని జూపవలెను. పైని 'అనలంకృత లయ్యెదు మాంగల్యరహిత లయ్యెదుఁ గృపణ- అనుచో హల్పరకత యందును ప్రసన్న లయ్యెదున్ అనుచో నవసానమునందును 'మ'కారము లేదు. ఇంక ద్రుతాంత మగు 'ఎదు' అనునదే ప్రత్యయ మనియు నిరూపించుచున్నవి.

'ప్రాచీనతాళపత్రగ్రంథములందును శాసనాదులందు ఎదుము కాన వచ్చుచున్నది. దుమకారాత్ కావృతాద్యాః అని యథర్వణుండును పఠించెను. (చ.370) తాళపత్రప్రతులనుబట్టి 'ఎదుము' ప్రత్యయ మందమా? "దుము అని కొన్ని యెడలఁ దాళపత్రమాతృకలలోఁ గన్పట్టుచున్నది. (వ్యా.సం.స. 1387) ఉండెదుము కప్పలు (హల్పరకతలో నిట ఎదుము కలదు) (శాపము. అను.3.143)--కొన్ని యెడలఁ గొన్ని తాళపత్రమాతృకలలో ఉండెదుము కప్పలు అని యున్నది. ఇట్టివానిని బట్టి యీ ప్రత్యయము దుమ అనియో దుము అనియో నిర్ణయింపరాకున్నది' (వ్యా.సం.స.1388) అనియుఁ జెప్పిరి. మఱి 'దుమ' యని చెప్పు టెట్లు. వి.వి.కారిక ననుసరించి యనఁదగును.

'దీవన చెదుమయ్య గాతయుఁ గావుత-[ఆ.భా.]అను అం.భా.ఆ. అభిప్రాయమును దిరస్కరించి వీరు 'అథర్వణకారికనుబట్టియు 'ఎదుము'

అనుస్థితి పరి పైయున్నట్లు తోఁచదు. 'ఎడుమ్' అనుదానినిబట్టి ఎడుము అనునదే నిజరూపము [స్వరూపము?] అనియుఁ దోఁచుచున్నది' [వ్యా. సం. స. 1389] యనిరి. 'ఎడుమ్' అనునదాశీరర్థకప్రత్యయముగా నంగీకరింప నిపీరు దానినిబట్టి 'ఎడుము' యన్నదె ప్రత్యయ మనుట విచార్యము.

ఈపాఠము వీరిసిద్ధాంతమునకు విరుద్ధముగా నుండుటచేఁ గాఁబో లును 'దీవెన లగునెడఁ గాతయుఁ గావుతయుం దెనుఁగుకవులకబ్బుఁబలెఁ శ్రీవెలిగెడు నధిపుఁడు మేల్గావించుం గాత మేలు గావుత యనఁగన్' [ఆం. భూ. 160] [వ్యా. సం. స. 1389] అని చూపిరి. ఇందు 'అగును' అన్నది యధ్యాహార్యము గావచ్చును. వీరిపాఠమున 'ఎడు'ప్రత్యయము చెప్పఁబడలేదు. కాని యిందలి 'శ్రీవెలిగెడును' అనునది ఎడు అనునాశీరర్థ ప్రత్యయ మైనందుల కుదాహరింపఁబడినది. నేఁ టిట దీవెన లగు నెడ గాతను గావుతనున్' ... శ్రీవెలిగెడు నధిపుఁడు... ఇత్యాదిగా నున్నది. ఇదియె లక్ష్యలక్షణములు సరిపడుచు నుచిత మనఁదగియున్నది.

భారతాదుల 'ఎడుము' ప్రత్యయ మనవచ్చునా? నన్నయప్రయోగ ములలో నెచ్చటను 'ఎడుము' కల దనుటకుఁ దగినయాధారము లేదు. 'పొందెడు మంచు, లగ్గయ్యెడు మని' రక్షించుచుండెడు వెల్లకార్యముల యందును, అయ్యెడు మరుగుండు (వ్యా. సం. స. 1389) అనురీతిగా నచ్చర కత్వమునందలిమకారము క్రియ. 28.చే సిద్ధము. వరుఖలవా రన్నట్లు 'పొం దుము + అంచున్ అనురీతిగా విభాగించిన (వ్యా. సం. స. 1395) నెల్లెడల సంధి నిత్యముగా నగుట విశేష మనక తప్పదు. నన్నయప్రయోగములలో హలవసానపరకతలో 'మ'కార మసలు గనఁబడకుండుటయు, నచ్చర కతలో నిత్యముగా సంధిలోనె కనఁబడుటయు వింత యనక లేదు. 'ఎడును' ప్రత్యయ మంగీకరింపకతప్పదు గావునను నచ్చరకతలో దాని ద్రుతమునకు మారి మకారమును విధించెను గావునను నిట మూర్ప్రణా

కలో లాఘవము సమగ్రతయు స్పష్టము. అచ్చరకతలోనియీమకారము నుద్దేశించియె యథర్వణుఁడు 'డుమ' ప్రత్యయ మన్నచో దానికంటె సూరి విధాన ముచితము.

ఎఱ్ఱనాదులును 'ఎడుమ' ప్రయోగించినజాడ లేదు. తిక్కనప్రయోగములందు మాత్రము వీరు 'ఎడుమ' చూపిరి. ప్రసన్నుఁ డయ్యెడుమ నీకు (శాంతి.4.222) వైభవము నయ్యెడుము నీకు (అను.2.187) పెక్కుతునియ లయ్యెడుము యనవుడు (సౌప్తి.2.121)

అయ్యెడుమ నాకు ననుచో అయ్యెడును నాకు అని భారతసంశోధిత ముద్రణము చూపినది. దీనికిఁ బాఠాంతము 'అయ్యెడమ' అని యిచ్చె. అయ్యెడుమ యనుచో 'అయ్యెడుమ' [అయ్యెడము] అనియె పెక్కుప్రతుల నున్నట్లు పేర్కొనె.

ఇట్టి వివాదగ్రస్తములనుబట్టి 'ఎడుమ' ప్రత్యయ మని సాధారణముగా విధించుట యుచితమా? అది భాషాసామాన్యలక్షణమున కనుగుణమా? 'బుగ్గిగాను' అనురీతివానికంటెఁ గూడ మిక్కిలి క్వాచిత్కము అనఁదగినయిట్టిస్థలములను విశేషముగా గుర్తించుట యుచితము. ప్రచురమై కవిప్రయోగప్రసిద్ధమైన 'ఎడుమ' అనుదానిని సామాన్యముగాఁ జెప్పి యచ్చరకతలో మకారముతో నిట్టిప్రయోగములను సంగ్రహించినసూరి లక్షణము లక్ష్యానుగుణమై యథాతథముగా గ్రహింపఁదగియున్నది.

'డుమకారాదిక్వాదికారికను సరిగ గ్రహింపమింజేసి' [వ్యా.సం.స.1895] సూరి భిన్నముగాఁ జెప్పె. ననువచులవారియభిప్రాయము సరి కాదు. అర్థము కొఱంతుట కొలక్షణమున గూఢత యేమి? ఉన్నను సూరి సరిగా గ్రహింపలేదనుట సాహసము కాదా? [డుఙ్మకారౌ' యని కవిజనమందన పాఠము] సరిగా గ్రహింపనివాఁడు ఎడుమ, తమ అని విధించు టేమి? అచ్చరకత్వమున శ్రుతమునకు మకారమును జెప్పు టేమి? శ.ల.సం.లోను సూరి 'తవర్ణకం బాశీస్సులందు సర్వవచనంబుల కగు. ఎడువర్ణకం

కొండె, —(53,54) ఎదుతల ద్రుతం బచ్చురా మకారం బగు. (క్రి.33) అనురీతి నిట్లు చెప్పె. ప్రయోగానుసారముగా భాషాలక్షణమును సముచితముగా గ్రహించియే సూరి యిట్టియేర్పాటు చేసె నని గుర్తింపఁదగును.

సూరి 'ఎదుసు' విధించుట యుక్తము. ఎదుమ లేదా ఎదుమ అను రీతి నొక్కొక్కచో నుంట సయ్యది విశేషస్థలముగా నెన్నఁదగు. (చూ.కావ్యశతము.) దుమకావులాపాశిషి (వై.సం. అవ్య.9.) లక్షించెదు ముమున్న.

విధ్యర్థమున విశేషవిధి యారంభింపఁబోవుచున్నాఁడు గావున సూరి యిట నాశీర్వాదసంప్రార్థనముల నుదాహరించెను. కావున 'లూట్టుడుజ్జు' అని చెప్పినను నాశీర్వాదసంప్రార్థనములు మూఁటనే యాకార్య మగును. పరుషులవారు సంప్రార్థనమును తొలఁగించి యాశీర్వాదములు రెండే పేర్కొనిరి. అది సరి గా దని వారివచనములతోనె గుర్తించితిమి.

కాఁగా సూరిలక్షణము సూక్తము.

## విధి :

'విధియందు లూట్టునకు మూఁడుగ నది యనుతచ్ఛృద్ధింబును ముందు నుగాగమంబు నగు (27) నను సూరిసూత్రమును వీరు "లూణ్మర్ధ్యమపురుషలచో విధిప్రభృత్యర్థవిశేషములందు ద్రుతపూర్వక మగు అదిశబ్దము నిల్చును." (ఉ.35సూ) అని పేర్కొనిరి.

"సూరిగారియుదాహరణస్వారస్యమునుబట్టి —ద్రుతపూర్వక మగు నదిశబ్దము ప్రథమమధ్యమపురుషములందు మాత్రమె వచ్చు ననియు— విధ్యర్థమునందు మాత్రము వచ్చుననియు సూరి తలఁచినట్లు తోఁచుచున్నది. —ద్రుతపూర్వక మగు అదిశబ్దము విధ్యర్థమందే గాక ప్రార్థనాద్యర్థవిశేషములందును మధ్యమపురుషమందు మాత్రమె వచ్చుటయు మహాకవిప్రయోగములందుఁ గన్పట్టుచున్నవి' [వ్యా.సం స.1392]

సూరి 'విధియం' దని చెప్పఁగా వీరు విధిప్రభృత్యర్థవిశేషములం దనిరి. ఈయర్థ మనవసరమె యని తోఁచుచున్నది. 'ద్వారవతినుండియును విడ నారసియుంచునది దానవాంతక' (పఞా.2.82) అనురీతిస్థలములలో విధ్యర్థ మనుట యుచితము గాదు. ప్రార్థనార్థము.

కాని యిద్దానికై వీరు 'ప్రభృత్యర్థవిశేషములం' దనుట యుచితముగాఁ దోఁపదు. "లూట్లు పురుల కనుటచే విధి యూదర్థ మనుట స్పష్టము. "ఆశీశ్శాపసంప్రార్థనవిధులందు లూ ట్టగు" ననుచో విధి దివ రిదిగాఁ జేర్కొనఁబడినది. విధిప్రభృతు లనుచోఁ బ్రభృతిశబ్దముచే నేది గ్రహింపవలె. ఆశీశ్శాపార్థములం దీ'అది' కానరాకుండుటచే వీరు 'సంప్రార్థనవిధులం దని స్పష్టముగాఁ జెప్పఁదగును గదా.

వీరు 'అనుష్ఠించునది ఇత్యాదులలో నుపదేశ మర్థ మనియు, నన్నుఁ బ్రియమ్ముగ నిచ్చునది యనుచో సమ్మతి యనియు' మున్నుగా "ఇట్టి యర్థవిశేషము లింకను బెక్కు గలవు గావున నర్థవిశేషద్యోతక మవు నని యథర్వణుఁడు (ఆదిశబ్దప్రయోగస్యార్థవిశేషార్థే నిరీక్షితే) వచించుట యెంతయు సమంజసముగా నున్న దనియు (వ్యా.సం.స.1391) వీరు పేర్కొనిరి. అనఁగా విధిప్రభృత్యర్థవిశేషములం దనుచో నుపదేశాదులు ప్రభృతిశబ్దముచే నుద్దేశించి రేమో. కాని వి.వి.మార్గము వేఱు. "తద్ధర్మప్రవర్తమైకత్వవాచకార్థక్రియావదా" త్తని చెప్పుటచే నది యెట్టియర్థవిశేషము లైనను దెల్పునవు నేమో. ఇది ప్రత్యేకలకారమున నుపదేశింపలేదు.

కాని యిట వీరు "లూట్లుపురులచో" అనుటవలన లూట్లున కాదేశ మయినపురులనే గ్రహింపవలెను. ఉపదేశాద్యర్థములు సంగ్రహింపఁబడు నన్న ముం దన యాయర్థములలో లూట్లు విధింపఁబడవలెనే. అది లేకుండ లూట్లున కాదేశ మయినపురులచో వచ్చుఆదిశబ్దమునకు విశేషార్థ మెట్లు వచ్చును?

అథర్వణుఁడు చెప్పినదే సమంజస మని తలఁచుచో వీ రిట లూట్లు

కెల్ల రట్లు నిత్యసంధిని ప్రయోగించి రని సమర్థించుటకంటె నీసూరిమార్గ ముచితము కాదా?

వఝులవారు పొరపడిరి గాని యాశీరర్థమున 'ఎడుము' ప్రత్యయము ప్రత్యేకముగాఁ జెప్పవలసియె యున్నది. అట్టియెడల 'ఎడుము' ప్రత్యయమందలి 'మ' వర్ణమునకు హలవసానపరకతలో ద్రుతమును, (అచ్పరకతలో నిత్యసంధియు) జెప్పవలె. లేదా ఎడుమప్రత్యయముతోపాటు "ఎడును" అనునది వేఱుగా విధింపవలె. ఆరెంటికంటె సూరిమార్గము లాఘవముతో నుచితముగా లేదా? వఝులవారు "ఎడును" ప్రత్యయమును గుర్తించిన సూరివిధానమునందలి యౌచిత్యమును గుర్తించెరికా యనవచ్చును.

### కావృతము :

ఒనరించుచుండుఁ గావృతమ యఖండితముగ (ఆది.8.83) ఒనరించుచుండుఁ గావృత స్సఖండితముగ- నని కవిప్రయుక్త మనఁదగును. "కావృతాదులలో నిమకారస్థితి విశ్వసనీయము కాదు" (వ్యా.సం.వ.1389) ఇట్లు వీరు నన్నయప్రయోగమునెడలను గవిప్రయుక్త సునుచు నింకొక పాఠమును సృజించుటలో విశేషము లేకపోవచ్చును. ఇందుఁ దమసిద్ధాంతముతో విరోధము గల్గి యిట్లు చేసిరనవచ్చు. అట్టివిరోధ మేమి?

అథర్వణాచార్యుఁడు వీనిని వివరించుటలో "డుమ" అనుదానిని మాత్రమే మవర్ణఘటితముగఁ జేర్కొని తక్కినవాని నట్లు పేర్కొనకుండుటచే డుమేతరములందు మవర్ణస్థితి లేదని తోఁచుచున్నది. వీనిలో నెద్దాని యందును మకారస్థితిని విర్వహింపఁజాలు ప్రామాణికకవిప్రయోగము గానరా కాని ముద్రణములందే గాక తాళపత్రమాతృకలందును వీనిలో మకారస్థితి కన్పట్టుచున్నది. డుమలోనిమకారముమట్టి సామ్యముచేఁ దక్కినకావృతాదులందును స్వరసంధిలో మకారస్థితి యర్వాచీనులచేఁ బ్రక్షిప్త మగుచు

వచ్చె నని తోఁచుచున్నది. ఇష్టసిద్ధులఁ జేయు నెల్లప్పు డీశ్వరుఁడు మున్నగుచోటులందువలెనె చేసెదున్- చేసెదిన్ మున్నగువానియందును మకారాభావము న్యాయ్యము. ఇట్లగుటచేతనె గదా దుమ అని మకారఘటితము నధర్వణుఁడు విధింపవలసెను. కాఁబట్టి కావుతాదులద్రుతమునకును స్వర పరకతలో మకారాదేశము రానేర దనుట యుక్తము' (వ్యా.సం.స.1387) అని విస్తరించిరి.

దుమేతరములలో మకారస్థితిని నిర్వహింపఁజాలుప్రయోగమె లే దనుట సరి కాదు. ముద్రణములందే కాక తాళపత్రప్రతులందును మకారము గల దని వీరె చెప్పుచుండిరి కదా. పైఁగా 'స్వరసంధిలో మకారస్థితి' యనుట స్వరపరకత్వమున ద్రుతమునకు మకారము చెప్పినయీసూరివిధానము సమంజస మని వారివాక్యములె నిరూపించుచున్నవి. 'అయ్యెడుమ నీకు' ఇత్యాదిగా నెల్లెడలఁ గానవచ్చినను సట 'అయ్యెడును నీకు' అనియె కవి ప్రయుక్త మని చెప్పుచో 'ఎడుమ'ను నిర్వహింపఁజాలుప్రయోగము మాత్ర ముండును. (అయ్యెడుమ యనవుఁ డనుచో నర్థవిశేషము చెప్పుదుము.) తాళపత్రప్రతులం దున్న దని 'దుమ' యంగీకరించినవీ రందె యున్న స్వర పరకతలోనిమకారము నంగీకరింపకపోవుట సక్రమమా? ఇట్లుండుటనుబట్టి యే సూరి ద్రుతమునకు మకారము విధించె నని గ్రహింపఁదగదా?

ఈమకార మర్వాచీనులచేఁ బ్రక్షిప్త మయిన దనుటయు విశ్వసింప రాకున్నది. తాళపత్రప్రతులందును నర్వాచీనులే ప్రక్షిప్తము చేసి రను టెట్లు?

'స్వరసంధియందే ప్రక్షిప్తము చేయు టేమి? హల్పరకతలో నేల చేయలేదు. గణభంగ మగు నని కాఁబోలును. అనఁగా మకారము పైస్వర ముతోఁ గూడియె యుండును గాని విడిగా 'మ' యని యుండ దన్నమాట. ఇదియు సూరిమకారవిధానమును సమర్థించుచున్నది.

దుమలోనిమకారము సామ్యముచే స్వరసంధియందుఁ బ్రక్షిప్తము

చేసి రనఁగా 'తుమ' యన్నది కూడ స్వరపరకతలోనె యున్నదని మీరు నంగీకరింతురా? (హల్పరకతలో అమ్మెయ్యకుండు నీకు ననురీతి ద్రుతమువర్ణము కవిప్రయుక్త మందు రని కాఁబోలును మీరు స్వరపరకస్థితిని జేర్చినారు.) హల్పరకత్వమునను 'తుమ' అని యుండఁగా 'త' వర్ణముపై స్వరసంధి యందు మాత్రమె మకారమును ('మ' వర్ణమును గాదు) ప్రక్షిప్తము చేయు టేమి? 'సామ్యము' స్వరపరకతలో మాత్రమె యనుసరించుటకుఁ గారణ మేమి?

ఇష్టసిద్ధులఁ జేయు నెప్పు డనుచో మకారము లేదు గావున చేసె దున్. చేసెడిన్ అనుచోట లేకుండుట న్యాయ్య మనిరి. ఈ రెండింటికి సామ్య మేమి? చేసెడిన్ అనుచో మకారమును సూరియుఁ జెప్పలేదు. చేయు నెప్పు డనుచో చేయు నన్నది తద్ధర్మక్రియ. చేసెడిన్ అవి చూపుటను బట్టి మీ రిటుఁ జేర్చినన్న 'చేసెడున్' అనునదియుఁ దద్ధర్మక్రియయే తద్ధర్మక్రియలో ద్రుతమునకు మకారమును సూరియుఁ జెప్పలేదే. కావున నీ తద్ధర్మక్రియలలో ద్రుతమునకు మకార మవుట న్యాయ్యమె కాదు. లక్షణ విరుద్ధమును. ఇట్లనుటను బట్టి బూట్టులోని 'చేసెదును' అనుచో ద్రుతమునకు మకార మగుట న్యాయ్యమె. లక్షణానుగుణమును. కాఁగా బూట్టులో మకారము లే దనుటకు మీరు లాద్రూపములను జూపుటచె న్యాయ్యము గా దని గుర్తింపఁదగును.

బూట్టులో (ఎదు) 'త' ద్రుతమునకు మకారము కల్పించుచున్నను లే దనుట కథర్వణుఁడు తుమవలె 'తమ' అని చెప్పకుండుటయె కారణ మనవలె.

అథర్వణుఁడు చెప్పకున్నను 'తన్' ప్రత్యయమును మీ రిటు విధింప లేదా? ప్రయోగములనుబట్టియే కదా. అట్లె యథర్వణుఁడు 'తుమ' అని మాత్రమె చెప్పినను 'తన్' వర్ణకమందును ద్రుతమున కల్పరకత్వమున మకారమున ప్రయోగానుగుణముగాఁ జెప్పు టుచితమె కదా.

కాఁగా నిట్టి మకారము లేదనుటకు వర్ధులవారు చూపినకారణములు విరుద్ధార్థకము లై సూరివిధాన ముచితము యని నిరూపించుచున్నవి.

'కనుఁగావృత మంచు (అను.3.34) కనుఁగావృత నంచు. అని ప్రయుక్త మన్నదగును. ఇచ్చుచుండుఁ గాత మివ్వసుమతి (హరి.పూ.1.124) ఇచ్చుచుండుఁ గాత నివ్వసుమతి అని కవి ప్రయుక్తపాఠ మనఁదగును. పయిప్రయోగములం దెల్ల మకారఘటితపాఠమువలె తాళపత్ర మాతృకలందును గలవు' (వ్యా.సం.స.1990) అని గుర్తించినవీరు కవి ప్రయుక్తపాఠములనుచు నున్నవానిని దిద్ది వానిని సాధించుసూరిలక్షణము నిరాధారముగాఁ దిరస్కరించుట యనుచిత మనక తీఱదు. ఇట్టి ప్రయోగము లను దిద్దివేసిన వీరిగ్రంథమున మాత్రము 'కవిప్రయుక్తపాఠములలో' మకారము గానరాదు గాని పూర్వగ్రంథములందు మకారము కలదు. కాన సూరి యట్లు విధించుటయే సమంజసము. వీరు దీనిని దొలఁగించుట కవి ప్రయోగవిరుద్ధము గాన సంగీకరింపరాకున్నది.

ఇంతకును 'గావృతమ యఖండితముగ' నన్నది బాల సాధ్య మగుట యెట్లు? తిక్కన్నగారియొండురెండు 'డుము' ప్రయోగములవంటి దగునా యిదియు.

కాని యిటఁ గూడ నచ్చరకతలోనె మకార మయ్యె నని తోఁచు చున్నది. "దానహోమజపవిధానములఁ దన కిపి గలవ యేని ధరణీవలయ రాజ్య మింద యుండి ధర్మనందనుఁడొనరించుఁ గావృతమ యఖండితముగ" అనుచోఁ బద్యమునఁ బూర్వస్థలముల ననుసరించి యిటఁ గూడఁ గావృతను అను క్రియాపదముపై నవధారణార్థక మగు 'ఆ' శబ్ద ముండఁగా కావృ తను + ఆ అనుచో నచ్చు పర మయినది గావునఁ బ్రస్తుతసూత్రముచే ద్రుతమునకు మకార మై 'కావృతమ' యని యయ్యె ననవచ్చును. దీనికి సంధి రాదు గావున కావృతమ యఖండితముగ. 'ధరణీవలయరాజ్యమును

దప్పక యొనరించుచుండుటఁ గావున' ననురీతి నన్వయము సముచితము గనే కుదురుచున్నది.

'పెక్కు' చునియ అయ్యెడును యనవచ్చును. అయ్యెడును నీకు సల్పారి తక్కన ప్రయోగములను ని ట్లవధారణార్థక మగు 'అ' శబ్దముతో నన్వయించిన సుచిత మగు నేమో పరిశీలింపవలె. అవు డీవియు నిట లక్షణసాధ్యములు గానివిశేషస్థలము లనవలసినయక్కఱ యుండదు. ఎఱుము, ఎడము యనురూపములను గొన్నియెడల నిటఁ బాఠాంతరములుగా నుంచుట విశేషమె.

## ఇంద:

లాణ్మద్యమవ్వరులకు ముఖ్యుడగు (28)ననుదాని నట్ల గ్రహించిరి. (శ.3రసూ)

"ఇందలిమువర్ణకమునకు లోపము పాక్షికము. రక్షింపుము-రక్షింపు. ఇందము-ఇంద (-ఇదిగో పుచ్చుకొమ్ము.) సూ.రా.నిఘంటువు దీని నవ్యయ మనెను. ఇందధాతురూప మనుట యుక్త మని తోఁచును" (శ.371) మధ్యమమువర్ణకమున కెల్లయెడల లోపము వికల్ప మని తలఁచుటచే వీ రిట్లు పేర్కొనియుందురు. ('న ప్రాణే తు కదాచన' యనునథర్వణవచనమునకు విరుద్ధముగ నైనను వీరు స్వరపరకతలో ముల్లోపము చెప్పుట విశేషమె.)

'ఇంద' ధాతు వనుట విచార్యము. 'ఇంద' అనుధాతువు గానరాదు. దీనికి వర్తమానాద్యర్థములందు రూపములును లేవు. శ.ర. ఇందము. దే.స.క్రి.వి. అని చెప్పె. దానినిబట్టి వీరు విది ధాతునిష్పన్న మని తలంచియుందురు. శ.ర.క్రియ యని చెప్పినను నిపాత మనుట యితరరూపములు

లేకుండుటవలనన గానచ్చును. ఇట దీనిబహువచనాంతరూపమును శర. ఇందలికి 'మొ॥ అని చెప్పెం గాని ప్రయోగము నీలేదు. మొదల లగున వేవో యస్పష్టము. 'ఇందము' మధ్యమపురుషైకవచన మన్నను నిందే ఇందఁడు ఇందండు అనుబహువచనాంతరూపములు లేవు. అందుకే సూ.వి. ఇది యవ్యయ మని యుండు. 'శార్ఙ్గ మింద. అనుచో ములోపమునుబట్టి యిది బాణార్థర్యమైకవచన (వ్యా.సం.న.1399) మనుట పొసఁగునా? స్త్రీసమక్లీబ సమములుగా నెంచుచో ఇంద, ఇందము అని రెండురూపములు నగును. ఎట్లయినను నిట ధాతువు 'ఇంద' అని చెప్పుటకుఁ దగినయాధారము లేమి దీనిని ధాతునిష్పన్నముగాఁ జెప్పుట విశ్వసింపరాకున్నది. ('కో'మత్తు రూపాంతర మైన 'కో'తోఁ గూడి 'అదిగో' నిర్దేశవాచక(అవ్యయ)ముగా వీరును జెప్పిరి.(పు.180)

## పండుదము :

"ఉభయప్రార్థనంబున దుగాగమంబున కత్వం బగు" (80)నను సూరిసూత్రమును వీరు "ఉభయప్రార్థనంబున బొట్టునకు దుగాగమంబును దానియుత్వంబునకు కత్వంబు నగు" (పు 37సూ) నని సవరించిరి.

"సూరి -- ప్రార్థనార్థమున దుక్కును విధింపలేదు. ప్రార్థనార్థము బొట్టె కాని లొట్టు గాదు గదా" (పు.371)అందు కని వీ రిట దుగాగమ మును ప్రత్యేకముగా విధించి రన్నమాట. "సూరి లాదర్థములలోఁ బ్రార్థ నార్థమును వేఱ్కొనియుండలేదు" (వ్యా.సం.ప.1408)కాని "యాశీరాదులు" అనుచోటియాదిపదముచేఁ దద్ధర్మాదులలోఁ బ్రార్థనార్థమును సంగ్రహింప రాదా? సూరి లొట్టుసూత్రము నట్లు గ్రహించి వీరును దద్ధర్మాదులలోఁ బ్రార్థనమును వేర్కొనలేదు. కాని "వాసుకి మాకుఁ బ్రసన్నుఁ డయ్యెడున్" అనురీతిని లొట్టుయొక్క ప్రథమపురుషైకవచనరూపము లని చెప్పుంగనగు (పు.370) ననిరి. మఱి ప్రార్థనార్థమున లొట్టు గాక పోవు టేమి? ఆశీరాదు లన్నప్పటియాదిశబ్దముచేతనె వీరును బ్రార్థనమును గ్రహింపవలెఁ గదా.

మూల మయినసూరిలక్షణమున మాత్ర ము శ్లీల గ్రహింపరాదు.

అది యటుండఁగా సం.లో వీరు "సంస్కృతవ్యాకరణవ్యాఖ్యల పద్ధతి ననుసరించి ప్రాప్తమున దుక్కును కత్వము విధించినసామర్థ్యముచే "అత ఏవ దుక్" అనురీతి నుభయప్రాప్తమున దుక్కును ఘటించుకొన వలయును (వ్యా.సం.స.1405) అని ప్రస్తుతసూత్రముచేతనె దుక్కును సాధించిరి. ఇట్టిపద్ధతి తెలుగువ్యాకరణవ్యాఖ్యలయందును గలదు. "కేషాఞ్చిదుదన్తానాం నేతివిభక్త్యావునోలుక్ స్యాత్" త్వనుచిం. సూత్రవ్యాఖ్యయం దహో. "ఉకారాన్తాత్ నవర్ణకవిధానమిత్యత్ర 'ఇదమేవసూత్రం జ్ఞాపకమ్'" (కవిశి:483) అనెను. "కేషాఞ్చిదుదన్తానామ్.. అనుజ్ఞాపకసూత్రముచొప్పునఁ గొన్నియుదంతములపైని మాత్రమె నప్రత్యయము నిల్చును. (వ్యా.సం.స. 507,) ఉదంతజడవాచకములకు నన్ అనుసప్తమీవిభక్తివచ్చు ననుటకును నీసూత్రమె జ్ఞాపక మగుచున్నది' (వ్యా.సం.స.827) అని వీరును నట్లే వ్యాఖ్యానించిరి. నన్నయాదు సమ్మతమైయున్నయిట్టిపద్ధతిని బాల.లో నమన్వయించుటకు బాధ యేమి?

సూరిలక్షణమున దురుక్తి లే దని ముందు గుర్తింపవలెను. ఆ శ్లీల యని వీరు స్పష్టముగాఁ జెప్పఁబూని రందును దోషము లేదు. కాని వీరిలక్షణము దోషగ్రస్త మయియున్నది.

వీరు దమసూత్రమున 'లూట్టునకు దుగాగమంబును' అని దుగాగమమును లూట్టునకే విధించిరి. ధాతువున కనునధికారసూత్ర మున్నను నీసూత్రమునఁ బ్రత్యేకముగా 'లూట్టునకు' అని నిర్దేశించుటచే ధాతువునకుఁ బరమైనలూట్టునకె దుగాగమ మగును. దు(క్) కిత్తు గావున లూట్టున కంత్యావయవముగా నయి వండు + ల్ + దు.. వండుముదు- వండుముద- యను రీతిని గావలె. ఇది యసంగతము గదా. 'లూట్టునకు' అనుట యనర్థకము. లూట్టు పరం బగు నపు డన్నఁ గొంత మేలు.

ఇంక వీ రిటుఁ జెప్పినబూనిరిట్ట్ ప్రార్థనార్థమున లూట్టుమాత్రమె

యగును. కావున 'ఉభయప్రార్థనమున' ననుటచేతనే యీ ట్టిది స్పష్ట మగును గావున సూత్రమున దానిని మఱల ప్రస్తావింప నక్కఱయే లేదు. ఉభయప్రార్థనంబున దుగాగమంబును- అనుకీరుగా మాత్రమె చెప్పినఁ జాలును. సూరి యీట్టులో దుగాగమము చెప్పకుండఁగా దాము చెప్పుచున్న ట్లు చెప్పుటకై వీరు సూత్రమునను 'యీట్టునకు' నని చేర్చుటచే నీయనర్థము వాటిల్లిన దని గుర్తింపవచ్చును.

ఇట్లైె వీరు సూరిసూత్రముకంటె విశేషముగా 'దానియుత్వంబున కత్వంబు నగు' ననుచో 'నుత్వంబున' కనుదళము నైతము స్పష్టతకు మాత్రమె. అత్వ మేకాల్లు గావున నంత్యవర్ణమునకె కదా యవును. 'ఉభయప్రార్థనంబున దుగాగమంబును దాని కత్వంబు నగు' నని మాత్రమె సూత్రించిన నుద్దిష్టార్థము సముచితముగ సిద్ధించెడిది.

'అత్వంబు నగు' అనుచోటనుశబ్దము పూర్వోక్తమగుదుగాగమము తోడిసముచ్చయమునకై వీరు ప్రయోగించిరి. కావున సూరిమతమునవలె వీరిమతమునను దుగాగమమున కత్వము నిత్యమె. "ఉభయకర్తృకప్రార్థన స్థలములం దెల్ల అత్వము కలుగుచుండును. (వ్యా.సం.వ.400) అట్టిచోట వీరు దుగాగమ మని యుత్వముతోఁ జెప్పి దానికి నిత్యముగా నత్వము చెప్ప నేల? ఆగమము నెట్లును ప్రత్యేకముగా విధించుచుండిరి గావున నత్వ ముతోనె విధించిన నుత్వమున కత్వము చేయుగౌరవము తప్పెడిది గదా. (ఉభయప్రార్థనంబున దగాగమం బగు' నని మాత్రమె సూత్రించినఁ జాలదా?)

ఉభయప్రార్థమునందు మాత్రమె వీరు దుగాగమమును విధించుటచే నితరము లగులాడర్థములలోను, నితరపురుషవచనములందును. దుగాగమము ప్రవర్తిల్లుటకే యవకాశము లేదు. కావున నితరత్ర యుత్వము లేక పోవుటతో దుగాగమవిధానము ప్రయోజనవంత మగు నని తలఁప నవకాశ మును లేదు.

వి.వి.లోఁ దద్ధర్మార్థకరూపమునందే ప్రార్థనమున 'ఉభయార్థే భవే దత్వ' మ్మని యత్వము చెప్పె. లాతర్థమునందుఁ బ్రార్థనమును జెప్పయు విట వీరు సూరి ననుసరించి యుచి లాఙ్రూపముగనె సాధించిరి.

సూరిమత మేమి? తద్ధర్మాదులలోఁ బ్రార్థనమును సూరియు సమ్మతించిన నాతఁడును దీనిని లాఙ్రూపముగా సాధించుట యనవసరమే యగును. లాడంతరూపములు సాధించుసందర్భమున లక్ష్యాంతములకుఁ బూర్వము, సంతకు ముందు చెప్పవలశారములయొక్క క్రమములోను దీనిని సాధించుటమట్టి 'వండుద' మన్నది లాడంతముగనే సూరి యుద్దేశించె ననక తప్పదు. (ఉభయార్థము విశేష మైన లక్ష్యాంతములకును విడవ నిది చెప్పవలె.) తద్ధర్మాదులలోఁ బ్రార్థనమును సూరి యుద్దేశింపలే దనవలె. అందుఁ బరిగణింపకుండుటయె కాక లాడర్థముల నుదాహరించు సందర్భమునను బ్రార్థనమును జూపలేదు. ఇంక పరులవారు 'ప్రార్థనార్థక మగు లాఙ్రూపముగాఁ జూపిన 'ప్రసన్నఁ శయ్యేఽహమ్' అను నదియు సూరి 'ఏతు' ప్రత్యయముగాఁ జెప్పి లాడంతముగనె సాధించెను. కావున నివి లాఙ్రూపము లనువరులవారియభిప్రాయము సూరికి సమ్మతము గా దని నిశ్చయింపనగును. అది యుచితము.

ప్రార్థనార్థమున దుగాగమముతోడిరూపములను గానరావు. 'మనకు వండవలసియున్న దని తెలిసియున్నచో మన మప్పుడే వండుదము' (వ్యా.సం.స.1400) వండుదము వండియుండెడివార మనురీతిగా నిది సంభావనార్థముతో లాఙ్రూపమె. ఇట్టియెడలఁ బ్రార్థనము గోచరింపదు. 'రక్షింపుము' అనురీతిధర్మములో రక్షింతు వనురీతిదుగాగమముతోడిరూపములు లే వనుట స్పష్టమె. ఇట్లె యితరపురుషలయందును.

అం.శ.శా.లో సూరి 'ధర్మంబునందు దిరుతల్లోపంబు అగు.

ఆనురీతిగా నాయావిధానములందు దుక్కు పేర్కొనఁబడినది. అటఁ జెప్పిన కార్యము లీయుభయప్రార్థనస్థలములను నగుట గమనింపవచ్చును. (పరిగ్ర హింపుదము) పరిగ్రహింతము. ఆకర్షింపుదము. పోదము మొ॥

అప్పవిధానము గౌరవ మని దుగాగమమునే విధించినచో నీస్థలము లందు దుక్కుతోపాటు దక్కును గూడఁ బ్రత్యేకముగాఁ బేర్కొనవలసి యుండును. ఇట్టియవసర మనేకస్థలములఁ గల్గుటను బట్టి యట నెల్ల గౌర వమును దగ్గించుటకుఁగా నిటనే దుగాగమ మని లఘుత్వము చెప్పుట లాఘవ మును సంపాదించుచున్నది. ఇంక దుక్ స్థలమున నగుకార్యము లెల్ల నిట నగుటను బట్టియు దుక్కుకంటె భిన్నముగా (దక్ అని) చెప్పుటకంటె దుగాగమముగాఁ జెప్పుటయు నుచిత మగుచున్నది.

ఇంక నిట సూరి దుక్కును ప్రధానముగా విధింపక జ్ఞాపితము చేయుటయును గమనార్హ మైయున్నది. కావున నిత్యముగనె యైనను దుగాగ మమున కత్వము చెప్పు సూరివిధి యుక్తమె.

ఇట్టిప్రయోజనము వచ్చుటవారిమతమున మాత్ర మేల గుర్తింపరాదు? కాని యట వీరు సూరివిధానముకంటె భిన్నముగాఁ జెప్పుకొనుటచే నీ ప్రయోజనము వీరిమతమున నెన్నరాకున్నది.

బాల. క్రియా. 90, 108 సూత్రస్థలముల నొకచో సంగ్రహించుచు వీరు "తద్ధర్మాద్యర్థకము నుభయప్రార్థనాద్యర్థకము నగుదుక్కుతోఁగూడ- (క్రి. 94సూ) అని యుభయప్రార్థనార్థకదుక్కును వేఱుగాఁ బరిగణించిరి. వేఱు గాఁ జెప్పినప్పుడు దుక్కె యన నేలఁ దక్కన్న సందుఁ గ్రొత్తగా నేర్పడు గౌరవ మేమి?

'పోవునదు దుజ్మాత్రుల' (క్రి. 102సూ) అనుచో మాత్ర ముభయ ప్రార్థనార్థమును వేఱుగాఁ బ్రస్తావింపలేదు. అయ్యు పోవుదము-పోదము అనియుఁ జూపిరి. ఈయొక్కదానికై యుభయప్రార్థనమున దుగాగమ మని చెప్పవలెనా?

ఏ కైవసము వీరిక్రియా. 102. సూత్రవివరణమునుబట్టి ముఙ్ఙు అనుదానిచే నుభయప్రార్థనమందలి ముఙ్ఙును గ్రహించుటయే వీరు నుద్దేశించిరనవచ్చును. కాని సూరి సాధించిన ప్రయోజనము వీరిలక్షణమునను గలదు గాన దుగాగమ మనకుండ దుగాగమ మను నుచితమే యనుచు నాపక్షమున ఉ.క్రియా.94సూత్రమున నుభయప్రార్థనార్థక మగుముఙ్ఙును వేఱుగాఁ బ్రస్తావించుటయే యనుచిత మని నిర్ణయింపఁదగును.

అయ్యు దుగాగమము సూరి జ్ఞాపితము చేయఁగా వీరు ప్రత్యేక ముగా విధించుట స్పష్టతకే యనవలెను. 'ము' విలువకుండుటను బట్టి సూరి దానిని బ్రత్యేకముగా విధించుటకంటె శాస్త్రీయ మగుప్రయోజనమునకై జ్ఞాపితము చేసె ననఁదగు నది యుచితము గదా.

పరిగ్రహింతము. నిశ్చయము గాని ప్రార్థనము లేదు. చూతము యంచు. మానసోద్దిష్టప్రేరణము మాత్రము (వ్యా.సం.వ.1401) ఇట్టి స్థలముల నెల్లఁ బ్రార్థన మంతగాఁ గన్పట్టదు. అస్మచ్ఛబ్దవాచ్యుఁడు యుష్మచ్ఛబ్దవాచ్యుని బ్రేరించుట మాత్రమె తఱుచుగాఁ దోఁచుచుండును' (వ్యా.సం. వ.1400) అని వీ రింతకుముందు పేర్కొనిరి. దీనింబట్టి సూరి 'ఉభయ ప్రార్థన మనుట సరి గా దేమో' యనునభిప్రాయము గల్గుచున్నది. వీరు నిట (దీనిని బొట్టుగాఁ బేర్కొనుటనుబట్టియు) నుభయప్రార్థనంబున నని సూరివలెనే తమసూత్రమునఁ జెప్పుటనుబట్టియుఁ బూర్వపుఁదమయభిప్రాయమును విడిచిపుచ్చుకొని రనఁదగు.

కాఁగా సూరిసూత్రమ సూక్తము.

### ముఙ్ఙు :

బాల.క్రియా.31,32సూత్రము లట్లు గ్రహించిరి. (ఉ.38,39సూ.)

'ముఙ్' అనెడిప్రార్థనార్థకమధ్యమపురుషప్రత్యయములప్రత్యాహారమె ముఙ్ అనునది యని చెప్పినఁజాలును. అట్లయినను సూరి

యట్టివిషయమునె బా.క్రి.31 సూత్రమున మధ్యమపురుషజ్ఞులు ముజ్జ నాఁడు అని స్పష్టార్థముగా రచించెను' (వ్యా.సం.ప.1533)

ఆసూరిసూత్రము నట్లు గ్రహించి యిటఁ జెప్పినవీరియభిప్రాయము పైనట్లు స్పష్టతమె కాని సూరి యట్లు స్పష్టతకయియే చెప్పెనా యని సందేహము. అకారంబునకు దుగ్రూపురుషముణ్ - అనుచో 'ఊకారంబు ప్రత్యాహారార్థంబు' అని సూరి స్పష్టము చేసెను. ఇచట డుజ్‌లో జకార మిత్సంజ్ఞమై. 'జిత్తు బిందుపూర్వం బగు' నని ముందుబిందువు చేరుట ప్రయోజనముగా నుద్దేశింపఁబడిన దనుట స్పష్టము. అయ్యు మువర్ణముతో దీనింగూర్చి ప్రత్యాహారము చేయుటతో నడ్డంకి లేకపోవచ్చును. కాని యిట్లు చేయుతలంపు సూరి కున్నట్లు తోఁచకున్నది. సూరి ప్రత్యేకముగాఁ బేర్కొన్నచోఁ దప్పఁ బ్రత్యాహార మితరత్ర చేయుట గానరాదు.

## అదాదులు

'సంప్రార్థనంబున ముజ్జున కదాదులు విభాష సముప్రయుక్తంబు లగు' (33) ననుసూరిలక్షణమును వీరు "సంప్రార్థనంబున ముజ్జునకు అఆఇఈఉఊఋయ్యిఅన్న మున్నగునవి విభాష సముప్రయుక్తము లగు'(ఉ.40) వని చెప్పిరి. సూరి 'అదాదు' అన్నదానిని వీరుసూత్రమునసె వివరించి చెప్పుటయే యిందలిమార్పు.

అదాదులలో సూరి పేర్కొన్న ఎ,ఏ,ఒ,ఓలను వీరు తొలఁగించిరి. దానింగూర్చి పై సూత్రమున గమనింతము. వీనిని బరిహరించినమాత్రమున నదాదు లనుటలో దోసఁగు లేదు, అదాదు లేవియో యవి యన్ని నిర్దేశింప లేదు. 'మున్నగునవి' యని సూత్రమున నిల్పిరే కదా. అన్నింటిని నిర్దేశించునప్పటికిని వాని నెల్ల సూత్రముననే పఠించుట గౌరవమాత్రమునకే. అదాదు లని చెప్పి యవి యేవో వివరణమునఁ దెల్పుట యుక్తము గదా.

ఏమ్యాదులను నిత్యాదులలో నని కొన్ని సూత్రమునఁ బఠించిరా?

సూత్రమును వీరు వ్యాఖ్యానప్రాయముగాఁ జెప్పి రనఁదగు. సూరి సూత్రము సూక్తము.

'అదాదులలోని ఇ శబ్దమును నిర్వహించుప్రబలప్రయోగము కానరాదు'. దీనికిఁ గారణము 'నన్నయ సంప్రార్థనార్థకాదీ' త్తని వచించుట చేత ఇశబ్ద మిట నన్నయ్యకు సమ్మతము కా దని తోఁచుచున్నది.' (వ్యా.సం.సూ.1416) అయిన సూరి అదాదులలో 'ఇ'వర్ణమును బఠింపరా దని యుద్దేశించి రేమో. కాని ఉ.లోవీరు ఇవర్ణమును గూడ నీసూత్రమునఁ బఠించిరి. (అయ్యు దీనికిఁ బ్రయోగము చూపలేదు.) 'సంప్రార్థనార్థకాదీత్' అనుచో 'ఈత్' అనెఁ గాన 'ఇ'వర్ణము గ్రహింపఁబడ దని యెంచినవీరు 'ఉదాత్తప్రశ్నలక్షణో భవతః' అనుచో 'అత్' అన్నను 'అ'వర్ణమునుదిం. లోనె గ్రహించిరి. 'అచ్యుతుష్కుం భవేత్' అనువ్యథర్వణలక్షణవివరణమున 'హ్రస్వదీర్ఘము లగుఇఈలు గ్రహించి చెప్పుమి. చెప్పుమీ' (వ్యా.సం.సూ. 1410) అని యుదాహరించిరి. సూరి అదాదులలో 'ఇ' పేర్కొనుట సముచితమె. (నన్నయాథర్వణసమ్మతము నపవలె.)

## వినవె-వినరె:

'ఎదాదు లను ప్రథము త్తంబు లగునపుడు ముజ్జునకు వుజీ రుజీ యగు' (34) ననుసూరిలక్షణమును వీరు దమగ్రంథమునఁ దొలఁగించిరి. ఈలక్షణముచే సిద్ధించురూపములను సాధించుటకై వరుసలవారు మూర్ధాంతరమున పే రొకరెండుసూత్రములు చెప్పిరి.

'వ్యతిరేకార్థకక్రియలమీఁద ఎఏఒఓఅయ్యుఅన్నఅమ్మమున్నదునవి నిల్చునపుడే నది ప్రార్థనాద్యర్థకములగును.(బాల.లోలేదు.) (ఉ.41.సూ) ఇట్టి లక్షణము బాల.లో లేకుండు టుచితము. ఇట్టిరూపములు బాల.34సూ. సాధించుచున్నది గదా, ఆసూరిసూత్రములు ఉ.లో లేకుండుటయు, బాల.లో లేనియీసూత్ర మిట నుండుటయు సరి గాదు.

ఏవి మొదలుగాఁ గొన్నింటిని నిర్దేశించినను వీని సూత్రమున 'మున్నగునవి' యనక తప్పదు. అట్టి వీనియన్నింటిని సూత్రమున కెక్కించుట యేల? అన్నింటిని నిర్దేశించినను నవి పెక్కు లయినప్పుడు సూత్రమునఁ జేర్చుట గౌరవమునకే. సూరి చెప్పినట్లు 'ఏబాదులు' అని సూత్రమున నుంచి యని వివరణమునఁ దెల్పుట లాఘవముతో నుచిత మైయుండును.

ఏవి- మున్నగునవి నిల్చుటచే ననుటచే నవి చేరుట పూర్వసిద్ధముగాఁ జెప్పవలె. వ్యతిరేకక్రియలపై వీనినిలుకడ యిచటను వీరు విధింపలేదు. ఇంక విధానసామర్థ్యముచే నీసూత్రముచేతనె నిల్చు ననవలె. బాల. క్రియా. 36. సూత్రమునెడల వీరివిధానము స్మరింపఁదగును. దాని నట్లు మార్చిన నీ రీతి నిల్లు చెప్పుట విరుద్ధము గదా? 'ఏ-ప్రభృతులు నిల్చుటచేఁ బ్రార్థనాద్యర్థవిశేషములు గల్గు ననుటకంటెఁ బ్రార్థనాద్యర్థవిశేషములందు ఏ-ప్రభృతులు చేరు నని చెప్పుట శాస్త్రమార్గమున కనుగుణ మైయుండును.

'వ్యతిరేకక్రియలమీఁద' నని సామాన్యముగాఁ జెప్పుటచే వ్యతిరేకక్రియ లెల్ల నెదాదియోగమునఁ బ్రార్థనాద్యర్థకములు గావలె. వీ రీట నెల్ల మొదల వ్యతిరేకార్థకమధ్యమపురుషక్రియలనే చూపిరి. ప్రార్థనార్థము మధ్యమపురుషయందే సంభవము గావునఁ బ్రత్యేకముగా 'మధ్యమపురుషక్రియలమీఁద' నని చెప్ప నవసరము లే దనుకొనిరా? అయిన క్రి. 35 సూత్రమున 'యుష్మన్మధ్యమపురుషలచో' నని యేల చెప్పిరి.

వాసుకి మాకుఁ బ్రసన్నుఁ డయ్యెడున్. ఘోరఫణిరాజులు మాకుఁ బ్రసన్నులయ్యెడున్ అనుచోఁ బ్రార్థనార్థకక్రియ ప్రథమపురుషయందుండుట గ్రహించితిమి. కాఁగా (వారు) ప్రసన్నులయ్యెదరున్ అనునర్థమున ప్రసన్నులు కారే ఇట్లే రారే, వంపఁడటయ్య ఇత్యాదిగాఁ బ్రథమపురుషయందును బ్రార్థనార్థకరూప మేర్పడు నని చెప్పవలె.

కావున 'వ్యతిరేకక్రియలపై' నని సామాన్యముగాఁ గాక 'వ్యతిరేక

మధ్యమక్రియలపైఁ' వని వీరు చెప్పుకొనవలసియున్నది. సూరి శ.ల.సం. లో 'వ్యతిరేకమధ్యమంబుమీఁద నెదాదు లగు సంప్రార్థనపరంబు లగు' (92)ననెను.

'ప్రార్థనాద్యర్థక' అనుచో నాదిశబ్దముచే వీరు ప్రశ్నాద్యర్థము లుద్దేశించిరి. (వ్యా.సం.స.1410)

"సూరి ... ప్రార్థనాద్యర్థకముల్గానకు ఎదాదు లనుప్రయుక్త మగు నవుడు -- (ఉ.373) అని వయులవారు పేర్కొనుట సరి కాదు. సూరి అదాదులు (ఎదాదు లిందలివే) సంప్రార్థనమున ననుప్రయుక్తము చేసెను. కాని 'ఆది'శబ్దమును సూరి ప్రయోగింపలేదు. (ఉ.40.సూ) కావునఁ బ్రార్థనాద్యర్థక మని సూరియాశయముగాఁ జెప్ప(వ్యా.సం.స.1416)రాదు. చిం.ఆశయము గ్రంథాంతరమునఁ జూతము.

ఇఁక వీరు విశేషముగాఁ జెప్పినఆదిశబ్దముచే గ్రహింపఁబడువ్యతిరేకవ్యంజకప్రశ్నాద్యర్థములు మాత్రముప్రార్థనార్థకములవలె మధ్యమక్రియలపైనె యగు నని చెప్పుటకు వీలు లేదు. నృపులు లేరో -లేరా- ఉన్నారు. వేట రారో- రారేదా? వచ్చిరి. మేము కామో- కామా? అవుదుము. ఇట్లిది వ్యతిరేకక్రియ అన్నింటిపైఁ గలుగును.

కాఁగా మధ్యమక్రియలపై మాత్రమె గలప్రార్థనార్థమును నెల్లెడలఁ గలవ్యతిరేకవ్యంజకప్రశ్నార్థమును గలిపి 'ప్రార్థనాద్యర్థకము'గాఁ గూర్చుటెట్లు పొసఁగును? చిత్తశాంతి యొనర్పవే- నన్నుఁజూచి నగరె. వ్యా.సం.స.1415.

కాఁగా నిట వీ రాదిశబ్దమును జేర్చుట సరి గా దని నిశ్చయింపఁ దగును. అట్లు చెప్పనిసూరిలక్షణము సమంజసము.

వ్యతిరేకవ్యంజకప్రశ్నార్థము వ్యతిరేకక్రియలయెడనే కాక, చెల్లనయ్య, యనుతీరుగా తద్ధర్మభూతక్రియలయెడఁ గూడఁ గలదు. కావున (ప్రౌ.క్రి.2.4.5)వీరు వ్యతిరేకక్రియలయెడ మాత్రమె చెప్పుటయు సరికాదు.

'వ్యతిరేకక్రియలు- ప్రార్థనాద్యర్థకము లగును' అనువీరిలక్షణముచే వీనిపైని నిల్చినఏదాదు లనుప్రయుక్తము లనియు వీరును దలఁచి రనవచ్చు. కాఁగా నీయంశమున సూరితో విభేదము లేదు.

ముఖ్యమైనమార్పు సూరి ప్రార్థనార్థకక్రియపై నేదాదులను జేర్చ వీరు వ్యతిరేకక్రియ ప్రార్థనాద్యర్థక మగు ననుట. వ్యతిరేకక్రియ ప్రార్థనాద్యర్థక మగు నన వ్యతిరేకార్థవిశిష్ట మగుప్రార్థనార్థక మగు ననుసందేహమున కవకాశము గల్గుచున్నది. 'నన్నుఁ బంపవే' యనుచోఁ 'బంపవు'అను వ్యతిరేకక్రియ ఏకారాదియోగమువలనఁ బ్రార్థనార్థమును బొంది 'పంపకుము' అనురీతిగాఁ బ్రార్థనార్థము గల్గును గదా. వ్యతిరేకార్థము నశించుట యెట్లు? తెలుఁగున నదాదులు పెక్కిటిపైఁ గానవచ్చును. కాని విరుద్ధార్థక మవ్వుట మాత్ర మిచ్చుటనే యనవలె. (పంపవే-పంపుమా)

నన్నుఁ జూచి నగరె యనుచో 'నగరు' అనువ్యతిరేకక్రియపై 'ఎ' అనునది చేరి 'నగరె' అని కాఁగా 'నగరు' అనుక్రియయొక్క వ్యతిరేకార్థము ప్రశ్నార్థయుక్త మగును. దీనికి వాచ్య మగునర్థము నగువారు కారా యనియె. పిదప 'నగుదురు' అనునర్థము వ్యంగ్యముగా సిద్ధించును.

చిత్తశాంతి యొనర్చవే యనుచో నిట్లు గాదు. ఒనర్చవు- అనువ్యతిరేకక్రియపై 'ఏ' యనునది చేరఁగా నేర్పడిన 'ఒనర్చవె' యనుదానిచే 'ఒనర్చుము' అనునదే వాచ్య మగునర్థము. వీని నెల్ల నొకేకోవకుఁ జెందినవిగా (వ్యా.సం.స.1415) వఝులవారు చూపుట సరి కాదు.

ఈభేదమునుబట్టియె 'ఒనర్చవె' యనురీతిని "ఒనర్చుము" అనురీతిప్రార్థనార్థకరూపమునుండి సాధించుటయె యుచిత మనియు నట్టిసూరిలక్షణ మర్థక్రమానుగుణ మనియును నిశ్చయింపవచ్చును.

అజరణ్యారుఁ గని చెప్పవయ్య వాని నెఱుఁగు దేని. చెప్పుమయ్య తపతీకపత్యుల పైనతెలుఁగు (వ్యా.సం.స.1415) అనుచోఁ జెప్పవయ్య చెప్పవయ్య యనునవి సమానార్థకములు. చెప్పుమయ్య యనుదానినుండి చెప్పవయ్యయని సాధించినసూరిమత ముచితము.

సూరి మొదాదిపరకత్వమున ముజ్జుస్థానమున వుఁజే. రుజే విధించెను. ముకుజ్జులస్థానమున నైన వగుటచే నాయర్థమె సహజము గాన వంపవే యనురీతివానికి పంపుము అనురీతిగా నర్థ ముండుట సముచితముగ సూరి మతమున సిద్ధించుచున్నది.

ప్రౌఢ్ధ పోయెదుఁ బదవమ్మ ముద్దుగుమ్మ (విజ.3.207) చూతము పదరమ్మ (శుక.4.142) పదవే పదరమ్మ యనువీరీతిప్రయోగములు సూరి విధానము నెంతయు సమర్థించుచున్నవి. ఇట వ్యతిరేకక్రియలపై ఎదాదులు చేయవలె నన్న పోవె, పోరమ్మ యనియె యగును. పోవుధాతువునకు వ్యతిరేకార్థమునఁ బదవు. బదరు అనువిధ మైనరూపము లుండవు గదా. పదము పదఁడు అనువానిలో వదులవారు గుర్తించినవిశేషార్థము వ్యతిరేకక్రియలం దెట్లు సాధ్యము? ఇంక వీరిలక్షణముచే సాధ్యములు గాని యీయవి. కవి ప్రయుక్తములు గా నవనవలె నేమో.

వ్యతిరేకక్రియనుండి యీరూపములను సాధించువీరిలక్షణము "ఏదోశౌ వ్యతిరేకాదపి సంప్రార్థనపరౌ క్రియాణాం స్తః" అనుచిం.లక్షణము ననుసరించియున్న దనుట స్పష్టమె.

సూరియు మొదట వీవరులవారిపద్ధతిలో ననఁగా చిం.మార్గములోనె వీనిని నిరూపించుట గమనింపవచ్చును. "అదాదిదీర్ఘులు మధ్యమపురుషజ్ఞల మీఁద నొందెడి నగు. వ్యతిరేకమధ్యమంబు మీఁద (వీరు దను 41.సూ.లో మధ్యమమున కనఁబుంట గమనించితిమి. చిం.ని గ్రహించుచునే సూరి యుచితముగాఁ జెప్పెను.) నెదాదులు సంప్రార్థనపరంబు లగు" (శ.సం.87,92) కాఁగా చిం.పద్ధతి యర్థ మయియుండియు, సూరి బాల.లో నామార్గమును

బరిహరించి ముడుంబజకు పుజీ,రుజీ విధించుట యనాలోచితముగ ననఁదగునా? శబ్దస్వరూపమునందలిసామ్యముకంటె నర్థము ప్రధాన మని సూరి ముజనకు పుజీ రుజీ విధించెను. ఇందలియౌచిత్యము నెన్నక పరుులవారు పుజులఁ జిం. మార్గమును బునరుద్ధరించుట యేల?

'పీరితరుపాతిసూత్రమె పైసూరిప్రణాళిక యుచిత మని నిరూపించు.

## వినతింపె :

'ఎపేలయోగమున వ్యతిరేకప్రార్థనాద్యర్థకమువర్ణకముకారమునకు వకారాదేశ మగును' (ఉ.42)

'ఎపేలయోగమున' ననుటచేతనె ఎపేలు చేరుటను సాధించుకొనవలె' అన్నఁగా బాల.క్రియా.30.సూత్రమునొద్ద వీరు తలఁచినయనౌచిత్యమె వీరిసూత్రమునను గల్గిన దన్న మాట. సంప్రార్థమున ముజనకు వీరు ఎపేలనుప్రయుక్తములుగాఁ జెప్పలేదు. సూరి యట్లు చెప్పుటను దిరస్కరించిరి కదా. కావున ఎపేలు ప్రస్తుతమాత్రముచేతనె వచ్చు ననుకొనవలె. అపుడు వీరు ఉ.క్రి.87సూత్రమున దుగాగమమును జెప్పుటయు సూరి యట్లు చెప్పలే దని విమర్శించుటయు నసంగతములు.

సూరి(వలె వీరును) "సంప్రార్థనంబున' నని ప్రార్థనమునసె ముజన కదాదులయనుప్రయోగమును జెప్పెను. కాని యిట వీరు "ప్రార్థనాద్యర్థక" మని యాదిశబ్దము చేర్చిరి. ఈమువర్ణకము లోట్టుపువర్ణమున కైనది. లోట్టు ఆశీశ్శాపసంప్రార్థనవిధులం దగును. మఱి యిట ప్రార్థనాద్యర్థకమన నాదిశబ్దముచే నేది గ్రహింపవలె. ఆశీశ్శాపవిధులం దీకార్య మయినట్లు వీరొక్కలక్ష్యమును జూపలేదు. వీ రధికముగాఁ జేర్చినయాదిశబ్దము నిరర్థకము.

"మువర్ణకముకారమున" కనుచో ముకారమున కన్నది యచ్చుపొర

పాటు గావచ్చును. ముపర్ణక "మ" కారమున కవి యుండఁదగును. (ము కార మన ముపర్ణము మొత్త మగును. అట్టియెడల ముపర్ణకమున కన్ననే చాలు. మఱలముకారమున కవకాశము లేదు. ముకారమునం దుత్వమునకె యాలు వినకుమ్మే యని యపరూప మేర్పడు ప్రమాదమును గలదు.) సూరి ముములకు వురులు విధించెను. జీర్ణత్వమునుబట్టి యూతఁ డట్లు చెప్పుట లాఘవము.

మకారమునకు అనుచోటిషష్ఠిచేతనె మకారముస్థానమున నని యర్థ మగును కావున. "వకారాదేశ" మగు నని "యాదేశము"గాఁ జెప్పుట యవసరము గాదు.

ఈసూత్రముచే వీరు లక్ష్యానుసారముగా సూరిప్రణాళికవైపు మఱలి రని స్పష్టము. వినవు + ఎ-వినవె యనుచో వ్యతిరేకక్రియపై నెత్వ మగు నన్న వీరు, వ్యతిరేకక్రియ వినకువు అనురీతి నుండదు గాన సూరిమార్గమును ద్రొక్కి 'వినకుము' అను (వ్యతిరేక) ప్రార్థనార్థకక్రియాపదమునుండియె మకారమునకు వకారమును విధించి సాధించికొనవలసివచ్చినది. 'వినకువె' యన్నది 'వినకుము' అనుదానినుండి సాధించినట్లైన, వినవె (వినరె) యన్నది వినుము (వినుఁడు) అన్నదానినుండి సాధించుట నక్రమ మని వఝలవారియీసూత్రము సూచించుచున్న దని గమనింపవచ్చును.

సూరిపక్షమున వినవె-వినరె వినకువె వినకురె వినవయ్య మున్నగు చోటులందు వినుము + ఎ-వినవె వినకుము + ఎ- వినకువె- -అనురీతిని పదచ్ఛేదము-- ఇది యెంతయు నస్వాభావికము నసత్యము ననుటకు సందియము లే (వ్యా.సం.స.1418) దన్నవీ రిట వినకుము + ఎ- వినకువె పడకుము + ఎ పడకువె' యని సాధించుట స్వాభావికమును, సత్యము నై యున్నదా? వినకుము + ఎ- వినకువె యనుట స్వాభావికము కాఁగా వినుము + ఎ- వినవె యన్నదే యస్వాభావికమా?

వినవు-ఎ-వినవె- వినుము అనుదానికంటె వినుము + ఎ-వినవె-

వినుము అనురీతిప్రక్రియ స్వాభావిక మనుటలో సందియ మక్కఱ లేదు. 'వినవె' యనుచోటశబ్దముసామ్యము (చిం.) ననుసరించి. పై రీతి స్వాభావిక మనుకొని శ్రమా. కాని యర్థస్వరూపము స్వాభావికమా? కాదే-కారా- అగుదురు అన్నట్లుగా వినవే- వినువా- వినుము అని యగు ననుకొంటకు వీలు లే దని పైని గమనించితిమి. అర్థవంత మగుసూరిప్రక్రియయె సమంజసము.

## చూవె-చూరె :

ప్రార్థనమున ముజ్ఞనకు ఎవి లనుప్రయుక్తములు గా వనియు వృజీ ఛజీ రా వనియుం జెప్పుట వీరియుద్దేశ్య మనుట స్పష్టము. కాని వీరే తరువాత నొకసూత్ర మిట్లు పేర్కొనిరి.

'చూచుధాతుప్రార్థనార్థక సంక్షేపరూపము అగు చుమ్ము-చుము (చూడుము) చుండు- చుండు(చూడుండు) అనునవి మొదాద్యనుప్రయోగమున చూచెవె-చుమ్వి (చూడవె) చూరె (చూడరె) అనురూపముల నంది- '(తె.43.బాల.లో లేదు.) నిట్టిసూత్ర మంత నవసరము లేదు. చుమ్ము, చుండు అనునవి యేర్పడిన బాల.క్రియా.84సూ-చే నీరూపము లేర్పడును.

చూడుము-చూడుండు అనువానిసంక్షేపరూపము లనుటచేతనె చుమ్ము చుండు అనురూపములు సిద్ధించు నని వీరు దలంచియుందురు. చూడుము, చూడుండు అనువానిప్రక్రియ స్పష్టమె.

చుమ్ము చుండు అనువానిప్రక్రియయు సూచింప నవకాశము లేక పోలేదు. చూచు + ము, చూచు + డుజ్ అనుచో చూచున కర్థవిశేషమున ముజ్ఝరకత్వమునందు 'చు'లోపమును క్రియా.101సూత్రమునందలి బహుళపదముచే సాధించుకొనవచ్చును. అప్పుడు చూ + ము, చూ + డుజ్ అని కాఁగా, చుమ్ము,చుండు-(చెమ్ము- చెండు) అని యేర్పడు. అంటయుంక

సరించి యొదాద్యనుప్రయోగ ముక్తమందమా? ఇట వీరు ఆదాదులు అని చెప్పి 40.సూత్రమును జూపు మనిరి. ఆసూత్రములో అదాదు లని చెప్పక వానిని నిర్దేశించిరి. అందు ఏఏలు లేవు. ఇంక నెదాదు లన నేవి? ఏ రావిషయమును మఱచిరా? బ్రాహ్మణుండనె, ద్రుపదమహారాజులె యనుచో నెత్వమును జూపిరి. ఎదాదు లదాదులలోఁ గల వేమో యని సందేహింపకుండ 40సూ. చూడు మనిరి.

ఇచ్చటివివరణము ననుసరించి యచ్చట (40.సూ.)నున్న 'మున్నగు'శబ్దముచే ఎఏఒఓలు గ్రహింతమా? అవు దట చూడుమే (చూడవే) వండుఁడో (వండరో) ఇత్యాదిగా రూపములు సిద్ధింపఁగలవు. "చూడుమే మున్నగురూపములు లే వని" (ఉ 374) వీరును స్పష్టము చేసిరి. కాన నట నదాదులలో ఎఏప్రభృతులు గ్రహింపరాదు.

ఇంతకు నిట వీరు 40సూత్రమున ముఱసనె యదాదులయనుప్రయోగమును జెప్పిరి. బ్రాహ్మణుండనె ఇత్యాదుల నితరస్థలముల నెట్లయినది? వివరణముచే నగునా? సూత్రముగాఁ జెప్పి యదాదులలో నెదాదులను జేర్చియున్న బాగుండెడిది.

ఈవివరణమున వీరు 'నామము' అన్నది సుబంతము అనునర్థమునఁ (బ్రాహ్మణుండనె మొ॥) బ్రయోగించుట విశేషము. వ్యాకరణమున దీనికిఁ బ్రాతిపదిక మనియు యర్థము. క్రియ అనఁగాఁ దిఙంతము అని చూపిరి. కాఁగా నామము (క్రియ)లనక పదసామాన్యముపైఁ జేరుట నింకొకతీరుగఁ జెప్పఁదగును.

ఈపదము లదాదులతోఁ గూడి యర్థవిశేషము నిచ్చు ననుటకంటె నర్థవిశేషమున నదాదులు చేరుటను జెప్పిన నుచితముగా నుండెడిది.

ఇఁకఁ బ్రస్తుతస్థలమున నెదాదు లనఁగా నేవో వీరు స్పష్టముగాఁ జెప్పలేదు. ఉదాహరణములనుబట్టి ఎ,ఏలు రెండె యగునా? అయిన 'ఎఏ'

అని స్పష్టముగా నిర్దేశించిన సరిపోవుదానికి 'అది'శబ్ద మేల? పెట్టి యున్న వోట్ల సూత్రమునన గొప్ప నిర్దేశించి మున్నగున వనుటయు ఎ,ఏలు రెండే యుండ నిట మాత్రము ఎదాదు లనుటయు వింత గాక తప్పదు. ఎదాదు లనుప్రయుక్త మగునవుడు 'చూపె- చూరె' యగు ననిరి. దీర్ఘ ముప లక్షణ మనుకొనవలె. ఎదాదులలో నేది యనుప్రయుక్త మయినను చూపె, చూరె అనియె యగు నని తలంచుటకు నవకాశము గల్గుఁ గదా. కాక యెదాదులలో నితరము లనుప్రయుక్తము లయినవు దీర్ఘమార్గమున రూపము లగు నని చెప్పుచో నెదాదు లనుటయు నొప్పును.

అయిన నెదాదు లేవి? సూరిగారియెదాదులలో ఎఏ,ఒఓ అయ్య మున్నగున వున్నవి. ఆ వన్నియు నిట గ్రహింపవచ్చునా? అయినచోఁ జూపయ్య. చూరయ్య అనియె కావలెను. చుప్పయ్య, చుంరయ్య యను రీతిరూపము లసాధువు లగును. అట్టియెడల లోఁగడ సూరిలక్షణమున వీరు చూపినదోషము (ఉ.373. దీనింగూర్చి పైని జూతము) వీరిలక్షణమునను నేర్పడును సిద్ధుఁడఁ జు మయ (భోజ.2.190) రప్పింపవలెఁ జూమయ్య (కాశీ.6.32) [సూ.ని.] కాన నయ్యాదు లిచ్చట నెదాదులలో లే వనవలె. బోసీ ఒఓలు గలవా? చేయవలయుఁ, జూండో [రుక్మాం.1.126] తప్పగుఁ జుఁడో [కాశీ.5.270][సూ.ని.] అనురీతి నసాధువు లగును. కావున ఒఓలు గూడ నిట నెదాదులలో లే వనవలె.

"ఇట్టిచూపె మున్నగుచోటులు తప్ప మ తెల్పుటను ప్రార్థనాద్యర్థక మధ్యమపురుషపై ఎఏలు నిల్చుట లేదు. చూడుమే మున్నగురూపములు లే వని తాత్పర్యము' [ఉ.374]అని వీరే ఎఏలు మాత్రమె యని స్పష్టము చేసిరి. 'ఎదాది' అనుచోటఁటనూదిశబ్దముచే 'ఏ' అనున దొక్కటి గ్రహింపవలె నన్న మాట. ఎఏ లని యిట స్పష్టముగా నిర్దేశింపఁదగును. 40,సూత్రమున అదాదు లనియు. 41సూత్రమున నెదాదు లనియు వీరు చెప్పఁదగును.

ఏ పైన నిటుఁ జూపె, (చూరె) మున్నగుచోట్లఁ ముజపై ఎఏలు

వినుము అనురీతిప్రక్రియ స్వాభావిక మనుటలో సందియ మక్కఱ లేదు. 'వినవె' -యనుచోటిశబ్దముసామ్యము (చిం.) ననుసరించి. వీ రిది స్వాభావిక మనుకొని రేమో. కాని యర్థస్వరూపము స్వాభావికమా? కాదే-కారా- అగుదురు అన్నట్లుగా వినవే- వినుమా- వినుము అని యగు ననుకొంటకు వీలా లే దని పైని గమనించితిమి. అర్థవంత మగుసూత్రప్రక్రియయె సమంజసము.

## చూవె-చూరె :

ప్రార్థనమున ముజ్జనత ఎవి లనుప్రయుక్తములు గా వనియు వ్రీ రుజీ రా వనియుఁ జెప్పుట వీరియుద్దేశ్య మనుట స్పష్టము. కాని వీరే తరువాత నొకసూత్ర మిట్లు పేర్కొనిరి.

'చూచుధాతుప్రార్థనాద్యర్థక సంక్షేపరూపము లగు చుమ్ము-చుము (చూడుము) చుండు- చుఁడు(చూడుఁడు) అనునవి యెదాద్యనుప్రయోగమున చూవె-చువె (చూడవె) చూరె (చూడరె) అనురూపముల నంది- '(ఉ. 43. బాల. లో లేదు.) నిట్టిసూత్ర మొండ నవసరము లేదు. చుమ్ము, చుండు అనునవి యేర్పడిన బాల.క్రియా.3.4సూ.చే నీరూపము లేర్పడును.

చూడుము-చూడుఁడు అనువానిసంక్షేపరూపము లనుటచేతనె చుమ్ము చుండు అనురూపములు సిద్ధించు నని వీరు దలఁచియుందురు. చూఁడు, చూడుఁడు అనువానిప్రక్రియ స్పష్టమె.

చుమ్ము చుండు అనువానిప్రక్రియయు నూహింప నవకాశము లేక పోలేదు. చూచు + ము. చూచు + డుట్ అనుచో యాచున కర్థవిశేషమున ముజ్జ్వరకత్వమునందు 'చు' లోపమును క్రియా. 101సూత్రమునందలి బహుళపదముచే సాధించుకొనవచ్చును. అపుడు చూ + ము, చూ + డుట్ అని కాఁగా. చుమ్ము, చుండు-(లెమ్ము- లెండు) అని యేర్పడు. అంటయుఁగా

చూఁడుసూత్రము ననుసరించిఖండబిందువును నిర్బాధ మగుట చూఁడు అనియు నగును. 'చుమ్మ' అనుదాని నక్కటాదులలోఁ జేర్చుటచే 'చుము అనియు నగు.

సంక్షేపరూపము లనుటకంటె నిట్లు ప్రక్రియనూహించుట యుచితమై అర్థవిశేషమును బ్రస్తావించిరే కదా.

చుమ్మ, చూఁడు అనువీనియందలిమండుబ్జాలు మధ్యమపురుషజ్జ్ఞ కాన 'బాల.క్రియా.33సూ.చే చుమ్మీ చుమీ ఇత్యాదు లగు. బాల.క్రి.3సూ.లే వే లేరే యనురీతిని చూవె చూరె యనియు నేర్పడును. ఇ ట్లేర్పడుట యసంగత మను (వ్యా.సం.స.1420) వీరియభిప్రాయము సరి కాదు. ఇమ్ము+ఎ-ఈవె, ఇండు+ఎ-ఈరె.

ఈ ట్లీరూపములు క్రియా.34.సూ.చే సిద్ధించుచునే యుండఁగా వీనికై వే ఱొకసూత్రము రచింప నవసరము బాల.లో లేదు గదా.

పరుఖలవారిలక్షణముచే నీరూపము లేర్పడు టెట్లు? వ్యతిరేకార్థమున చూవు. చూరు అని యుండవు గాన వీరు వినవె, వినరె యన్నవి సాధించినపద్ధతిలో చూవె, చూరె యన్నవి సాధ్యములు గావు, (చూడవె, చూడరె యని యగును.) 'ఎడాద్యనుప్రయోగమున చూవె చూరె అను రూపము లందు' ననఁగా నిది నిపాతసూత్రము గాఁబోలును. ఎడాద్యను ప్రయోగమును వీనిపాతసూత్రముచేతనె యగు ననవలె. ప్రార్థనార్థకముల మైనను త.క్రి.సూ.చే ఎడాద్యనుప్రయోగ మెట్లు? ఇట 'ఎడాదు' లన్నవీరు 40.సూ.లో నడాదు లనియు, 41సూ.లో నెడాదు లనియుఁ జెప్పక యుండుఁ గొన్నంటిని సూత్రముననే యేల పఠించిరో తెలియదు.

'నామములును యథాప్రయోగముగ అడాదులతోఁ గూడి యర్థవిశేషముల నిచ్చుచుండును. నే నొకబ్రాహ్మణుండనె. ద్రుపదమహారాజబె- అడాదులు -క్రియా.40.సూ.వివ)' (పు.374) అనువీరివివరణము నను

సరించి యాదాద్యనుప్రయోగ ముక్త మందమా? ఇట వీరు అదాదులు అని చెప్పి 40.సూత్రమును జూచు మనిరి. ఆసూత్రములో అదాదు లని చెప్పక వానిని నిర్దేశించిరి. అందు ఏఏలు లేవు. ఇంక నెదాదు లన నేవి? వీ రావిషయమును మఱచిరా? బ్రాహ్మణుండనె, ద్రుపదమహారాజనె యనుచో నెత్వమును జూపిరి. ఎదాదు లదాదులలోఁ గల వేమో యని సందేహింపకుండ 40సూ. చూడు మనిరి.

ఇచ్చటివివరణము ననుసరించి యచ్చట (40.సూ.)నున్న 'మున్న గు'శబ్దముచే ఏఏటలు గ్రహింతమా? అపు డట చూడుమే (చూడవే) వందురఁడో (వందరో) ఇత్యాదిగా రూపములు సిద్ధింపఁగలవు. "చూడుమే: మున్నగురూపములు లే వని" (త 374) వీరును స్పష్టము చేసిరి. కాన నట నదాదులలో ఏప్రభృతులు గ్రహింపరాదు.

ఇంతకు నిట వీరు 40సూత్రమున ముఖ్యనకె యదాదులయనుప్రయోగమును జెప్పిరి. బ్రాహ్మణుండనె ఇత్యాదుల నితరస్థలముల నెట్లయినది? వివరణముచే నగునా? సూత్రముగాఁ జెప్పి యదాదులలో నెదాదులను జేర్కొన్న బా గుండెడిది.

ఈవివరణమున వీరు 'నామము' అన్నది సుబంతము అను నర్థమునఁ (బ్రాహ్మణుండనె మొ॥) ప్రయోగించుట విశేషము. వ్యాకరణమునఁ దీపికఁ ప్రాతిపదిక మనియు యర్థము. క్రియ అనఁగాఁ దిఙంతము అని చూపిరి. కాఁగా నామము (క్రియ)లనక పదసామాన్యముపైఁ జేరుట నింకొకలేదుగఁ జెప్పఁదగును.

ఈపదము అదాదులతోఁ గూడి యర్థవిశేషము నిచ్చు ననుటకంటె నర్థవిశేషమున నదాదులు చేరుటను జెప్పిన నుచితముగా నుండెడిది.

ఇఁకఁ బ్రస్తుతస్థలమున నెదాదు లనఁగా నేవో వీరు స్పష్టముగాఁ జెప్పలేదు. ఉదాహరణములనుబట్టి ఎ,ఏలు రెండె యగునా? అయిన 'ఏ'

అని స్పష్టముగా నిర్దేశించిన సరిపోవుదానికి 'ఆదు'శబ్ద మేల? పెక్కు లున్న చోట్ల మాత్రమునన గొన్ని నిర్దేశించి యున్నగున వనుటయు ఎ,ఏ రెండే యుండ నిట మాత్రము ఎదాదు లనుటయు వింత గాక తప్పదు. ఎదు లనుప్రయుక్త మగునపుడు 'చూచె- చూచె' యగు ననిరి. దీర్ఘ ము లక్షణ మనుకొనవలె. ఎదాదులలో నేది యనుప్రయుక్త మయినను చూ- చూచె అనియే యగు నని తలంచుటకు ననకాశము గల్గుఁ గదా. కాక యాదులలో. నితరము లనుప్రయుక్తము లయినవు దీర్ఘమార్గమున రూపము లనని చెప్పుటో నెదాదు లనుటయు నొప్పును.

అయిన నెదాదు లేవి? సూరిగారియేదాదులలో ఎఏ,ఒఓ అను మున్నగున వున్నవి. ఆ వన్నియు నిట గ్రహింపవచ్చునా? అయినచో జూవయ్య, చూరయ్య అనియే కావలెను. చుమ్మయ్య, చుండయ్య య రీతిరూపము లసాధువు లగును. అట్టియెడల లోఁగడ సూరిలక్షణమున జూ చూపినదోషము (ఉ.373. దీనింగూర్చి పైని జూచునది) వీరిలక్షణమున నేర్పడును సిద్ధుఁడఁ జూ మయ (బో.ఆ.2,190) రప్పింపవలెఁ జూమంద (కాశీ.8.32) [సూ.ని.] కాన నయ్యాదు లిచ్చట నెదాదులలో లే వనవలెను ఒఓలు గలవా? చేయవలయుఁ జూండో [దశా.1.128] తప్పఁ జూఁడో [కాశీ.5,270][సూ.ని.] అనురీతి నసాధువు లగును. కావున ఒఓ గూడ నిట నెదాదులలో లే వనవలె.

"ఇట్టిచూచె మున్నగుచోటులు తప్పు మ ఈచ్చుటను ప్రార్థనాద్య పర్యమపుడునపై ఎఏలు నిల్చుట లేదు. చూడుమే మున్నగురూపము లే నని తాత్పర్యము' [ఉ.374]అని వీరే ఎఏలు మాత్రమె యని స్పష్ట చేసిరి. 'ఎదాది' అనుచోటియాదిశబ్దముచే 'ఏ' అనున దొక్కటి గ్రహింపవలె నన్న మాట. ఎఏ లని యిట స్పష్టముగా నిర్దేశింపఁదగును. 40,సూత్రమున అదాదు లనియు, 41సూత్రమున నెదాదు లనియు వీరు చెప్పఁదగు

ఏ మైన నిటఁ జూచె, (చూచె) మున్నగుచోట్లఁ దప్పుకుపై ఎఏ

చేయుట నంగీకరించి సూరిప్రక్రియను గొంత యామోదింపకతప్పలేదు. 'విన కువె' యనునది మొదటిదిగా నిది రెండవస్థలము. వ్యతిరేకక్రియలపైఁ గుడు రవిచో నెల్ల వీరు సూరిమార్గము ననుసరించుచుండి రని గమనింపవచ్చును.

మ తెచ్చుటను ప్రార్థనార్థకముపై ఎవెలు లేవు గావునఁ జూడుమే యని యుండ దనిరి. అందుకే సూరి ఏడాద్యనుప్రయోగమున ముజ్ఞానకు పుజి దుజి చెప్పి చూడవె యని సాధించెను. చుమ్ము, చుండు అనుచోఁ బ్రార్థనార్థకముపై ఎవెలు గలవు గదా. అట మాత్రము చూడుము+ఎ-చూడుమె వలె చుమ్ము+ఎ- చుమ్మె, చుండు+ఎ-చుండె యగుచున్నదా? ఇటఁ జూడవె చూడె యని యె ట్లగునో యట్లే చూడుము-ఎ- చూడవె యని యగు నవి చెప్పుటలో దోషమేమి? సూరిమత ముచితమే. సూరి 34 సూత్రమొక్కటి తొలఁగించి. 41,42,43గా మూఁడుసూత్రములు రచించినను వీరు సూరి 34సూత్రాభిప్రాయమును గొన్ని యెడల ననుసరింపకతప్పకుండుటయు గమనార్హము.

## వినకురె :

వ్యతిరేకప్రార్థనమునందును వీరు 'ము'వర్ణకమకారమునకు వకారమునే చెప్పిరి. (మూఁడు పుజి మారి విధించె) సూరిలక్షణము ననుసరించి డుజ్ఞానకు రుజి యగును. వినకురె యని సూరి యుదాహరించెను. 'వినకురె మున్నగుబహువచనప్రయోగములు కవిప్రయోగములందు లే' (ఉ.376) వనిరి. 'వినకువమ్మ- వినకురయ్య- అనురూపములు పైత మ స్థితిసూత్రమునకు లక్ష్యము లని చెప్పుటకు వెనుదీయఁ డని చెప్పనగు'. (వ్యా.సం.న. 1417) వని గు.ప్ర.కర్తను వీరు విమర్శించిరి. అయ్యవి సూరిలక్షణముచే సాధింపఁబడుచుండఁగా లక్ష్యములు గా వనుట సరి కాదు. బా.వ్యా.కే. అయ్యాదులు వ్యతిరేకక్రియలపైఁ జేరు ననుటయుఁ బొరపాటు.)

వినకురె యనురీతిప్రయోగములు లే వనుదృష్టితోనె వీ రి ట్లేకవచనమున నకారము చెప్పి రన్నమాట. అట్లయిన బహువచనమందు రూపము లె ట్లుండవలె. వినకుఁడె, వినకుఁడే యనురీతి నుండునా? బహువచనముపై ఎవి లనుప్రయుక్తములు గావని వీరు స్పష్టము చేయలేదు.

చిలుకను మావికిం బగలు సేయకురే లతకూనలార (కళుత్న1.129) నిలువఁగ నీకురే యనుచు (కాళ.3.26) మీ రిపుడు గో లని చూడకురమ్మ (విజ.3.34) ఇత్యాదిగాఁ గవిప్రయోగములం దుండుటను జూచియె సూరి యిట 'వినకురె' యని యుదాహరించె నని గ్రహింపఁదగును.

కాఁగాఁ గవిప్రయోగానుగుణముగా సూరి ముజ్జనకు రుజీ చెప్పి యుండఁగా వీరు దానిని తిరస్కరించుట సమంజసము గాదు.

సూరి యెదావ్యయప్రయోగమున ముజ్జనకు వుజీ రుజీ విధించుట యెంతయు నుచితమె, కాన సూరిలక్షణము సూక్తమె.

కాని యొకవిశేష మిట గుర్తింపకతప్పదు. 'వుజీ రుజీ యగు' నన్నసూరి వినవె, వినకురె యనురీతిగ నుదాహరించెను. 'తత్పక్షమున' వినుమయ్య- ముజ్జ విల్వ నేరదు. ఎదాదులలో సూరి అయ్య అమ్మ అను వానిని బఠించెను' (ఉ.373) అనువరుసలవారివిమర్శలో నౌచిత్యము లేక పోలేదు. 34సూత్రమునొద్ద సూరి ఎదాదులలో అయ్యాదుల నుదాహరింప లేదు. అయ్యఁ బూర్వసూత్రవివరణమునుబట్టి అయ్యాదు లెదాదులలోఁ జేరినవే. కావుననె వినవయ్య చూడకురమ్మ యనురీతిరూపము లేర్పడు చున్నవి. వినుమయ్య యనురీతివి సాధువులె, కాఁగా ఎదాదులలో ఎవ,ఒఓలు పర మయినపుడు మాత్రము వుజీ రుజీ నిత్యమె. కాని యందలియయ్యాదులు పర మైనపుడు వుజీ రుజీ రాకుండుటయుఁ గలదు. నన్నయాదుల ప్రయోగములనుబట్టి వీనికి సాధుత్వము గల్పించుటకు వుజీ రుజీ ప్రాయికముగా నగు నన్న బా గుండెడి దేమో. (ఎవఒఓలు- పర మైన నిత్యము

గను నయ్యాదులు పరమైనఁ దఱుచుగను విధించినను బాగుండుటేగా కొన్ని యెడల లేకుండుట వివరించినను బాగుండెడిది.

సూరి 'టతివర్ణంబులు పరంబు లగునప్పు డుత్వంబునకు కిత్వం బగు' ననియె చెప్పి కొన్నియెడల లేకుండుటను జేర్కొని చెప్పుటని పని యుదాహరించె. ఇట నల్లే సూత్రమున నగు నన్నను గొన్నియెడల (నగుటతో పాటు) లేకుండుటయుఁ గల దని వివరించి వినుమయ్య చెప్పఁడయ్య (ఆది. 7.207) యనురీతి నుదాహరించిన బాగుండెడిది గదా యనిపించుచున్నది. శాకపూర్వస్థలమును బట్టి మన మూహించుకొనవచ్చుఁ గవిప్రయోగానుసారముగా.

## చెప్పఁడయ్య :

వివరణమున నొకవిశేష మిట్లు పేర్కొనిరి. "అయ్యాదు లేకవచనాంతము లయ్య బహువచనాంతములమీఁద నైతము నిల్చును. చెప్పఁడయ్య (ఆది.7.207) చూచితి వత్తమమ్మ సుదతులార (భాగ.) (పు.374) ఇది వివరణము గావున స్పష్టతకుఁగా నిట్లు చెప్పినఁ దప్పు లే దనవచ్చును. చెప్పఁడయ్య యనుచో వీరిక్రి.40.సూ.చే అయ్య అనుప్రయుక్తమైనది. అనుప్రయుక్తము లర్థవంతములు గా వనియు 'నేది లోపించినను వక్తభంగము కల్గదో యది యనుప్రయుక్త మనఁబడు ననియు' (పు.211) పీఠికాభిప్రాయము. ఇది పెల్లయెడలఁ గుదుర దను ఉట్లుంచిన నిట ననుప్రయుక్త మగు ననయ్యాదులు (సంప్రార్థనమున) క్రియపై స్వార్థమునందే చేరును. కానియవి స్వీయార్థముతో నుండవు. అదాదు లెట్లో యిట నీఅయ్యాదులు నట్లె చేరునవి. వత్తమమ్మ యనుచోఁ గూడ ననుప్రయుక్తమే. కావున వీనివచనముఁ గూర్చిన విచార మనవసరము. [చూ. త్రి. శే.]

కాని మహాదర్థముననె అయ్య యనునదియు మహాత్వర్థమునని అమ్మ యనునదియుఁ జేరుట గమనార్హము. ఇట సార్వాద్యర్థము లేకున్నను చూచితి వత్తమమ్మ సుదతులార, పోవమ్మ కుమార యని యుండదు గదా.

వచ్చుధాతు ప్రార్థనాద్యర్థకసంక్షేపము అగు రా- ర- రారా- రాఁ [రమ్ము] అను శబ్దములు యథాప్రయోగముగ నామములపైని క్రియలపై నిల్చి యర్థవిశేషద్యోతకము అగును' [ఉ.44.సూ.బాల.లో లేదు][వ్యా.సం స.1422] వి.వి. ననుసరించి పై రీతి విశేషముగాఁ జెప్పి రని గ్రహిం పవలెను.

కాని రార- మొదలగునవి నిల్చినట్లు చూపినస్థలములలో ఏమిర క కాదురోరి, ఒరిరా, ఏరా తమ్ముఁడ, కానీరా, ఔరా అనుచోట్ల నున్న రా-ఁ అనునవి వచ్చుధాతువునుండి యేర్పడినరూపము లనుట యసమంజసమ ర-దే. అపదము నీచమిత్రోద్దేశములయందు ఉద్దేశ్యవాచకమునకు ఏకత్వం వ అంతాగమం బగును. కాదురోరి- ఏలర- అవ్య. అనురీతిగా శ.ర. అవ ముగ నవ్యయముగను జెప్పనది. ఇది యవ్యయ మనఁదగు. సంస్కృ మందలి రే(అవ్య.నీచాదేశ్సంబోధనే శబ్దస్తో.]శబ్దమువంటిదిగాఁ దెలుఁగు 'ర' అనున దవ్యయముగా నెన్నఁదగును. 'ర' యనునదే కాకువుతో 'ం యని యగు ననఁదగును. 'ఏమిర'- ఇత్యాదులలో రవర్ణము నీచత్వాదుల బోధించునే కాని వచ్చుధాత్వర్థమును (రమ్ము ఇత్యాదిగాఁ) దెల్పదు.

అర్థవిశేషద్యోతకము అగు ననుటలో వీరును "రమ్ము" అను ముందు నని తలఁపలే దనవచ్చు. అట్టియెడల నివి వచ్చుధాతునిష్పన్న ములుగాఁ జెప్పవలసినయవసరము శబ్దశాస్త్రమున లేదు.

ఇఁక వీరు సూత్రమునఁ జెప్పిన రారా- రార అనువానిలో మొద 'రా' రమ్ము శబ్దమె. దీనికి "ర" అను నవ్యయము పరముగ నుండఁగా రమ్ము- ర- అనుచో హల్స్వరత్వమున మధ్యమము వర్ణకము లోపించి రార ఆ యగును. దీనినుండి దీర్ఘముతో "రారా" అని యేర్పడు. ఇటుఁ బూర్వశబ్ద నెర "రమ్ము" అనునర్థమును సరిపడుట గమనింపఁదగును.

“ఒక్కటే ప్రత్యేకముగా, క్రియయుక్త మగునపుడు హ్రస్వాకార మ దదు. ర-రమ్ము- అని వాడరాదు." [వ్యా.సం.స.1421] దీనినిబట్టియు

యనుదానిని కాదు.... ఆ అనురీతి నేర్పడినట్లు చెప్పరాదు. కాని వీరు కాదా-కదా — కా యన్నవి గూడ శబ్దములకుంటగాఁ జెప్పిరి గదా. కదయ్య కదవె యన్నవి శబ్దత్రితయము గలవి. ప్రార్థనార్థమున శబ్దత్రితయమె కానగు. వినఁ గదయ్య [వినుము] అనునర్థమున విన్గాదా, వినఁగదా, వినఁగా అనురీతిని ప్రయుక్తములు గా వనుట స్పష్టము. నేఁడు గదా, నేఁడుగా యనుచోట్లఁ బ్రార్థనార్థక మగునా?

'కాదా' యన్నది కాదు + ఆ యని యేర్పడె ననుట స్పష్టమె. ఇట్లేర్పడిన కాదా యన్నది ప్రశ్నార్థకమై తద్వ్యతిరేకార్థమును (అవును) వ్యక్తము చేయును- కదా. కద, కా- యనువానియం దర్థక్రమ మిట్లు లేకుండుట గమనార్హము. కావున నివి చారిత్రకముగా నెట్లేర్పడినను, శబ్దశాస్త్రము ననుసరించి కాదు శబ్దమునుండి యేర్పడినవిగాఁ జెప్పకుండుటయె యుచిత మనిపించు. ప్రసిద్ధ్యాదులను బోధించు నివి(కద, కా) ప్రత్యేక మగు నవ్యయము లనుట యొప్పును.

### కదవె-కదరె :

"కదా. కద మున్నగువానిపై వె-రె అనునవి నిల్పుటయుఁ గలదు. చెప్పఁగదవె. అయింపఁగదవయ్య (ఉ.375) ఇందు రెండువిశేషము లున్నవి. కదతోపాటు కదా యనుదానిపైఁ గూడ వె,రె నిల్పు ననిరి. కాని కదావె. కదారె యన్న వుదాహరింపలేదు. అట్టివి భాషలో లే వనవచ్చును. 'మున్నగు వానిపై' ననిరి. కాని యవి యేవియో చెప్పలేదు. ఉదాహరింపను లేదు. 'కద'పై నిలుపుటకు మాత్రమె యుదాహరించిరి. (అంటవె-అంటరె?)

వె, రె అనునవి నిల్పు నన్నవీరు 'కదవయ్య' యనునది గూడఁ జూపుట విశేషము. మున్నూరం బయ్యోఁ గదవమ్మ, కూర్పఁగదటయ్య ఎంత తడవైనా కదరమ్మ(వ్యా.సం స.1425) అన్నవియు సం.లోఁ బ్రదర్శించిరి.

ఇట వయ్య, రయ్య, వమ్మ, రమ్మ యన్నవి నిల్చు నని చెప్పుదురా? లేక కదవె+అయ్య కదవయ్య, కదరె+అమ్మ కదరమ్మ అని యగు నందురా? క,ర. కదరె- కద+రె అని విభాగింపఁగా నది సరి గా దని వీరు కద+ర+ఎ- అని భేదము చూపుట యుక్త' (వ్యా.సం.స.|425) మనిరి. కాని యయుక్త మన్న క ర.విభాగమునె యిట వీరను వేర్కొనిరి. కద+ర+ఎ అను వీ రూహించినవిభాగము నైతము యుక్త మని నిర్ణయింపరాకున్నది. పారి యయ్య, మున్నగురీతిగా నిట సంధి లేకున్న కదరయయ్య యని యొకపక్షమున నగు నేమో యనుసందేహమున కవకాశము గల్గు. ఇట్లు పైని జూపినచో కదవె యయ్య మొ॥ (కద+ఎ-కదె) అయ్య వింతకంటె ఎదాచులకు ముందు వురులు భేదా వకాంరేఫములు చేరుటయుఁ గల దని చెప్పుట యుక్తము గదా.

వె, రె యనునవి నిల్చు నని వీరు సామాన్యముగాఁ జెప్పిరి గాని వీని భేదము గమనింపవలె. కావఁగదరయ్య రామచంద్ర,రక్షింపఁగదవయ్య దేవతలారా అనుట లేదు. కాఁగా 'వె'యన్నది యేకత్వమునను,రె యన్నది బహుత్వమునను గల దనవలె. (సూరి వ్యుత్పత్తి విధాన మచ్చోటనె కాక భాషాలక్షణ మైయితరత్ర గూడఁ దగుచు సూరి యీయంశమును గుర్తించుట ప్రశంసార్హ మగుచున్నది.)

ఈయంశములు కొన్ని ప్రస్తావించిన ప్రౌఢ-క్రి.9,28,29సూత్రములను ఉ.లో, గూడ వజ్ఝలవారు సూచించిన బాగుండెడిది.

**పో-లే ;**

'పొమ్ము-పో విశ్రుయార్థకములు'(ఉ.375)పొమ్ము విశ్రుయార్థంబు నం బగు నని ప్రౌఢ (వాక్య.22)చెప్పె. వీరు పో అనుదానిం గూడఁ జెప్పుట విశేషము. వచ్చెఁ బో యిక్కారణిన్ (సూ.ని.) అని స్వరపరకత్వమున ముదోపము గలదు. దానిని వీ రంగీకరించిరి. కాన వీరు 'పొమ్ము'ఒక్కటి.

చెప్పినఁ జాలు. పొమ్ము మధ్యమపురుషక్రియ కా దని వీరును జెప్పిరు (వ్యా.సం.స.1428) గదా.

అయితె- అయతె (అయ్యెను గదా.) (ఉ.872) 'తే' యనుదానికి హ్రస్వము నగుట విశేషము. ఇది శబార్థక మగు నని వివరణమునుబట్టి యూహింపవలె. పోతె మున్నగుచోట్ల నిది నిశ్చయమును సైతము చెల్లు.

కాని యివి శబ్దములజంటలు గాకుండుట గమనింపవలె. కొన్ని శబ్దము లంటులు. ప్రార్థనాద్యర్థకము లగు నని కదా వీరు లక్షణము చేసిరి. ఇట్టి, పో, మొదలగునవి జంటలు గావు. చేయఁబో మొత్తము నుద్దేశింప రాదు గదా.

ప్రార్థనార్థము నుద్దేశించుటవలనఁ గాఁబోలును వీ రీవాని నిటఁ బ్రస్తావించిరి. కాని, పో, ప్రభృతుల కిటఁ బ్రసక్తి గాసరాదు.

## టవర్గకలోపము:

టవర్గకంబు ఖావంబునం దగు (165) ననుదాని నట్లు (ఉ.46) గ్రహించిరి. విశేషము-

'చేయుటకంటెన్- మున్నగునవి చేయుటకంటెన్ మున్నగువాని రూపాంతరము లని యాధునికవ్యాకర్తలు సూత్రించినను (ప్రౌఢ.క్రి.14) నది ప్రాచీనసమ్మతము గాదు. అది చేయుదానికంటెన్ మున్నగువానిరూపాంతరములు' (ఉ.876) అథర్వణాచార్యు 'విభక్తిమాత్రం సర్వత్ర మహితం స్యాట్టవర్గకా' త్తని చెప్పుట యిందుకు మూలము. (వ్యా.సం.స.1433). కావున టవర్గకము లోపించినను ప్రౌఢ.ప్రక్రియ సరి గా దనవలె. అథర్వణోక్తికి భిన్నముగా వీరు చెప్పవచ్చును. ప్రాచీనసమ్మతి యెట్లుండవలె ననుట విచార్యము.

'పాలించుకొఱకు' ఇత్యాదులలోఁ బాలించుదానికొఱకు అనుదాని కంటె పాలించుటకొఱకు నని యర్థము చేయుట సూటిగ నుండు ననుక

తప్పదు. అందుకే ప్రౌఢ. 'తన్నకంటె' యిత్యాదిస్థలముల నసమాప్త తచ్ఛృద్ధిలోపమును జెప్పియు (క్రి 21) నిట కొఱకుకంటెపోయెంటెబపరకత్వమున 'ట'లోపమును జెప్పియుండరు. ఆయ్యది లక్ష్యసంగ్రాహకముగాఁ దోఁపదు.

మతులం గనియెదుకొఱకు (వ్యా.సం.వ.1434) అనుచో 'ట'లోపమైన దనుట కవకాశ మేది? ఇట్టి వింకను గానవచ్చును.

విశ్వామిత్రుని వాఁ దయ్యెదుకొఱకును (హరి.పూ.2.42) ఊర్వశి గనంగ నరిగెదుకొఱకై (భాగ.9.420) విందు దప్పెదుకొఱకై (భాగ.10.ఉ.70) వ్యవహారలక్షణం బెఱింగెదుకొఱకు (భోజ.1.59) ఘోరదురితంబు వీగెదుకొఱకు (భోజ.7.31) దాన నొకంగము దాచుచేతనో (అము.2.33) ఇది బాగెదుకొఱకై (సిం.11.145) వన్నెద మాడిన కోపము (వై.జ.3.96) పోయెదికొఱకు (రం.రా.299పుట) మొ॥

ఇట్టి వెల్ల సంగ్రహింపఁబడునట్లుగా నిట 'ట'లోపమును గాక యసమాప్త తచ్ఛృద్ధిలోపము చెప్పనగు ననువరుల వారియభిప్రాయ మ్ముచితము గనె తోఁచు. కాని యదియు గౌరవమే యనిపించు. (అటఁ దచ్ఛృద్ధిలోపమనుటచే) ఇవి యెల్ల ధా.వి.లుగా గుర్తింపఁదగును. ధా.వి.లకు విభక్తి వివక్షించినపుడు తచ్ఛృద్ధి మనుప్రయుక్తముగాఁ జెప్పఁబడినది. అట్టియను ప్రయోగము [అమహాదర్శమునఁ] గొన్నియెడల లే దనియు నట ధా.వి.లపై నరాసరిగా కొఱకుప్రభృతివిభక్తులు కొన్ని చేరుట గల దనియుఁ జెప్పిన నివ్వాసప్రక్రియ లాఘవముతో సిద్ధించును. కావున నిటఁ ప్రౌఢ. క్రియా.14,చేఁ గొన్నియెడల టవర్ణకమును, 21చేఁ గొన్నియెడల నసమాప్త తచ్ఛృద్ధమును లోపించు ననుటకంటె వఱుల వారెల్లయెడలఁ దచ్ఛృద్ధము లోపించు ననుటకంటె నిట ధా.వి.లకుఁ దచ్ఛృద్ధి మనుప్రయుక్తము గాదే యనుటయె యుచిత మని గుర్తింపఁదగును.

## భావార్థకము-తువర్ణకము :

చేయుట మున్నగునవి రూపాంతరములుగ చేయుటు మున్నగునవి కొన్ని కవిప్రయోగములం దగపడుచున్నవి. -చేయుటు- ఆది.7.16. ఓర్పుటు- శా.1.177 --(ఉ 376) నేఁ డీటుప్రత్యయము భావార్థమునఁ గానరాదు. 'చెప్పుటును' ఇత్యాదిగా ద్రుతాంత మగుటువర్ణ మానంతర్యార్థకము. కావునఁ బ్రాచీనప్రయోగములం దరుదుగఁ గానవచ్చు నీయంశమును విశేషముగా గుర్తింపవచ్చును. వరుసలవారైనను ప్రత్యేకముగా భావార్థములు [సూరివలె టువర్ణకమునే కాని] టువర్ణమును విధింపలేదు గదా. వివరణమునఁ జూపుట యుక్తమె.

కాని ప్రాచీనప్రయోగముల నైనను దర్పమధాతువులపై టువర్ణమిట్లుగాన రాదు. ఆకర్షించుటు[ఆకర్షించుట] ఇత్యాదులు గానరావు. అయ్యు ఎక్కుడు క్రమ్మరుటు (బాల.కృత్.20) అనుచోటిటువర్ణముతో దీనికి సామ్యము మృగ్యము. [చెప్పుటుమాటలు?] ఇది టువర్ణకమువంటి దన్నను చేయుటలు ఇత్యాదిగా చేయుటులు, చేయుటకొఱకు అనురీతిగా నీటువర్ణముపై నితరవిభక్తులు గానరాకుంటయు గమనార్హము. ఇట్టివి యెల్ల తెలుఁగుల విశిష్టములుగాఁ దోఁచు. చూ. భావార్థకము- ఆనంతర్యార్థకము.

## భావార్థకము-కజీ :

'కజీవర్ణకంబు పురార్థయోగంబున విభాషను భావంబునం దగు (36) ననుసూరిలక్షణమును వీరు దమగ్రంథమునఁ దొలఁగించిరి.

'సూరి కజీవర్ణకంబు .... మునుపు ముందు మున్ను తొల్లి అనురీతి పురార్థకంబులు అని సూత్రించి యుదాహరించెను. ఇది సరి కాదు --వ్యతిరేకక్త్వార్థకము.. -(ఉ.377) అనురీతివి పురార్థకంబు' లనుమాటలు సూరిగ్రంథమున లేవు. -వివరణప్రాయముగా వీరు గలిపియుందురు.

ఇఁక వీకజీ వ్యతిరేకక్త్వార్థకమె యని యిట్లు వివరించిరి. 'శంకకయ

మున్న - అనుచో క్రుంకకుండునున్న అని యుండుధాతురూపాధ్యాహారముచే సమానకర్తృకత సిద్ధించుచున్నది. కొన్నిచోట్ల నిట్లుండుధాతురూపాధ్యాహారము లేకయె యుండుధాతుప్రయోగమే వెలయుచున్నది. క్రుంకకుండుమున్న [ద్రో.2.28] [ఉ.38] దీనినిబట్టి యిచ్చటికజీ వ్యతిరేకక్త్వార్థముగా నస్వీకరింపవలయు నన్న నుండుధాతురూపము నధ్యాహారము చేసికొనవలె నన్నమాట.

ఉండుధాతుజవిశేషణ [వ్యా.సం.స.144] రూపము నధ్యాహారము చేసి సాధించున దేమి? సమానకర్తృకత యేమో యని వీరివివరణము వలనఁ దోఁచుచున్నది. సమానకర్తృకత లేదు గావున కజీ ప్రాప్తింపక పోవుటచే నిట్లు సూరి సూత్రించెనా? ఆ 'కజీ' వ్యతిరేకక్త్వార్థమునం దగునది గాఁగా నిట 'భావమునందుఁ' జెప్పఁబడినది. వ్యతిరేకక్త్వార్థకమైన కజీ భావార్థకము నగుటయుఁ గాని, లేదా ప్రస్తుతస్థలమున సూరి చెప్పినట్లు భావార్థము గాక వ్యతిరేకక్త్వార్థమే యున్న దని గాని చెప్పుచో నపుడే యీసూరి విధాన మనవసరము గాఁగలదు. కాని వీ ర ట్లాలోచించినట్లు దోఁపకున్నది.

వీరే "వండకమునుపు అనుదానిలోని వండకశబ్దమునకు వండుటకు అనియే యర్థము. పేటికావ్యాఖ్యాత 'వంటచేయుటకు ముందు వంట చేయకుండుటయే యుండెడిఁ గాన వ్యతిరేకరూపప్రయోగము తోఁచుట సహజము అని కేవలము పొరపాటుగా వ్రాసెను. వండకమునుపు అనుదానిలోని వండకశబ్దము భావార్థకమె కాని వ్యతిరేకార్థకము గాదు. ఈసూత్రమునందలికజీ భావార్థమున విధింపఁబడినదే --(వ్యా.సం.స.144)అనిఇచ్చటికజీవ్యతిరేకార్థకము గా దనియు సూరి సూత్రమునఁ జెప్పినట్లు భావార్థకమె యనియు సముచితముగాఁ జెప్పిరి. పేటికను విమర్శించుటలో సూరిభావార్థమం దనుట సమంజస మనియుఁ జక్కఁగా నిరూపించిరి. వ్యతిరేకక్త్వార్థమునందు కజీ వేరుగా విధింపఁబడినను నిచట భావార్థమె కలదు గావున భావార్థమందలికజీని వేఱుగా సూత్రించుట యసంగత మను టెట్లు?

వీరి వివరణమునకె విరుద్ధముగా నిది వ్యతిరేకార్థక మని (వ్యతిరేక క్త్వార్థకము) దీనిని వేఱ సూత్రింప నవసరము లే దనుట సక్రమమా?

క్త్వాగా నర్థము ననుసరించిన సూరివిధానము సముచితమె యని వీరివివరణమె స్పష్టము చేయుచున్నది. అయిన వీరే యేల యీసూరివిధానమును దిరస్కరించిరి?

నన్నయాధర్వణులు భావార్థమున కళ్ని విధింపకపోవుట యొకకారణము గావచ్చును. "కళ్ని వ్యతిరేక క్త్వార్థకకళ్గానే యంగీకరించి యయ్యది ఉండు అనునర్థ్యాహార్యధాతుజవిశేషణముతో నన్వయించునట్లు సమన్వయించుకొని సమర్థించుట యుక్త మనియుఁ దోఁచెడిని. ఇట్టియభిప్రాయము కలవాఁడగుటచేతనె కావలయు నధర్వణాచార్యుఁడు వేఱుగ దీని నుపదేశింపఁడయ్యె. ఆధర్వణాచార్యుఁడే గాక ప్రాచీను లెవ్వరు నిట్టిసూరిపద్ధతి నుపదేశింపలేదు. (వ్యా.సం.న.1440)

ఇట్టికళ్ని సాధించులక్షణము నేర్పఱుపఁగా నది వల దని తిరస్కరించి' యెదియో మార్గమున 'సమర్థించుట' యేలకో యర్థము గాదు.

వ్యతిరేక క్త్వార్థమున విధింపఁబడినకళ్ యెట్లు సాధింపఁగలమా యనియో కాని యిట నర్థము నది సాధింపఁగలదా యని వీరు ప్రముఖముగాఁ దలఁపలే దనిపించు.

'ఉండు' అధ్యాహార మనుట యొక్కటి సాధారణముగా సాధించులక్షణమును దిరస్కరించి 'యధ్యాహారము' దెచ్చిపెట్టుకొను టేల? పైఁగా నీపద్ధతి యధర్వణుఁడు నుపదేశించియుండు నని యూహించుట యింకను నసంగత మైయున్నది.

అధర్వణుఁడు అధ్యాహారస్య సంయోగ స్త్వత్ర నైవ సుఖావహః అని యధ్యాహార పద్ధతి నామోదింపలేదు. వీరివ్యాఖ్యానపద్ధతి ననుసరించిన ప్రస్తుతవివరణము నన్నయాధర్వణసమ్మతము గాదు సరి గదా విరుద్ధ

మనియుఁ జెప్పవలసియున్నది. కాని యీ టీకాటీకావివరణమున సుఖావహము గా దనుటచే ననఁగా నిషేధింపఁబడకుండుటచేతఁ గ్వాచిత్కముగా సుఖావహ మగునధ్యాహార ముంచిన నందు ననుసర్థము తోఁచుచున్న' [వ్యా.పం.ప.1102] దనిరి. 'నైవ సుఖావహః' అని 'ఏవ'శబ్దముతోఁ జెప్పఁగాఁ గ్వాచిత్కముగా సుఖావహమే యని యర్థము తోఁచుటవింతయే. ప్రౌఢ. చెప్పినయధ్యాహారస్థలము లెల్ల సుఖావహములే యనిరి. అవుఁ గాక, అది యథర్వణసమ్మత మని చెప్పఁబూనుట యుచితమా? కాఁగా నిట నుండుధాతురూప మధ్యాహార్యమె యని యథర్వణుఁడు తలఁచె నను నూహా విశ్వసనీయముగా లే దనక తప్పదు.

అవసర మైనఁ బూర్వులు సమ్మతింపలే దనియే నుపేక్షింపఁ బని లేదు. కాని యిట నధ్యాహార మవసరమా? అన్వయమున ననుపపత్తి యేర్పడిన నధ్యాహారము చేసికొనవలె. క్రుంకకముందు, పండక మునుపు ఇత్యాదులలో నన్వయమున కనుపపత్తి యేర్పడినదా?

క్రుంకకుండుమున్న. పూవకుండఁగా మున్న అనుచో 'నుండు' ప్రయుక్త మైనది. కాని యిది ప్రత్యేకముగా నన్వయించుచున్నదా యని సందేహము.

పూవక ఉండఁగాన్- మున్న- వికసింపక యస్థితి యుండఁగా దానికి మును పని యర్థము. దీనికి వికసించుటకు మును పని యర్థమా లేక వికసింపకుండుటకు మును పని యర్థమా? ఇట 'నుండఁగా' నన్నది స్వతంత్రముగా నర్థవంత మై వాక్యమం దన్వయించు నన్నపుడే యన్వయము క్లిష్ట మగుచు నుద్దిష్టార్థము సరిగా సిద్ధించుట లే దనిపించుచున్నది.

క్రుంక కుండుమున్న- ఉండు అనునది ధా.వి.గా [సం.లో] వీరును జెప్పిరి. అపు డీరూప మెట్లు దీనివలనఁ గదా సమానకర్తృకత సిద్ధించు నందురు వీరు. అట్టిచోఁ గ్రుంకుటకు, నుండుటకు నొక్కటియ కర్త: తోయజమిత్రుఁడు. కావున 'ఉండు అనుధా.వి. కాఁగా విభక్తి

కావలె. తోయజమిత్రుఁడు క్రుంకక యుండువాఁడు. [క్రుంకక] ఉండువానికి మున్ను-ఉండుమున్ను అని సమాసమునమహత్తచ్ఛబ్దము లోపించిన దన్న మాట. [వీరిప్రక్రియలో నిది కష్టమె] అపుడు దీనియర్థ మేమి? క్రుంకక యుండువాఁడైన తోయజమిత్రునికి మున్ను అనియా? ఇది యుచితమా? క్రుంకక యుండుటకు మున్ను అని భావార్థము సరిపడును. ఇట 'ఉండు' అనుప్రయుక్తముగాఁ జెప్ప నుచితముగాఁ దోఁచు. అపుడే క్రుంకకుండు మున్ను-క్రుంకుటకు మున్ను. పూవకుండఁగా మును- పూచుటకు మును నని యర్థము సులువుగాఁ గుదురు.

ఉండుధాతురూపములు ప్రయోగింపఁబడునపుడే యన్వయించు. లేకుండఁగా, లేనిచోట్ల నధ్యాహారము చేయవలయు ననుటుచితమా? ఉండి, ఉంచి అధ్యాహారము చేసినవస్థలవారిప్రక్రియామార్గములో నిఁబ్బందులు కొన్ని యిట గమనింపవచ్చును. (చూ.కౌర.) వారు గానక ముందర (విరా.4.84) మున్నగా వీరు చూపినవానియన్నిఁట నుండుధాతురూప మును దెచ్చిపెట్టుకొన్న నన్వయము క్లిష్టమే. కానకఉండుటకు ముందర వివక్షలోఁ దచ్ఛబ్ద మనుప్రయుక్త మైన మహాదర్థమున 'ఉండువాఁడు' అని అని యుండురూపము నన్వయించుచోఁ 'గవిసప్పు' దని యర్థ మగు నేమో యనిపించు. కాక పిదప సెప్పుడు గాన లే దనియు నర్థము గానవచ్చును. ఏ మైన నిట నన్వయము సహజముగా లేమి స్పష్టము.

'వండక' యన్నది భావార్థకమై యయ్యుఁ బులార్థకముతో నన్వయించునపుడు వ్యతిరేకార్థము స్ఫూర్తి గల్గినఁ గల్గ నగు నని వీర పేర్కొనిరి. (వ్యా.సం.స.1441) అన్వయమునకై యుండుశబ్దమును దెచ్చికొన్న నట్టివ్యతిరేకార్థస్ఫూర్తి యుండ దేమో. ఉన్న నర్థమువిపరీత మగును గదా.

వచ్చియుండక మున్ను- వచ్చియుండక యుండుమున్ను- అను

రీతిగా చేయుట యెంతసహజముగా నుండునో చెప్పఁ బని యేమి?

కాఁగా వచ్చులవారిసమన్వయమును సముచితముగా లేమింజేసియు బా.సా.పే.ను విమర్శించుచు నిది భావార్థకమే కాని వ్యతిరేకార్థకము గా దని వీరే పేర్కొన్నదాని ననుసరించియు నిట భావార్థమున సూత్రి కజేని విధించుట సముచితమే యని స్పష్టము.

మహాకవుల(వ్యా.సం.ప.1441)ప్రయోగముల కనుగుణమైయున్న యీసూత్రిలక్షణమును వీరు దొలఁగించుట సరి కాదు.

## మిజీ :

'వ్యతిరేకభావంబున మిజీ యగు'(37) ననుదాని నట్లె గ్రహించిరి. (త.45)

'మిజ్' జిత్తు గాన బా.క్రియా.20సూత్రముచొప్పున ధాతూకారమున కాదేశముగా అకారము వచ్చును' (వ్యా.సం.ప.1448) అని స్పష్టము చేసినవరులవా రిట 'వండు+అ+మి-వండమి అట్లే పండు+అ+మి-పండమి- అనురీతిగా ధాతూకారమునకుఁ బదముగా నత్తును జూపుట పొరపాటు. వీ రిట్లే 'ధాతువుతుదిఉకారమునకు అకారాదేశ మగును. వండు+అ+క- వండక (1455). వండు+అనివాడు (1487) కొట్టు+అనుపడు (1497) అనురీతిగా స్థలాంతరములందును (బ్రాకెట్టులఁ) జూపుట సమంజసముగా లేదు.

## క్త్వార్థకము :

'సమానాశ్రయంబులం బూర్వకాలంబునం దివర్ణకం బగు' (35) ననుసూత్రలక్షణమున (సంస్కృతానుసారముగా) సమానకర్తృకంబులం బూర్వకాలంబునందు 'ఇ' వర్ణకం బగు (త.49) నని సవరించిరి. సమానకర్తృకము అనకే సమానాశ్రయము అనుట ప్రయోజనము నుద్దేశించియే యని సూరి వివరించెను.

దీనింగూర్చి వసులవారు- "చైత్రునిచేతఁ గొట్టఁబడి మడిసె- మున్నగుచోటులందు సమానకర్తృకత్వము కుదురదని దనుచు సూరి 'సమానాశ్రయంబులవ్' అని సూత్రించెను. కాని యీసూరిసూత్రము సుఖ్యంభాదిస్థలములం దతివ్యాప్త మగుచున్నది. చైత్రునిచేతఁ గొట్టఁబడఁగా మైత్రుండు మడిసె. చైత్రునిచేతఁ గొట్టఁబడియున్న మైత్రుఁడు మడిసె. అని యిట్లు ఉండుధాతురూపాధ్యాహారముచే నేకకర్తృకత్వము గల్గుచునే యున్నది" (ఉ.౩౪౪) యని సూరిలక్షణమున నతివ్యాప్తిని జూపిరి. దానిని వారించుటకే వీరు 'సమానకర్తృకము' అనిరా? అయిన నతివ్యాప్తి వారింపఁబడినదా? క్త్వాప్రత్యయ మయినపుడే యుండుధాతురూపము నధ్యాహారము చేయవలెనా? సూత్రమున సమానకర్తృకము అనుటచే నట్లు సమానకర్తృకత్వము సిద్ధించుటకే యధ్యాహరింపవలె. అట్లు సూత్రింప నేల? అందుకై యధ్యాహారము చేయ నేల? సూరి 'సమానాశ్రయము' అనుట యుక్తమని వీరి యీవివరణముచేతనె తెలియవచ్చును.

అసలు సూరిలక్షణ మతివ్యాప్త మనుటకు కొట్టంబడి మడిసె. కొట్టఁబడఁగామడిసె' సమానస్థలములా? 'కొట్టంబడిమడిసె' ననుచో ముందు కొట్టఁబడుటయుఁ బిదప మడియుటయు నర్థము. కొట్టుట, మడియుట యనురెండుక్రియలలోఁ బూర్వకాలిక మైన 'కొట్టఁబడు'అనుదానికి క్త్వాప్రత్యయమె రావలె. అట్లు వచ్చినది. 'కొట్టంబడఁగా మడిసె' ననుచో కొట్టుటఁ బూర్వకాలికమె యయ్యెను. కొట్టఁబడుటచే మడిసె నని యర్థము. 'వసుదేవుఁ డుండఁగ వృద్ధని పూజించితే' అనుస్థలములందువలె భావలక్షణార్థము విశేషము. కావున నాయర్థమున నుజియే యగును. నుజి యగుచోట్ల 'క్త్వా'ప్రత్యయ మందువలననే కలుగదు. కాన నిట నతివ్యాప్తిదోష మున్న దనుట సరి కాదు. కొట్టఁబడిమడిసె, కొట్టఁబడఁగా మడిసె. ననుచోట్ల సమానార్థకములు గాకుండుటయె యీయంశమును స్పష్టము చేయఁజాలు చున్నవి.

ఆట లస్పష్టములు గాఁగా "చైత్రుండు వంటన్ బోయెను. అనుచో

దుమర్థమున దీనికిఁ బ్రసక్తియే లేదు. (వ్యా.సం.స.1457) చైత్రుఁ పండు నతిథి వచ్చెను అనుచో సమానాశ్రయత్వము లేదు. ఇవ ర్త్వ వీ జేషస్థలములఁ నతివ్యాప్తి మగుప్రశ్నయే లేదు. ఉండుధాతురూపాధ్యాహ మును సంస్కృతానుసారముగనె వచ్చులవారు చెప్పిరి. (వ్యా.సం.స.146 అట్టియధ్యాహారమునవసరము లేకయె సూరి యుప్రత్యయము సాధిఁ చుచుండఁగా నది తిరస్కరించి యధ్యాహారపద్ధతి నాశ్రయింప నేల? స ఉకార్థమందుఁ దెలుఁగునఁ బ్రత్యేకముగాఁ బ్రథమ విధించినస్థలము ! స్మరింపఁదగును.

అయినను 'వ్యాకరణముతో విరోధ మేర్పడినపుడు దానిని దొ గించుటకై సంస్కృతపండితు లట్టి యధ్యాహారమార్గ మవలంబింతు (వ్యా.సం.స.1418) గదా, ఇట వ్యాకరణమే యవిరుద్ధముగాఁ జెప్పుచుఁ డానిని దిరస్కరించి విరోధమును దెచ్చిపెట్టుకొని దానిని వారించుట యధ్యాహారమార్గము నాశ్రయింప నేల? ఉండుధాతురూపము నధ్యాహారః చేయకయు నన్వయమునం దనుపపత్తి లేకుండఁగా నర్థము సిద్ధించుచున్న గదా.

తెలుఁగున నేవి 'రాహుకంఠము తెగి దేహము ధరణిఁ బడెఁ నిత్యాదులం దవసర మైన నిట్టియధ్యాహారము చేయుదురు గాక- (అదియు బరిశీలింపవలె)సూరి యుదాహరించిన 'కొట్టంబడి మడిసె' ననుచో నట్టిద ఇటఁ గూడ నధ్యాహారము చేయుచోఁ దెలుఁగున గర్మార్థకవాక్యము నిట్టిచో నెల్లెడల నియతముగా నధ్యాహారము చేయవలె. ఇది తెలుఁ నందలి ప్రత్యేకస్థితి కావున నె సూరి సమానాశ్రయము లనుటకుఁ బ్రయోజ ముగా నీవాక్యము నుదాహరించియుండవచ్చును.

దీనిని గుర్తించి గు.ప్ర. 'సంస్కృతంబులో నీవాక్యంబు(కొట్టంబ మడిసె) తెలుఁగునందువలె వచింప వలనుపడదు'అనుటను దిరస్కరించు వచ్చులవారు"బాలవ్యాకర్త గాని తద్వ్యాఖ్యాతలు గాని...సంస్కృతమందు

ట్టియెడల క్త్వాప్రత్యయముతోడి ప్రయోగమసమ్మతమేయని గ్రహింపరై ' ని (వ్యా.సం.స.1452) విమర్శించిరి. ఇట్టిసంస్కృతవాక్యములు తాము హపితి మనిరి గాని యది సరి కాదు. ఇట బాలవ్యాకర్తయుఁ దద్వ్యాఖ్యాతలు ఏ జూపినది కర్మార్థకవాక్యము. ఏ కట్టి దొక్కటియుఁ జూపలేదు. (వ్యా. సం.స.1449) బహుళః ఉందు(స్థిత)శబ్దాధ్యాహారము సంస్కృతమునను గల దని యుదాహరించుటయే యిది యని తలఁచి రేమో. వీ రిటఁ బ్రధాన ముగాఁ జూచినది ఉందురూపాధ్యాహారము, సమానకర్తృకతాసాధనము మాత్రమె. కావునననె సూరిప్రభృతులయుదాహరణములకును తా మిచ్చిన సంస్కృతప్రయోగములకును గల ప్రధానమైనభేదమును వీరు పట్టించుకొనలే కనపచ్చును.

సంస్కృతమున నిట్టికర్మణివాక్యముల క్త్వాప్రత్యయము గలుగుటయే పొసఁగదు. 'చైత్రేణ తాడితో మైత్రో మమార' అనురీతినే యుండును అన్న గు.ప్ర.(407) వచనములు గమనార్హములు. వరుసలవా రైన నెట నుండి యుదాహరింతురు? కావున నిది తెలుఁగువాక్యములో సంస్కృతవిలక్షణ మగుప్రత్యేకతయె. సంస్కృతమున నిట్టిచోట్ల క్త్వాప్రత్యయమె లేకుండ నట్టిచోట్ల నిట్టియధ్యాహారము సంస్కృతమునఁ గల దనుట యెట్లు? తెలుఁగులోనియీప్రత్యేకతను దృష్టియం దుంచుకొని యిట్టియెడల నియతముగా నధ్యాహారము చేసికొనవలసినయవసరము దప్పించినసూరిలక్షణము సూక్తిమై యుండ నది తిరస్కరించుట యసమంజసము. సూరిమార్గమువలన "సమానకర్తృకత్వపునిర్వాహమునకయి పెక్కుచోటులందు ఉందుధాతురూపములధ్యాహార్యములు (ఉ.379) గావలసినయవసరము తప్పుట ప్రశంసార్హమైయున్నది.

'అధ్యాహారసంయోగ స్తత్ర నైవ సుఖావహః' అని యుధర్వణుఁడు చెప్పియున్న వీరు విశేషముగాఁ గ్వాచిత్కముగా సుఖావహ మని వ్యాఖ్యా

నించి యిటఁ జెక్కుచోట్ల నది కల్పించుటలో నన్నయాథర్వణసమ్మతిఁ గై విచారింపకుంట విశేషమే.

రాహుకంఠము తెగి దేహము ధరణిఁ బడియె ననుస్థలమునందును 'తెగియున్న దేహము ధరణిఁ బడియె అనురీతిని ఉన్నశబ్దాధ్యాహారముచే సమన్వితమగుచున్నది' (వ్యా.సం.వ.145.2) అనుట యుక్తముగాఁ దోఁపదు. (పుత్రం దృష్ట్వా సుఖం భవతి- యనురీతిదానికంటె యిది భిన్నము.)

కంఠము తెగియున్న దేహము ధరణిఁ బడె ననుచో నన లాదేహము మొదలే కంఠము తెగియున్న దనియునట్టికంఠము లేని దేహముక్రిందఁ బడిన దనియునర్థమగుచున్నది. 'అమరారిమర్దనుఁడు చక్రముఁ గ్రక్కున వేయ రాహు కంఠము దెగి దేహము ధరణిఁ బడియెఁ దన్ముఖమమృతస్పర్శమున నక్షయంబై నిలిచెన్' అనుచో (నాతని ముఖ మక్షయముగా నిల్చియే యున్నది.) విష్ణు చక్రమువలన ముందుగా కంఠము తెగి పిదప దేహము ధరణిని బడిన దనియే యర్థము. ఉన్నశబ్దము నధ్యాహారము చేసిన సంతకుముందే కంఠము తెగియున్న దేహము విష్ణునిచక్రముచే నేలపైఁ బడిన దనురీతిగా నర్థము తోఁచుచున్నది. ఇది యుచితము గాదు గదా. ఇట సూరిలక్షణమున సమానాశ్రయత్వముచే 'ఇ'ప్రత్యయ మైనట్లు చెప్పఁదగు.

భీము గదాహతిఁ గూలి యాతనిచేత సర్వాంగంబులందును గ్రొన్నెత్తురు కొంతఁ ద్రావఁబడి మఱి తెగటారి పడియున్నవాఁడు దుశ్శాసనుఁడు (శ్రీ.255) అనునది 'కొట్టంబడి మడిసె' ననుసూరియుదాహృతివంటిదె.

ఎనయంగ నార్నూఱు నేఁబది యేండ్లు సనియె నీ విట వచ్చి సంయమి వర్య (బసవ.3.1159) ఇట ఉండు నధ్యాహారము చేసి యన్వయించిన వచ్చియుండి 650 ఏండ్లయ్యె ననఁగా 650 ఏండ్లనుండి యిటనే యున్న ట్లర్థ మగును. 650 ఏండ్లకుఁ బిదప వచ్చినయర్థము గలుగదు. ఇట సమా

నాశ్రయత్వమును గుదురకున్నది. ఏతేర దొరకని యెన్నియో నాళ్లయ్యె' -విత్యాదిస్థలములఁబట్టి 'ని' ప్రత్యయ మర్థవిశేషములందు నగుట గుర్తింపఁ దగును.

అరు దగునిట్టివిశేషస్థలములు ప్రత్యేకముగా గుర్తింపఁదగియుండఁగా ఇప్రత్యయమును భాషాసామాన్యలక్షణము ననుసరించి 'సమానాశ్రయంబులం బూర్వకాలమునందు' విధించినసూరిలక్షణము సూక్తమై యట్లు గ్రహింపఁ దగియున్నది.

### కొని-క :

'ఆత్మనేపదార్థకకొనుధాతు క్త్వార్థకరూప మగు (పట్టు)కొని మున్నగు వానికిఁ బర్యాయములుగ పట్టుక, పట్టుకొ, పట్టుకొన్ అనురీతిని నిర్మాణ గలదు. మెడఁబట్టు కొయ్యఁదిరుగన్ —శకు.80 ఇట్టిప్రయోగములు సాధువు లని విశ్వసింపఁదగదు. (ఉ.380) ఇట్టిరూపములు బాల. సిద్ధములునుగావు. అయ్యవి నుపేక్ష్యములా?" ఈప్రయోగములలోఁ గొన్ని ప్రామాణికకవిప్రయోగము లున్నవి. వీనిని సూరి కానున్నను ప్రౌఢవ్యాకర్త యేని సంగ్రహింప కుండుటకుఁ గారణము తోఁపకున్నది (వ్యా.సం.స.1516) యన్న పీఠికఁ గారణ మేమియుఁ జేర్కొనకయె సాధువులు గా వని విశ్వసించుట యుచితమా?

పైఁగా 'ప్రాచీనప్రామాణికగ్రంథములం దిట్టిప్రయోగము లున్నచో నవి ముద్రణసంస్కర్తలచేఁ బ్రక్షిప్తము లనఁదగును — కొన పట్టియెడఁ జుప్రత్యయము కవిప్రయుక్త మని విశ్వసింపఁదగును'- (ఉ.380) అని పేర్కొనుట చూడఁగాఁ గవిప్రయోగములను దిద్దివేయవలె నని చెప్పుచుండి రనవలె. సం.లోఁ బ్రామాణికకవిప్రయోగములు గల వన్నపీఠిక నవి ముద్రణసంస్కర్తలు ప్రక్షిప్తములు చేసి రనుట వింత. ఇంకను కొట్టుకు- కొట్టుచు- అని చువర్ణము కవిప్రయుక్త మని విశ్వసింపఁదగు నన్నపీఠిక ముందు సం.లో. చువర్ణముగా ననుమానించియు సమార్గమును దిర

స్ఫురించి "అనేకస్థలములందు విస్తరించి యున్న యీప్రయోగము కవిప్రయుక్తమే యనుట విశ్వసనీయ మైయున్నది' (వ్యా.సం.ప.1517) అని 'కుత' ఇత్యాదిగనె కవిప్రయుక్త మని విశ్వసింపు మనిరి. ఇట్లు నింకొకవిధముగా విశ్వసింపఁదగు ననిరి. పరుటలవారిబుద్ధి ననుసరించి కవిప్రయోగములను గూర్చినవిశ్వాసమును మాఱిపోవలయునా?

దీనికి సాధుత్వమును గల్పించు టొప్పును. విశేషముగా నీప్రయోగములను గుర్తించుటే నొప్పును. కూఁతురిని అనురీతివాని నంగీకరించినవి రివి సాధువులు గా ననుటకు సూరి యిది యసాధువులనకుండుట కారణము గాదు గదా.

## మిక్కిలి :

'మిక్కిలుధాతుక్త్వార్థక మగుమిక్కిలిశబ్దము విశేషణముగ నైతము వాడఁబడు నందురు [శ.ర.] వానిమిక్కిలిచేతులు మిక్కిలికన్నుల్ [సభా. 2,57] మిక్కిలు. అనుతద్ధర్మవిశేషణమునె నిల్పుట లెస్స' [అ.381]

అన నేమి? నన్నయ మిక్కిలి యనియే ప్రయోగించినను దానిని దీసి యట 'మిక్కిలు' అనుతద్ధర్మార్థకవిశేషణమును నిల్పవలె ననియా? పరుటలవా రీమార్గమును దఱుచుగా ననుసరించినను నది యంగీకార్యము గాదు. ఇట నన్నయ 'మిక్కిలిచేతులను వానిమిక్కిలికన్నుల్' అని ప్రయోగించె శ.ర.కూడ నట్లె చూపె.

పరుటలవారిపై వివరణమునుబట్టి వారికి 'మిక్కిలి' యనునది విశేషణముగా సమ్మతము గా దని యర్థము తోఁచును. దాటించినమిక్కిలుల్ [ఉ. హరి.8] అనుదానినిబట్టి మిక్కిలుధాతు వంగీకరింపవచ్చును. కాని వీ రట "మిక్కిలి- అధిక మైనది. అనురీతిని విశేషణమును గలదు ".అని చెప్పియూ నన్నయప్రయోగమె చూపిరి. [వ్యా.సం.ప.1424] కాఁగా సం.లో నిది విశేషణముగా నంగీకరించియు నిట 'మిక్కిలు' అని యేల నన్నయప్రయో

గమును దిద్దఁబూనిరో. తమయభిప్రాయమును మార్చుకొనిరా? కాని యింకను సం.లో 'పాండవులవిభవ మది యాఖండలువిభవంబుకంటెఁ గడు మిక్కిలి యై' (సభా.2.104) ధేనువు మిక్కిలి మానవులకు (అశ్వ.2.161) (కర మర్థి మిక్కిలి కన్నిచ్చుట (బసవ.వ్యా.సం.ప.1454) —అనియుఁ జూపిరి. ఇటఁగూడ దిద్దవలెనా? 'మిక్కిలు' అని పిల్పుట క్లిష్టములు, గుడుఁదే. నన్నయప్రయోగమునసె పైని 'మిక్కిలు' అనుతద్ధర్మార్థకవిశేషణరూపము పిల్పుద. మన్న మిక్కిలున దై యని యుండవలె. పద్య మే మగును. అవకాశ మున్నమేర దిద్దవలెనా? అవకాశము లేనిచోట మిక్కిలి యనువిశేషణరూప మంగీకరింపకతప్పదే. అసలు కవిప్రయోగములను దిద్దు టేమి? ఇష్టమైన సాధింపఁదగును. ఉపేక్షింప తున్న నసాధువు లనుకొందురు గాక స్వేచ్ఛగా దిద్దఁదలఁచుట యొప్పునా?

'మిక్కిలి' విశేషణ మనుట సమంజసమే.

ఇంక నిది మిక్కిలుధాతువు క్త్వార్థకరూప మనువరుల వారియభిప్రాయము నుచితముగాఁ దోఁపదు. శ.ర. మిక్కిలి విశేషణ మన్నను విట్లు క్త్వార్థకరూప మన్నట్లు గానరాదు. మిక్కిలికంటె పెల్లు ఇత్యాదుల నిది సమానగత మయియు నున్నది.

మిక్కిలు— అతిశయించు. (అధికమగు) మిక్కిలి— అతిశయించి (అధికమయి) అధికము అనునర్థ మెట్లు? 'మిక్కిలు' ధాతురూపము లరుదు. 'మిక్కిలి' శబ్దము ప్రచురప్రయుక్తము—చారిత్రకముగా నిది యె ట్లేర్పడినను 'మిక్కిలి' ప్రత్యేకశబ్దముగాఁ జెప్పుటయే యుచిత మనఁదగు.

కాక చేయు— చేయి, వ్రాయు—వ్రాయి— యనుతీరుగా మిక్కిలు— మిక్కిలి. 'ఇ' అనుకృత్ప్రత్యయ మైన దందమా? (చేయి యనుచోఁ గర్త్రర్థకము వ్రాయి—యనుచోఁ గర్మార్థకము మిక్కిలి అనుచో భావార్థకము) ఇది

యా యా విభక్తులతో మిక్కిలిని. మిక్కిలిచేత ననురీతిగాఁ బ్రయుక్త మయి గానరాదు.

## వ్యతిరేకక్త్వార్థకం :

'కజి వ్యతిరేక క్త్వార్థంబునం దగు' (39)ననుదాని నట్లు గ్రహించితి. (ఉ.50)

ఇటఁ గూడఁ బూర్వసూత్రానుసారముగా సమానాశ్రయంబులం బూర్వ కాలంబునం దని సూరియభిప్రాయము గాఁగా సమానకర్తృకంబులం బూర్వ కాలంబుం దని పరులవారియభిప్రాయము. వీరిమతమున నందుధాతురూపా ధ్యాహారము తప్పదు. అది యనవసర మగుటయు సూరిలక్షణము సూక్త మగుటయుఁ బూర్వము (క్రి.36. సూత్రమునొద్దను) స్పష్టము.

చదువకయును నాకు సర్వవేదంబులు సంభవిల్లవలయు(ఆర.3.26) చదువక- అనుదానికిఁ గర్త నేనుశబ్దము. సంభవిల్లుట అనుదానికిఁ గర్త సర్వవేదంబులు. ఇట సమానకర్తృకతకయి 'చదువకయున్నను సర్వవేదంబులు సంభవిల్లవలయు నని యుండుధాతురూపాధ్యాహారము చేయుటచే 'ఉన్నన్' అనుదానితో సమానకర్తృకత్వము సిద్ధించినది' (ఉ.381) సూరి మతమున నిట్లధ్యాహారము చేయఁ బని లేదు. వేదములు చదువకుండుట, వేదములు సంభవిల్లుట అనునవి రెండును 'నేను' అనునొక్కదానినే యాశ్రయించియుండుటచే సమానాశ్రయము లగువీనిలోఁ బూర్వకాలిక మగుచదువు ధాతువునకు వ్యతిరేకార్థమున కజిప్రత్యయము సూరిలక్షణముచే సామాన్యము గనె సిద్ధించును.

ఈ రధ్యాహారము చేయుటయు 'సమానకర్తృకతాసంపాదనమునకే' యని వారివివరణమే నిరూపించుచున్నది. సమానకర్తృకములం దని చెప్పి యని కుదురనిచోట నందుకయి వేఱొకశబ్దము నధ్యాహారము చేసికొనుట కంటె నట్టియవసరము లేకుండఁ జెప్పినసూరిలక్షణ ముచితము. అధ్యాహా

రించుకొన్నను ఉండుధాతురూపములు సరిగా నన్వయింపక 'యనుప్రయుక్త ములవలె మాత్రమె గన్పట్టుట గుర్తించియుంటిమి. కాఁగా సూరిమతము చితము.



## చాల-చాలా :

తుమర్థభావలక్షణంబులందు నుజీ యగు(40)ననుదాని నట్లు గ్రహించిరి. (ఉ.51)

చాలన్ అనునది చాలుధాతునుజ్యంతరూపమె యయ్యు విశేషణము గా నైతము వాడఁబడుచున్నది. చాల, చాలా శబ్దములు విశేషణత్వమునఁ గళలుగా నగపడును. చాలకాలము (పాండు)-- చాలా [చాలన్]గౌరవమంద [హరి.నూ.6.147] లక్ష్మీనారాయణకోశమున చాల, చాలా విశేషణము లుగాఁ జూపఁబడెను [ఉ.382] వీనిని గళలుగాఁ జెప్పవలెనా యని సందేహము. శ.ర,సూ.ని.లు ఇట్లు పేర్కొనలేదు. అందుకే వీరు లక్ష్మీనారాయణ కోశము నుద్ధరించియుందురు. చాల నబల- ఆది.6.220 [వ్యా.సం.స.1460] అని యిది ద్రుతాంతమె. చాలకాల మిత్యాదుల సమాసమున ద్రుతము లోపింపఁగా [ఎల్లకలుషము లిత్యాదిగా] నేర్పడినరూపములుగా గుర్తింపఁదగి యున్నవి.

ఇంక నిది చాలుధాతునుజ్యంతమా? ప్రత్యేక మగు[ప్రతిపదోక్త మగు]నవ్యయముగాఁ జెప్పఁదగు నని సూ.ని.వలన నూహింపఁదగియున్నది. అర్థమునందుఁ గలభేదమువలన నిది 'చాలు'ధాతునిష్పన్నముగాఁ జెప్పకుంటయె శబ్దశాస్త్రమునఁ దగు నని తోఁచుచున్నది.

'చాలా' అన్నది [లోకవ్యవహారమునఁ గలదు.] కావ్యవ్యవహారమున నున్నదా? చాలా [చాలన్] గౌరవ మంద అనునది వీరు చూపిరి. కాని యిటనే కుండలీకరణమున 'చాలన్' అని చూపుటనుబట్టి యిటఁ జాలా యని యొన్నదని వరుసలవారును నిశ్చయించినట్లు గానరాదు. సం.లో నీప్రయోగ

'చాలన్ గౌరవమంద' అని చూపిరి. (వ్యా.సం.స.1460) ముద్రితప్రతియం దిది 'చాల్ గౌతుక మంద-' నని యున్నది. సూ.ని. అట్లే యుద్ధరించినది. (వరుసలవారు 'గౌరవ' మని దిద్ది యొక్కడిపాఠమో.] కాఁగా నిది 'చాలా' యనుదానికి నిర్వాహకము గాదు. అందుకే 'చాలన్' అన్నది పేర్కొన్న సూ.ని. 'చాలా' పేర్కొనలేదు.

కాఁగా కావ్యవ్యవహారమున సాధారణము దొరుకునందునఁ 'చాలా' శబ్దము నిట నంగీకరింపఁ బని లేదు. ఇంక లోకవ్యవహారమున సముచ్చయాద్యర్థవిశేషములతో దీర్ఘము పెట్టఁదలఁ గలదు. ఏమియును- ఏమీ- అన్నయును, తమ్ముఁడును- అన్నాతమ్ముఁడూ- అట్లే యిట 'చాలా' అని విన్పించు. [దానిని లక్షణబద్ధము చేసి కావ్యప్రయోగార్హత కల్పింపఁదలఁచుచోఁ బెక్కింటి కవకాశము గల్పింపవలె.]

'చాలా' యన్నది కావ్యప్రయుక్తము గాదు గాన దానిప్రసక్తి యనవసరము. చాల నన్నది కళ కాదు. ద్రుతప్రకృతికమె. ఇది చాలు ధాతువుత్వాంతరూపము గాక ప్రత్యేక మగునవ్యయ మను లోప్పు నని గ్రహింపఁదగును.

## చేదర్థము-అప్యర్థము:

'చేదర్థంబునందు వృత్తం బగుభావలక్షణంబునందు నపర్ణకంబు ద్రుతాంతం బగు' [41] ననుసూరిలక్షణమును వీరు 'చేదర్థంబునందును, నప్యర్థమందును, భూతార్థమందలిభావలక్షణార్థమందును ద్రుతాంతం బగు నపర్ణకం బగు' ననిరి. [ఉ.52సూ] సూరిసూత్రమందలిపదము లటు నిట నగుట యుపేక్షింపఁదగు. ఇంక 'వృత్తంబగుభావలక్షణంబునందున్- భూతార్థక మగుభావలక్షణార్థమందును' [వ్యా.సం.స.1469] అనుచో సూరిసూత్రమందలి 'వృత్తం బగు' అనుదానివివరణమే వీరిలక్షణమందలి 'భూతార్థమందలి-' అనునది. కాఁగా నిట సూరిలక్షణమున దురుక్తి లేమి

స్పష్టమే. ఇఁక వీరు దమమాత్రమున నధికముగాఁ జెప్పినది. 'అప్యర్థము' [వ్యా.సం.స.1484]

వినినఁ బఠించిన బ్రాపింపఁ గొనియాడిన దురితపీడకుం దొలఁగి (శాంతి.3. 382) అనునది చేదర్థమునకును, అడిచినఁ దిట్టినన్ మఱి మహాపురుషం బులు పల్కి యల్కతోఁ బొడిచినను త్తమద్విజులుపూజ్యులు(ఆది.1.199) అనునది యప్యర్థమునకును నుదాహరించిరి. వినినఁ బఠించినన్ అనుచో వినినచోను, పఠించినచోను అని చెప్పినట్లుగనే, అడచినఁ దిట్టినన్ అనుచోను అడిచినచో, దిట్టినచోను, అని యర్థము చేయవచ్చును. కాని వినినచో దురితపీడదొలఁగదు. అడఁచినచోఁ దిట్టినచో నుత్తమద్విజుఁడు పూజ్యుఁడు కాఁడా? భేదము గల దనిపించు.

చేదర్థమునవలె నప్యర్థమునను నీవిధాన మవసరమె యనిపించు. సూరిసమన్వయమార్గ మేమో యింకను బరిశోధింపవలె.

'న్యూనవచోవాక్యంబునఁ దద్వచనంబు లధ్యాహార్యంబు లగు' నని ప్రౌఢ. (వాక్య.13) పేర్కొన్నది. అడిచినఁ దిట్టిన నను పిరీతిస్థలములందు 'నేని' నధ్యాహార్య మన్న అడిచిన నేని- అడచినచో నైనప్పటికిని నను రీతిగా నర్థము గుదురు నేమో.

చాద్యర్థకనుశబ్దముతోడినమన్వయ ముచితమా? శ్రుత్వాపి- వినినను. శృణోతిచేత్ వినినన్ అనుచోఁ జేదర్థమునఁ జివరిద్రుతముపై లేవియూచిత అప్యర్థమున నియతముగా స్ఫురించుట గమనార్హము. అందుకే వడుల వారు పేర్కొన్నట్లు అప్యర్థములో వ్యవహారమున ఎంతచెప్పినా వినడు, ఎంతచెప్పినను వినడు' అని దీర్ఘము (వ్యా.సం.స.1472) విస్ఫురించును. ఇది చేదర్థమున లేదు. 'వస్తే పోతావు నదే రాకపోతే నూ (రాకపోయినా) పోతావా' అనుతీరుగా నున్నవ్యవహారమునుబట్టి చేదర్థకముపై నుశబ్ద

ప్రయోగముచే సప్తమ్యర్థము గలుగుచున్న దనిపించు. పరిశీలింపవలె.

## భావార్థకము—ఆనంతర్యార్థము :

'ఆనంతర్యంబున డువర్ణకంబు ద్రుతాంతం బగు' (42) ననుసూరి సూత్ర మనవసర మని తొలగించిరి వీరు.

భావార్థకము సముచ్చయసుశబ్దముతోఁ గూడి యానంతర్యార్థమును బోధించుట సంప్రదాయము. చెప్పుటయు. ఆది.1.134-(ఉ.377) అని ప్రౌఢ. (క్రి.12) ననుసరించి భావార్థకమువలననే యానంతర్యార్థము గల్గు నని చెప్పిరి. ఆ ప్రౌఢ. సూత్రము వల్ల యిచ్చి వివరించిన బా గుండెడిది. (మూ. త్రి.శే.)

కాని 'అట్టిస్థలములం దీభావార్థకడుప్రత్యయము.' ధారాళముగ వాడఁబడును. ఆముని యల్లి చూచుడుసు- (ఉ.377) అనుటయె విచార్యము. భావార్థమునందు డుప్రత్యయము ప్రాచీనప్రయోగములం గొన్ని యెడలనె యరుదుగా నున్నది. అట్టియెడల సువర్ణముతోఁ గూడి యానంతర్యార్థము నిచ్చుట మాత్రము ధారాళ మగుట యేమి? తిక్కనాదిప్రయోగములలోనె భావార్థమున లేనిడుప్రత్యయ మానంతర్యార్థమున మాత్ర మెల్లరప్రయోగముల ధారాళముగా నుండుటనుబట్టియే యిది ప్రత్యేక మని గుర్తింపవలయును గదా.

వీరు సూచించినప్రౌఢ.క్రియా.12సూత్రమున భావార్థకము(సుశబ్దముతోఁ గూడి) ఆనంతర్యార్థక మగుట 'కొన్నియెడల' నని చెప్పఁబడినది. డువర్ణము భావార్థమందే యగుట యరుదు. అది సుశబ్దముతోఁ గూడియానంతర్యార్థక మగుట యింకను నరుదుగా నుండవలె. ఇంక డువర్ణమును భావార్థమునఁ బ్రయోగించినవారిప్రయోగములందే యది యిట్లానంతర్యార్థక మగుట కొన్నియెడల నే నొప్పును. కాని వీరివివరణ మేతద్విరుద్ధముగా నున్నది గదా.

భావార్థమున టవర్ణము కవిప్రయోగప్రసిద్ధము. లక్షణగ్రంథములందును నట్లే. అది సుశబ్దముతోఁ గూడి యానంతర్యార్థక మగుట యరుదు. భావార్థమున డువర్ణము కొందఱప్రయోగములం దదియుఁ గ్వాచిత్కము. కాఁగా నది సుశబ్దముతోఁ గూడి యానంతర్యార్థక మగుట యెల్లగ్రంథప్రయోగములందుఁ గలదు. అదియు ధారాళము. డువర్ణము టవర్ణకమువంటి దనుటకుఁ దగినసామ్య మేది?

సుశబ్దముతోఁ గూడిన యానంతర్యార్థక మగుట 'సంప్రదాయ' మనుటచే నీ రీతిస్థితి నియత మని తలఁచియుండకపోవచ్చును. 'చదువుటయు వ్రాయుటయు సమమే' యనుచో నానంతర్యార్థ మున్నదా? సముచ్చయార్థము నుండును. అందుచే ప్రౌఢ. 'కొన్నిచోటుల' నన్నది. ఇట్లు టవర్ణకము పైవి సుశబ్దము భావార్థక మగుట ప్రసిద్ధమై యుండఁగా డువర్ణముపై సుశబ్దము చార్థమునం దున్నదా వేది? ఇట మాత్రము కేవల మానంతర్యార్థమై యుండుటయు విశేషము గదా.

ఇట్టియెడల వీరు భావార్థకడువర్ణమునుండి యానంతర్యార్థమును నియతముగా సాధించుట సరి కా దనక తప్పదు. కాఁగా దీనివలన 'సూరి పయి విషయములు గ్రహింపక 'అనంతర్యంబున డువర్ణకంబు ప్రయుక్తం బగు జాబిల్లి చూతెంచుడుం గువలయంబులు వికసిల్లె' అని సూత్రించి యుదాహరించుట సరి కాదు (సూ.377) (వ్యా.సం.స.1483) అనువసుధవారివివరణ మసమంజసము. సూరి 'పయివిషయమును' గ్రహించుటచేతనే యానంతర్యార్థమున డువర్ణమును ప్రత్యేకముగా విధించె నదియు నుచితము.

సం.లో పైరెండు వరుసగా నానంతర్యార్థకడువర్ణాంతరూపముల నుదాహరించి "ఇట్లు సుశబ్దముతోఁ గూడినచో భావార్థకడుప్రత్యయము తఱచుగఁ బ్రయుక్త మగుచుండును కేవలభావార్థకడువర్ణకప్రయోగము పయి నుదాహరించినరీతి నరుదుగ నుండును' (వ్యా.సం.స.1485) అనిరి. తఱచుగఁ బ్రయుక్త మగునప్పు డెల్ల సుశబ్దము తప్పదు. అనంతర్యార్థము నియతము.

దీనినిబట్టియె దువర్ణకము ద్రుతము (నువర్ణము) చివరఁ గలిగి యానంతర్యార్థక మగుట నియత మని నిశ్చయింపఁబడినట్లే. అట్లైన భావార్థము (ద్రుతము లేక) దువర్ణముప్రయోగము లొండు రెండే. దీనినిబట్టి యొక రెండుప్రయోగములఁ గనిపించు దువర్ణభావార్థమును విశేషస్థలముగా నెన్న దగును. ఇంతఁ దఱు చగు ద్రుతాంతదువర్ణముయొక్క యానంతర్యార్థకస్థితి ప్రత్యేకముగా గుర్తించి సూత్రించు టుచితము.

ఇంతకును వఝులవారు దమవ్యాకరణమున నానంతర్యార్థమున దువర్ణకమును జెప్పుసూత్రమునె (బాల.క్రి.42) తొలఁగించుటచే నీయర్థమిందువా, వివరణములచేఁ దెలియవలసినదే. భావార్థమున దువర్ణమును వీరును సూత్రింపమింజేసి యది నఞర్థముతోఁ గూడుట యానంతర్యార్థక మగుట యన్నవి వీరియీవివరణము నాశ్రయించియె తెలిసికొనవలె. ఇదే యంశము సూత్రించిన బా గుండెడిది. కాని యీవివరణ మచితము గాదు. సూత్రింపఁ కుంటయె యుచితము.

సూరిలక్షణము సూక్తము.

### శత్రర్థము :

'చువర్ణకంబు ద్రుతాంతంబు క్రియాన్వయంబున శత్రర్థంబునం దగు (43) ననుసూరిలక్షణమును '...వర్తమానార్థంబునం దగు' (54) నని చివర సవరించిరి.

దీనిని శత్రర్థ మనరా దని వీరియిచ్చటియభిప్రాయము. "సంస్కృతమందలి 'వసన్' అనుశతృప్రత్యయాంతమునకుఁ దెల్గున వసించుచున్నవాఁడు అనువర్తమానార్థకవిధేయవిశేషణము పర్యాయము. కాఁగా సంస్కృతమునఁ దెల్గు 'చున్' ప్రత్యయముఁ బోలు వర్తమానార్థకలాక్షణికావ్యయమువంటిప్రత్యయము లే దని చెప్పనగును. దీనిని శత్రర్థక మనుట సరి గాదు. వర్తమానార్థకలాక్షణికావ్యయ మనఁదగును.' (ఉ.385)

ఇట్లున్న పిదప యీ వ్యాకరణముననే ఉ.సంధి.౭సూత్రమున "శత్రర్థక చువర్ణకము" అని దీనిని శత్రర్థకముగా వ్యవహరించిరి. ఇంతను 'వచ్చుచున్నాఁడు మున్నగుసమాపకక్రియాసమానపదములందలిచువర్ణము శత్రర్థక చుప్రత్యయము గాదు' (ఉ.౪౫) అని వివరించిరి గూడ. ఇట్లు ద్రుతప్రకృతికవిరూపణమున శత్రంతముగా దీనిం బేర్కొనిరి. సూరిలక్షణమును సవరించి తిరస్కరించినవి ధట్టి చెప్పుట విరుద్ధము గదా.

చిం. చరితక్రియాపదానాం సర్వేషాం వర్తమానకాలే స్యాత్ తనింపుం బోర్వానస్యాద్వర్తమానవిహితస్య యనియు వర్తమానార్థకముగా వ్యవహరించుటవలన నీ రీతి శత్రర్థక మనదగ దని తలఁప వీలు లేదు. చిం. 'శత్రర్థేతూతశ్చాన్తోః' అనుచో దీనిని శత్రర్థకముగాఁ బేర్కొన్నది. 'అంచున్' ఇత్యాదులు దానికి లక్ష్యములే.

వచ్చులవారును నొకచో నిట్లు పేర్కొనిరి.

ఇట్టి (సంస్కృతశత్రంతప్రయోగస్థలముల)విధేయవిశేషణస్థలము లందు సాధారణముగ శత్రర్థకచువర్ణ ప్రయోగమే తెల్గునఁ బ్రచుర మై యున్నది. ...లతాకుంజం గుంజన్– లతాకుంజమునందు ధ్వనించు– (వా.సం.స.1478) దీనిని ననుసరించియే తెలుఁగునందలి యీచువర్ణకమును శత్రర్థకముగాఁ జెప్పుట యొప్పును గదా.

కాఁగా సూరి శత్రర్థక మనుటలో దురుక్తి లేదు. అది సూక్తమే.

ఇప్పటిలక్ష్యములం దొకదోషము నిట్లు ప్రస్తావించిరి. 'చూచుచుం బోయెను. మున్నగువాటిలందలిచువర్ణకము వర్తమానార్థకము గాదు. ప్రధానక్రియ యనఁగా సమాపక్రియ భూతార్థక మగునప్పు డావాక్యము లోనిగౌణక్రియ యనఁగా దానితో నన్వయించునసమాపకక్రియయును భూతార్థకమె యగు ననుట సంప్రదాయము .... '(వ్యా.సం.స.) అయిన నీయర్థ

ప్రాయమును విడిచిపుచ్చుకొని వీరే ఉ.లో 'భూతభావులందును చూచుచున్ అనునప్పటి (పఠనా)దర్శన-వర్తమానక్రియ విరుద్ధము గాదు' (ఉ.384) అని సూరిలక్ష్యములం దౌచిత్యమును గుర్తించు టుచితముగా నున్నది. అట్లే వీరు నిట 'క్రియాన్వయంబున వర్తమానార్థంబునం దగు' నని, సూరి వలెనె యుదాహరించుట సమంజసముగా నున్నది.

సూరిలక్ష్యలక్షణములు సూక్తములు.

### ఎడి-ఎడు :

'తృవర్ణకార్థంబునం దెడిమొదువన్నియు నగు' వానికి లోపంబు బహుళంబుగా నగు (45)(44) అనువానిని వీరు తద్ధర్మాద్యర్థకవిశేషణత్వమున ఎడు-ఎడి-ఉ-వర్ణకంబులు పర్యాయంబున నగు' (55) అని సవరించిరి,

సూరి 'తృవర్ణకార్థంబున' ననఁగా వీరు 'తద్ధర్మాద్యర్థకవిశేషణత్వమున' ననుట మొదటిమార్పు. కాని 'తచ్ఛీలతద్ధర్మార్థములందును తృన్ ప్రత్యయము వైయాకరణసమ్మతము'- [ఉ.383] అనుట ననుసరించి 'తృవర్ణకార్థమున' అనుసూరిసూత్రదళమునకు వ్యాఖ్యానమే వీరి సూత్రమునందలి మొదటిపద మని గుర్తింపవచ్చును. ఇఁక సూత్రమునఁ జెప్పినదాని కనుగుణముగాఁ దద్ధర్మతచ్ఛీలాదు లని [తచ్ఛీలముకంటెను] మొదటఁ దద్ధర్మమును వీరు వివరణమునఁ జేర్కొన్న సక్రమముగా నుండెడి దని పించు.

తద్ధర్మాదులలోనియాశీరాద్యర్థము లిట నుండవు గావున సూరి తృవర్ణకార్థమునం దని యుండ నవు.

ఇట నొకసందేహము. 'ఉదంత మగుతద్ధర్మార్థకవిశేషణమున కని [సంధి.35] సూరి నుగాగమవిధానస్థలమునఁ జేర్కొనె- ఇట్లె సంధి.45 సూత్రవివరణమునందును. ఇట ఎడ్వాదులను 'దద్ధర్మాద్యర్థములందుఁ'

చెప్పినవయులవారును పైచోట్లఁ దద్ధర్మార్థమును' మాత్రమె ప్రస్తావించిరి. ఇట నాదిశబ్దముచే గ్రహింపఁబడునర్థములం దేర్పడినయీవిశేషణములపై నాకాక్షము లుండవా? సూరియభిప్రాయమును విచారింపవలసియున్నది.

ఇఁక, పిదప సూరి ఎడిఎడుప్రత్యయములకు లోపమును జెప్పి ప్రహరించువాఁ డనురీతిస్థితిని సాధించెను. వయులవా రట 'ఉ'అనుప్రత్యయమును విధించిరి. పిదప విది మఱచిన ట్లున్నది.

కలాదేశముమీఁద ఎడ్యెదులు నిల్వ (సూ.421] వనిరి. కలాదేశముపై నిలువనివి ఎడిఎదులు రెండే. కావున నిట వీరు విధించిన 'ఉ' నిలుచుట కవరోధము లేదు. ఇఁక నీమూఁడింటిలో రెండు విషేధించిరి గావున మిగిలినమూఁడవది యెప్పుడు ననఁగా నిత్యముగా నిల్వవలెను. కావున కల + ఉ = కలు = కలువాఁ డనియే కావలె. కలవాఁడని యె ట్లుదాహరించిరి?

తాము ఉప్రత్యయమును విధించినట్లు గుర్తున్నచో వీరు ఎడి,ఎదుల తోపాటు ఉప్రత్యయమును నిల్వ దనియె చెప్పియుండెడివా రనవచ్చును. ఏమైన వీరిలక్షణముచే కలవాఁ డనుసాధురూపము లక్షణవిరుద్ధమై యెచ్చటను గనరాని వినరాని కలువాఁ డనునది లక్షణబద్ధ మగుచున్నది.

సూరి ఎడియెదులకు లోపము (బహుళముగా) విధించుటచే (బాహుళకముచే నిట నిత్యలోప మయి) యెడియెదులు నిల్వకుండుట సూత్రముచే సాధింపఁబడుచున్నది. వీ రట్లు లోపమును జెప్పియుండమిచేసి యెడియెదులు నిల్వనేర వనువివరణము నాశ్రయించి లోపము చేసికొనవలసియున్నది. ఇందు సూరిమార్గ ముచితము గాదా?

ఎడియెదులలోపముచేతనె (వచ్చువాఁ డనురీతిని సూరిమతమున సిద్ధించుచు) ప్రత్యయలక్షణన్యాయము ననుసరించి యువియు తృవర్థకార్థ విశిష్టములే యగుచున్నవి. కాఁగా వయులవారు ఉప్రత్యయమును బ్రత్యేకముగా విధించుటవలనఁ బ్రయోజన మేమి? ఉత్వము ధాతువుతుదినిసహజముగనె యుండును. 'కల' యనురీతిగ నొక్కచో నుత్వము లేనపుడు (ఉ

(ప్రత్యయమును లేమి) విశేషణరూపమునందును నుత్వములేదు. 'ఉప్రత్యయ విధానము గౌరవమె కాని ప్రయోజనము లేదనుట స్పష్టమే.

సూరిలక్షణము లెంతయు సమంజసములు.

## పండుచున్నవాఁడు :

బాల.క్రి.48.సూత్రము నట్లు గ్రహించిరి. (ఉ.56) సం.లో నన్నయాధర్వణులమార్గమువిడిచి "సూరి యీసందర్భమున మార్గాంతరము ద్రొక్కుటచేత బా.క్రి.40,50,13,14,15 సూత్రములలోనివిధులచొప్పునఁ బ్రక్రియ నడుపవలసినవాఁడయ్యె' ననుు(వ్యా.సం.ప.1477)వజ్ఝలవారిభిప్రాయము సరి కా దని, సూరిమార్గముననే వీరు నీగ్రంథమునఁ గ్రమముగా 58,66, 21,22,23సూత్రములతో నడిపినప్రక్రియ నిరూపించుచున్నది. ఇంక నన్నయాథర్వణులమార్గముగా వీరు నిర్ణయించినప్రక్రియలో నెంతసహజత యున్నదో తద్గ్రంథపరామర్శనమున గుర్తింతము.

## నిజీ :

'వ్యతిరేకత్వవర్ణకార్థంబున నిజీ యగు' (47)ననుదానిని వీరు 'వ్యతిరేకతద్ధర్మాద్యర్థములందు నిజీ యగు' (57)అని చూపిరి. ఇంతకు ముందు ఎడియెదు(టి)లు తద్ధర్మాద్యర్థములం దని చెప్పిరి గానఁ దదనుగుణముగ వీ రట నిట్లు పేర్కొనిరి. అది యనవసర మని సూరిసూత్రమునకు వ్యాఖ్య వంటిదే యనియు గుర్తించియున్నారము. ఇదును నంతే.

ఇట 'వ్యతిరేకతద్ధర్మాద్యర్థములందు' అనుటనుబట్టి యితఃపూర్వము వీరు 'తద్ధర్మాద్యర్థవిశేషణత్వమున'(55) నని విశేషణత్వమును పేర్కొనుటయు వివరణాత్మకమె యని గుర్తింపవచ్చును. పూర్వ(56)సూత్రమును సూరి ననుసరించియె చెప్పిరి గదా.

## క్రియాజన్యవిశేషణములు :

ఇవి ధాతుజవిశేషణములు. క్రియాజన్యవిశేషణములు నామాకాంక్ష సమాపకములు నగుచును' (ఉ.387) 'క్రియా ధాతుః' అనుచిం.లక్షణమును (క్రియాజవిశేషణ మ్మనుచి.వి.వ్యవహారమును)అనుసరించి ప్రౌఢవ్యాకర్త వలె వీరును వీనిని క్రియాజన్యవిశేషణము లనియుందురు. సూరి 'క్రియ' యనుదానిని ధాతు వనునర్థమున వ్యవహరించుట గానరాదు. అట్లే సూరి వీనిని క్రియాజన్యవిశేషణము లనియుఁ బేర్కొనలేదు. వీరు 'నామాకాంక్ష సమాపకము లని (ఉ.386) వ్యవహరించుట విశేషము.

## అకారాదులు :

'అకారాదులు సకర్మకంబులకుం గర్తృకర్మంబులందును లౌకికిం గర్తయందు నగు' [48] అనుసూరిసూత్రమును వీరు- '-కర్తృకర్మార్థంబు లందును - కర్త్రర్థసూత్రమందును.-' [58]అని చూపుట సూత్రమున నించుక వివరించి చెప్పుటయె. సూరిసూత్రము సూక్త మనుట స్పష్టమె.

## కర్మార్థము :

'షడుజ్యనుబంధంబు కర్మణంబునం దగు' [49] అనుదాని నట్లే గ్రహించిరి. [ఉ.59]

షడుజ్యనుబంధపరకత్వమందును కాన్-కన్ [క్రియా.119] శబ్దము లనుప్రయుక్తము లవును. ఉదా. చేకొనంగఁబడునేని (సభా.2.142) దహింపఁగాఁబడి (అర.1.198)(ఉ.288) ఈవిశేష ముచితమె. 'షడు'పూర్వ మందలిరూపము సుబ్యంతమును గామి క్రియా.119సూత్రముచే సుబ్యంత మగునగుధాతు వనుప్రయుక్తము కాదు.

ఆత్మనేపదార్థమున కొనుధాతువువలెఁ గర్మార్థమునఁ బడుధాతువు ననుప్రయుక్తము చేసి తత్పరకత్వమున ధాతువునకు సుటి చెప్పిన నిబ్బంది యే మేని గల దేమో పరిశీలింపవలె.

రెండుమూఁడింటి కొక్కటి పడుఁజ్యసంబంధము నిల్పుటయుఁ గలదు. వినఁ జూడఁ బడు సం దెల్లను (శాంతి.6.285)అని వచ్చులవారు ప్రస్తావించినపేరొక విశేషము గ్రాహ్యమై యున్నది. విను, చూచు అనురెండింటిపైఁ బడుఁజే యొక్కటి (రెండవధాతువుపై) చేరినది. కాని పడుఁజేకి ముందఱిచూచుధాతువునందే కాక దానికిముందఱి వినుధాతువునందును జేర్త్వఫల మగునత్వము వచ్చినది. పడుఁజేపరకత్వమునఁ జెప్పినను గాగమము రెండు ధాతువుల కయినది.

## నగియించు :

గురువిరహితంబు లయి యయాంతంబులయినయేకస్వరద్విస్వరంబుల యించుగ్వక్రంబుల కియుఙాగమంబు విభాష నగు' (60)అనుసూరిసూత్రమును సవరించి యిట్లు పేర్కొనిరి. "గురువిరహితంబు లయి యయాంతంబు లగునేకస్వరద్విస్వరసంస్కృతధాతువుల కించుక్కు పరం బగునపుడును... ద్విత్రిస్వరాచ్ఛికధాతువులకు ణిజాదిప్రత్యయము పర మగునపుడును ఇయు డాగమము వికల్పముగా నగును' (ఉ.60)

వీరిసూత్రమునఁ బ్రథమార్థమున సంస్కృతధాతువులకు వక్రపరకస్థితి (ఇయుడాగమము) హరించుట స్పష్టము. "ఇంచుగ్వ్యవధానంబునం జేసి సంస్కృతధాతువులు వక్రపరకంబులు లే' వని సూరి యీయంశమును వివరణమున స్పష్టము చేసియే యుండెను. సూరి లాఘవముతో సూత్రమునఁ జెప్పె నందపార్థము లేమి స్పష్టము.

ఇట వీరు 'సంస్కృతధాతువున' కనుట యొకవిశేషము. ధాతువున కవిసామాన్యముగాఁ జెప్పినసూరిమతమున నాచ్ఛికధాతువులమీఁదియించుక్కు నకునియుడాగమము వచ్చు. 'నగియించు'అని సూరి యుదాహరించెను గూడ. కాని యట్టిరూపమును నిర్వహించుమహాకవిప్రయోగము లే [ఉ.388] దని వీ రాచ్ఛికధాతువుల కియుడాగమ మించుక్పరకతలో లేకుండఁ జేసిరి. [వ్యా. సం.స.1510]

సూ.ని. నగి[యి]ంచు-నగియించు శబ్దమును జూపినది కాని ప్రయోగము లేదు. వీరు 'నగుపించె నరటియుటలాజన్మమున్' [విరా.4.39] అను పద్యము టిప్పణమున నగియించె అను పాఠాంతరము చూపఁబడెను. తాళపత్రమాతృకలందును నగుపించె అనుపాఠమే చూపట్టుచున్నది. సూ.ని. కూడ — తెగియించినవారు —[కు.క.4.28] అనుసర్వాధీనసామాన్యకవిప్రయోగము- [వ్యా.సం.స.1502] అందుకె వీరిట మహాకవిప్రయోగములందు లేదని యుందురు. ఏచ్చోటినుంచి- అన్నది కుమారధూర్జటిప్రయోగమల్వాధీన మయ్యు గ్రాహ్యమైనది. కాని వీరి కిది యట్లు గాలేదు. మొత్తముపై 'నగియించు' అనునది లేదనియు నట 'నగుపించు' అని యుండు ననియు వీరినిశ్చయము.

నగు + ఇంచు- నగుపించు అని యగుట యెట్లు? ఇంచుక్కు- పర మగునపుడు అన్వాదులకు పుగాగమ మగును. కాన అనిపించు తినిపించు అనువానివలెనె నగుపించు' అని యగును. [విరా.4.39.తాళమాతృక] ఇచట టిప్పణిలోవినగియించెడినవేడి పాఠాంతరము ప్రక్షిప్తము [ఉ.389] కవిప్రయోగమును 'దాళపత్రమాతృక' నుండి యుద్ధరించుట యొక్కవిశేషము. అనిపించు, తినిపించు అనువానిని బోలుచు నగిపించు అని కాక నగుపించు అని యగుట యిం కొకవిశేషము

అయినను అనిపించు అనుదానివలె నగుపించు అని యగునా? అన్వాదులలో [క్రియ.78] సూరి నగుధాతువును జూపలేదు. "అను కను తిను విను అనునాల్గిటికే పుగాగమము నిత్యము మాను అనునది అన్వాదులలోనిది గాదు. దానికి విభాష యని వేఱుగ పఠింపఁబడెను" [ఉ.406] అని వీరును జెప్పిరి. అయ్యు నగిపించెన్ [కళా.5.54,65,] నగుపింపఁగా [శాంతి.6.217]- పయిప్రయోగములచొప్పున నన్వాదులలో నగుధాతువును జేర్పవలె ననిరి. [ఉ.406] వివరణమున నన్వాదులలో 'నగు' చూపవలసినది. అవుఁ గాక. అన్వాదులకుఁ బుక్కు నిత్యము గదా.

నగిపించు అనియె కావలె. అనించు, వినించు అని యుండినట్లే నగించు అని యుండుటకు వీలు లేదు. నగింపంగ (హరి.పూ.8.134) మొదలగు ప్రయోగములు అసాధువులా? సూరిపదెనె వీరును 'మానునకు మాత్రమె విభాషగాఁ జెప్పిరి. (ఉ.క్రి.81) వీరు' నగుధాతువు నన్వాదులలోఁ జేర్ప అన్వాదులలోనిది గాదని వీరును గుర్తించిన 'మాను'తోఁ గూర్చి పుగాగమును విభాషగా చెప్పుకొనవలసియున్నది.

అట్లు చెప్పనిసూరి యిట 'నగియించె' ననుపాఠమును గ్రహింపఁ దలంచె నని ప్రస్తుతస్థలోదాహృతియు నిరూపించుచున్నది. 'నగుపించు' అనునదియు గుర్తింపవలసిన సూరిమతమున క్రియా.77సూత్ర ముపయోగింపు నని తోఁచుచున్నది.

నగియించు తెగియించు అనువానిఁబట్టి యాదృచ్ఛికధాతువులయందు ఇంకు ననుకును నియుడాగమము క్వాచిత్కముగ నంగీకరింపఁదగియున్నది. క్వాచిత్కస్థితిని సూరిలక్షణమంతలివిభాషాపదముచే గుర్తింపవచ్చును కాఁగా నిట సూరిమతమున దురుక్తి యేమియు లేదు.

## క్రమ్మరియొద

చిన్నయ వీరు 'ద్విత్రిస్వరాచ్ఛికధాతువులకు ఎకారాదిప్రత్యయము పరమగునపు డిడుట్టు చెప్పిరి.

సూరి (సంస్కృతధాతువులకువలెనె) యాదృచ్ఛికధాతువులకును 'నేకస్వరద్విస్వరముల మాత్రమె యియుట్టు చెప్పఁగా వీరు త్రిస్వరములకు నధికముగాఁ జెప్పిరి. దీనిప్రయోజన మిట్లు పేర్కొనిరి.' క్రమ్మరియొదఁ క్రమ్మరెదను త్రిమ్మరియొదు త్రిమ్మరెదు- -క్రమ్మరియెదు- -కా యీప్రయోజనము నం దొక యిబ్బందిని వారే నం.లో గుర్తించి యిట్లు పరిష్కరించిరి. "క్రమ్మరు త్రిమ్మరు అనునవి ఋషుమంతములు కావు ద్విస్వరములును గావు. ఇట్టివానిని వాశబ్దవ్యవస్థానాచిత్యమున సంగ్రహింపవలయును.

(వ్యా-సం.స. 1607) అవ్వేకాక్షరపూర్వ- అనుచిం.లక్షణమున వీని నిట్లు సమర్థించిరి. అట్లై (సూరిలక్షణమును విభాషావదము నేయపసిద్ధాంత మున్న దని వీరు వైకల్పికముగా మార్చిరో) సూరిలక్షణమునను వేల సమన్వ యింపరాదు?

స్పష్టముగా సూత్రింపఁదగును గదా యని యిట్లు సూత్రమునఁ జేర్చాకొనిరా? అయిన సం.లో విపరీతవివరణము ననుసరించియె యిందుఁ వె క్కుడర్థములు గల్గుటను గుర్తింపవచ్చును.

క్రుమ్మరు ఇత్యాదు లగునివి త్రిస్వరములే కావి య ట్లగుటతోపాటు గురువమంతములు నై నవి. మఱి యిదియుదాగమ మగుట యెట్లు? సూత్రమున నాచ్ఛికధాతువులవిషయము విభాగించి చెప్పుటచే సంస్కృతధాతువులంగూర్చి చెప్పిన 'గురువిరహితంబు లయి' యనునియమ మాచ్ఛికధాతువులయెడ వర్తింప దనవలెనా? అట్లగుచో చొచ్చియెను, వండియెదు వా, దనురీతిగా నెన్నో దుష్టరూపము లేర్పడును.

'గురువిరహితంబు లయి' యనునది వర్తింపనప్పు 'దయాంతంబు లగు' అను పదియు నాచ్ఛికధాతువులకు వర్తింపదు. కావున [అయియెను, పోయి యెదివాఁడు] వ్రేసియెను, ఏసియెను అనురీతిగా నవును. వీరు త్రిస్వరముల యెడను జెప్పిరి గావున ఎగసియెను, సొగసియెను ఇత్యాదు లగురూపము లెన్నియు నేర్పడు.

'వగియించు' అన్నది యసాధు వని తిరస్కరించినవీరు పైరీతి నెన్ని యపరూపములను లక్షణబద్ధము చేయుచుండిరో. వీని నివారింపవలె నన్న గురువిరహితత్వము [అయాంతత్వము] అనునియమ మాచ్ఛికధాతువులయె డను వర్తింపఁజేయవలె, అట్టియపుడు 'క్రుమ్మరియెదు' ననురీతి త్రిస్వరములు గురువమంతము లగుటచే నట యియుట్టు రాదు.

జలము లోలుకఁ బెగ్గిలియెన్ (భాగ.10.పూ.1443) సంక్రందనసూతి దగ్గఱియె (విరా.4.184) క్రమ్మఱియెదుమము (కవిక.పి.60) అనురీతిగాఁ ద్రిస్వరము లగునిట్టిస్థలము లెల్ల గురుమంతము లగుట నియతముగాఁ గానవచ్చుటచే గురుమత్త్వమునుబట్టి యియడాగమము రాదు గావునఁ ద్రిస్వరము లని పీఁదు సూరికంటె విశేషముగాఁ జెప్పినదళము వారుద్దేశించినకవిప్రయోగములను సాధింపఁజాలదు. ఇంక కొలిచియెను, విలిచియెదువాఁ డనురీతిగా గానరానిరూపములనే సాధించుచు ననర్థక మగు.

కాఁగా పీఁదు సూరికంటె నధికముగాఁ జేర్చిన 'త్రిస్వర'ముల కన్నది కేవల మనర్థకమె.

చిం.లో వాశబ్దముచేఁ (గాని బాల.లో విభాషాపదముచేఁ గాని) ఇట్టివి గుర్తింపఁదగు ననువచులవారియభిప్రాయ మెంతవఱకు కామోద యోగ్యమో నిర్ణయింపరాకున్నది. విభాషకు ప్రవృత్త్యప్రవృత్తులను వ్యవస్థ చేయుట ప్రసిద్ధమె. ఇట క్రుమ్మరు ఇత్యాదుల కియుట్టు సాధింపవలె నన్న నది యన్యకార్య మగును. విభాష కన్యకార్యమును నియమించుట సంప్రదాయముగాఁ గానరాదు. సంస్కృతమునం దెట నే నిట్టిస్థితి (విభాష కన్యకార్యమును వ్యవస్థ చేయుట) గల దేమో వెదుకవలె.

ఇంకను స్పష్టముగా నీయియుట్టు క్రుమ్మరుప్రభృతులపై వక్రము (ఎ)నకును గానవచ్చుటను ప్రత్యేకముగా సూత్రింప (లేక యీసూత్రనొద్ద వివరించినను) బా గుండెడి దని తోఁచుచున్నది.

### కనియెదునం :

ఇంక నీ రియాచ్ఛికధాతువులకు మీఁది 'ఎకారాదిప్రత్యయమున' కియు ట్టగు ననిరి. సూరి సూత్రమందలి 'వక్రము' అనుదాని కిది వివరణముగా నెంచి రేమో. ఎఫ్.ఒఓలు వక్రము లయినను నవి పర మగుట

## చనెను :

"చనెన్ వినెన్ కనెన్ అనురీతిరూపములు నన్నయాథర్వణాదిసమ్మతములు గా వని యప్పకవి వచింపఁగా (వ్యా.సం.వ.1505) అప్పకవి వి.పి. నెఱ్ఱగి యథర్వణుఁడును నంగీకరింపలే దని గుర్తించి యట్లు స్పష్టము చేసె నన్నమాట. (ఇది తెలియనియాహోబలుఁ డప్పకవి కథర్వణగ్రంథము దొరుకలే దనెను.) నన్నయభారతభాగమునం దెచ్చటను లేవు. తరువాతికవు లట్టి రూపములను బ్రయోగించిరి. కాని సూరి యట్టిరూపముల నేల సంగ్రహింపఁడయ్యెనో తెలియకున్నది. ప్రౌఢవ్యాకర్త యైన నేల సంగ్రహింపలేదో తెలియకున్నది'. (వ్యా.సం.వ.1504) అనువర్యులవారివచనముల కాధారము గానరాదు. చిం. చనెన్ అనురీతిరూపములు సంగ్రహించుచున్నదో లేదో గ్రంథాంతరమున గమనింపఁగలము. సూరి సాధింపలేదా? 'చనియెన్' అనున వైన సాధించె నని యంగీకరింతురు గదా. చని + ఎను అని యుండఁగా క్రియా 50 సూత్రముచే నియుడాగమము వచ్చి చనియెన్ అని యగును. ఇయుట్టు విభాష గదా. అది రానిచో నగెను, తెగెను- అనురీతిగాఁ జనెను అని కాదా? చనియెను అన్నది కూడ సూరి సంగ్రహింపలే దనవలెనా? వదుల వారట్లనలేదు. కాఁగాఁ జనియెను సాధించె నన్నఁ జనెను (చనెన్) అని పక్షాంతరమున సూరి సాధించినట్లు ఇయుట్టు నిత్య మని సూరి చెప్పలేదు గదా. ఇట్టిరూపములు కాల. సంగ్రహించియుండుటచేతనె ప్రౌఢవ్యాకర్త పునరుక్తముగాఁ దిరిగి ప్రస్తావింపలే దని గుర్తింపఁదగును.

## పద్యాదులం :

'పద్యాదులసవర్ణకంబున్న కత్వంబును గదహల్లుసకు ద్విత్వంబు నగు' (51) ననుసూరిలక్షణమును పద్యాదుల-- (ఉ.61) అని వివరించిరి.

'సంధి 43 సూత్రపుపద్యాదులు వేఱు. ఇందలిపద్యాదులు వేఱు. కావున నిట పద్యాదు లనక అద్యాదు లనుట లెస్స.' (ఉ.391)(వ్యా.సం.వ.1482, 1483)

ఇందలిపచ్యాదు లేయవియో యిట సూరి ప్రశ్నించుచుండఁగా సంధి 48 సూత్రమునందలిపచ్యాదు లనుకొన నవకాశ మేది?

స్పష్టత కైన నిట్లు నియమించుకొన్నవీరే తమనియమము నెల్లెడల ననుసరించినట్లు లేదు. ఉ.క్రియా. 81 సూత్రమును బాల.సంధి (క్రి.78) యథాతథముగా అన్వాదు లని- గ్రహించిరి. ఉ.క్రియా. 85 సూత్రమునందును 'నన్వాదు' లనియె చెప్పిరి. (బాల.క్రి.54) అందలికొన్నిమనుధాతువులు 81 సూత్రస్థలమున లేవు. వీరే "అన్వాదులు క్రియా 85 సూత్రమునఁ జెప్పఁబడెను. దానిలో కొన్నిమనుధాతువు లిందు విడువఁబడె" (ఉ.405) నవిరి. ఇట్లు భేదము గలిగినవి దీని కన్వాదు లనకపోయిరా? అట నట్లు చెప్పుటలో దోషము లేనపుడు ప్రస్తుతస్థలమున మాత్రము పచ్యాదు లనుటలో దోష మేమి? ఇచ్యాదు లన నవసర మేమి? ఇది లెస్స యగుట యేమి?

గణములందలిశబ్దములు కొన్ని వేఱైనపుడు, సమానముగా నున్న యొకశబ్దమును రెండుగణములకు మొదట నిలుపరా దని నియమ మేమేని గలదా? సంస్కృతమున నిట్టిస్థితి గమనింపఁదగు. వృష్ ఫణ్--- అరీహణ- కుముదకాశతృణ--కుముదాదిభ్యః (4-2-80) అనుచో నాల్గే సూత్రమున భిన్నప్రత్యయములకై కుముదాదిగణములు రెండు పేర్కొనఁబడినవి. మొదటికుముదాదులలో- కుముదశర్కరాన్యగ్రోధ-- ఇత్యాదులుగలవు. రెండవస్థలమున కుముదగోమథరథకార-- ఇత్యాదులు గలవు. ఇట్లు భేద మున్నను రెండింట గణాదిని కుముదశబ్దమె పేర్కొనఁబడినది గదా. అట్లే నడాదిభ్యః ఫక్ అనుచో ఫక్‌స్థలమునందలినడాదులలో నున్న చర. ఇతిక. ఇతిశాదులు- నడాదీనాం కుక్చ అనుచోటినడాదులలో లేవు. కుక్‌స్థలమందలి నడాదులలోని బిల్వవేణుప్రభృతులు ఫక్‌స్థలమునందలినడాదులలో లేవు.

కాఁగా సంధిపరిచ్ఛేదమందలిపచ్యాదులలోనిశబ్దములును, విచ్ఛలి

పద్యాదులను వే అయినను గణాదిని బహుశబ్దమునే గ్రహించి సూరి చెప్పుట సంప్రదాయవిరుద్ధ మనరాదు.

'దీర్ఘపూర్వకనువర్ణాంతముల కిట్టిస్థితి లేదు. మానిన- మానినన్' (తె.392) ఇది స్పష్టత కైనఁ జెప్పుట యనవసరమే యనఁదగు. ఏల యన సూరివలెనె వీరును 'ఇవి ఇత్యాదులు' అని పద్యాదులను నియత గణముగనె పేర్కొనిరి. అట్టియెడల వీనిలోఁ జేరనిశబ్దముల కికారత్వము ప్రాప్తించుటయే లేదు గదా.

మఱియుఁగా దీర్ఘపూర్వకనువర్ణాంతములకు రా దందు రేమి? దీర్ఘపూర్వక మగునువర్ణేతరములకు నగునా?

సం.లో "ప్రకృతసూత్రమందలివిభాష వ్యవస్థితవిభాష యగుట చేతను దీనికి మూల మగు క్వచిన్న స్యేచ్ఛలోపవాన్ అనువికృతివివేకకారికలోఁవిక్వచిచ్ఛబ్దమహిమచేతను దీర్ఘపూర్వకస్థలములం దీఅత్వద్విత్వములు కల్గ నేర వని గ్రహింపనగును. ఉ.పాడినన్-మానినన్- -(వ్యా.సం.స. 1482)" పాడినన్ అనుచోఁ, బై ఉ.వివరణము ననుసరించి నువర్ణాంతము గాదు గావున దీర్ఘపూర్వక మైనను నత్వద్విత్వము లగు ననవచ్చునా? ఇత్యాదిభిన్నస్థలములలో నికారత్వము వారించుటకు దీర్ఘపూర్వకనువర్ణాంతములకు రా దని వి.వి.లో క్వచిచ్ఛబ్దమహిమచే గుర్తింతురు గాక. నియతగణముగాఁ జెప్పినయీలక్షణమున ననవసరము. కాఁగా నీసూత్రము నందలివిభాషకు వ్యవస్థ చేసి దీర్ఘపూర్వకములపై నికారత్వము రా దని యర్థము చేయవలయు ననుట ప్రమాదము.

దీర్ఘపూర్వకములే యేమి? ఇప్పటిపద్యాదులలోఁ జేరనిధాతువు హ్రస్వపూర్వక మగునెట్టివర్ణ మంతమందుఁ గలది యైనను నికారత్వ మగునా? నగినవాఁడు- తెగిన ఇత్యాదులలోను నగ్గ తెగ్గ అనుకితిరూప ములు గలవా? వచులవారియీవివరణమువలన ననర్థస్ఫూర్తియే ప్రయోజనము.

నూఱి పద్యాదులలోఁ జూపినతగుధాతువును వీరు తమ పద్యాదులలోఁ దొలఁగించిరి. (ఉ.391) 'మూలమున లేనితగుధాతువును గవిజనమందఱ నముసుండి నూఱి పద్యాదులలోఁ జేర్చెను గాని తగ్గువని, దంచఁదగ్గవాఁడు మున్నగువ్యవహారములలో నిట్టిరూపము లగపడుచున్నవే కాని మహాకవి ప్రయోగములం దిట్టివి కన్పట్టవేదు. తగినన్ అనుచేదర్థమునందు తగ్గన్ అనురూపాంతరము వ్యవహారమునందు సైతము వినఁబడలేదు. (వ్యా.సం. ప.1482, ఉ.391)

(వి.వి.)మూలమునం దిది లే దనుట కస లేది యున్నదో యందు స్పష్టముగాఁ జెప్పఁబడినదా? 'కవిప్రయోగముల నాశ్రయించి చెప్పకొనవలసినదే. చేదర్థమునందు వ్యవహారమునను 'తగ్గన్' లే దనిరి. తగినన్ ఉన్నదా? అసలు వ్యవహారమునఁ జేదర్థమునందు 'న'ప్రత్యయ మేధాతువు మీఁదను దఱచుగా వినఁబడదు. కురిస్తే పండుతాయి (రమ్మంటే పోయినా) అనువిధముగా 'తే' అన్నదే కన్పించును. తేచేతి అనిసా.ప్రతి.శ.దీపిక చెప్పుచున్నది. (క్రి.) ఇంక పద్యులవారు విశేషముగాఁ బ్రస్తావించినయున్నర్థమునందె వ్యవహారములో వ్యతిరేకార్థముపై నప్రత్యయము వినవచ్చును. వద్దన్నాపోయినా. తురవకపోయినా పరవాలేదు. కాఁబట్టి 'తగ్గన్' అన్నది వ్యవహారమున లేకుండుటలో వింత లేదు. (అప్యర్థములోఁ గూడ వ్యతిరేకార్థముపైనె 'న'వర్ణము విన్పించును గావున నటను తగ్గా అను రూప ముండు నవకాశము లేదు.

## ఆత్మనేపదార్థము :

బాల.క్రి.52,53 సూత్రము లట్లు గ్రహించిరి (ఉ.62,63) వీరు వేసుకొని మున్నగునర్వాచీనప్రయోగములను గుర్తించుటయు 'ప్రాసుకు' అనురీతి వానిని నిరాకరించుటయు నుచితమె. (చూ.బాల.క్రి.38)

## యాకు సకారము :

'ఇకారవక్త్రంబు లుక్తంబులందలివి పరంబు లగుచో యాకు సకారం బగు' (54) అను సూరిలక్షణము నిట్లు సవరించిరి. 'ఇంచుక్కృత్ప్రత్యయ ములు తప్పఁ దక్కినప్రత్యయముల మొదట నున్న ఇ-ఎ-ఏ-లు పరమగు నపుడు ధాతువుతుదియకారము సకార మగును. (బా.84)

వీరిలక్షణమును బరామర్శింతము. సూరిసూత్రమందలి ఉక్తంబులంద లివి అనుదానికి 'ఇంచుక్ కృత్ప్రత్యయములు తప్ప తక్కినప్రత్యయ ములమొదట' ననువీరిసూత్రభాగము వివరణాత్మకముగా వీ రెంచియుందురు. కాని యిం దపక్షములు పెక్కు.

'తక్కినప్రత్యయముల మొదట' నని చెప్పునప్పు డాఇంచుక్కు నిటఁ బ్రస్తావింప నక్కఱ లేదు. ఇంచుక్కు ఆగమమె కాని ప్రత్యయము గాదు గదా. కాఁగాఁ బ్రత్యయము పర మగునపుడు చెప్పినకార్య మాగమము పరమగునపు డెట్లును రాదు. కావున నాగమ మైనఇంచుక్కు పర మైన నీకార్యము ప్రాప్తియే లేదు. ఇఁక దానిని మఱలఁ జెప్ప నేల? 'కృదిచ్ఛిన్న ప్రత్యయములు' -అన్న నించుక్కు పర మైనపుడు సకార మగునా? సూత్ర మున ననవసర మైనగౌరవము గల్గినది.

ప్రత్యయముల అనుటయు సరి కాదు. ఆగమములు ప్రత్యయ ములు గావు. కావునఁ బ్రత్యయపరకత్వమునఁ జెప్పినయీకార్య మాగమపరకత్వమునఁ బ్రాప్తింపదు. ఇట్టియెడల త.క్రి.60సూత్రమునొద్ద వలెనే ఎదు, ఎడి, ఎద మొద లగునాగమములు పర మైన సకారము రా వీలు లేమి చేసెదును, చేసెడిని, చేసెదను, చేసిరి మున్న గుచోట్ల సకారము వచ్చుటవారిసూత్రముచే లక్షణవిరుద్ధ మయి యిట్టి వెల్ల గ్రామ్యము లగు. కాక విటఁ గూడఁ 'బ్రత్యయ' మాగమమున కుపలక్షణ మనుకోవలె. అపు డించుక్కును జేర్కొనుట యొప్పు. ఇంచుక్కును జేర్కొన్న సామర్థ్య ముచేఁ బ్రత్యయ మాగమమునకు నుపలక్షణ మనవచ్చు. ఇట్టియవసర మును గల్పింపనిసూరిలక్షణము సూక్తము గదా.

'ప్రత్యయముల మొదట నున్న ఇఎఏ' అనిరి. క్త్వార్థమునందు వచ్చు 'ఇ' అనునదే ప్రత్యయము. ఇది 'ఇ' మొదటఁ గలప్రత్యయ మనవలెనా? చేసిరి ఇత్యాదులం దగు 'ఇ' ఆగమము సిద్ధి.

ఇఁక నిట వీరు 'ఇ-ఎ-ఏ- యనుచో 'ఏ'కారమును గూడఁ జేర్కొనిరి. ఇది యచ్చుపొరపాటేమో యనుకొనుట కవకాశము లేదు. సం.లో 'ఇద్వక్రంబులు- ఇకారమును ఏలును (ఇకారసాహచర్యమునఁ దాలవ్యములు గాని ఒఓలకు గ్రహణము లే దని యెన్నునది.) (వా.శ.సం.న. 1522) అనుటనుబట్టియు 'ఏ' వీ రుద్దేశ్యపూర్వకముగనె) యుంచి రనవలె. కాని 'ఏ'కార మాదియందుఁ గలప్రత్యయము గాని యాగమము గాని యీవ్యాకరణమునఁ జెప్పఁబడలేదు. వీరు నెచ్చట నుదాహరింపలేదు. ప్రత్యయాగమము లయిన ఎను-ఇ-ఎడు-ఎడి-ఎద అనునవి మాత్రమె యిట నుక్తపూర్వములు. (ముఖ్యన తనుప్రయుక్తము చేసినవెదాదులలో ఏకార మున్న నది ప్రత్యయము గాకున్నను నది ధాతువునకుఁ జెందినదై యుండదు.) కాఁగా వీ రిట 'ఏ' (దీర్ఘము) చూపుట యనవసరము. 60 సూ.లోవలె 'ఎ'(హ్రస్వము) మాత్రమె చూపఁజాలును.

సం.లో ఇకారసాహచర్యముచేఁ దాలవ్యవక్రములే కాని ఒఓలు గ్రహింపఁబడ వని తాము చేసినవ్యాఖ్యను దృష్టియం దుంచుకొని స్పష్టత కయ్యి వీనిని వివరించియుందురు. కాని పైరీతిని వ్యాఖ్యానింప నవసరము గానరాదు. వక్రశబ్దముచే ఎఏ,ఒఓ లెల్ల గ్రహింపఁబడినను ఒఓ అనువక్రములు పర మగుట సంభవింపదు గావున నట సకారప్రసక్తి లేమి నపరూపప్రసక్తియు లేదు గదా. సంస్కృతధాతువుల కించుగ్వ్యవధానంబుసంజేసి యట వక్రపరకత్వము లేమి నట వక్రమున కియుట్టు లేదన్లే యిటను ఒఓలు వక్రములైనను నవి పరముగా నుండమి సకారము ప్రసక్తి లే దని సూరియభిప్రాయము స్పష్టము.

ఇకారదసోహచర్యముచే వక్రములు తాలవ్యములే గ్రహింపఁబడు ననిరి. అట్లు 'ఏ' గూడ గ్రహింపఁబడినను నట సకారము లే దని గుర్తించితిమి గదా. ఏకారమువలె ఒఓలను బర మగుట లేమి సకారము లేమి గుర్తింపఁ దగియున్నది. కావున వీరు తాలవ్యవక్రములే గ్రహింపఁబడు ననురీతిని జేసినవ్యాఖ్యయే యవసరము గా దని నిశ్చయింపఁదగును. ఏకారమును విడుచుటకు వీరివ్యాఖ్య ననుసరించియే యవకాశము లేదు. వీరు గ్రహించినను ప్రయోజనము లేదు. ఒఓలు నట్లే. వీరివ్యాఖ్య సరి కాదు.

'ఇకారవక్రంబు లుక్తంబులందలివి' యనుటచే ఏఏఒఓలు నాలుగును వక్రములే యైనను సూక్తములందలివక్రము హ్రస్వ మగు'ఎ'కారము మాత్ర మే. కావున నది యొక్కటియే గ్రహింపఁబడు నని వ్యాఖ్యానించిన సూరి మతానుగుణ మైయుండును.

'ధాతువునకు' అనునధికారసూత్రము గలిమి వీరు దమసూత్రమున 'ధాతువుతుదియకారము' అనుట స్పష్టతకె. కావున నది లేనిసూరిలక్షణమున దురుక్తియు లేదు.

మొత్తముపై సూరిలక్షణమే సూక్తము. అం దేయపసిద్ధాంతమును మారింప నిట్లు వీరు సవరింపఁబూనిరో కాని వీరిసవరణమువలననే యనర్థము లేర్పడుచు నిది యగ్రాహ్య మైనది.

### ఉండుచున్నను :

బాల. క్రి. 55,56సూత్రములు బాదా పట్లె గ్రహించిరి. (ఉ.66,67) ఉండుచుండినను, ఉండుచున్నను 'అనునవి అపశబ్దములు' (ఉ.395) ఎటటనే నిట్టిప్రయోగములు గానవచ్చినచో ఉండుచున్ + ఉండినను (ఉన్నను) అనురీతిగా గుర్తించుటలో బాధ యేమో విచారింపవలెను.

### ఉన్నను:

బాల. క్రి. 56,57సూత్రములను బాదా పట్ల గ్రహించిరి. (ఉ.66,67)

'ఉంచు+అట్-ఉండు+చు+ఉన్న+ను ఇటఁ ప్రకృతసూత్రమునఁ ఉండుధాతువు లోపించుటచే దానితుదిని నిల్వవలసినచువర్ణము లోపించినది' (వ్యా.సం.వ.1479) చువర్ణము లోపించిన దనుట సరి కాదు. చువర్ణకము చేసినపిదప దానివలన ఉన్నశబ్దముతో నుండుధాతువునకు వ్యవధానము గల్గుటయు గమనార్హము. ఉండు+అట్, ఉండు+చు ఉండు+ఉన్న+ను, అని యున్నశబ్దము చేరినవెంటనె ప్రస్తుతసూత్రముచే నుండుధాతువు లోపింపఁగా ధాతువునకు రావలసినచువర్ణము ధాతువు లోపించుటచే, ప్రాప్తింప నవకాశమె లేదు. కావున వీరు 'చు' లోపించు ననుట యసంగతము. దీని వలననే 'ఏతత్స్వభావన్యాయమున ఉన్న యనెడియనుబంధము పైతము లోపింపవలసియే యున్నను నేతత్సూత్రవిధానసామర్థ్యమున నట్టిలోపము గలుగ దని సూరియాశయ' (వ్యా.సం.వ.1479) మని నిరాధారముగాఁ గల్పించుకొనవలసివచ్చినది. పైప్రక్రియప్రకారము 'చు' లోపించుటయే లేదు గాన ఉన్న లోపించు ననుప్రశ్నయె లేదు. మరి 'చు'లోపము నుద్దేశించిన ఉండుతోపాటు చువర్ణమునకును లోపము చెప్పెడివాఁడే. ఉదంతము న కున్నానుబంధము చెప్పఁగా నుదంతమె (ఉండుధాతువు) లోపించును గాన దానికి వచ్చిన 'ఉన్న' లోపించు నని తలఁపరాదు. కన్ఁగవ [illegible]. ము త్తియము. ము త్తైము. మొ॥

సూరిగారిఉండుధాతులోపవిధానము వరుసలవారికి సం.లో నప్పలేదు'

'సహజ మగుచింతామణిమార్గము ననుసరించి అదర్థము ఏపదిక మగునవు దుండుధాతురూపము లితరధాతువుల కనుబంధము అగు … —

చిం. 'వసతిరనుబన్ధకః' అనఁగా నుండుధాతురూపమునకె … ము లగునా? వండుధాతువున అదర్థమును వివక్షింపఁగా … మెట్టి దనుబంధ మగును? అదంతమా? అయిన అదంత … అనుబంధ మగు నని స్పష్టముగాఁ జెప్పవలదా? అప్పుఁ గాక. చిం. ప్రకాశ … మైన ఈయుండుధాతులదంతరూపప్రక్రియ నేవి చెప్పెనా? ఉండుఁడు, ఉండు …

రు అను సంశయమునకె చిం. లక్షణము నడచినది. ఇది సహజ మగు ప్రక్రియయా? శబ్దచరిత్ర కగు నేమో. కాని శబ్దశాస్త్రమున మాత్రము గా దనక తప్పదు.

—ఉండినఅనుదానిలోని డివర్ణలోపమున ఉన్న శబ్దమేర్పడె ననియు—

'ఉండిన' అని యట నవర్ణ మైన దన్నమాట. దీనిని భూతార్థానాం తు నః క్రియాణాం స్యాత్తని చిం. భూతార్థమునం గదా చెప్పినది. లదర్థమున నందును సూత్రమున స్పష్టముగాం జెప్పకుండంగా 'ఉండిన' అను భూతార్థకరూప మనుబంధ మగుట యెట్లు?

'—అట్టివికృతిచే దానిభూతార్థము పోయి వర్తమానార్థము గల్గె ననియు'—

ఎట్టివికృతి? డివర్ణలోపము. వసతిరసుబద్ధ అని చెప్పిన చిం. ఉండిన, ఉన్న అని యగు నని డివర్ణలోపమును (బిందుపూర్వక నకారమును) చెప్పినదా? భూతార్థమున నవర్ణము చేసి, అది వర్తమానార్థమున ననుబంధము చేయుచు నట్టిది భూతార్థము పోయి వర్తమానార్థక మగుటకు డివర్ణము లోపించువర్ణవికృతియో మూల మయినపుడు అట్లని చిం. ఉద్దేశించినపుడు దానిని విధింపకుండు టేమి? 'క్వచిన్నవర్ణే డేర్లోపః' అని డిలోపమును జెప్పినయధర్వణుం డేని నట భూతార్థము పోయి వర్తమానార్థము గల్గుటను ప్రస్తావింపలే దేల?

ఇట్టివికృతివలన నట్టియర్థభేదము సహజ మనుకొనియెనా? అసలిట్టివికృతివలన నర్థభేదము గల్గునా? 'క్వచిద్డోశ్చ తథా భవే త్తనె నిక్కడనే వి.వి. ఉండునేని— ఉన్నేని (వ్యా.సం.స.1485) ఇట నర్థభేదము

ఉన్నవాఁడు వర్తమానార్థకవిశేషణము. ఇది భూతార్థకమె కావలసియున్నను వర్ణలోపాదివికార మందినది గాన నన్నయాదిమహాకవులు దీనిని వర్తమానార్థకముగ వాడిరి. (వ్యా.సం.స.1485) ఇటనే యేలః ఉండినన్—

ఉన్నన్ (ఉన్నచో) అనుచో నిట్టివికారమె కలదు. అర్థభేద మేర్పడినదా? వర్ణవికృతివలన నర్థభేదము సహజముగా భావింప వీలు లేదు. కావున నర్థ భేదమును ప్రత్యేకముగా సూత్రింపవలసినదే.

ఆ ట్లిట పరులవారు చేసినయూహ లన్నియు నిరాధారముగా సాగినవే. ఆధారము చెప్పవలె నన్న నన్నయాదర్శముల క్రియాపదముల ప్రక్రియ సమగ్రముగాఁ జెప్పలే దని పునరాగమ క్రియాణా మిత్యాదుల దేనినో యాశ్రయింపవలె. అట్లుగాక, అది నన్నయాదర్శముల యాశయముగాఁ జెప్పుట విశ్వసించు టెట్లు? ఇందు సహజత్వము నన్నయాదర్శముల పేరి వలనఁ గలిగిన దనుట తప్పు కాదు.

వర్తమానక్రియాపదమునందు నన్నయ (వండుచు) ఉన్నవాఁడు అనురీతిని ప్రయోగించు నన్న 'వ్యతిరేకార్థే ల్యటి లటి ముక్ స్యాత్' అని అట్టునకు ముక్ విధాన మేల? దీనినిబట్టియె పరులవారు చేసిన 'సహజ' ప్రక్రియ చిం. (వి.వి.) కర్త యుద్దేశించినది గా దని నిశ్చయింపవచ్చును.
ఇఁక సూరి దాని ననుసరింపలే దనువిచార మేల?

కావున 'సూరి ఉన్న అనునది యేదో శబ్దవిశేష మనియనట్లు సమాపక క్రియారూపములతో ననుబంధముగాను వర్తమానార్థకవిశేషణప్రత్యయము గాను వచ్చు ననియు'- చెప్పుట యసహజ మను టొప్పదు. చదువుచున్న వాఁడు చదువుచున్నాఁ డనుచో చదువుచుండినవాఁడు చదువుచుండినాఁ డను రీతి వ్యవహారము గలదా?

చదువుచున్నాఁ డనుచో ఉన్నాఁడు, అనుబంధ మని పరులవారి మతము. ఇట ఉన్నాఁ డనుచో ఉండుధాత్వర్థము (ఉన్నాఁడు అను ప్రత్యేక క్రియాపదముయొక్క యర్థము) నకుఁ బ్రాధాన్యము లేదు గదా. అట్టియెడ ఉండుధాతువుపై భూతార్థమున నేర్పడిన 'ఉన్న' యన్నది వర్తమాన

ర్థక మగు నని దానిని దగిలించుటకంటె. ఏ క్లేశపడిన దను ప్రశ్న లేక 'ఉన్న' అనుశబ్ద మగు ననుట శబ్దశాస్త్రోచితము గాదా?

అది పర మగునపు డుండుధాతువే లోపించు ననియు నిట్లసహజ ముగాఁ బ్రక్రియాకల్పనము చేసికొనవలసివచ్చెను -(వ్యా.సం.స.1480)

ఈ రెండుపద్ధతులలో నేదిశబ్దశాస్త్రోచితమో గుర్తించుట సులువే.

వర్తమానార్థకక్రియాపదప్రక్రియలో 'ఎక్కువసంఖ్య గలసూత్రము లుపదేశింపవలసివచ్చెను' (1480) చిం.లో 'వ్యతిరేకార్థే ల్యుటి లటి తుక్ స్యాత్' అనుచో వీరు "వండుచుండు + డు = వండుచున్నవాఁడు వర్ణాగమోవిశేషః ఇత్యాదిసూత్రముచేతనె రూపసాధనము చేసికొనవలెను' (వ్యా.సం.స.1341) అనెను. ఇట్టికల్పితరుపునంటిలక్షణ మున్న నింతటి ప్రణాళిక యనవసర మనుకొన్న నిట సూరిప్రక్రియలో సూత్రసంఖ్య యెక్కువ యైన ట్లొప్పుకొనవలసినదే.

కాని పైని వీరు చూపినచిం.ప్రక్రియలో వండుచుండు + డు అనుచో వర్ణాగమోవిశేషః అనుదానిచే బిందుపూర్వకతువర్ణమునకు (ండు) 'న్న' ఆదేశ మైన దనవలె. ఇట యూకార్థానాం తు అని 'న' వచ్చుటయు లోపించుటయుఁ దన్మూలమున సర్వము మారుటయు ననుచీ రూహించిన వన్నియూ ధ్వనుల ప్రక్రియలో నసహజత్వము కొంత నష్ట మగుట గమనింపవలసియున్నది.

అట్లే ఉండినన్ అనుచేదాద్యర్థమునకు ఉన్నన్ అనునది ప్రాక్షికముగా నాదేశ మగు నని వే ఱొకసూత్రము నుపదేశింపవలసెను. -(వ్యా.సం.స.1481)

సరి మఱియు వింత. చిం.వి.వి.లలో నిట్లు ప్రత్యేకసూత్రము లేకయె ఉండినన్- ఉన్నన్ అని యైనదా? చిం. చెప్పలే దన్న నంగీకారమె కాదు. వి.వి. క్వచిన్నవర్ణే ర్లోపః- అని లోపమును విధించి

వది. 'నకారపరకానుస్వారము నకారముగఁ బరిణమించె' (ఇక్కడ మకారపరకానుస్వారము మకారముగఁ బరిణమించిన చేసెంపబోనది చేసెప్పబోనది యగు. కాని వచ్చెంగోడు కిత్యాదులఁ బరపొల్లుగా నసుస్వారము మాఱదే. ఇట విశేష మున్నమాట.) నని (వ్యా.సం.స.1465) యూహింపవలసిన యవసరము లేకుండ సూరి 'ఉండినన్' అనుదానికి 'ఉన్న' ఆదేశము చేసి రూపము సాధించుట ప్రశంసార్హము కాఁగా నీతిరస్కార మేల?

అనుబంధప్రత్యయస్థలములందును 'ఉన్న' యన్నది 'ఉండిన' అను దానినుండి సాధించుటచే వీరి కదియు నీచేదాద్యర్థకస్థలమును సమానముగాఁ దోఁచియుండు. అట 'ఉండిన' అనుదానితో రూపాంతరము లేమి గుర్తింపమి. అభేదము సూరిలక్షణముననె స్పష్టము.

'భూతార్థానాం తు' అనుచో క్త్వపదర్థకనవర్ణమును జేదాద్యర్థకనవర్ణమును గలిపి వివరించిరి. (వ్యా.సం.స.1463) సూరి స్పష్టముగా వేఱుగా సూత్రించుట యుచితము గదా. కావున నాయంశమునను గౌరవముగా నెంచఁ బని లేదు.

కాఁగా నిట సూరిప్రక్రియ యంతయు శాస్త్రోచిత మైయున్నది.

పిదప నైన నిది గుర్తించి వరులవారు ప్రస్తుతవ్యాకరణమున సిద్ధి మొదల సూరిప్రక్రియామార్గమును యథాతథముగా గ్రహించి సం.లో వీరు చేసిన తిరస్కార మనుచిత మని సూచించుట ముదావహము.

౫౧౯ :

"తిరుటులు పరంబు లగునపు డన్వాదులనుస్థానంబున మున్నయు నుండుడుం లోపంబును విభాష నగు (౬౮)నను సూరిసూత్రమున "మున్నయు" ననుచో "నెఱసున్నయు" నని మిగిలిన దళ్ళ గ్రహించిరి. (తి.౬౮) వీరు చేర్చిన "నెఱ"యనువిశేషణము స్పష్టతకే. అది లేనిసూరిలక్షణమునొప్పున నఱసున్న యగునిదిప్పుడి లేదు.

ఇట నన్వాదు లనఁగా బా.క్రి.64సూత్రమునందుఁ జెప్పఁబడిన యన్వాదులే కదా. వీని యన్నింటను "ను"వర్ణము నడికొల్లి హ్రస్వముపైనె యున్నది. కావున "అఁటయిఁక–అనుసూత్రము ననుసరించి నడికొల్లి హ్రస్వముపై నున్న యన్వాదులలోని నువర్ణమునకు ఖండానుస్వారము రా వీలు లేదు. కావున నెఱబిందువు మాత్రమే వచ్చును. వీరును క్రియా 62సూత్రములో పూఁవలెనె బిందు వని సామాన్యముగనే చెప్పిరి. వసతి యట ఖండము రాకుండుట 'కఁటయిఁక'లక్షణమే కదా మూలము. అదే విధముగా నీసూత్రమునను. కాఁగా వీరు 'నెఱ' యనుట స్పష్టతకే.

వీరు అనుట–అంట. అఁట అని మైన దండుదు. ఇట "నెఱ" యన కున్న అనుట అనుచో నిందున్న లోపాటు (అఁటయిఁకచుఁదుసూత్రముచే వీట ఖండ మొందుటలో బాధ లేదు గావున) ఖండబిందువు నయి అఁట అను రూపము వచ్చుటనే సాధింపఁబడియుండెడి. "నెఱ" యనుటవలనఁ బూర్ణబిందువు మాత్రమె వచ్చుటచే మఱల వీరు దమసంజ్ఞా.14.సూ.చేఁ బూర్ణమునకు ఖండము చేసికొనవలసియుండును.

ఇఁక సూరిమతమున నన్న నిట ఖండము రాదనియె యెంచఁదగును. అఁట యన్నది "అనుట" యనుదానినుండి యేర్పడె నని సూరి తలఁచె ననుట కాధారము లేదు. అంట అఁట యన్నవి సమానార్థకములుగా నిశ్చయముగాఁ జెప్ప వలనుపడదు. అంటవలన, అఁటకు ననురీతిగా నాయావిభక్తులు "అఁట"శబ్దముపై లేవు. నీయంటకు మెచ్చి యనుచో నీయఁటకు మెచ్చి యని యుండదు గదా. కావున అఁట యన్న దవ్యయముగాఁ గోశములు పేర్కొను టుచితమె. [దీనినుండి ఖండమునకుఁ బూర్ణ మైనను అంట యనియు నేర్పడు నదియు నవ్యయమె.] అఁటయిఁకసూత్రమునందలి దీయ వ్యయశబ్దము] అనుటనుండి యేర్పడిన "అంట" కృదంత మయి యాయా విభక్తులను బొందు నేకాకశబ్దము. కావున నీసూత్రముచే నట ఖండ ముంచుట కవకాశము లేదు. కాన సూరిమతమున అనుట– అంట యనుచోఁ

గూడ నీయఁటయిఁతసూత్రము ననుసరించి తింట యిత్యాదులవలెనె ఖండ బిందు వుండదు. సూరిసూత్రము సూక్తము.

### తెమ్మ్ర :

బాల.క్రి.59నుండి62సూత్రములను దాదా వట్ల గ్రహించిరి. (ఉ.69 నుండి72)

61సూ.స్థలమున "కొనుధాతుస్థలమందే కాక స్థలాంతరములందును నీవిధి వర్తిల్లును (తే.రా.కా, మొ॥) తెమ్మ్మ-తెండు(ఉ.398) సూరి యిటఁ గొమ్మ్మ, కొండు అని చూపె నని యీకార్య మీస్థలమందు మాత్రమె యని భ్రమింపకుండుకై నీ రిట్లు వివరించియుండుదు. తెమ్మ్మ తెండు మొ॥రూప ములు సూరియు స్థలాంతరమున నుదాహరించెఁ గదా.

### కోకుము :

వ్యతిరేకప్రార్థనమునందు కొనునకు కో కస్పష్టము. కొనకుము కొన కుఁడు చేకొనకుము (ఉ.398)కుజితో వ్యవధానమువలన బాల.క్రి.60సూత్ర ముచే నిట 'కో' అనునాదేశము రాదు.'కోకుము'అనురీతివి గానఁబడుటయు లేదు. ఒకవేళఁ గ్రై కోకు మనురీతిప్రయోగము గాననయిన నా(60)సూత్ర మందలిబహుళపదము నాశ్రయింపవచ్చును. (చీదోకి దాళమే [పాండు. 3.42] మున్నగున వట్లే కదా.)

### అంద్రుం :

బాల.క్రి.62.సూత్రము నట్ల గ్రహించిరి. [ఉ.72]

సం.లో "బా.ప్రకీ.17,18సూత్రములు విభక్తిప్రత్యయపరకత్వము నందలిస్వరలోపమును విధించునవి కామింజేసి సూరి యిట నీసూత్రమును

దేశించినవాఁడమ్మో" [వ్యా.సం.న.1593] ననిరి. అందుచేతనె 'విన్మ్రు' ఇత్యాదులు బాల.చే నసాధ్యము లనిరి వీరు.

ప్రస్తుతసూత్ర ముల్లోపమును జెప్పుచున్నది. ప్రకీ.18సూత్రము లాఁతియచ్చున కని యున్నస్వరలోపము చెప్పుచున్నది. కాన వరుసలవా రిట ప్రకీ18సూత్రమును బ్రస్తావింప నవసరము గానరాదు.

ప్రకీ.17సూ.చే వినుము- విన్మ్రు అని యగు నన్న నీసూత్రము వ్యర్థ మగునా? అసూత్రము 'నలదర' లయుత్తునకు లోపము చెప్పుచున్నది. ఈసూత్రమున 'తదన'లయుత్తునకు లోపము విహితము. ఇందలితద లందు లేవు. రువర్ణకము పర మగునపుడు గొన్నియెడలఁ గలయీలోపమునకై తదం సాసూత్రమునఁ జెప్పి సామాన్యముగ నెల్లెడలఁజెప్ప నుచితముగాదు. ఇంక బహుళపదము నాశ్రయించి సాధించుకొనవలె. ఎక్కడెక్కడ లోప మగునో స్పష్టముగాఁ జెప్పుచున్నయీసూత్రార్థమునే యచ్చటిబహుళశబ్దము చే గ్రహింపవలె. దానికంటె నిట్లు సూత్రించు టుచితము గాదా?

తవతలయుత్తునకు బిందువు మీఁదనె లోపము అనుదురు- అంద్రు అని కాదు గదా. పోషింతురు- పోషింత్రు అని యగును. పోషింపుదురు- పోషింప్రుదు అని కాదు.రువర్ణము పర మగునపుడే కాన పోషింత్రు.అంద్రు ఇత్యాదులు నుండవు.

వినుము.విన్మ్రు అనురీతి నరు దగుస్థలములకంటె, పోషింత్రు, అంద్రు, కొంద్రు అనురీతిస్థితియొక్క ప్రాచుర్యము ననుసరించి యీలోపము పైభాషికముగఁ బ్రత్యేకముగఁ జెప్పుటయె యుచితము.బ.లో వీరు నట్లు చెప్ప టుచితముగా నున్నది.

ఇటుఁ గలయితరకార్యముల నెట్లును వేఱుగ సూత్రించుచుండెను. కావున వానితోపాటుగ నీయంశమును గూడ స్పష్టము చేయు టుచితమె.

ఇంకను బ.లోఁ జత్వమములందును నీవిధి వర్తిల్ల వలయును గాన

అచ్చి.29[ప్రకీ.17]సూత్రముచే విధి పునరుక్తము గాదు [పు.399] అని చక్కఁగా ప్రయోజనము నిరూపించిరి.

ప్రత్యయపరకతయందుఁ బ్రత్యేకముగా నిట్టిస్వరలోపముఁ జెప్పియున్నవారే [అచ్చి.29] యిచ్చుటియుత్వలోపము ప్రత్యేకముగా విధింపఁబడి యుండుటను సముచితముగా గుర్తించిరి. కావునఁ బ్రస్తుతసూత్రలక్షణము [క్రి.62][ప్రకీ.17[18]సూత్రము ప్రత్యయపరకస్వరలోపము చెప్పఁబూనిచేసి చెప్పఁబడిన దనుట యసంగత మని గుర్తింపవచ్చు.

ప్రకీ.17,18సూత్రము ప్రత్యయాగమాదిపరకత్వమునఁ బ్రవర్తించు నది కా'[వ్యా.సం.స.1579]దనువారియభిప్రాయము నిర్మూలము. మనుష్పు కుదుర్పు తేల్పు ఇత్యాదులు దానికి లక్ష్యము లగుటలో బాధ లేదు. [చూ. ప్రకీ 17,18,సూ.]

## నామములు-ఇంచుక్కు :

బాల.క్రి.69సూత్రము నట్లు గ్రహించిరి. [పు.2] ఈసూత్రమును ముందునకుఁ జెప్పుటలో సూరిసూత్రమున నపసిద్ధాంతము గల దని వీరి యుద్దేశ్యము గాకపోవచ్చును. కాని యర్థమున భేదము గలదు. సూరి సంస్కృతధాతువులకు అని ధాతువులకు మాత్రమె యీసూత్రముచే సంచుక్కు నని స్పష్టము చేసెను. కాని వీరు సంస్కృతధాతువులకును గొన్ని సంస్కృతనామంబులకును నంగలాదు లగుకొన్ని యాచ్ఛిక[ధాతువులకును] శబ్దంబులకును స్వార్థమునందు ఇంచుగాగమ మగును." [పు.354] అని వివరించిరి.

సూరివలెనె వీరును మొట్టమొదట "ధాతువునకు" అను నధికారసూత్రమును జెప్పి ఇంక నుపక్రమింపఁబడునది ధాతువున కగుటను వివరించిరి. అట్టిమొదలఁ బిదపఁ దీసూత్రమున "సంస్కృతంబునకంగలాదుల" కనఁగా- సంస్కృతధాతువునకు నంగలాద్యాచ్ఛికధాతువులకు నని మాత్రమె యర్థము

చెప్పవలసియున్నది. అట్టియెడల 'నామముల' కనుసర్గము పీఠి కెటనుండి లభ్యమైనదో స్పష్టము గాకున్నది.

ఆస్లే 'కొన్ని నామముల' కనిరి. కొన్నింటికి కనుసర్గమున కీసూత్రమున నాధార మేది? ధాతువున కనుసధికారసూత్రమును విడిచిపెట్టిన సంస్కృతంబునకనఁగా సంస్కృతశబ్దంబుల కెల్లనని యర్థమై రామించు, కృష్ణించు ననురీతిగాఁ జెప్పుట తప్పగునా? అందుకే వీరు కొన్ని అని యుందురు. దానికి సూత్రమున నాధారము లేమి స్పష్టము. అగతికము లగుభ్వాదులకుఁ బ్రయోగము వారింపఁబడుటచేఁ దద్విధానమువలనఁ గొన్నిసంస్కృతధాతువుల కించుక్కు ప్రసక్తి లేదు. నామముల కట్టివిధాన మున్నదా?

ఇంక నాచ్ఛికములయెడల (నంగలాదిధాతువులకె యించుక్కావు నని వివరణమునఁ జెప్పినను) ఎలుగించు అడకించు అనురీతి నాచ్ఛికనామములపై వించుక్కు చూపిరి. దీనికిని లక్షణమున నాధారము లేదు.

సూరి 'నిర్దిష్టనామంబుల కయుగాగమంబు గలుగ'దనుచో నామంబుల కయుగాగమనిషేధసామర్థ్యముచేఁ గొన్ని (సంస్కృతాచ్ఛిక) నామముల కించుక్కాగుటను సాధించెను. ఏ రాయర్థమును ప్రత్యేకముగా సాధింపఁ దలఁచినచో నామంబులకుఁ గొన్నింటికి ధాతుత్వవివక్షయం దించుక్కాగుటను ప్రత్యేకముగా సూత్రించుట యొప్పును.

'గాల తిలక అపువాని నంగళాదులలోఁ జేర్చరా దని సం.లో భావించినను (వ్యా.సం.స.1553) నిట నట్లు వీనిని జేర్చుట (సూరిమతానుగుణమై) సముచితముగ నున్నది. (చూ.తద్ధి.11సూ.)కాని 'తిలక' ధాతువును జేర్చలేదు. 'తిలక'(ము) అనునామమునకు 'తిలకించు' అనుధాత్వర్థము లేమి కోశాదుల స్పష్టము. 'తిలక' ధాతువుగా గుర్తించుట యుక్తము.

## ఉపకృతులు-నామధాతువులు :

ఉపకృతిపరిణతిసంస్కృతు లని (సంస్కృత)ధాతువును త్రివిధముగాఁ జెప్పియుండఁ సూరి దాని ననువదింపక స్వతంత్రప్రణాళిక నేర్పఱచు కొనుట వరుులవారికి సం.లో నచ్చలేదు. సూరిమార్గమున విప్పందులు పెక్కు ప్రస్తావించిరి.

'నుతించు స్తుతించు ఇత్యాదులను సూరి నామధాతువులుగాఁ జెప్పి వాని కించుక్కను బా.క్రియా.65సూత్రముచే జ్ఞాపకము చేసెను. ఉపకృతు ల నంగీకరింపకపోవుటచే - అని వివరించుకొనుసవస్థ సూరికి సంభవించె ననిరి. (వ్యా.సం.స.1552) మంచిదే. వ్యాఖ్యాతల కట్టియవస్థ తొలఁగినది. ఇట వరుులవారు ప్రస్తుతసూత్రమునకుఁ జేసినవ్యాఖ్య యెట్టిది? సూరి పడిన యవస్థలు తాము దప్పించుకొనుటకై వీరు ఉ.లో ఉపకృతిధాతువులను దేర్కొన్నట్లు గానరాదు.

'ఏవో యలంతిధాతువులు జ్ఞాపకసిద్ధము లనుట యుక్తము. పరిష్కృతము లగుధాతువుల నట్లు సంగ్రహించుట యుక్తమా.' (వ్యా.సం.స. 1552)

అనఁగా నుతించు స్తుతించు అనురీతివి పెక్కులు గలవు గావున జ్ఞాపకసిద్ధములు చేయుటకంటె నించుగాగమమును విధించుట యుచిత మని వీరియభిప్రాయ మెన్నఁదగు. పరిష్కృతములుగ నున్నట్లు గుర్తించిన వీరు ఉ.లో నామములకుఁ గొన్నింటికి యని యేల చెప్పిరి? కొన్నియనఁ బరిష్కృతములా? జ్ఞాపకసిద్ధము అను టొప్పుఁ గదా.కాక వీనిని చిం.వలె ధాతువులు గనె చెప్పఁదగును గాని నామములుగా భావింపరా దని చెప్పఁదలఁచిరా?చిం. 'ఉపకృతిః కృదన్తా' యనె.ఉపకృతి యను పేరె దానిస్వరూపమును సూచిం చుచున్నది.వరుులవారు 'కృదన్తాశ్చ'యని నన్నయసూత్రమును సరి చేసిరి. సూరికి ముందు చిం.సూత్రమున కీపాఠము పుట్టలేదు కావున నిట్టియవస్థము

సూరికిఁ దెలియదు కావుననే కృదంతములను ధాతువులుగాఁ దెలుఁగున నైనను బరిగణించుట సమంజసము గాదని యవి నామములుగ సంస్కృతానుసారముగా నిరూపించెను. సంస్కృతమున ధాతుసంజ్ఞ గలిగినదానినిమాత్రమె తెలుఁగునను (సంస్కృత) ధాతువుగా గుర్తించి పేర్కొన్న సూరిమతముచితము గాదా? నుతి, స్తుతి ఇత్యాదులు సంస్కృతమున ధాతువులు గావు గదా. తెలుఁగున నట్లే యుపకృతులను బేర్కొన్నచిం. అన్యస్మాద్ధాతోః.. అనియు నామములకు ధాతుత్వవివక్షలో నింతయు చెప్పినది. 'నుతి' మొదలగునవి యిట్టివి యనరాదా?

మఱియు నిట్లు ప్రాతిపదికముల నెల్ల సంగ్రహించుకొనునపుడింక ద్వేషించు మున్నగువానికై బా.క్రి.66సూత్రము నుపదేశించుట సిద్ధసాధనమె. (వ్యా.సం.స. 1522)

నామధాతువులను బేర్కొనెఁ గావున నెల్లవియు ప్రాతిపదికలనుండియె సంగ్రహింపవలెనా? 66సూత్రముకడఁ జూపిన వెల్ల (సంస్కృత) ధాతువులె యగుట గమనార్హము. సంస్కృతమున ధాతుసంజ్ఞ గలవాని నెల్ల నటనుండి తెలుఁగునకుఁ దెచ్చికొనినపుడు తెలుఁగునను సంస్కృతానుసారముగా ధాతువులుగా గ్రహించి యాపై వికారము లుపదేశించుట సక్రమము గాదా? అట్లు సంస్కృతాచ్ఛికములు ధాతువులనుండి నిరూపింప నవకాశము కుదురువపుడే నామములను ధాతువులుగా వివక్షించుట యొప్పును గాన నట నామములనుండి ధాతురూపమును సాధించుకొను టుచితము. సిద్ధసాధనము చేయుటకుఁ దప్ప సముచితమైనసూరిప్రణాళికను భంగపఱచుట యనవసరము.

మఱియు నీకఁ డిట్లు నామధాతువులను సృజించుట కారంభించుటం జేసి కరుణాచిత్తదంతములనుండి కరుణించు మున్నగుధాతువులను, పల్లవాది సమాసములనుండి పల్లవించు మున్నగుధాతువులను కృత్తద్ధితసమాసాశ్చ అనుదాన్వున నామత్వము ననఁగాఁ బ్రాతిపదికత్వమును సంగ్రహించుకొను

నవస్థయు దుర్వార మగుచున్నది' (వ్యా.సం.స.1551)ఇది మఱియు వింతగా నున్నది. కరుణవల్ల వాదులను ప్రాతిపదికలుగా గుర్తించుట దురవస్థయా? కరుణించు అనురీతిధాతువుల నెట్లో సాధించిన కరుణాదిశబ్దముల ప్రాతిపదికత్వము గుర్తింప నక్కఱ లేదా? కృత్తద్ధితాంతములు సంస్కృతానుసారముగాఁ దెలుఁగునఁ బ్రాతిపదిక లగుట యటనే విశేషముగా గుర్తింపవలెనా? ప్రాతిపదికత్వము సహజమె. వానిని ధాతువులుగా వివక్షించుటయె విశేషము. చిం.లో కరుణించు, వల్లించు అనువాని సిద్ధి నామము ధాతుత్వవివక్షచేతనె తాము సిద్ధింపఁజేసినసంగతి (వ్యా.సం.స.1547) మఱచి రేమో. అక్కడ వీనికిఁ బ్రాతిపదికత్వ మెట్లు సిద్ధమో సూరిమతమునను నట్లు కావున నిటఁ బ్రత్యేక మగునవస్థ యే మున్నది? ఈవాక్యములచే వీ రేమి చెప్పఁదలఁచిరో కాని దీనియర్థము మాత్రము వారిసిద్ధాంతమునకుఁ దోడుపడునది కాదు.

ఇంకను వీరు 'కరుణాశబ్దము కృదంతమె యగుటచే దీని నుపకృతిగా నేల యంగీకరింపరా దని శంకింపఁజనదు. ధాత్వర్థస్ఫురణవిదూరము లగు కృదంతములనుబట్టి యుపకృతిత్వ మంగీకరించుట సంప్రదాయము గాదు. (ఈసంప్రదాయ మెక్కడినుండి వచ్చినదో యని విచారింప నక్కఱ లేదు. 'భట్టారకునినామధాతూపదేశమె యయిరీతి గలసంప్రదాయమునకు స్ఫోరక మగుచున్నది' వ్యా.సం.స.1547 అనిరి.) కరుణించు అనుధాతువునందుఁ గృదాత్వర్థభావము లేదు గదా' (వ్యా.సం.స.1547) నన్నయను బ్రత్యునుంచి వచులవారియభిప్రాయమును గమనించిన నుపకృతులను జెప్పుట వ్యర్థ మని స్పష్టము గాఁగలదు. నుతి-కృదంతమె. కరుణ-కృదంతమె. లక్షణము చేర్కొనని 'సంప్రదాయములో' వీనికి భేదకల్పన మేల? నామధాతూపదేశముచేఁ గరుణ కృదంత మయ్యు నామధాతు వైనది. ఉపకృతులను జెప్ప 'నుతి' యుపకృతి యైనది. ఉపకృతులను జెప్పకున్న నిది నామధాతువు గాదా? ఉపకృతి యగుకరుణనామధాతు వైనవు డట్టి 'నుతి' నామ

ధాతు వని చెప్పఁ దప్పేమి? 'ఉపకృతిః కృదన్తా' యన్నది కాని చిం. ధాత్వర్థస్ఫూర్తి సంప్రదాయమును జెప్పినదా? కావుననే కొన్నికృదంత ములు నామధాతువులా నొకకొన్ని యుపకృతులు వనుటకంటెఁ గృదంతత్వ ముచేఁ బ్రాతిపదికసంజ్ఞను బొందినవీనివి నామములగనె గ్రహించి ధాతుత్వ వివక్షచే ధాతువులుగా (నామధాతువులుగా) సంగ్రహించినసూరిమతము సమ్మతింపఁదగినది.

## అంగలాదులు :

'అంగలాదులలో' గాల మున్నగువానితోపాటుగ పయన మున్నగు వానిని జేర్చుకొనుటచే -- నట్టివానిని నైతము జ్ఞాపకసిద్ధము లనుచు సంగ్ర హించుచిక్కు నేల పడెనో తెలియకున్నది (వ్యా.సం.ప) ఇచ్చటి "గాల" యనునది నామము గా దనియు నాచ్ఛికధాతువె యనియు స్పష్టము. ఉ.లో వీరును 'గాల' ధాతువుగాఁ జూపిరి. [ఉ.355] కావున గాలశబ్దముచేర్పఁ గాన పయనాదినామములు చేర్పవచ్చు ననరాదు. అంగలాదు లెల్ల [నాచ్ఛిక]ధాతువులే యగుట సూరిమత మది స్పష్టమె. సంస్కృతమె యైన నాచ్ఛికమె యైన నామముల కీసూత్రమునొద్ద సూరిమతమునఁ దావు లేదు.

సంస్కృతమునెడలనటెఁ దెలుఁగుశబ్దములయెడలను నామవిభక్త్యం తముగాఁ బ్రయుక్త మగుశబ్దము [ఇంచుగాదులతో] క్రియావిభక్త్యంతము గాఁ గూడఁ బ్రయుక్త మగుచో నట్టి నామములే ధాతుత్వవివక్షయందు ధాతు వులై యవి నామధాతువు లవును. ధాతుత్వవివక్షచే నామము ధాతు వగుట కలదు గాని నామత్వవివక్షచే ధాతువు నామముగాఁ గావ్యప్రయుక్తి మగుట లేదు గదా.

పయనము అనుదానిని నైతము అంగలాదులలోఁ జేర్చి సాధించు కొనుట యుక్తము. అనన్యగతికస్థలములందు మాత్రమె నామములకు ధాతు త్వవివక్షచే ధాతుత్వమును జ్ఞాపకసిద్ధముగా నంగీకరించుట యుక్తము.[వ్యా.

సం.స.1560] అయిన పయనించు అనునది నామమునకు ధాతుత్వవివక్షచే ధాతు వగుటచే నేర్పడినది కాదా? పై వాక్యములవలన 'పయనము' అన్నదియు ధాతువే యని యర్థ మగుచున్నది. ఇది వారియుద్దేశ్యమును గాదు. అంగలాదులు ధాతువులే యని గుర్తించినపుడు (వ్యా.సం.స.1547] అందు నామములు చేరుట యెట్లు?

ధాతువునకు అనునధికారసూత్రము ననుసరించి యిట సూరి సముచితముగా సంస్కృతాచ్ఛికము లెల్ల ధాతువులేచూపియుండఁగా వీరు ఉ లో నిరాధారముగా 'కొన్నినామములు' చేర్చుట యసమంజస మైయుండ సూరి యట్లు చేయలేదని విమర్శించుట యుక్తమా?

కాఁగా సూరి ప్రస్తుతసూత్రమునొద్ద నామములను బ్రస్తావింపకుండుటయుఁ బ్రయోజనము లేని 'ఉపకృతి' విభాగము ననుసరింపకుండుటయు.నుచితములు. అవి కొన్నియు నామముల ధాతుత్వవివక్షచే ధాతువు లై ప్రయోగింపఁబడుటను జ్ఞాపకసిద్ధము చేయుటయు సంప్రదాయానుగుణమె. దీనిని దిరస్కరించుటకు సరియైనయాధారము చూపలేదు వీరు. సూరిమతము సముచితము. నామములకుం గొన్నింటికి ధాతుత్వవివక్షలో నించుగాదు లగుటను బ్రత్యేకముగా సూత్రించుట తప్పు గాదు. కాని యట్లు గాక సూరి జ్ఞాపకసిద్ధము చేయుటయుఁ దప్పు గాదు. వరుులవా రెట్లును లక్షణబద్ధము చేయలేదు.

ఇల్లు ఇలు అనునాగమములను జేర్చుటచేత సైతము కొన్నితత్సమధాతువు లేర్పడును.' (చూ.క్రియా.74) (ఉ.355) క్రియా74సూ.చే వీరు ఇంచుక్ప్రకారంబునకు సబిందుకంబునకు ద్విరుక్తలకారము విధించిరి. కావున నట ఇల్లు, ఇలు అనునవి ప్రత్యేకము లగునాగమములుగాఁ జేరుప్రసక్తియే లేదు. కావున ఇల్లు ఇలు అనువానిని జేర్కొనుట యనవసరము స్పష్టతక

యయ్యెను. ఇంచునుండి యేర్పడుట ప్రస్తావింపఁదగు (ఇటు అనునదియు వేఱుగాఁ జెప్పుట యింకను విశేషము.)

## అయుఁగాదులు :

'ఇఉఋల కించుక్కు పరం బగునపు డయుగవ్వుగరుక్కు లగు' (81) అనుసూరిసూత్రమును వీరు "సంస్కృతధాతువులతుది నున్న ఇ.ఉ. ఋ. అనువర్ణంబుల కించుక్కు పరం బగునపుడు వరుసగా (అయ్.అవ్. అర్) వయుగవ్వుగరుక్కు బగును [ఉ.3] అని చూపిరి. వఝలవారి యీలక్షణము సూరిసూత్రమునకు సంగ్రహవ్యాఖ్యవంటిదే. సూరిలక్షణమున దురుక్తి లేదు. ఇంక వీరియీసూత్రమువ్యాఖ్యానప్రాయ మగుటచే నిందు దళ సార్థక్య మెన్నుట యనవసరము.

బాల.క్రియా.70.సూత్రమునందలి'సర్వంబునకు' ననుదళ మిచ్చోట్ల విధులు సంస్కృతములకె యని నిరూపించును. వఝలవారు స్పష్టముగా 'సంస్కృతధాతువుల' ననుట యుచితమె.

## నవించు :

యథాప్రసిద్ధి ధాతూనాం ప్రయోగస్సమ్మతో భవే త్తనురీతిని సూరి వచింపమింజేసి ప్రకృతసూత్రముచెప్పున 'ను' మున్నగుధాతువులనుండి నవించు మున్నగుధాతువు లగునవసిద్ధాంత మేర్పడుచున్నది. (వ్యా.సం.స. 1559) ప్రాదులతోఁ గూడినను గూడకున్నను అద్ మొద లగుసంస్కృత ధాతువులు దెలుఁగున బ్రయోగింపఁబడమింజేసి యిట్లు సూత్రింపవలసినదే యని తోఁచుచున్నది. (వ్యా.సం.స.1667) కాని వఝలవా రైన నాలాటు పూనుక ట్లిట్టిసూత్రమును జెప్పరో లేలకో.

కాని 'యథాప్రసిద్ధి' యనునది చెప్పకుండుటచే 'విధ్యాగమంబుల కయుగాగమంబు గలగదు మున్నగుసూత్రముల నుపదేశించుకొనుప్రక్రియా గౌరవమును గల్గుచున్న (వ్యా.సం.స.1559)దనుట సరి కాదు. 'జి'యన్నది

పరిణతిధాతు వనియు 'నిర్జి' సంవృతిధాతు వనియు 'యథాప్రసిద్ధి' అను కారిక చెప్పుచున్నది? (వ్యా.సం.స.1541) ప్రయోగానుసారముగా పరిణతియో సంవృతియో తెలిసికొనవలె. అట్టియవసరము లేక (సూరి) లక్షణమే స్పష్టము చేయుచుండ దానిం దిరస్కరింప నేల? ప్రయోగముల నాశ్రయించి తెలిసికొ మ్మన నేల? ఇట్లె 67,68,69 మొ॥సూత్రములు,సూరి చిం. వలె ఉపకృతిపరిణతిసంవృతిభేదకల్పనము చేయలేదు.అది యనవసర మని గుర్తించి వరుసలవారును సూరివలె ఉ.లో నట్టివిభాగము చేయకుండు టుచితముగా నున్నది. ఇంతకును సూరివలెనె యిట వరుసలవారును నిర్జి కయుగాగమమును వారించుచు లక్షణము చేసి పైని సూరిలక్షణమునఁ బేర్కొన్న యనౌచిత్యము సత్యము గా దని తామే నిరూపించిరి.

## అయుగభావము :

'నిర్జినామంబుల కయుగాగమంబు గలుగదు' (65)అనుసూరిసూత్రమును వీరు "నిర్‌పూర్వకజిధాతువునకు అయుక్కు లేదు' (4) అని చూపిరి. 'నిర్జికి' అనుసూరిసూత్రదళమునకు వివరణమె 'నిర్‌పూర్వకజిధాతువునకనువీరివచనము. సూరిసూత్రమున నపసిద్ధాంత మేది?

నామంబుల కనుదళమును వీరు దమసూత్రమునఁ దొలఁగించిరి.తమ పూర్వసూత్రమున "సంస్కృతధాతువులతుదిని" అని పేర్కొనుటచే నామములకయుగాగమము ప్రాప్తించుట లే దని వీరు తలఁచి రేమో.కాని యివి సహజములుగా నామము లయ్యు ధాతుత్వవివక్షచే ధాతువు లగును. కావుననే యింముక్కు దాఁగా మీఁద లకారాదు లగుచున్నవి, నామధాతువులును ధాతువులే యగుటచేతను, వీరు ప్రపూర్వసూత్రముచే వానిపై నింయుగాగమమె ల్లని జేసియేయుండుటచేతనె స్తుతి + ఇంచు ఇత్యాదినామధాతువులకుఁ బూర్వసూత్రముచే నయుగాగమము రాకతప్పదు. కావుననె ప్రస్తుతసూరిలక్షణమున "నామంబుల" కనుదళము స్వాంశమునఁ జరితార్థ మయినది. మఱి వీరిమతమున స్తుతయించు నుతయించు అని యగుట నివారింపఁబడునది

యొట్లనఁగా వీరు నామధాతువులకు సూరివలె జ్ఞాపకసిద్ధముగాఁ గాక ప్రత్యేకముగనే యించుక్కను సాధించితి మని తలఁచినను వాని కయుగాగమమును నిషేధింపకుంతుట సమంజసము గానేరదు. అపరూపము తీర్పవలెక తప్పదు.

అసలు వీరు నామముల కించుక్కు లక్షణముచే సాధించినట్లు దయె లేదు. ఈసూత్రమున నామంబుల కయుగాగమనిషేధసామర్థ్యముచే నైనను సూరిమతమున ధాతుత్వవివక్షయందు నామములకుఁగొన్నింటికించుగాగమము లక్షణబద్ధము చేసెను. వీరు తమవ్యాఖ్యలో వివరించిరి. సంస్కృతంబున కంగలాదుల కనుయుత్రము సాధింపఁజాల దని గుర్తించితిమి గదా. ఇఁక వివరణమున విశేషలక్షణము చెప్పవచ్చుఁ గాన వీరిమతమున నట్లు గ్రహింపరాదా? అన్నవివరణముచేఁ జెప్పువీరిమార్గముకంటె సూత్రమున జ్ఞాపకసిద్ధము చేయుపద్ధతి సంప్రదాయానుగుణముగా సమంజసము గాదా? (తెలుఁగు నందలిమిశ్రసాధ్యసమానము లత్యల్పము లనియె వీరు సామాన్యశాస్త్రసిద్ధములు గాకుండఁజేసిరా. నామధాతువులప్రత్యేకత సూత్రమున గుర్తించిన సూరిలక్షణము దానిప్రాచుర్యమును ప్రస్తావించియు నెట్లైని సూత్రబద్ధము చేయఁజాలవివరణలసూరిలక్షణమార్గముకంటె సమంజస మనుటలో సందేహము లేదు.

ఇఁక సూరి నామముల కయుగాగమము మాత్రమె నిషేధించెను. తెలుఁగున ఋకారాంతము లగు (సవితృవిధాతృమాంధాతృ) నట్టినామధాతువులు లేవు. ఉదంతములు గల వేమో చూడవలె. వాని కవుగాగమ మగుటలో బాధ లేదు సూరిలక్షణముచే.

## గుణము :

"సంస్కృతంబునకు లఘూపధంబున కించుక్కు పరం బగునపుడుగుణం బగు" [౬౬] నను సూరిసూత్రమును వీరు "సంస్కృతధాతువులయుపధ లగు

ఇఉఋవర్ణంబులకుఁ గించుత్కృత్పరం బగునపుడు గుణాదేశం బగు" [సూ.5] నని చూపిరి.

'ధాతువునకు' అనునధికారసూత్రమునుబట్టి ధాతుపదమును సూత్రమునఁ జెప్ప నక్కఱ లేదు. సూరివివరణము 'సంస్కృతధాతూపధలకు' అని వివరించుట నీయధికారము ననుసరించియే. సూరివివరణమందలిదీనిని వీరు సూత్రమునఁ జేర్చిరి.

సూరి 'లఘూపధంబులకు' అనఁగా వీరు 'ఉపధ లగు ఇఉఋ అను వర్ణంబులకు' అని సూత్రమునందు వివరణము చేసిరి. అయినను వీనిఁ గొంతవిరోధము గమనింపవచ్చును.

"పీడ్ ఘూష్ మున్నగునవి లఘూపధంబులు కామింటేని పీడించు ఘూషించు మొ॥ (వ్యా.సం.స.1561) కాఁగా వీ రిట లఘువు అని చెప్ప కుంటచే పేడించు (పీడించు) ఘోషించు (ఘూషించు) వంటియపరూపము లను సాధించిరి. ఇంతకు ముందు (క్రియా.8) ఇ-ఉ-ఋ అనువర్ణంబులకు అని సూత్రించి- నీ-నయించు- లూ-లవించు- తౄ-తరించు (సూ.358)అని చూపిరి. అట్లు యుటఁ గూడ సూత్రమున ఇఉఋ అనువర్ణంబులు అనుచోట యనుకరణముచేఁ దత్పూర్వమం దున్నవి(హ్రస్వములు)మాత్రమె గ్రహింపఁబడు నన వీలులేదు. కాఁగా సం.లోనివీరివివరణము ననుసరించియె లఘూపధంబున కనుసూరిలక్షణము సూక్ష్మ మని గుర్తింపవచ్చును.

సూరి "గుణం బగు" ననఁగా వీరు "గుణాదేశం" బగు నని సూరికి వివరణమె. లఘూపధంబునకు (ఇఉఋవర్ణంబులకు) అనుచోటనుప్రయోగించెను తత్ "స్థానమున" వచ్చుట సంప్రదాయసిద్ధము. వీ "రాదేశ" మనుట స్పష్టతకే.

సూరిసూత్రమె సూక్ష్మము.

## సంకోచించు

బాల.క్రియా.67,68,69 సూరిసూత్రము లట్లె గ్రహించిరి (ఉ.6,7,8.)

వరుస(68) సూత్రమునొద్ద కుచధాతువునకు గుణము లే దనుటను దిరస్కరించువివరణమును వీరు దొలఁగించిరి.గుణము లేనిలిఖకుటాదులలో వీరు కుచధాతువును బరిగణింపలేదు గావున దీనికి గుణ మగు ననియే వీరి మ దలఁచి రనవచ్చు. సం.లో [సంపూర్వకకుచధాతువునకుఁ గూడ ముణి గిపోవు అనునర్థమున గుణము రా దనియు, వెనుదీయు అనునర్థము గుణంబు వచ్చు ననియుఁ జెప్పుట యుక్తి మని తోఁచెడిని [వ్యా.సం.స 1542] అనిరి. కావున నేయర్థమున నైన గుణము వచ్చు నని వీ రిట నేకి యు వివరింపకపోవుటనుబట్టి గ్రహింపఁదగునా? "సంకోచించు- కుచరోధే సంకుచించుచున్నాఁడు ఇతి రూపం సంవృతేరపి" [శవి.672] అనునహో బలోక్తిని సూరి పైనట్లు నిరసించె.

## ప్రేరణేంచుకొను

క్రి.70. సూరిసూత్రము నట్లె గ్రహించిరి. [ఉ.73]వివరణము "వచించు ఆపులించు మున్నగుసార్థేంచుగంతములమీఁద సైతము ప్రేరణా మున ఇంచుకు నిల్చు ననుటకయి సూత్రమున "సర్వమునకు" అనుద ము నిల్పఁబడె"[ఉ.399] ననిరి.వీరిసూత్రమున నట్లు గావచ్చును.కాని మా సూత్రమున నిట్లు గాదు.

"వచింపించు, ఆపులింపించు, వందించు" అని సూరి చూపినలక్ష్య క్రమము ననుసరించి, సంస్కృతాచ్ఛికధాతువుల కెల్ల వచ్చు ననుటయెసూ యుద్దేశ్యము. "ఇతటులకు" అనునది మొదలుకొని యింతకుఁ బూర్వపు వఱకు నాయాకార్యములు సంస్కృతధాతువులకు మాత్రమె విధింప.బడిన కావున నిటఁ గూడ నట్లు గాక యాచ్ఛికధాతువులకు సైతము వచ్చుననుట "సర్వంబునకు" ననుదళ ముంచఁబడిన దనఁదగు. వచించు [సంస్కృతము

లకారమును చెప్పఁ ప్రత్యేకవిధి యుండుటయే యుచిత మని తోఁచు.

ఇట్లున్న నొక్క లకారంబునకు లోపంబు (57) అని సూరి ఆం.శ.శా.లోఁ జెప్పెను. ఇదిఁ గూడఁ జెప్పవలసినది.

## ఇంచుగ్లోపము :

'ఇంచుక్కు పరం బగునపుడు రంజాదులయిఁచుక్కునకు లోపం బగు' (72) ననుసూరిసూత్రమును 'ప్రేరణేంచుక్కు -(75) అని యట్లు గ్రహించిరి. ప్రేరణార్థమున నైనది తప్ప రంజాదులయించుక్కుమీఁద నింకొకయర్థమున నైనయించు క్కుండదు. కావున వీరు 'ప్రేరణ' విశేషణమును జేర్చుట స్పష్టతకె. అది లేని సూరిసూత్ర మసందిగ్ధ మై సూక్త మై యున్నది.

## చుగాగమము :

బాల.క్రియా.73,74లక్షణముల నట్లు గ్రహించిరి. (ఉ.76,77)

అచ్చికములపయిని చువర్ణకమును నిల్చినచో నవి కొన్నియెడల ధాతువు లగును. (చువర్ణము నిల్చినచో నెల్లయెడల ధాతువె యగును. చువర్ణము నిల్పుటయే కొన్నియెడల నని వీరియభిప్రాయము గుర్తింపఁదగు.) ఎదురు-ఎదురుచు- ఎదిరించు చెమరు- చెమరుచు, చిగురు- చిగురుచు (చిగురించు) కొన్నిధాతువులకు స్వార్థమందును చువర్ణకము చేరును. ఉదా తసరు-తసరుచు, మొ॥' [ఉ.402] వీ రిట 'చు'వర్ణక మనిరి. ఈసూత్రమున (ప్రేరణమున నైనను) 'చుక్' అగమముగా విహితము. స్వార్థము నందలిచువర్ణము ప్రత్యయమా? సం.లో 'అచ్చికనామములకు ధాతుత్వవివక్షయందు చుగాగమము చేరు నని ... [వ్యా.సం.స.1582] ప్రకృతసూత్రములోవిటహాళపదముహిమచేఁ గొన్నియాచ్ఛికధాతువులకు స్వార్థమందును చుగాగమము వచ్చుట కవ్పట్టుచున్నది [వ్యా.సం.స.1594] అని యాగమముగనేగుర్తించిరి.అగమాన్యచకారముల కనుసూత్రముచేఁ పీనికిఁ బత్వమును

నట [1582] వ్యాఖ్యానించుటనుబట్టి ఉ.లో దీనిని వీరు వర్ణక మనుట సరిగా దని గుర్తింపఁదగును.

ఎదురు అనుధాతువును గలదు. తనరుచు అనుచోవలె ఎదురుచు అనుచో స్వార్థమునందుఁ జు క్కయిన దనఁదగు. 'ఎద్రుచు లోనిది స్వార్థిక చుగాగమము.' [ఉ.403]

'ఎదురు అనునామము నంగలాదులలోఁ జేర్చినచో ఎదిరించు అను రూపము సిద్ధించును.' [వ్యా.సం.న.1582] అందుకే వీరు సంస్కృతంబున కంగలాదుల కనుదానిచేతనే నామములకు నించుక వివరించి రేమో. [ఉ.354,355] అట్టిమొదల సంస్కృతశబ్దముచే ధాతువులు నామములు రెండు నొకసూత్రమున గ్రహింపవలె నేమో. అందలియిబ్బంది నట గుర్తించితిమి. కాని యిట్లు తలఁచినవీరు నుతి. స్తుతి మొదలగువాని కయుగాగమమును నిషేధింపకుండుట యెట్లు సరిపడు నని తలఁచిరో స్పష్టము గాకున్నది.

ఆచ్ఛికనామములకు ధాతుత్వవివక్షయందుఁ జుక్కనకు సూరిమతమున నీసూత్రమందలిఅపాంశపరము నాశ్రయింపవలయును. వఝలవారు నీయంశమును ప్రత్యేకముగా సూత్రింపకుండుట విశేషమె.

## ఇత్వము :

చుక్పువర్ణంబులు పరంబు లగునపు దిత్వంబున కుత్వం బగు [76] ననుసూరిలక్షణమును చుక్పుగ్వర్ణకంబులు ... [78] అని యుంచుక మార్చి చూపిరి. వర్ణకము లనుచు చుక్, పుక్, అని కిత్తులుగాఁ జెప్పుట విశేషము. చుగాగమంబు. [76] పుగాగమంబు [77] అని వీరును సూరివలెనె వీనిని కిత్తు లగునాగమములుగనె చెప్పిరి. కావున నిట వీరు 'వర్ణకంబులు' అనుట ప్రమాదము. వర్ణకం బనుచో వీరిసూత్రమున 'క' వర్ణ మచ్చుపొరపాటున

నధికముగ( బడిన దేమో. సం.లోను నిట్టి క్రేపిరార్థకప్రత్యయము (వ్యా. సం.స.1587) అనిరి.

సూ.3 'దుక్ప్రవర్ణంబు' అన పేరు దృక్పుక్కు అని పువర్ణమును గూడ( గిత్తుగా( జేర్కొనుట విశేషము. (వ్యా.సం.స.1587) సూరి పువర్ణమును కిత్తుగా( జేర్కొనమింజేసి కిత్తుగానిపువర్ణము పర మయినను నీసూత్రముచే నిత్యమున కుత్వ మగును. తనియు-తనుపు వృలియు-వృలు-పుఇత్యాదులలో( గృత్తయినపువర్ణకము పర మగుచుండ(గా నిత్యమున కుత్వ మగు. (సూరి యిట్టి( జూపిన కలపు తడుపు అనునవి కృదంతములు నగునని పించు) 'పుక్' అని కిత్తుగా నిర్దేశించినవరులవారిలక్షణముచొప్పున నిట్టి సూత్వమున కవకాశ మీసూత్రముచే లేదు.

సూరిలక్షణము సూక్తము.

## పెక్కుదెఱఁగులం:

బాల.క్రియా.78,సూత్ర మట్లు గ్రహించిరి. 'తిగియు' మాయ్యాదులలో( గాక యుతంగ్వాదులలో( జేరు ననుట [వ్యా.సం.స.1557] యుచితమె. [79] 'ఇంద్రుక్పృత్సుగాగమంబులు పరంబు లగునప్పు డాగమాదేశలోపంబులు పెక్కుదెఱంగులం గానంబడియెడి'[77]ననుదాని నట్లు గ్రహించుటనే 'పెక్కుదెఱంగు' లనుదానిని 'పెక్కుతెఱంగులు' నని చూపిరి. ఇట్టి( సర్వధాతుపమున [గసడ]ద[వ]ఆదేశము విరుద్ధ మని యేమో. కాని ఒండు గత ఇత్యాదిగా నీయాదేశము కవిప్రయోగప్రసిద్ధమె. (చూ.సంధి.19) దీనిని బట్టియు( గర్మధారయమున నీయాదేశము సూరిసమ్మత మనవచ్చు. (అన విడి వ్యస్త మన్నను బాధ గానరాదు.)

నిష్పన్నము మోత్రాలు అనురీతిగా సూరి యిట్టి( జూపినసామములను నీ దంగలామంబులోనివిగా( జెప్పుట సూరిసమ్మతము గాదు. అంగలాదులు [అర్చిక]ధాతువులు.

పెరుఁగు తునుఁగు అనువానితో నూరి పేర నున్న యాంధ్రధాతుమాల లోని ఖండానుస్వారము గానరాదు. ఇది యెక్కడిప్రమాదమో. వజ్ఝలవారు చూపు టుచితము.

### పనుచు :

'పనుచు- పంచు- పనుపు- పంపు వీనియాద్యక్షరలోపమున నేర్పడిన వనఁదగిన అనుచు- అంచు అనుపు అంపు (పిలుగుప్రభృతులలోఁ జేర్పరేమో. కాని యవసరము గాదు.) అనునవియు- పోవుధాతుప్రేరణరూపములై యుసియు వీనికి ఆజ్ఞాపించు అనునర్థము గౌణముగఁ గల్గు నవియు నూరియాశయము. (ఉ.405) అందువలననే కాఁబోలు వీరు 'పుచ్చు'ఒక్కటె చూపిరి.

పౌష్పనతు పనుచుప్రభృతులకును 'నాకారసామ్యము' లే దని వాని నిట్లు కుదిర్చిరి. 'పనిశబ్దమునుండి చువర్ణకయోగమున (క్రియా.76) పనుచు మున్నగునవియు వానియాద్యక్షరలోపమున అనుచు మున్నగునవియు నేర్పడియుండు' (ఉ.486) ననుటలో నాకారసామ్యము గుదిరినది. కాని ప్రధానమగునర్థమునందే సామ్యము లేదు. 'అర్థము సరిపడినను' (వా.స.న.15 95) అనుట సరి కాదు.

పనిశబ్దముపై 76.2.వివరణముచే చువర్ణకము చేయు మనిరి. [illegible] సూత్రము చుగాగమమునే విధించిన వీరు సం.లో చుగాగమమే యున్నను నిది చువర్ణక మనిరి. ప్రత్యయాగమము లభిన్నములుగా వీరు తఱచుగా వ్యవహరింతురు. పనుచు, పంచు అనురీతివర్ణవికారమునకై ప్రస్తుతసూత్రము నాశ్రయింపవలెఁ గాన దీని ననుసరించి 'చు' ఆగమ మైనను కుదురును. ఎట్లయిన చువర్ణము చేయవలె. (76.2.వివరణమున వీరు "ఆచ్ఛికశబ్దములపయిని చువర్ణకమును విధించినచో నవి కొన్నియెడల ధాతువు లగు' ననిరి. ఉ.402) ఇవి స్వార్థమునంద యుండుఁ గాని ప్రేరణార్థకములు

గాష్ఠ గదా. (వ్యా.సం.స.1584) కాఁగా 'పనుచు' అనఁగా 'పనిచేయు' అను రీతిని స్వార్థమే. కాని యీపనుచుప్రభృతు లన్నియుఁ బ్రేరణార్థకములు గదా. కొన్ని యౌపాధికనామములపై చువర్ణకము ప్రేరణార్థమునం దగు నని చెప్పుకొనవలె. వీ రట్లు చెప్పలేదు. ధాతుత్వము లేకయె ప్రేరణార్థకరూప మేర్పడుట భాషలో నింక నెట నేని గల దేమో వెదుకవలె. ఇంక నిది యంతర్భావితప్రేరణమా? (వ్యా.సం.స.1585)స్వార్థమునం దన దుండదా? వింతయే.

ఎట్లే నాజ్ఞాపించు అనునర్థమును వీరు దీనికి నియమింతురు గాక. దీనికిఁ బోవుధాతుప్రేరణరూపార్థము లేదా? పోవునకుఁ బ్రేరణరూపము 'పుచ్చు' అనుట దొక్కటి వీరు చూపిరి. పనుచు ఇత్యాదులకు బుచ్చు అను నర్థ మెట్లు? పనుచు-పంపు- అరుగఁజేయు- వృద్ధాంగుసలం బోడుగఁ బనిచి, (అనుప అరుగఁజేసి... నిజపురంబున కనిచె [సూ.ని.] అనురీతిని వీనికిఁ బోవుధాతుప్రేరణార్థము ప్రసిద్ధమే. పని యనునామమునుండి ధాతువుగా నేర్పరిచినపనుచు అనుదాని కీయర్థ మెట్లు సంభవించును? అందుచే పోవుధాతు ప్రేరణరూపములుగా వీని నంగీకరింపక తప్పదు.

పోషణ నాకారసామ్యముకంటె ముఖ్యమైనయర్థసామ్యము ననుసరించియె సూరి 'పుచ్చు' అనునర్థమున వీనిని సాధించుట సమంజసము.

'ఆజ్ఞాపించు' అనునర్థమున నైతము వీరినిరూపణము సరిగా లేమి గ్రాహ్యము గాదు. ఇట్టియర్థము లౌపచారికముగా పోవుధాతుప్రేరణరూపము పై పనుచుప్రభృతులకుఁ గల వని శ.ర. పేర్కొన్న మార్గము సమంజసము. సూరిసమ్మతము.

పనుచుప్రభృతులవలె నను చుప్రభృతులను గూడ నిటునే సంగ్రహించుటలో సూరిమతమున లాఘవము స్పష్టమే.

లేమి నిలుచున్కను లేదు. కాఁగా దీనికిఁ బ్రేరణరూపమె యుండ దనవలెనె, అది యొప్పునా?

శ.ర. సూ.వి.లు కూడుచు కూడుధాతు ప్రేరణరూపములుగనె చూపినవి. 'కొమ్మ నడవరించి కూర్చు బరువె (విరా.2.280) అనుచో కూర్చు అనుచో కూడునట్లు చేయు అని యర్థము. కూడుధాతువున కిట్టియర్థ మున్నదా? కూడు ధాతువునకు కలుగు పొందు అనురీతియర్థములె యుండఁ బ్రేరణమున నీవిశేషార్థ మెట్లు?

కాఁగా సూరియర్థానుగుణముగా కూడుధాతువున కికారత్వమును జెప్పుటెంతయు నుచితము. వయిలవా రది తొలఁగించుటయు (పునరుక్త మను టయు) సరి గాదు.

ఇంక సూరి 'చుక్క పరం బగునపు' డనఁగా వీరు ప్రేరణార్థక చుక్క పరం బగునపు డనిరి. వీనికి స్వార్థమునందుఁ బుగాగమము లేదు. కావున వీరు ప్రేరణార్థ మని యధికముగాఁ జెప్పుట ఉ.75సూత్రమునవలె స్పష్టతకె. అసందిగ్ధముగా నున్న సూరివచన ముచితము.

ఇట్లే సూరి "రేఫం బగు" నన వీరు "రేఫాదేశం బగు" నని 'యాదేశము'గాఁ జెప్పుటయు స్పష్టతకే. 'తకారంబునకు' అనువృత్తిచే నీయర్థము స్పష్టము.

సూరిసూత్రమె సూక్తము.

## ఉత్వమున కిత్వము :

బాల.క్రియా.81నుండి84లక్షణము లట్లు గ్రహించిరి.(ఉ 81నుండి87)

'ఆత్వంబు గాని యెత్వంబు గాని కూడుచో ననాద్యం బయినయుత్వంబున కిత్వం బగు' [85] ననుసూరిలక్షణమును 'ఆత్వంబు గాని ఎత్వంబు

గాని గూడుచ్ వనాద్యం బయినఉత్వంబునకు ఇత్వంబు బహుళంబుగా నగు' [88] నని చూపిరి. నడుమ నడుమ సంధి మానుట స్పష్టత కేమో. అది యనవసరము. ఇంక సూరి 'ఇత్వం బగు' ననఁగా 'బహుళంబుగా నగు' అని సవరించిరి.

బహుళం బనుటచేత నీసూత్రము ప్రయోగానుసారముగా వర్తిల్లును. -పురుటియాలు.. పురుడించు.. -పగుల్చి (ఉ.450), పయిసందర్భమునుబట్టి యిది బహుళ మనుట యుక్తము. (వ్యా.సం.స.1810) అందుకని యిట బహుళ మనిరి. ఇత్వమునకు యతిస్థలఘటితప్రాచీనప్రయోగము లభింపలే దని యీవిధిని దొలఁగింపకుండుట యుచితమె.

పురుటియాలు, పురుటిల్లు అని ప్రకృతసూత్రవిరుద్ధము లనుట యసమంజసము. పురుడు- పురుటియొక్క యనుచో నౌపవిభక్తిక 'మగుటివర్ణ పరకత్వమున 'టితివర్ణంబులు పరంబు లగునప్పు' (అచ్చ.36) దనుసూత్రముచే రావలసినయిత్వ మచ్చో సూరి 'కొండొకచో నుత్వంబున కిత్వంబు చూపట్టదు- నెత్తుటికి' నని చెప్పుట కమగుణముగా నట్టిదిగా నెన్నఁదగును. నుడుటికి ననుదానిని సూరియె సూత్రాంధ్రమునఁ జూపె. కాఁగా నివి యే సూత్రమునకు విరుద్ధము లనఁగలము?

పురుడించు పగుల్చి యన్న విటఁ జూపఁదగినవె. కాని వీనినై 'బహుళ' మనవలెనా? 'మగిడి-మగుడి' యనురీతిగా పైభాషికస్థితి ప్రచురముగాఁ గలదా? ఇట్టికొన్నిచిక్కస్థలములకు 'అగు'అనుట విరుద్ధము గా దని పై చోటిసూరివివరణమె నిరూపించును. సూరిలక్షణము సూక్తమె. వీనినైనఁ 'దఱు' చనుట కొంతవఱ కుచిత మనవచ్చు.

## చకారము-పత్వము :

బా.వ్యా.క్రి.86సూత్రము నట్లు గ్రహించిరి. (ఉ.90) 'క్రేపరణేంచుక్క- పరం బగునప్పుడు షకారంబు చకారంబున కగు'(87) ననుసూరిసూత్రమును

'ప్రేరణేచ్చుక్కు పరంబగునపుడు చకారంబునకు పకారం బగు' (సూ.89) నని మార్చిరి. 'పకారం' బనుచో వీరు సరళాదేశాదులు చేయకుండ స్పష్టతకై యనిందద్రుతగ్రామ్యముగాఁ (పు.సం.24) గావచ్చును. అది యవసరము గాదు. సూరి 'పకారంబు చకారంబున కగు' ననుటలో నేమి యపసిద్ధాంత మున్న దని వీరు తిరుగవేసిరో స్పష్టము గాదు. అనవసరము.

'బహుళ మనుటచేత మెప్పించిన యాజగజెట్టి (విదో.3.175)- ద్విత్వస్థలములందు విభాషను పత్వ మగును. మెప్పించు అని కోశములందుఁ గలదు గాని యట్టిపత్వమునకు యతిప్రాసాదిస్థలగతప్రయోగము లభింపలేదు' (సూ.410)

బహుళ మనుటచే ననిరి. గాని బహుళ మని యెవ రనిరి? సూరి యనలేదు. వీరు ననలేదు.

'ద్విత్వస్థలములలో విభాష' యని సామాన్యముగఁ జెప్పిరి. సూరి మెచ్చునకు మాత్రమె విభాష యనెను. (మెప్పించు గానరా దనుచునే (వ్యా.సం.స.1015) వీరు విభాష యనుట విశేషమె.) వీరియీవివరణము సరి గా దని పైవివరణమె స్పష్టము చేయును. 'హెచ్చు-హెచ్చించు ఇత్యాదులందు పత్వము లేనేలేదు. ఇచ్చు-ఇప్పించు, తెచ్చు-తెప్పించు ఇత్యాదులందు నిత్యము. వచ్చు-రప్పించు - విశేషరూపాభావపక్షమున నిత్యమె. (సూ.411) ఇట్టియెడల ద్విత్వమునకు సామాన్యముగా విభాష యను టెట్లు? నిత్యాదులుదానికి వ్యవస్థ చేసికొనవలెనా? వీరివివరణము సరి గాదు. 'మెచ్చునకు విభాష' యనుసూరిమత మ్ముచితము.

రప్పించు-ఇత్యాదులలోనిపత్వమున కీసూత్రముతో సంబంధము లేదు. ఇంచుక్ప్రత్పుగాగమంబు (క్రి.80) లను సూత్రముచేతనే (వచ్చు-రప్పు) యని సాధింపఁబడును. దాని నిటఁ జూపుట యనవసరము. (బహుళ మనఁదలంచిన నది యనవసరము.)

మారిలక్షణము సూత్రము.

## వ-వ :

బాల.క్రి.88,89సూత్రము లట్ల గ్రహించిరి. (ఉ.91,92)

"కవిత్రయాదీతరకవిప్రయోగంబులందుఁ గొన్నియెడల నుజ్యంతాదుల పరంబు లగునప్పుడు వత్వము విభాష నగు (ఉ.412) తత్ప28.సూత్రమునవలెఁ గవిత్రయాదీతరప్రయోగములనుద్దేశించి సూత్రమునందే "ప్రాయిక"పదము చేర్చి సూరిసూత్రమును సవరింపకుండుట గమనార్హము. కవిత్రయాదీతరప్రయోగముల పైనను "విభాష" యనుటకంటెఁ గొన్ని యెడలనే" యనుటయుఁ బ్రయోగానుగుణమె.[ప్రౌఢ.క్రి.16] పై వివరణమున "నుజ్యంతాదు" లనుట ప్రమాదము. నుజ్యంతాదులు ధాతువునకుఁ బర మగుట యసంభవము. నుడ్యాదు లని వీరియభిప్రాయము గుర్తింపఁదగు. "తీర్పుము" అనియుఁ జూపిరి.కావున నుడ్యాదులని ప్రత్యేకముగాఁ జెప్పుట యవసరమా?

## విడువన్ :

ఇట విడువన్- ఒలువన్ మొద లగునవి వ్యావహారికము లనిరి. [ఉ.411] అన నివి కావ్యప్రయోగయోగ్యములు గావు. గ్రామ్యములు విడువన్ విడువక అనురీతివి ఉండవలె నని వీరినిర్ణయము.[వ్యా.సం.వ.1620]

కాని యిట్టివత్వమునకు వత్వమునకువలె మహాకవిప్రయోగప్రమాణ మేదియుఁ జూపలేదు. [ఉ.412] లక్షణముచే వత్వము రావలెను. కాని యోగవిభాగమునకు వకార మగుటయె యిటఁ జేర్చఁగాఁ దగు. సూరి [illegible] లో వపవ్యత్యయంబు క్వాచిత్కంబుగం గలదు[4-14]అనె. అట్టి లక్షణ మిట నీ లేవి జెప్పవలసినది.

'అడ్రుచు అనుచోఁ బ్రేరణార్థము లేమి అదురు అనుధాతువునకు లేమి అడ్రుచు అంచో మవర్ణము ధాత్వవయవమె' (వ్యా.సం.వ 1582,1621 [illegible] [illegible] [illegible] సూ.ప్ర.కి.20)

ఆదేశముగాఁ జెప్పిన 'పుడు'లో 'ఉడు' అనుభాగము ముందటి 'చుడు' అనుదానిలో నున్నదే. దానినే మఱల నాదేశింప నేల? మార్పుచకారమునకు సకార మగుటయే. అదె విధింపఁదగును. అట్లు చెప్పినసూరిలక్షణమున నపసిద్ధాంత మున్న దనుట యెట్లు?

సూరి 'చెఱసున్న మీఁదిదాని' కనఁగా వీరు 'పూర్ణముమీఁది' అనిరి. భేదము లేదు గదా.

దీనికి ముందు వీరు 'ఆగమతద్భిన్నము లయినచువర్ణములు రెండును' గ్రహించిరి. "ఇట్టియెడల... బూర్ణముమీఁదిచుడు" అనఁగా నా చువర్ణ మాగమ మయినఁ గావచ్చును, లేదా తద్భిన్న మయినఁ గావచ్చును. సూరి 'యాగమచకారమును మాత్రమ చేర్కొన వీరు తద్భిన్నమును గూడఁ జెప్పుట విశేష మనవచ్చె. ఆగమేతర మగుచకారమునకుఁ బత్వ మగుటను వీ రుదాహరింపలేదు. కొంచులో చకార మాగమేతరము. వీరి లక్షణముచే గొంపుదురు అని కావలె. అట్టివి లేవు. ఇట్లే తలంతురు [తలంచుదురు] సయింతుము (సయించుదుము) ఇత్యాదిగా నాగమేతర మగుచకారముపైఁ బత్వము లేదు. ఇట్లె మంపుదు రిత్యాదుల వీరిలక్షణ మతివ్యాప్త మవుచున్నది.

సూరిలక్షణమె సూక్తము.

మిగిలినవీరిసూత్రభాగము బాల108సూత్రముకతఁ జాతము.

టీ :

బాల.క్రి.91సూత్రము నట్లె గ్రహించిరి. (ఉ.95) ఇచ్చునకు సర్వంబున కి యగు(92)ననుసూరిలక్షణమును వీరు 'ముత్తు పరం బగునపుడు ఇచ్చు అనుదానికి ఈ అనునది సర్వాదేశ మగును. జీత్తు పర మగునపుడు ఈయ ఇయ్య అనునాదేశము లగును' [ఉ.96] అని వివరణాత్మకముగఁ జెప్పిరి.

"ముత్తు పరం బగునపు" డనునది ప్రకరణసిద్ధ మగుటచే సూరి యట్టిసూత్రమునందుఁ జెప్పమివలన నెట్టియపసిద్ధాంతమున కవకాశము లేదు. 'తేతేరులు తెచ్చున కగు' (ఉ.97) అనుతరువాతిసూత్రమున వీరును వీరిళము నుల్లంఘించినను నపసిద్ధాంతము లేదు గదా. ముత్తు పరం బగునపు డన్నది దీనికి బూర్వసూత్రమున నున్నది. కాఁగా నీవత్తులవారిసూత్రమున 'ముత్తు పరం బగునపు' డన్నది వివరణమే కాని విశేషము గాదు. సూత్రమున నేల?

'ఇచ్చునకు'- 'ఇచ్చు అనుదానికి' అనుటయు నిట్లే (వచ్చునకు, 85, 86 చెచ్చునకు ఉ.84)

"ఇచ్చునకు సర్వంబున కగు" ననుటచేతనె సర్వమున 'కాదేశ' మగుట స్పష్టము. వీరు మఱల "నాదేశ" మనుటయు స్పష్టతకె. కాఁగా వీరి సూత్రమున మొదటిభాగము సూరిసూత్రమునకు సంగ్రహవ్యాఖ్య.

పిదప వీరు "ఈయ-ఇయ్య" యనునవి రెండు నాదేశములుగాఁ జెప్పిరి. కాని "ఇయ్య" యన్నది ప్రత్యేకముగాఁ జెప్ప నవసరము లేదు. వీని నాయేబాదులతోఁ జేర్పఁగా (ఉయ్యేల)ఇయ్యయనురూప మేర్పడును. [నోపు- నొవ్వు వీ రీమార్గముననే సాధించిరి [ఉ.111]గాని నోవుతోపాటు నొవ్వు అనునాదేశమును వేఱుగా విధింపలేదు గదా. ఇది నేల? కాఁగా "ఇయ్య" యనునది యాదేశించుట యనవసరము.

ఇఁక "ఈయు" యనునది, ఒకానొకచో "ఈయు" యనునాదేశమును గల దని సూరి వివరించెను. దానిని వీరు సూత్రముననె చెప్పిరి. కాక "ఇత్తు పరం బగునపు" డనునది "ఒకానొకచో" ననుసూరివాక్యమునకు వివరణ మనఁదగినను స్పష్టతర మైయున్నది. సూరివివరణమున నింత స్పష్టత లే దన్నను నపసిద్ధాంతము మాత్రము లేదు.

సూరి "యొకానొకచోఁ గానంబడియెడి" నని వివరించుటచే సర్వత్రస్థితి ప్రచురము గా దనునభిప్రాయము వ్యక్త మగుచున్నది. కాని వీరు "ఈయ

ఇయ్యి అనునాదేశములు నగు" అనుటలో షష్ఠ్యర్థమున శబరాళ మీయ లేదు.

మొత్తముపై నిట సూరిలక్షణమునం దెట్టియపసిద్ధాంతమును లేమి గ్రాహ్యము.

### ఈవృత :

"ఈవృతన్ అనురూపము సూ.రా.నిఘంటువున నుదాహరింపఁబడెను. ఇందలి పత్యము నిరాధారము. దీనిని నిర్వహించు మహాకవిప్రయోగము లేదు." (ఉ.415) సం.లో ప్రాసాదిఘటితమహాకవిప్రయోగము లభింపలే (వ్యా.సం.స.1636) దని ప్రాసేతరస్థలముల నుండి సూచించి రనవచ్చును.

అయి లీవృత [హరి.పూ.1.3]- అనయంబు నీవృతన్ [పాండు-1.6] అప్పనధివాగ్రణి కీవృత మిప్పితార్థముల్ (రాజ.1.5) విశేషవరంబు లీవృతన్ [భోజ-1.3] ఇట నెల్ల 'ఇచ్చుత' అని దిద్దఁజూచుటకంటె నీరూపమును గుర్తించు టొప్పును గదా.

ఇట పత్వ మలయిన దనుటకు నిచ్చో పత్వమును జెప్పులక్షణము లేదు. కావున నీవజ్రము సుఱ మ్ముందుఁ గావృత [హర.3.47] దణపీరుల గావుట నీ వెఱుంగవె [ఆది.8.286] భద్రసంపాదిని గాఫ్త ఉచ్చెరువె [శల్య.1.1-275) అనుతీరుగా నిట 'లాఁతిచో సహితము కాదేశాదు' [క్రి.102] అనులక్షణముచే ఇచ్చునకు ఈవు ఆదేశ మైన దని గ్రహింపఁ దగును.

### నేతురం :

బాల.క్రి.93నుండి 96సూత్రము లట్ల గ్రహించిరి.(ఉ.97నుండి100)

నేరుచునకు ఓడ్లాట్టులు ముత్తుం బరంబు లగునప్పుడు రుచులకు లోపంబు బహుళంబుగా నగు (97) ననుసూరిసూత్రమున 'నేరుచునకు

లాట్లనందును భూతార్థకరూపములందును దువర్ణము బహుళముగా లోపించును. ముత్తు పరంబగునపుడు తీనితుది యువర్ణము వైకల్పికముగా లోపించును.' (సూ.101) అని పేర్కొనిరి.

"సూరి భూతార్థములలో లిట్టునందు మాత్రమె దలోపము బహుళ మని సూత్రించెను, అప్పకవి నీక్రిందిభూతార్థకరూపములు సాధ్యములు కానేరవు. నేచినయట్లు (మొ.స.1.215) నేచియు నేరతుంచియును (దశ.3.140) (ఉ.416) ఇందుకయియే సూత్రము నింతగా మార్చిరా? సూరి సూత్రమందలి బహుళపద మీరూపములను సాధింపఁగలదు గదా. ఈ లిట్లు సవరించినను బహుళపద మవసరమ యైనది. 'బహుళగ్రహణముచేత నేచు కొనంగలరు [పరా.12.77] మున్నగునవి సాధ్యములు అగును. వానితోపాటు నేచిన, నేచి యనురీతిని గుర్తింపరాదా? లిట్టుకు భిన్న మయినభూతార్థములయందు నిట్టిది క్వాచిత్కముగాఁ గల దని బహుళపదముచే సాధించవలసి యుండఁగా నివి సూరిలక్షణముచే సాధ్యములు గా వనుట యెట్లు? నేచుకొను అనురీతిని వీరిలక్షణముచే సాధ్యములు గావంత్రలోపమే. ఇట్టి ప్రయోజనము నుద్దేశింపనిచో [వీరు దలోపము వైకల్పిక మన్నట్లు సూచియు] వైకల్పిక మనక బహుళ మనుట యేల?

బహుళగ్రహణముచే నేచుకొను మున్నగురూపములు [illegible] సూరియాశయము కావచ్చును. కాని యట్టియెడల దువర్ణలోపము [illegible] ప్రాచీనగ్రంథములలోఁ గానరాదు' [వ్యా.సం.స.1642] అనుపించుచు ప్రాయము ననుసరించియే భారతాది ప్రాచీనగ్రంథములందుఁ గ్వాచిత్కముగా నున్న నేచిన ఇత్యాదులు గల్గ నమలయే బహుళపదప్రయోజన మని [illegible] యాశయ మనరాదా? (వానితోపాటే నేచుకొను) నిట్టి [illegible] సుపలక్షణ మనుకొను [వ్యా.సం.స.1642] లేల?

వీరిసూత్రముత్తరార్థమున 'తుదినున్నదువర్ణ' మనుచోఁ దుది

కర్ణము స్పష్టతకై, నేరుగున నున్న చువర్ణ మొక్కటె. అది చివర యున్నది. [పడిమిరువర్ణ మనవల్లె] సూరి 'దుచుల'కనుటలో [నెట్టివిశేషములేక] సమసిద్ధాంతము లేదు.

వేఱువేసి చెప్పుటవలన చులోపము "వైకల్పిక" మైనది వీరిసూత్రమున. అందు విశేషము లేదు.

కాఁగా వరుసవారియీలక్షణము సూరిసూత్రమునకు సంగ్రహవ్యాఖ్యమె. సూరిలక్షణము లక్ష్యసంగ్రాహక మగుచునె లాఘవముతో నూక్తము.

## పోద-పద

"పోవునకు దుఙ్మత్తులు ముఙ్ఙు పరంబు లగునప్పుడు వులోపంబు, పోదపదలును విభాష నగు (98) ననుసూరిలక్షణమును "పోవునకు దుఙ్మత్తులు పరంబు లగునప్పుడు వులోపంబు విభాష నగు" (ఉ.102) అని చెప్పిరి అనఁగా సూరి చెప్పిన "ముఙ్ఙు పరం బగునప్పుడు పోదపదలు విభాష నగు' నన్నయంశమును తొలఁగించిరి. అది సరి గా దని వారివచనములనుండియే గ్రహింతము.

"పొమ్ము-పోదము- పదము మున్నగువానిలోని ము ప్రత్యయము మధ్యమపురుషైకవచనసంబంధి (ఉ.372) పదము పోదము అనునివి మధ్యమపురుషైకవచనములు. పదఁడు పోదఁడు అనునవి మధ్యమపురుషబహువచనాంతములు. యుష్మదర్థకప్రకృతికములు. (వ్యా.సం.స.1644)

ముఙ్ఙులు మధ్యమపురుషప్రత్యయములె. పోదము- పదము పోదఁడు పదఁడు-అనుచో నున్నవి మధ్యమముఙ్ఙు లనియె సూరి పేర్కొనె. ముఙ్ఙు పరం బగునప్పుడు [పొద పద లగు] అనుట యుక్తమే కదా.

"ఈమధ్యమపురుషరూపములందును వచనద్వయమునందును ముఙ్ఙున అర్థము పోవుధాతువునకు వెలయుచున్నవి" (ఉ.372]

ఈదుష్కృతము, సత్వము నెట్లు వెలయుచున్నదో వివరించిరి గాదే, మధ్యమపురుషములు లని వీరే యంగీకరించిరి గదా. మధ్యమపురుషలకు ముగాగమ లగుట యెట్టునందు. అట్టులో దుగాగమమును గూర్చి చెప్పలేదు. ఏ శేష జెప్పిరా? ఉభయప్రార్థమున దుగాగమము చెప్పకయె సూత్రి యత్వము చెప్పి తె ట్లని అట మాత్రమె వీరు దుగాగమము విధించిరి. (ఉ.371) ముకి యీమధ్యమపురుషలో దుగాగమము గానియత్వము గాని లక్షణముచే విధింపంబడకయే యెట్లు వెలసినవి. దుగాగ మయి దాని కత్వ మయిన 'ద' వ మగును. 'పౌద- పద' అనుచో 'ద' యనున దిట్లు గూర్చి పైసూత్రమున విధించె. అది యగుచున్న దని యంగీకరింతురు గాని యగుటను జెప్పిన సూరిలక్షణమును దిరస్కరింతు రేమి?

ఈకార్యము 'పోవుధాతువునకు వెలయుచున్న' దనిరి. సూ.(ఉ) మాత్రమున పోవునకే విధించెను. అందుఁ దప్పేమి?

దుగాగమము సత్వమును జేర్కొనిరి గాని వీ రుదాహరించిన పౌద, పద, యనువానిలో నంతమాత్రమె యైనదా? అయిన పోవుదము, పోవుదఁడు అనియు గావలె. కాని వీరు పౌదఁడు, పదము అనురీతిని జూపిరే. అనఁగా వీరు వివరింపకున్నను దుగాగమము దాని కత్వముతో పాటు, వు లోపము ఇది ప్రతిప్రసూత(602) సూత్రముచే సిద్ధించును వికల్పముగా. కాని పోవుదఁ డనురీతి విధేమి? వీరియెడ లోపము నిత్యముగా వేఱ విధించుకొనుటయో విభాషకు వ్యవస్థ చేయుటయో యవసరము. (పౌదము- ఓత్వమునకు హ్రస్వ మొకసారి (పౌదము) అత్వ మొకసారి (పదము) అగు నని చెప్పవలదా? లేనిచోఁ దిక్కనాదుల ప్రయోగముతొ విరుద్ధము లగు. ఇ ట్లిన్నికార్యములు విధించుటకంటె, పౌద, పద అనునవి యాదేశించిసూరిలక్షణ మింతయుఁ సముచిత మనుటలో సందేహమే యక్కఱ లేదు.

'పౌదము అనునుభయకర్తృకరూపమునకు సంక్షేపరూప మనుక్రాంతి నొదవించుచున్న'- [వ్యా.సం.ప.1402] దనిరి. ఇది భ్రాంతియే కాపున సం. లోపలె నిటఁ. గూడ నివి మధ్యమపురుషక్రియలే యని నిరూపించితి. పౌద

పోద మనికిన్ పదపదఁ డంచు అనురీతి నామ్రేడితపదకతలో లోపమును విట్టియు నిది మధ్యమమునఙ్గులే [వ్యా.సం.స.1403] యని నిర్ణయించు టుచితముగా నున్నది. సూరిప్రక్రియ యెల్ల నొప్పికొనుచునే దానిం దూలఁ గింప నేల?

'మఱి కొన్ని యాచ్ఛికధాతువులకును బహుళత్వమున నివి ప్రయోగ దృష్టము లగుచున్నవి —వెదకుదండు చూతండు. [చు.372] ఇవి సూరిగాని ప్రౌఢవ్యాకర్త గాని యూచుకొనలే దట [చు.372] అప్పుఁ గాక చూచుకొనని యవి సాధింపకపోవుటయు దోసఁగె. చూచినవి సాధించుటయు దోసఁగె యగునా? పోవున కేకత్వమునను గలదు. భేదము వీరే స్పష్టము చేసిరే. వెదకుదండు చూతండు అనురీతి నదు దగునొండురెండు రూపములు సూరి ప్రౌఢ.సాధింపలే దన్న వీరు ప్రచురములై భారతాదిప్రాచీనమహాకావ్యము లందె ప్రయుక్తమైయున్న పోదము పదఁ డనురీతిని సాధించిరా?

ఇంక మిక్కిలియరు దగు వెదకుదండు చూతండు అనురీతివానిని, ప్రచురము లగు పోదము,పదఁడు అనురీతివానిని సమానముగాఁ జెప్ప టుచితమా?

ఏ మైన వసులవార్పై విపదణమునుబట్టి యీసూరిప్రక్రియ యయుక్తమె. అయిన వీ రేల గ్రహింపరు?

పోదము— పదము అనువానిని పోవుము పొమ్ము అనువానికిఁ బర్యాయముగ నుదాహరించుట సరి గాదు.— అందలిఆత్వమహిమచే నస్మదర్థ సాహిత్యము వ్యక్త మగుటమాత్రమె విశేషము. [వ్యా.సం.స.1644) నీవు పోదము — నీవు వెల్లము— నేనును వచ్చెదను. [చు.372] ఇ ట్లర్థమున భేదము గల దనిరి. పోదపద అనువానిలో నస్మదర్థసాహిత్యమును గల దని క్రియా.67సూత్రమున వివరింపఁబడుటచే నిందు పోదపదలయాదేశము మఱి లఁ జెప్పలేదు' [చు.117] మఱలఁ జెప్పుట యేమి? ఇంతకు ముం దీయాదే శము నొకసారి చెప్పిరా? అస్మదర్థసాహిత్య మర్థమునుగూర్చి చెప్పితి మని

(వివరణమున) వారె పేర్కొనిరి. అర్థమును వివరించుట యూరూపములు సాధింప నశక్యము లే దనుటకుఁ గారణ మెట్లగునో తెలియకున్నది.

కాఁగాఁ బౌదపదాదేశమును వీరు చెప్పక విడుచుట యసంగత మని వారివివరణమే నిరూపించుచున్నది.

ఇంక నర్థభేదమును బ్రస్తావించుటయే వీరు ప్రధానముగా నుద్దేశించి నట్లు వీరివిమర్శనమున గుర్తింపవచ్చును. ఏమైన నివి మధ్యమపురుష క్రియ లనుట వారును నిశ్చయించిరి. అర్థవిశేష మున్న దానిని విశేషముగాఁ గలిపి చెప్పుట యొప్పును గాని యసలు శబ్దమె సాధింపక విడుచుట యెట్లు? అపు డర్థభేదము లక్షణబద్ధ మయిన ట్లగునా?

దశారమహిమచేతను. (ఉ.372) అత్యమహిమచేతను (వ్యా. సం.ప.1644) నన్నత్ర్దర్థసాహిత్యము వ్యక్త మగు ననిరి. వీరు పిస్ప్రత్రి యనె లక్షణబద్ధము చేయకుండ దేనిచేనైన వ్యక్త మగుట యెట్లు? వివరణముచే గ్రహింపవచ్చు. అపు డత్యమో దత్యమో కారణముగాఁ జెప్ప నేల? అది సూత్రసిద్ధ మయినట్లుగా.

ఈవివరణమున వరుసలవారు పేర్కొన్న యర్థమున నిషచ్ఛేదము గుర్తింపవలసినదే యున్నది వీ రన్నట్లు 'పౌదము- నీవు వెళ్లుము -నీవెంట నేను వచ్చెదను' [వ్యా.సం.ప.1409] అనియె కాక నావెంట నీవు ర మ్మనియు నర్థము గల దేమో యనిపించు [లోకవ్యవహారమున నట్లు గానరాదు.] అది గాను మచోప్రతను పే బౌద ప్రాజాపత్యలోకమున కనవుడు [అను.4.72] అనుచోఁ బ్రాజాపత్యలోకము నందిత్తును రమ్మని యనవుడు [అను.4.72] అని యింద్రునియభిప్రాయము. నావిపోల నిచ్చెద ర [అను.4.79] మ్మనుచోఁ బూర్వ మిట్లే కదా. ఏమైన వరుసలవారు పేర్కొన్న యర్థసాహిత్యము గల దని యంగీకరింపవలసినదే.

చెప్పినయిత్యాదులనుండి తొలఁగు గెలుచు పెలుచు అనునవి చూపుట యుచితముగా నున్నది.

బాల.క్రి.102సూ. నట్లు గ్రహించిరి. (పు.106) "రావించు రప్పించు కావించు మున్నగుచోట్ల నిత్యము. ఇవి క్రియా 80.సూత్రముచేతనె సిద్ధించును" (పు.419) అట్టియెడల "లాఁతిచోటులలో" వీనిని ప్రస్తావించుట స్పష్టతకై యైనను నవసరముగాఁ దోఁపదు.

కావున్, కానన్ ద్రు.ప్ర. లనుట సూరిమతానుగుణమె. (పు.419) [చూ.ద్రుత.]

### అయియవ్వులు-ఐఔలు :

'అచ్చికంబులం దయియవ్వులకు వక్రతమంబులు బహుళంబుగానగు' (103) ననుసూరిలక్షణమును 'అచ్చికంబులందు అయి-అవు అనువానికి వరుసగా ఐ ఔ అనువర్ణములు బహుళంబుగా నాదేశము లగును' [పు.107] అని చూపిరి.

'అయియవ్వు లనుసూరిగారిసిద్ధద్వంద్వమును, సంహితాయకారమును ప్రామాదికము' (పు.419) లనిరి. దీనినిబట్టి సంహితాయకారమే కాక సిద్ధద్వంద్వమును దప్పే యని చెప్పఁదలఁచి రని తోఁచు. కాని సం.లో 'అయియవ్వు లనుద్వంద్వమునందలియకారాగమము సాధువు కా దని తోఁచెడిని' (వ్యా.సం.న.1665) అనుటనుబట్టి సిద్ధద్వంద్వ మగు నని రని గుర్తింపవచ్చు. అచ్చికద్వంద్వ మయిన యకారాగమము సాధువె కదా. అయి,అవు అనునవి యాశబ్దములను బోధించు ప్రిసమము లగుశబ్దములు.వీనికిఁ దెలుఁగున ద్వంద్వ మగును. (చూ.అతోఁతుకూడులు.) ఇందు యడాగమము లక్షణానుగుణము. సూరి 'అయియవ్వు' లనుట సిద్ధుష్టమె. కావున నది సరి గా దని వీరు 'అయి-అవు అనువానికి' నని చెప్పుట యనవసరము. వివరణ మవసరగును. సూరి వక్రతమము లన వీరు 'ఐఔ' లనిరి. సూరివచనముల ననసిద్ధాంతము లేదు గదా.

'వరుసగా' ననునదియు వివరణమె. అగున కనుకనులకు (100) చొప్పునోపులు చప్పునొప్పుల కగు నిత్యాదిస్థలముల వీరును 'వరుసగా' నన నున్నను నట్లు గాకపోయెనా? ఇదియు వివరణమె.

అయియవ్వులకు (అయి-అవ్వు అనువానికి) అనుచో టిషష్ఠిచేతనె వాని స్థానమున ననునర్థముతో నాదేశ మగుట సిద్ధించును. కావున వీరు 'ఆదేశము' అని పేర్కొనుటయు వివరణమే.

ఇట్లు పదులపారిలక్షణము సూరిసూత్రమునకు సంగ్రహవ్యాఖ్య యగును.

ఐఔలకు అయి-అవ్వు అనునవి యాదేశము లగుటయుఁ గలదు. కైక-కయిక దైవమ్-తద్భవ- (దై - అము- దయియము) దయ్యము యౌవనమ్ తద్భవ-(జౌవనము- జవువనము)జవ్వనము ఇట్లీ పద్ధతిమిక్కిలి యరు దనఁదగును. (ఉ.420) ఇట్లీరి యరు దని గుర్తించిరి గానఁ జిం, వ్యాఖ్యలోవలె నిట ఐఔలకు అయియవ్వులయాదేశమును సూత్రమునఁ జెప్ప కుం టుచితముగా నున్నది. సూత్రమందలిబహుళపద మిట్టిస్థలములను సంగ్రహింప సమర్థమె కదా. దయ్యము జవ్వన మనుచో పిరిప్రక్రియ యుచితముగాఁ గానరాదు. దైయము, దయియము, (జౌవనము) జవువనము అనురీతిశబ్దములే గానరావు. 'కైక' యనుచో 'కయిక' పూర్వరూప మనుటలో నిబ్బంది యేమో విచారింపవలె. ఈయంశము పరిశీలనార్హము.

## కలుంగు-కల:

కలుగున కస్త్యర్థంబునందు లట్టు పరం బగునపుడు కల యగు' (104) ననుసూరిసూత్రమును వీరు అస్త్యర్థకంబును బ్రాప్త్యర్థకంబును (సకర్మక)నగు కలుగుధాతువునకు కల యనునాదేశము లట్పరకత్వమున నిత్యముగా నగు' (108) నని చూపిరి.

కల యనునాదేశము, నిత్యముగా ననురీతి పరులసూత్రములోని పదములు పూరిసూత్రమునకు వివరణప్రాయములే. ఇంత వీరిసవరణము "ప్రాప్త్యర్థకకలుగునకను" "కల" చెప్పుట.

సూరి అస్త్యర్థకకలుగుధాతువునకు మాత్రమే కల అనునాదేశమును విధించెను. కాఁగా ప్రాప్త్యర్థకకలుగున కీక్రిందిరీతిరూపములు సాధ్యములు కానేరవు. 'ఎఱుకఁ గలదె మగువ కెందు (ఆది.2.34) ఇది వడిఁ గలదు (ఆది.2.34) — (ఉ.420,వ్యా.సం.ప.1655,1659)ఇట సకర్మకత్వమును గుండలీకరణమున నుంచుటంబట్టియు అస్త్యర్థమున సకర్మకమును ప్రాప్త్యర్థమున సకర్మకము నై యుండ సకర్మకమునకు మాత్రమే యగు నని సూరి తలఁచినట్లు వీ రూహించిన ట్లున్నది.

ఎఱుకఁ గలదె యనురీతిప్రయోగములు బాల.సిద్ధములు గావా? "గుబ్బెత మట్టుత మిండత అస్త్యర్థకములె. (ఉ.తద్ధి.58) గుబ్బెత- ప్రశంసార్థము అగు కుచములు కలది (ఉ.309] అనఁగా గుబ్బలు గలిగియున్నది అనురీతిగా నది 'యస్త్యర్థకమె' కదా, అట్లె ఎఱుకఁ గలదు.ఎఱుక గలిగియున్నది- అనురీతివిగా నియ్యవి 'యస్త్యర్థకము' లగుట విరుద్ధమా? 'అస్త్యర్థంబున' అనుసూరిలక్షణముచే నీయవి. సాధ్యము లగుచున్న వని స్పష్టమే.

'అస్త్యర్థంబున' కనుటచే సత్పత్త్యాదు లగువర్థములు వాదింపఁబడుచున్నవి. పుట్టుట యనునర్థమున నీయాదేశము లేదు గదా. నాకాశ్చర్యము గలుగుచున్నది యనుచో నాకాశ్చర్యము కల దని కాదు. (ఇది యకర్మకమును) పుత్రులు కలుగుచున్నారు. మొ॥ ధనలాభము కలుగుచున్నది.ధనలాభము గల దన్న నీయర్థము గలుగదు.

క్రియా.21.22.సూ.చొప్పున నుదంతము కామింజేసి చు-ఉన్న (ఉన్న-ఫ) అనునవి రావు. క్రియా.20.సూ.చొప్పున ఉన్న లేదు గావున దివి రావు. ప్పరకత్వమున కలాదేశము నిత్య మగుటంజేసి 'ధనలాభము గలుగుచున్న

ది యున్నగుచోటులందు కలుగుచున్ + ఉన్నది అనురీతిని వర్తమానార్థక చువర్ణకద్వారమున రూపసిద్ధి నరయునది' (ఉ.421)సూరిసూత్రమును సవరించి 'ప్రాప్త్యర్థకము' చేర్చుటవలన నీయర్థము వీరిలక్షణమున నేర్పడినది. (ఇందుకై సూత్రమున బహుళపదమును జేర్చుటుంట కొంతనయమె.)

'ధనలాభము కలుగుచున్నది' యనుచో 'కలుగు' ప్రాప్త్యర్థకము. (ధనము ప్రాప్తించుచున్నది.) కావున వీరిమతమున కలాదేశము రావలసియున్నది. అందుకై మార్గాంతరము ద్రొక్కిరి. ఇంక సాధారణముగా లక్షణము ననుసరించి 'ధనలాభము కలదు' అని కావలె. దీనికి ధనలాభము కలుగుచున్నది యనునర్థ మున్నదా? కలదు'అనుచో నది అస్త్యర్థకమె(ధనము) కలుగుచున్నది యనుచో నస్త్యర్థకము కాదు (లభించు) గావున సూరిలక్షణముచే నీయర్థమునఁ గలాదేశము రానేరదు. కాఁగా 'కలుగు' అని యుల్లే యుండును. ఇట్లిది యుదంత మయియున్నది గావున లట్పరకత్వమున నున్నానుబంధాదులు కలిగి కలుగుచున్నది యన్నది సాధారణముగనే సూరిలక్షణముచే సిద్ధించుచున్నది.

ప్రాప్త్యర్థకము అని యందుకై వీరు చూపినఎఱుకఁగలరనురీతివి వీరిదే ఘైన్నలాంతరవివరణము ననుసరించి యస్త్యర్థకములె యనఁదగి యుండుటంజేసి యవి సూరిలక్షణముచే సిద్ధించుచునేయున్నవి. అందుకై వీరు 'ప్రాప్త్యర్థమును ప్రత్యేకముగఁ బేర్కొనుట కొందొకచో ననర్థకము నని వీరి 'కలుగుచున్నది' రూపసాధనమె నిరూపించుచున్నది. ఇంక నిట సూరి సకర్మకాకర్మకవివక్ష చేయనేలేదు.

"కలఁడు-కలరు (కలవాఁడు-కలాఁడు- కల్గఁడు,కలవారు- కలారు-కలరు) "[ఉ.420] ఇది యీశబ్దములచరిత్రను నిరూపించుట గావచ్చు. [కలదు-కలవు అనుచో నిట్టియూహ కవకాశము గానరాదు.] శాస్త్రమునందు కలుగు + డుక్ - కల్గఁడు కలుగు + రు. అని వీరిలక్షణము ననుసరించియుఁ బ్రక్రియ స్పష్టము. ధాతువిశేషణము లయినపుడు కలవాఁడు కలవారు

కలఁడు కలదు, అన్నవి క్రియాపదములుగా మాత్రమె శాస్త్రసిద్ధము లగును.

'ప్రాప్త్యర్థకత్వమందు -కలవు- కలను -కలము'-అనునవి ప్రాచీన భాషలో "లే" [ఉ.420] వని వీరినిర్ణయము. అందులకే యట్టివి నన్నయ భారతమందే యున్నను నవి "సంస్కర్తలు ప్రక్షిప్తములను జేసిరి. కాని యీయాలోటులందు కలదు అనుసాధురూపమె కవిప్రయుక్తము. (ఉ.421) కలదు సాధురూప మన- కలవు, కలను కలము అసాధువులా? లక్షణము సాధింపబడున్నను నసాధువు లగుట వింత. ప్రాచీను లిట్లు ప్రయోగింపలేదు గాన పరిష్కృతమున నివి యసాధువులా?

నీరము గల వేని- (అర.1.609) నీరము గల దేని అనునదే కవిప్రయుక్తపాఠము. నేరుపుగల నసుచు [హరి.పూ.5.247] ఇచట నేరుపు గల దనుచు అనునదే కవిప్రయుక్తము [ఉ.421] ఇట్లు కవిప్రయోగము లను దిద్దుచు నట్టివి ప్రాచీనభాషలో లే వన్న విశ్వసించు టెట్లు? [వ్యా.సం.స.1657] నిరాధారముగా నిట్టి వెల్లఁ బ్రక్షిప్తము లన నొప్పదు. ఎఱుకఁగలరు సాధువే. ఎఱుకఁ గలను సాధువు గాదు ప్రాచీనులమతమున.

ఈ రీతిని ప్రాప్త్యర్థమున వ్యతిరేకమునందు 'లేవు లేను- లేము. లేవది అనురూపములు లేవు" [ఉ.422] ఇట వరిప్రత్యయము లే దనఁదగును. 'లే' యాదేశము లే దన్న వరి ప్రత్యయపరకత్వ మంగీకృత మై 'కలుంగు వరి' యనునవరూప మేర్పడవలసివచ్చును.

అంత ఎఱుక లేనె (అర.1.231) లేనె, లేనిదానవా? ఇట అంత ఎఱుక లేదె అని కవిప్రయుక్తపాఠ మనఁదగును. నిలుపు లేవ (ద్రోణ.5.326] నిలుపు లేద అనియె కవిప్రయుక్తపాఠ మనఁదగును. [వ్యా.సం.స.1659] ఈరీతిని కవిప్రయుక్తములుగా వని దిద్దుటచేతనె లేవు లేను లేము అనునవి లేకుండఁబోయిన వనవచ్చు. ఇటఁ గూడ మతిలే దైరి [భీష్మ.1.227] లావులే దైరి [అర.2.152] [ఉ.422, వ్యా.సం.స.1659]

అనురీతివి సాధువులె. ఎఱుకలేను, నిలుపు లేను అనురీతి వసాధువులు ప్రాచీనులమతమున.

ప్రాచీనులు కలవాఁడను— కలాఁడను— కలవాఁడు— కలఁడు॥ మున్నగురీతిని దచ్ఛబ్దవకారవాకారలోపమును బ్రయోగింతురే కాని ప్రాప్త్యర్థక కలుగుధాతుస్థలమున కలాఁడను- కలాను- కలను —— ప్రయోగింపరు. (ఉ.411, వ్యా.సం.స.1657] ఇదియుఁ జరిత్రయే యైయుండును. తచ్ఛబ్ద వాకారలోపము వీరును విధింపలే దిట.

నన్నయతచ్ఛబ్దవకారము గూడ లోపింపజేయక పోఁగాఁ దిక్కన తచ్ఛబ్దవకారమును లోపింపఁజేయ నాపిదపఁ దచ్ఛబ్దమే లోపించిన దనిరి. అవుఁ గాక. అస్త్యర్థమున నన్నయయే కలఁడు కలరు అని ప్రయోగించె ననిరి గదా. తచ్ఛబ్దవకారమె లోపింపఁజేయని నన్నయయుఁ దచ్ఛబ్దమునకే యిట లోపము చేసెనా? తిక్కనాదు లస్త్యర్థమున కలవు- కలను- కలము- ప్రయోగించె ననిరి. (ఉ.421) తచ్ఛబ్దవకారము మాత్రమె లోపింపఁజేయు తిక్కన ఇటఁ దచ్ఛబ్దమునకే కాక (కలాఁడను) డకారాదులకును లోపము చేసెనా? అస్త్యర్థవ్యతిరేకమున లేను లేవు లేరు మున్నగునవి ప్రాచీనులచే ధారాళముగాఁ బ్రయోగింపఁబడిన(వ్యా.సం.స.1659) వనిరి. ఇట్టియెడల బ్రాప్త్యర్థమందలియట్టిప్రయోగములను గవిప్రయుక్తములు గా వని వీరు దిద్దుట యేల?

కల్గఁడు కలరు లేను ఇత్యాదినన్నప్రయోగములనుబట్టియే యిటఁ దచ్ఛబ్దలోపప్రసక్తి (శబ్దశాస్త్రమున) లే దని నిర్ణయింపవచ్చును. ఇట్లే తిక్కనాదులప్రయోగములందును. ప్రాచీనులయాప్రయోగములంగూర్చి వరులవారిసిద్ధాంతమునకుఁ దగినయాధారము లేదు.

మొత్తముపై సూరిలక్షణము సూక్తము. ప్రాప్త్యర్థకమును వీరు వేఱ ప్రస్తావించుట యనవసరము ననర్థకమును.

## త్రర్థము-కల :

త్రర్థంబునం గలాదేశంబు విభాష నగు (105) ననుసూరిసూత్రమును వీరు 'తద్ధర్మార్థద్యోతకవిశేషణస్థలమునందును నర్థద్వయమునందును కలుగుధాతువునకు కల అనునాదేశము విభాష నగు' (109) అని చూపిరి.

'తద్ధర్మార్థద్యోతకవిశేషణస్థలమునందును' అనువీరిసూత్రభాగము 'త్రర్థంబునన్' అనుసూరిసూత్రదళమునకు వివరణమె. (చూ. క్రి.54)

'కలుగున కస్త్యర్థంబునందు' అనునర్థము పూర్వసూత్రము ననుసరించి యిట సిద్ధించును. ఇట్లే వీరిసూత్రమునను 'అస్త్యర్థంబును బ్రాప్త్యర్థంబున నగుకలుగుధాతువునకు' అన్నది పూర్వసూత్రమునుండి యనువృత్తి యుండును. కావున వీరు 'అర్థద్వయమునందు కలుగుధాతువునకు' అని చెప్పుట స్పష్టతకై వివరణముగా ననియె చెప్పవచ్చును.

అర్థద్వయమునందును అనఁగా బూర్వసూత్రమున వీరు చెప్పిన, అస్తి ప్రాప్తి అర్థములు రెండు. అందుఁ బ్రాప్త్యర్థము వేఱ చెప్పనవసరము లే దనియుఁ గొందొకచో ననర్థకము ననియుఁ గుర్తించితిమి. అట్లే యిట 'ధనలాభము కలుగువ్యాపారము' అనురీతిగా నిచ్చోటకలాదేశము లేని రూప మొకపక్షమున (విభాష యనుటచే) నగును. కాని యీయర్థమున 'ధనలాభము గలవ్యాపార' మనియు నుండవలసివచ్చుట యనర్థమె. విభాష కిటఁ గలాదేశ మసలు లే దని వ్యవస్థ చేసికొనవలె. ప్రాప్త్యర్థమును జెప్ప నేల? ఇట్లు నియమింప నేల?

ఇక్లై వీరిసూత్రమున "అనునాదేశము" అన్నదియు స్పష్టతకె. వివరణాత్మకముగా నున్న యీపదములు లేనిసూరిసూత్రమునం దెట్టియుప సిద్ధాంతమును లేక సూక్తమైయున్నది.

"ఎడిమెడులకు లోపం బిట నిత్యంబు" అనివివరించి సూరి కలవాఁడు కలుగువాఁ డని యుదాహరించె. కాఁగా కలుగుపై [కలాదేశము లేనప్పుడును] ఎడిమెడులకు నిత్యముగా లోపము చెప్పె ననవలె. దీనింగూర్చి

సూరి కలుగు అనుదానిపైని [నః] సైతము ఎద్యొడులు నిల్వ నని వచించుట పొరపాటు. ఏర్పడ జగములుఁ గ్రమ్మఱ గలిగెడునప్పుడు" [అర.4.237] సూరి కలుగుధాతువునకుఁ దద్ధర్మాద్యర్థకత్వమున కలాదేశమును డిక్కున ప్రయోగించె నని చూచుకొనలేదు". [ఉ.421] [వ్యా. సం.స.1658]

ఎడిమొడు లనరా దని తలఁచినవా రగుటంజేసి యుఁట వీరెద్యొడు లని యుందురు. 'సిద్ధద్వంద్వము గాన ఎద్యొడుల కని వచించుట యుక్తము. (వ్యా.సం.స.1658) ఎడిమొడు లనుట నిర్దుష్టము ((క్రి.54) పై ప్రయోగమును బట్టి కలుగుపై ఎడిఎడులు లోపింపకుండుట గల దని తలఁచిరి గావున వీరు సూరికి భిన్నముగా 'కలాదేశముమీఁద ఎద్యొడులు నిల్వ' (ఉ.421) వనిరి. అనఁగా న స్త్వర్థమునను కలిగెడువాఁడు (కలిస్నవాఁడు) అనురూపము గల దా? లోప మనునదే వీరు చూపిరి. [వ్యా.సం.స.1658] పై ప్రయోగ మట్టి దా? దీనిని సూరిలక్షణము సాధింపఁజాల దనుట సరి గాదు.

'లోపం విట నిత్యం' అనఁగా న స్త్వర్థమునందే యనుట స్పష్టము. పై ప్రయోగమున న స్త్వర్థ మున్నదా? జగములు గ్రమ్మఱఁ గలిగెడునప్పు డనఁగా జగములు సంభవించునపుడు అని భవన మర్థము. ఆ స్త్వర్థముగామిఁ జేసి సూరివివరణముచే నిట లోపము నిత్యముగా రావలసినయవసర మేమి? క్రి.55 ననుసరించి [బహుళము] విభాషగా నగును. కావున నీప్రయోగము సూరిలక్షణముచే సాధింపఁబడునదే.

ఇంకవీరిసమన్వయమునను దోషము గమనార్హము. వీరివివరణమును బట్టి కలుగుపై ఎడిమొడులు గల వనుదాని కిది లక్ష్య మైనపుడు మాత్రమె లోపము నిత్య మని యుద్దేశ్య మగును. అనఁగా నిటఁ గలాదేశము గల దన్నమాట. జగములు తిరిగి ఏర్పడునప్పు డనునర్థమున 'జగములు గల యప్పు' డని యగునా? సూరిమతమున నిటఁ గలాదేశమె లేదు. కలాదేశము గలచోటఁ గదా లోపనిత్యత. కావున నీ రిటఁ గలాదేశము గల దని భావిం

చుట సమంజసము గాదు.

పిదప నీ రీతిఁ దిక్కన ప్రాప్త్యర్థమునఁ గలాదేశమును బ్రయోగించుటను సూరి చూచుకొనలేదనుటలోఁ బై యెఱ్ఱయ ప్రయోగమునఁ బ్రాప్త్యర్థము గల దని తలఁచిరా యనిపించు.(జగములు ప్రాప్తించునపుడు?) ఇట నాయర్థము గుదురకపోవు టట్లుండి దీనివలన వీరు ప్రాప్త్యర్థమునఁ గలాదేశము చెప్పుట కవిప్రయోగవిరుద్ధ మనవలసియుండును. జగములు గలిగెడునప్పు డనునర్థమున జగములు గలుగునప్పు డని యుండదు గదా.

సూరి చూచుకొనలేదన్న తిక్కన ప్రయోగమును సం-లో నీ రీతిఁ జూపిరి. "ప్రాప్త్యర్థకకలుగుధాతువును నిష్ఠార్థకరూపములతోఁ బ్రయోగ దృష్టమవుచున్నది. దృఢబుద్ధి గల్గుము (శాంతి.2.253) తిర మైననడవడిం గలపరిణతచిత్తుండు (శాంతి.5.189)"- (వ్యా.సం.ప.1658) 'కల్గుము' అనునది యిట లక్ష్యమె కాదు, నడవడిం గలపరిణతచిత్తుఁ డనుచో(ఎటుకఁ గలదె -యనురీతిగా) నడవడిని గలిగియున్న -అనుతీరుగా నియ్యది యుత్పత్త్యర్థకముగా సుసమన్వితమగుచునే యున్నది. సూరి చూచుకొనకపోవు టేమి? సూరి ప్రస్తావింపనిసకర్మకాకర్మకభేదమును బ్రభావము చేసికొని వీరు భేదమును గల్పించినట్లు తోఁచుచున్నది. అది యనవసరము.

కాక కలుగున కెల్ల యర్థములయందును (అర్థద్వయమందును?) నీకార్యము ముద్దేశించి రన్నది యింకను నసంగత మని పై వారియుదాహరణమె నిరూపించును. (వీరితదుపరిసూత్రమునుబట్టి యెల్ల యర్థము లని యూహింపవచ్చును.)

కాఁగా వీరు 'కలాదేశముపై నెడ్యెడులు నిల్వ' వని యుత్పత్త్యర్థమందును 'కలుగు'పై ఎడియెడులు నిల్వ వని చెప్పుట సరి గాదు. అయోధ్యఁ గలిగెడువాఁ డనురీతి కవిప్రయోగమును బ్రదర్శించినఁ గాని యిది విశ్వసింపరాదు.(ఉత్పత్త్యర్థమునందుఁ గలుగువాఁ డనురీతియు నరుదేమో యనిపించును. పరిశీలింపవలె.)

వీరు 'ఏడ్వఁడులు విల్వ' ననుటలోనియసౌచిత్యములను క్రియా.55 సూత్రముకడ గమనించితిమి.

## కలుగు-లే :

'ఆ ప్త్యర్థంబున లజిమికసివడివర్ణకంబులు పరంబు లగునపుడు లే యగు' (106) అనుసూరిసూత్రమును 'కలుగునకు లజిమిజికజినిజివడి ప్రత్యయములు పర మగునపుడు లే అనునది సర్వాదేశ మగు' (ఉ.110) అని చూపిరి.

సూరిసూత్రమందలి 'ఆ ప్త్యర్థంబున' అను మొదటిదళమును తొలఁగించిరి. దీనింగూర్చి సూరి ప్రాప్త్యర్థకత్వమున వ్యతిరేకమందు లేఅనునాదేశమే లే దనుకొనుట పొరపాటు -మతి లేర్దెరి. (శీమ్న.3.227) —(ఉ.42: ఆప్త్యర్థ మనుటవలన నిట్టిరూపములా గ్రహింపఁబడ వని వీరు తలఁచుటచే పొరపాటని పైని గుర్తించియుంటిమి.

'కలుగునకు' అని యిట సామాన్యముగాఁ జెప్పిరి. ఆప్తిప్రాప్త్యర్థములు రెండు మాత్రమె కలుగుధాతువునర్థములా? అయిన వీ రింతకుముందు సూత్రమున 'అర్థద్వయమందును' అనుట యేల? దానికి ముందుసూత్రమున ఆప్త్యర్థప్రాప్త్యర్థములు రెండింటిని పేర్కొను టేల? 'అర్థద్వయమందు' అనునది పూర్వసూత్రమునుండి యనువృత్త మగు నన్న 'కలుగునకు' అనునది కాదా? సూరి 'కలుగునకు' అనకున్న నిట్లు గాలేదా? అనువృత్త మగు నని వీరు సం.లో వివరించిరి కదా.

కాఁగా పీఠికసూత్రమున 'ఆప్త్యర్థంబున' అనరా దనుకొంటియు, కలుగునకు అని చేర్చుటయు సరి గావు. "ఆప్త్యర్థంబున" అన్నసూరిలక్షణముచొప్పున 'నీమాటకు సంతోషము గలుగదు' ఇత్యాదులలో సంతోషము దనరీతిగా సీకార్యము గాదు. ఇట్లై కలుగమి, కలుగక, కలుగని -అనురీతి

రూపములు భాషలో నుండుట కవకాశము గల్గుచున్నది సూరిలక్షణము నను సరించి కలుగక (ఉ.౪౩౩) అని వీరును చూపిరి. ప్రస్తుతసూత్రమున వీరు కలుగునకు సామాన్యముగా "లే" యనునాదేశము చెప్పిరే. మఱి కలుగదు, కలుగక యనురీతిరూపము లేయర్థమం దైనను గలుగుధాతువునుండి యగుట యెట్లు? వేఱొక ధాతువునుండి యెట్లును గావు గదా.

"అస్త్యర్థంబున" కనుదళమును దొలఁగించుట యనర్థకము.

సూరి పిదప "లజిమిగనివడి" యనఁగా వీరు "లజి మిజి కజి నిజి వడి" యని మిగనిప్రత్యయములు కూడ జిత్తోఁ జేర్చినట్లు కేవలము స్పష్టతకే యనఁదగును. జిత్తులు గాని మిగనిప్రత్యయములు లేవు గదా. "లజి" యనుచో సూరియు 'జి' చూపెను. జిత్తు గాని లఁ ఉట్లు కలదు గావున నట నతివ్యాప్తము గాకుండుట కై దానిని జిత్తుగా నిర్దేశించుట యవసరమె. కాఁగా సూరి 'మిగని' ప్రత్యయములు జితో నిర్దేశింపకుంటలో నెట్టియపసిద్ధాంతమును లేమి నది సూక్తము. అట్లైన వీనిని సూరి వర్ణకము లనఁగా వీరు "ప్రత్యయము" లనుటయు.

సూరి "లే యగు" ననఁగా వీరు "లే యనునది సర్వాదేశ మగు" ననిరి. (అనునది) సర్వాదేశ మని వీరు విశేషముగాఁ జెప్పినది యనవసరము. అగు వచ్చు-- (-ఉ.క్రి.౧౯౫, బాల.క్రి.౧౧) మొదలగుచోట్ల కా,రా, ఇత్యాదులవలె, నిట 'లే' యనునదియు ననేకా ల్లగుటచే సర్వాదేశముగనే వచ్చును. "అనేకాల్శిత్సర్వస్య" యని గదా సంప్రదాయము. దీనివలన "కారా" ఇత్యాదులు వీరిగ్రంథమున సర్వాదేశములు గా వేమో యను సందేహమునకు నవకాశము గల్గు. కాఁగా వీరు లే(అనునది) సర్వాదేశ మనుట సూత్రగతవ్యాఖ్యయే కాని విశేషము గాదు.

ప్రాప్త్యర్థక లేవు, లేను, లేము, అనువానింగూర్చి పైని గుర్తించితిమి.

సూరిలక్షణము సూక్తము.

## ఒల్లఁబాటు :

బాల. క్రి. 107. సూత్రమును దాఁకా పట్ల గ్రహించిరి. (త. 111)

వ్యతిరేకభావార్థమున ఒల్లమి అనుదానికిఁ బర్యాయముగ ఒల్లఁబాటు అనునది యగు నందురు. కాని ఒల్లఁబాటు అనుశబ్దములో నిపూర్వావయవము ఒల్లన్ అనుభావార్థకనిపాత మనుట యుక్తము.' [త. 129] ఒల్లమి. కొల్లఁబాటని ప్రయోగింపఁబడియెడి' ననుసూరివివరణమును దిరస్కరించుచుండి రేమో యని వీరివాక్యారంభ మనుమానింపఁజేయును. 'ఒల్లఁబాటు'కు 'ఒల్లమి' యనునర్థమును దిరస్కరింపమి సూరివచనముల విరోధము లేదు. పూర్వావయవ మేదో సూరి యిటఁ జెప్పకనలేదు. వీరు విమర్శించినయాయంశము ఒల్లమి + పాటు ఒల్లఁబాటు అనురీతిని శ.ర., సూ.ని.లు పేర్కొన్నవి. [వ్యా.సం.ప. 1881] కోశకారులవచనముల వీరు విమర్శించి రన్నమాట. "తలంబ్రాలు మొదలగుసమాసంబుల ద్రుతమునకు లోపము లేదు" [సంధి. 26] అనుసూత్రమునొద్ద ఒల్లఁబాటు అని సూరి యుదాహరించుటంబట్టి ఒల్లను + పాటు అనువానికి సమాసము గాఁగా నందు ద్రుతము లోపింప లే దని సూరిమతము స్పష్టమె. వచ్చులవారు దానిని స్పష్టముగా వివరించుట యుచితమె.

## చుద్_తకారము :

'చువర్ణంబుతోడ దుగ్ధకారంబు తకారం బగు' [118] ననుసూరిలక్షణమును [క్రి. 90. తోఁ గూర్చి] యిట్లు విస్తరించిరి. "తద్ధర్మాద్యర్థకము నుభయప్రార్థనాద్యర్థకము నగుదుక్కు తోఁగూడ నాగమతద్భిన్న చువర్ణములు రెండును తువర్ణముగా మాఱును. ---[త. 94 సూ.]

సూరిసూత్రమందలి 'దుక్' అనుమాటకు వ్యాఖ్యానమే వీరిసూత్రములోని "తద్ధర్మాద్యర్థకము నుభయప్రార్థనాద్యర్థకమునగుదుక్కు..." అనుభాగము. ఉభయప్రార్థనమున వీరు సూరికంటె విశేషముగా దుగాగమము చెప్పుకొనుటనుబట్టియు నిట్లు పేర్కొని రేమో. అయ్యు సూత్రమున వ్యాఖ్యాన మేల? ఈ రెండుచోట్ల ప్రస్తావించుటకు వే ఱొకచోటి దుక్కు గ్రహింపఁబడకుంట

ప్రయోజన మంద మున్న నపలు పే తొకచో దుక్కే విధింపఁబడలేదు. ఇంక నిది వ్యాఖ్యానము గాక యే మగును? "పోవునకు దుక్కు త్తులు" అనుసూత్రమున వీరు సూచవలెనె 'దుక్' అని సామాన్యముగనె చెప్పినను విని రెండును గ్రహింపఁబడవా? [పోదువు-పోదము]

ఉభయప్రాప్త్యాద్యర్థక మనుచోనాదిశబ్దప్రయోజన మేమో వీరు వివరింపవలసినది. [ఉ.క్రి.37] ఆదిశబ్దముచే నెది యే నర్థవిశేషము చెప్పఁబూనినను నట దుక్కువిధానము వెదుకవలె.

మొత్తముపై సూరి "దుక్"శబ్దము నిర్దుష్టమె. కొంత లాఘవమును గలిగినది. [చూ.ఉ.క్రి.37]

సూరి "చువర్ణంబు" అనఁగా వీరు 'ఆగమతద్భిన్న చువర్ణములు" అనిరి. తద్భిన్న మన నాగమేతర మయిన దెల్ల గ్రహింపఁబడుచునే యున్నది. ఆగమ, ఆగమేతరచువర్ణము లెల్ల గ్రహింపఁబడఁగా నింక నిటఁ బ్రసక్తము గానిచువర్ణ మెక్కడ నుండును. ఎల్లచువర్ణములయెడ నీకార్య మగునపుడు ఆగమ-తద్భిన్న వివక్ష యేల? సూరి యాగమ మని గాని యన్య మని గాని పేర్కొనలేదే. [ఇంకను నిలుతురు అడతురు అని రెంటి నుదాహరించెఁ గూడ.] కాఁగా నాగమతద్భిన్నము లన్నదియు వివరణప్రాయమె. కావున సూరి "చువర్ణంబు" అని సామాన్యముగాఁ జెప్పుట సముచితమె కదా. సూత్రమున వ్యాఖ్యాన మేల?

సూరి "చువర్ణంబుతోడ దుగ్గకారంబు తకారం బగు" నని "చుద్" అనుదానికి "త"కారమును జెప్పఁగా వీరు 'దుక్కుతో చువర్ణములు తువర్ణ మగు' నని తిరుగవేసి చెప్పిరి. సూరిలక్షణమున నపసిద్ధాంత మేమి?

చుద్-కు 'త'కారపుఁబొల్లు సూరి విధింపఁగా వీరు 'చుదు'కు 'తు' విధించిరి. ఇందు విశేష మేమి? ఆదేశముగాఁ జెప్పినతువర్ణమునందలి యుత్వ మంతకుముందే "చుదు"లోనె యున్నది. ఉన్నయుత్వమును

మణుల నాదేశింప నేల? భేదము గల "త"కారవ్యంజనమును మాత్రమె చెప్పినసూరిలక్షణమె సముచితము.

కావున నీసందర్భమున వీరిలక్షణము కంటె సూరిసూత్రమె సముచితము.

ఇంకఁ బిదప "ఇట్టియెడల ద్విరుక్తచువర్ణంబు ద్విత్వతువర్ణం బగు (ఉ.క్రి.81) ననిరి. ఇదియు(వీరి)సూత్రమందలిభాగమె. "ఇట్టియెడల" ననుదానికి దుక్కుతోడి(-ద్విరుక్తచువర్ణము-) అనియర్థము చేసికొనవలె. లేనిచో ద్విరుక్తచువర్ణమునకు మాత్రమె ద్విత్వతువర్ణమై మీఁదిదుక్కు అట్లే యుండి మెచ్చుదురు. మెత్తుదురు అని యగును. [దీని కర్థము మెత్తురని గమనింపవలె.)

ద్విరుక్తచువర్ణ మనఁగా ద్విరుక్త మగుచువర్ణము. అనఁగా "చ్చు" అని యుండును. వచ్చు అనుచో చకారమె ద్విరుక్తము గాని "చు" ద్విరుక్తము గాదు. [ఇట్లు ద్విత్వతువర్ణమును] పలలోర్పిస్తుండుతోడుః. ఉపవర్ణ సలలువర్ణంబులకు ననురీతిని లాక్షణికులు లిట్టిసందర్భమును పేర్కొనుట గమనింపవచ్చును. వచ్చువారు నిట నట్టిమార్గ మనుసరింపవలసినది.

"వచ్చుదురు" అనురీతిస్థలమున "చ్చుదు" అనుదానికి "త్తు" అగు నని వీరు చెప్పఁదలఁచినయర్థము సూరిలక్షణముచే సిద్ధింప దనియే వీ రిట్లు సూత్రించిరా?

క్రి. 81సూత్రమున వీ రటునిటుగా మారివచ్చే చకారమునకు తకార మగు ననిరి. "ద్విరుక్తచకార- తెప్పించి"- [ఉ.410] అని యుదాహరించిరి. అటనే ఇచ్చు-ఇప్పించు- తెచ్చు- తెప్పించు -అనియుఁ జూపిరి. అట మణుల ద్విరుక్తచకారమునకు ద్విరుక్తపకారము విధింపలేదే. అట నెట్లు పత్వ మయినదో ఇట తత్వ మట్లు గాదా? ఇట్లె 114-సూ.చో చొచ్చు-

చొత్తెంచు. కావున నిది వివరణమం దుండఁదగినయంశము. లేదా యిట్టి సందర్భము లెల్లవానిని సంగ్రహించుచు ద్విరుక్తస్థలముల నాదేశము ద్విరుక్తముగా నగుట సామాన్యముగా వేఱుగా సూత్రించు టేని స్పష్టత కొప్పుఁగాని యిట్టిస్థితి పెక్కెడల నుండ నొక్కచోఁ బేర్కొనుట మిగిలినచోట్ల విరోధము గల్గదా. ఇట నిట్లు చెప్పుటచే నెప్పించు ఇత్యాదులలో 'ప'కార మొక్కటె యగు నని చెప్పవలసివచ్చుట విరోధము గాదా. కా దన్న నివయులవారివిధానము వ్యర్థమే.

## చేతురు :

సూరి కూఁతురిని ఇత్యాదులవలె చేతురు-కోతురు ఇత్యాదుల నసాధువు అనఁగా వీ రీసూత్రమున "కవిత్రయాదీతరప్రయోగములందు చుదు అనుదానితోఁబాటుగ యుదు అనునదియు పై కల్పికంబుగాతువర్ణంబును ..నగును (త.క్రి.౫౯సూ.) అని వీనిని సాధించిరి.

కవిత్రయాది యనుచో - నాదిశబ్దార్థము కవిప్రయోగానుగుణముగ గ్రహింపవలెను. బా.శ.నన్నయతిక్కనలప్రయోగముల నిట్టిస్థితిని ప్రస్తావించినది. (పుట.౮౫)

ఈసూత్రమున వీరు 'చుదుతోఁబాటుగ'ననుట కేవల మనవసరము. చుదు కీకార్య మింతకు ముందు విధింపఁబడియే యుండఁగా మఱల జెప్ప నేల? కవిత్రయాదీతరప్రయోగములలో 'యుదు'కే గాని 'చుదు'కు 'తు' లే దని తలంపకకుండుటకా? 'యుదునకును' అనుచో సముచ్చయార్థమును జెప్పుకొన్న నైయర్థము సిద్ధింపదా?

'చుదు'కు 'తు' చెప్పినట్లే "యుదు"కు తు చెప్పిరి. కాని యుత్వ మాదేశింప నేల? "యుద్" అనుదానికి మొత్తమునకు తకారము విధింపఁ జాలు.

కవిప్రయోగములం దెడ నెడఁ గన్పించునిట్టివానిని సూరి యసాధువు లన్నను సాధించు టుచితమే.

కాని కవిత్రయాదీతరప్రయోగములం దైనను సామాన్యముగా "వైకల్పిక" మని చెప్పుట యుచితము. ఇట్టిస్థితి యెల్లెడల 'యుఁడ్' అను దానికి వికల్పమున్నదనిన ప్రయోగప్రసిద్ధి లేమింజేసి యట్లు గాక యువర్ణంబుతోడి దుగ్ధకారంబునకుం గొన్నియెడల తకారంబు చూపట్టెడి నమరీతిని జెప్పుట ప్రయోగానుగుణ మని తోఁచుచున్నది.

## ఘటకక్రియలు :

స్వార్థవ్యతిరేకములందలికొన్ని క్రియలతుదిని జేరిన అగు—పోవు మున్నగు వానిస్వార్థికవ్యతిరేకరూపములు వివిధము లగువర్థవిశేషములతో ఘటకము లగును. కావుననే యవి ఘటకక్రియ లనఁబడును. అట్టిచోటులందు వివిధము లగునాగమాదేశలోపాదులును గల్గును. అట్టిజంటలీవలను గొన్ని సందర్భాంతరములందు సూత్రింపఁబడెను. ఇంకను సూత్రింపఁబడును. (ఉ. క్రి. 112) వయ్యలవారు దీని నొకసూత్రముగాఁ జెప్పిరి. కాని యిం దొలక్షణములు గానరావు. దళప్రయోజనమునుగూర్చి పరిశీలించుట వ్యర్థము.

పిదకొన్నిచెప్పితి మనియుఁ గొన్ని చెప్పఁబోవుచుంటి మనియుఁ జేర్చి విరి. కాన నిందుఁ జెప్పిన దేమియు లేదు. అట్టిచోటులందు అనునది మొదటికొని మిగిలిన దెల్ల సూత్రమున నుండఁదగినది గాదు.

'క్రియలపై నగుప్రత్యయములు చేరి యర్థవిశేషఘటకము లగునేయవి ఘటకక్రియ లనంబడు' నని చెప్పెడుభాగము మాత్రము సూత్రముగా నుండఁదగినది. నూపి 'పేర్కొఁబనియాఘటకక్రియలను' వీరు వి.వి. (భూగమి క్రియయోరస్తే ఘటకాఖ్యా విరుచ్యతే) ననుసరించి ప్రస్తావించి రనఁదగు.

ఈ చిట ఘటకక్రియలుగాఁ జూపినవానిం బరిశీలించినను వీనిప్రయోజనము స్పష్టము గాకున్నది.

తెల్లగా, చెన్నగా మొ॥ క్రియావిశేషణములు గూడ ఘటకక్రియలుగాఁ జూపిరి. 'కొన్ని క్రియలతుదిని'—అని చెప్పినవీరిలక్షణమున కివి విరుద్ధములు.

ఏమిర- మొదలగునిచోట్లఁ బూర్వావయవము క్రియకాదు గదా. చదువవయ్య చదువరెఇత్యాదులలోఁ బైని జేరినది క్రియ కాదు. వీరిసూత్రము పైనిజేరునవి క్రియ లని చెప్పు. మఱి యివి ఘటకక్రియలుగా నెట్లు చెప్పిరి. చేయుచున్నాఁడు మొ॥ వర్తమానార్థకక్రియాపదములు, చేయఁగలఁడు మొ॥ భవిష్యదర్థకములు, చదువుకొనుచు. మొ॥ ఆత్మనేపదార్థకములు, చేయఁబడును మొ॥కర్మార్థకములు, తెలియఁజేయును మొ॥ ప్రేరణార్థకములు. ఇట్టివి ఘటకక్రియ లనుటలోఁ బ్రయోజన మేమి?

ఇటలలాద్యంతముల వివరణము వీరే యీవ్యాకరణమునఁ జెప్పిన ప్రక్రియకు విరుద్ధము. ఉదాహరణమున కొక్కటి చూతము.

చేయఁగలఁడు- 'భావ్యర్థమున నుఙ్యంతము పైని కల్గుధాతువు చేరును.' —(ఉ.424) చేయఁగలఁ డనుచోఁ బ్రక్రియను వీ రిట్లే చెప్పిరా? కలఙ్యనుబంధము అత్వనుగాగమాదులును విహితములా. చేయఁగలఁడు చేయఁగలిగెను చేయఁగలుగఁగలఁ డనురీతి నగునా? ఇట్లె చేయఁబడును మొ॥

చేయఁగన్-చెప్పఁగన్- అనుచో 'నుఙ్యంతములపై ననుప్రయుక్తములై కాన్-కన్ అనునవి (ఉ.427) అనుప్రయుక్తము లర్థవిశేషమునీయు నని వారె యట వివరించిరి. ఇట్లివి విశేషార్థఘటకములు గాకుండ నివి ఘటక క్రియ లెట్లయినవి? అగుచెంచు మొదలగున విట్టియనుప్రయుక్తస్థలములె.

ఇట్లే వీరినిరూపణము మిక్కిలివివాదగ్రస్తమై వారిలక్షణములకె విరుద్ధముగా నుండుట గుర్తింపవచ్చును.

'ఉభయత్రాపి భవతి దన్యా తు వ్యతిరేకిణీ' యని యధర్వణుఁడు చెప్పఁగా వీరు పోవు స్వార్థరూపమును గూడ నధర్వణవచనమునకు దమ వ్యాఖ్యకును (వ్యా.సం.న.1663)విరుద్ధముగా చేయఁబోవు అనురీతిగాఁజూపుట విశేషము. సూరిప్రభృతులు మాత్ర మధర్వణసమ్మతికి విరుద్ధముగాఁ జెప్పరాదు.

ఈ విరోధ మట్లుంచి ఘటకక్రియాభేదకల్పనమువలన శాస్త్రమున నెట్టిప్రయోజనమును గానరాదు. వీరును వివరింపలేదు. శబ్దపల్లవము లెట్లును బేర్కొనఁబడుటంజేసియు సూరి ఘటకక్రియలను బ్రస్తావింపలేదని గుర్తింపవచ్చును.

ఘటకక్రియాకల్పన మనవసర మనియే యిప్పటికిఁ దోఁచుచున్నది.

## తెంచు :

బాల. క్రి. 109. సూ. నట్లు గ్రహించిరి. (త. 113సూ.)

'తెంచుధాతు వగ్వాదుల కనుప్రయుక్తం బగు నగుచో నుత్వంబు వయిని దానిదకారంబు తకారం బగు' (110) అద్దానికి ముత్తు పరం బగు నపుడు తేతేరు లగు (113) ననుసూరిసూత్రములను గలిపి 'తెంచుధాతు వగ్వాదుల కనుప్రయుక్తం బగు, ముత్తు పరం బగునపుడు తెంచునకు తేతేరు లగును' (త. 114సూ) అని చూపిరి. సూరి "అద్దానికి" అన వీరు 'తెంచున' కనుట స్పష్టతకే. ఇంక అగ్వాదులకు (110) అరుగ్వాదులకు (111) ననుప్రయుక్త మైన తెంచునకే తేతేరు లగు నని "అద్దానికి" అనుసూరిపలుకు స్పష్టము చేయు. తెగుధాతుప్రేరణరూపమున కీకార్యము లేదు. వీరు తెంచున కని సామాన్యముగాఁ జెప్పినను వీరిసూత్రముపూర్వార్థమునుబట్టి అగ్వాదుల కనుప్రయుక్త మైనతెంచునకె తేతేరు లగు నని గ్రహింపవచ్చును. సూరిలక్షణమున నపసిద్ధాంతము లేదు గదా.

సూరి 110సూత్రమునందలియుత్తరార్థమును వేఱు చేసి వీరు "తత్వం బుపైని తెంచుతకారము దకారం బగు" (త. 115సూ) అని చూపిరి. ఇటఁ గూడఁ బ్రకరణమునుబట్టి యనుప్రయుక్త మగుతెంచుననే యని గ్రహింపవచ్చును. వీరు "తెంచు" అని మఱల నుచ్చరించుట స్పష్టతకె.

ఇట వెల్లముదల నుత్వంబుపయిని తకారము దకార మవుటచేతను తేదేరు లగుట ముత్పరకత్వమునవే కావునను, వడిముడికార మగుదత్వము నిటనే చెప్పి విశేషస్థలములలోనికార్యమును సూరి వేఱుగ సూత్రించు టుచితమె. వరుచిగారు ఈసూత్రక్రమము మార్చుటనుబట్టి సూరిలక్షణమున నప సిద్ధాంత మేదో యున్న దని భ్రమింపరాదు.

## అరుంగుదెంచు :

'ఆభ్యాగతి నరుగ్వాదుల కయ్యెడి యనుప్రయుక్తం బగు నగుచో గువర్ణంబు విభాషను లోపించు (111) ననుసూరిలక్షణమును వీరు "అరు గ్వాదులకు తెంచు పరం బగునపుడు గులోపంబు విభాషన గు ణినిని ప్రాచీను లాగమనార్థమందె వాడుదురు" (ఉ.166సూ.) అని చూపిరి. పూర్వసూత్ర మందలిఅగ్వాదులలోనె వీరు అరుగు, ప్రభృతులను గూడఁ జేర్చిరి. కాన నిట గులోపమును వర్ణభేదమును మాత్రమె సూత్రించిరి. అగ్వాదులకు స్వా ర్థమునందె చేరు "తెంచు"ధాతు వరుగ్వాదుల కర్థవిశేషమునందుఁ జేరుటను బట్టి సూరి దానిని వేఱుచేసి చెప్పుట సముచితముగా నున్నది. అగ్వాదుల లోఁ జేర్చినను నర్థవిశేషమునుబట్టి యరుగ్వాదు లనుపగణము చేయక వరుచిగారికిని దప్ప లేదు. అయిన సూరిలక్షణమున నేమి యపసిద్ధాంత మున్న దని వీరు మార్చిరి.

సూరి 'ఆభ్యాగతిని' అనుప్రయుక్తము చేయ వీరు ముం దనుప్రయు క్తము చేసి ప్రాచీను లర్థవిశేషమునఁ బ్రయోగించుటను జెప్పిరి. ఇట నర్థ విశేషము 'తెంచు'మూలకమె. "తెంచు" లేని "అరుగు"న కాగమన మని యర్థము లేదు గదా. కాఁగా "తెంచు" అర్థవిశేషమునఁ జేరు ననుసూరివిధా నమె సముచితము. శాస్త్రమార్గమున కొప్పునదియు నదే. దప్ప లేదు.

ఇట నొకభేదము. సూరి "యభ్యాగతి" నని సామాన్యముగాఁ జెప్పఁగా వీరు ప్రాచీను లాగమార్థమున ప్రయోగింతు రనిరి. అనఁగా నాధునికు లాగమార్థముతోపాటు స్వార్థమునను బ్రయోగింతు రన్నమాట.

"హంసకేతనుపాలికి నరుగుదేర" (జై.4) ఇక్కడ తెంచుధాతువు స్వార్థమం దనుప్రయుక్త మైన దని యెఱుంగవలయును. ఇట్లే ఏఁగుచను క్రియలకును, అట్టిప్రయోగమితర గ్రంథములయందుఁ గానఁబడదు. ...శ.ర హా.ని.ననుసరించియు ఏగుదెంచు, మున్నగునివ్యానిని స్వార్థమున నర్వాచీనులును నరుదుగనె ప్రయోగించిరి. ఇట్టిశ్వాచిత్కస్థితిని సాధింపవచ్చును. కాని యందుకై ప్రాచీను లట్లు ప్రయోగింతు రని చెప్పవలెనా? స్వార్థంబునందుఁ గొన్నియెడల సాధునికప్రయోగంబులం జూపట్టుటను ప్రత్యేకముగాఁ జేర్కొనుట యుక్తము, తత్సమస్త్రీవాచకాద్యత్వసంధి యిట్లె గదా.

ఏ మైనఁ బ్రయోగప్రాచుర్యము ననుసరించి యర్థభేదము గలవీని నగ్వాదులనుండి వేఱుచేసి విధించినసూరిలక్షణమున నపసిద్ధాంతము లేదు. అది సూక్తము.

## చులోపము:

"అయ్యాది పరం బగునపుడు చువర్ణంబు లోపించు" (112) నను సూరిలక్షణమును వీరు "తెంచు పరం బగునపుడు వీచుప్రభృతులతుది చువర్ణంబు లోపించు" (ఉ.117సూ) నని చూపిరి. "అయ్యాది" యను దానికి వివరణమె. "తెంచు" సూరి "చువర్ణ" మని సామాన్యముగాఁ జెప్పఁగా వీరు "వీచుప్రభృతుల" యనిరి. దీనివలనఁ బ్రయోజన మేమి? ఎటనేఁ దెంచు పర మగునపుడు చువర్ణము నిల్చియుండునా? అట్లు నిల్చియుండు నని వీరు వివరింపలేదు. ఉదాహరింపను లేదు. కాఁగా "చు"వర్ణ మెల్లయెడల లోపించునే కద, అట్టియెడల "లేచుప్రభృతు" లనుట యేల? (చువర్ణాంతము లెల్ల వీచుప్రభృతులలోఁ జేర్పవలె.)

ఇట వీరినియమున భంగముగలుగుటను గుర్తించుట కీయది యుపయోగించును. సంధి-48లోని పద్యాదులు వేఱు క్రియా-51లోనిపద్యాదులు వేఱు కావున క్రి.యా.51(ఉ.61)చో "ఇద్యాదు లనుట లెస్స" (ఉ.381)

యనిరి గదా వీరు. ఇట చువర్ణము లోపించునట్టివి "పీచుప్రభృతులు" గాఁ జెప్పిరి. మఱల పీచుప్రభృతులకు నడీ యగు (కృత. 13) అనుచో పీచుప్రభృతు లనిరి. ఈరెండుగణములయందలిశబ్దములు సమానములు గావు. తాము స్వతంత్రముగా నేర్పరచుకొన్నచెప్పుమార్గము భంగపడుట కిట "పీచుప్రభృతు" లనుట యుపయోగించినది.

సూరి చువర్ణము లోపించు ననఁగా వీరు "తుది" చువర్ణము లోపించు ననిరి. ఇందలి "తుది" విశేషణము వివరణాత్మకమె. పీచు, పలుచు మొదలగా వీరు చూపినపీచుప్రభృతులలో నెల్లెడ "చు"వర్ణము తుదినే యున్నది. అసంప్రయుక్త మయినతెంచు పరిషుగాఁ గలచువర్ణ మన ధాతువుతుదిదే యగును. తుదను గాక చువర్ణ మిటఁ గానరాదు. కాఁగాఁ "దుది" యని వీరు విశేషముగాఁ జెప్పవలావికిఁ బ్రయోజనము స్పష్టతయె. సూరి మాత్రమున నట్లు వివరింపకుండుటలో నపసిద్ధాంత మేదియు లేదు గదా.

సూరిలక్షణమె సూత్రము.

## అజీ-అగు :

'ధాత్వంబున నజీకి విధ్యంతర్థ ంబగునగుధాతు వస్యుప్రయుక్తం బగు' (114) ననుసూరిలక్షణమును, వీరు 'ధాతంబున నజీకి ధ్యాతతద్ధర్మాద్యర్థకం బగుఅగుధాతు వస్యుప్రయుక్తం బగు' (ఉ. 118 సూ) నని చెప్పిరి.

'సూరి విధంతం బగుఅగుధాతువుమాత్రమె యసంప్రయుక్త మగు నని సూత్రించెను. ఆపెట్టుకొ నమ్మనేరనయ్యెదను (ఆది. 4. 31) మున్నగు ప్రయోగములు 'పలుగ్రహించఁబడవు' (ఉ. 426) ఈయభిప్రాయ ముచితమే. నన్నయాదులప్రయోగముల విధంతముతోఁ గాక, ఊదంతములు నసంప్రయుక్తము లవుచున్నవి. సూరి వానిని గూడఁ బ్రస్తావించిన బాగుండెడిది.

కాని యాప్రయోగములను సాధించుటకై వయ్యాకరణులు చేసినలక్షణము సమర్థము గాకపోఁగా ననర్థకము నైనది.

భూతతద్ధర్మాద్యర్థకమున భూతార్థకమును తద్ధర్మాద్యర్థకమును. ఇవి రెండును వీరు 'భూతంబున'నే విధించిరి. కావునఁ దద్ధర్మాద్యర్థక మగు నగుధాతువు పై తము లజీకి భూతార్థముననే యనుప్రయుక్త మగు నని వీరి లక్షణము చెప్పుచున్నది. 'నమ్మనేర నయ్యెదను' అనునది భూతార్థకమా? ఇప్పటి కిప్పటికిని నమ్మలేకపోవుచున్నాను అనురీతిగా(తద్ధర్మాదులలోని) వర్తమానార్థకము. కావున నిట్టివి భూతార్థకము లని తలఁచుట ప్రమాదము. లిడంతము ననుప్రయుక్తము చేసినసూరి 'భూతంబున' ననుటుచితమె. నమ్మనేర నైతిని- ఇత్యాదులు భూతార్థకములె కాన, లాదంతము ననుప్రయుక్తము చేయునప్పు డది యాయర్థముననె యగును. భూతంబున భూతార్థకంబును, దద్ధర్మాదులందుఁ దద్ధర్మాద్యర్థకంబు నగునగుధాతు వనుప్రయుక్త మగు నని చెప్పవలె.

సం.లో వీరె 'సూరి ప్రకృతసూత్రంబున -- అని వచించెనే కాని తద్ధర్మాద్యర్థములందును లజీకి లాదంత మగునగుధాతు వనుప్రయుక్తం బగుటయుఁ గలదు'(వ్యా.సం.స.1875) దీనినిబట్టియె ప్రస్తుతపువీరిసూత్ర మునఁ దద్ధర్మాదులం దని చెప్పకుంట సరి గా దని గుర్తింపవచ్చును.

'కాలవచనాదులు ధాత్వర్థములె యనియు నట్టియర్థములకుఁ బ్రత్య యములు ద్యోతకము లనియు' (వ్యా.సం.స.1318) ననుసరించి కాఁబో లును వీ రిట భూతతద్ధర్మాద్యర్థకం బగునగుధాతు వనుప్రయుక్త మగు ననిరి. ధాతువు ననుప్రయుక్తము చేసి దానిపై లిఙ్లాట్టులను జేయవలె నెంచిరా? కాకున్నను సూరివలె "లిఙ్లాదంతములగు" అని చెప్పుట యుచి తము, అట వీ రేల మార్పు చేసిరో. సం.లో లాదంత మనుప్రయుక్త మగు ననుటుచితముగా నున్నది.

## కాను :

'ణ్యంతం బగునగుధాతువు క్రియావిశేషణంబుల కనుప్రయుక్తం బగు' నుజీకి విభాష నగు (115) దానికి హ్రస్వంబు విభాష నగు (116) ననుసూరిలక్షణములను బెక్కుమార్పులతో పరులివా రిట్లు వివరించిరి.

అగుధాతుణ్యంతరూప మగుకాన్ అనునది వికల్పముగ హ్రస్వము నందును. ఇవి (కాన్-కన్) క్రియావిశేషణములకును, విధేయవిశేషణములకు ణ్యంతములకును బరముగా విభాషను నిల్చును. కొన్నిట నివి యన్వితము లగును. కొన్నిట వ్యర్థము లై యనుప్రయుక్తము లగును. ఇవి ప్రథమమీఁద నిల్చునపుడు గకారాదేశము నిత్యము (సూ.118).

అగుధాతుణ్యంతరూపము 'కాన్' అని కాక "కాను" అని చూపుట యుక్తము. అవసానస్వరలోపముతో నిర్దేశించుటలోఁ బ్రయోజన మేమియు లేదు. వీ రిట్లి "చన్వర్ణకము" ఇత్యాదిగఁ జేర్కొందురు. సూరి "కాను" అని వివరణమునఁ జూపుట యుచితముగా నున్నది.

సూత్రముననే చూపుట యనవసరము. అగుధాతుణ్యంతమునకు వికల్పముగ హ్రస్వ మగు నన్నఁ జాలు. కాన్ అనునది కాక వేఱొకటి అగుధాతుణ్యంతరూపము లేదు గదా. ఇఁక నట్లు చెప్పుట వివరణప్రాయ మనవలె. అది సూత్రమున నేల?

వయ్యాలా.116సూత్రము వీరిలక్షణమునఁ బ్రథమవాక్య మైన ట్లున్నది. సూరి "దానికి" అనుటచే ననుప్రయుక్త మయినదానికే విభాషగా హ్రస్వమును విధించెను. వీ రట్లు గాక సామాన్యముగా విధించుటచే స్వతంత్ర మగు "కాను" అనుశబ్దమును వికల్పముగా హ్రస్వమును బొంద వలసియున్నది. కాఁబట్టి -కఁబట్టి యని యుండునా? ఇది యె ల్లెడల లే దనుట స్పష్టము. ప్రౌఢ. "ఒకానొకచోఁ గానంబడియెడి" (క్రి.23) ననెను (వీ రాలక్షణము నిటఁ బ్రస్తావింపలేదు. కఁబోవు (కాఁబోవు) కఁగల కార్యము (కాఁగలకార్యము) అనురీతిగా నెల్లెడల హ్రస్వమును వికల్ప ముగాఁ జెప్పువీరిలక్షణము లక్ష్యానుగుణము గా దనుటలో సందేహము లేదు

గదా. అనుప్రయుక్త మయిన కానునకు హ్రస్వము విభాష యగుటలో విప్రతిపత్తి లేదు. కావున సూరి[116]లక్షణమె స్తుత్య మనుట నిశ్చయము.

'ఇవి' (కాన్-కన్) అని వీ రీరెంటిని విధించుట యనవసరము. కాన్ అనుదానికి హ్రస్వము చెప్పి 'కన్' అనునది సాధించిరి గదా. నొచ్చునకు నోవుతోపాటు నొవ్వు విధించిరా? 'కాను' ఒక్కటియే విధించిన దానికి హ్రస్వ మగుటచే 'కను' అనురూప మెట్లును సిద్ధించును. కాఁగా సూరి 'కాను' ఒక్కటియే విధించుట సముచితము. వీరు 'కన్' కూడ విధించుట వ్యర్థము. కాను(కను) అని చూపుట యొప్పు.

సూరి యిది క్రియావిశేషణముల కనుప్రయుక్త మగు (115)ననఁగా వీరు "విధేయవిశేషణములకును చెప్పిరి. క్రియావిధేయవిశేషణములకును చెప్పిరి. క్రియావిధేయవిశేషణములమీఁది- (క్రి.22)అను ప్రౌఢ.లక్షణము ననుసరించి యిట్లు విధింపవలసియున్న దని వీరు దలంచి రేమో.

"చెన్నగాఁ బల్కె ననుచో చెన్న యగునట్లు పల్కె నని కాన్‌శబ్ద మన్వితమగుచుండుటచే దాని ననుప్రయుక్త మనరాదు" (తి.427) అని వాక్యమం దన్వయించుపద మనుప్రయుక్త మనరా దనిరి గదా. సూరి యట ననుప్రయుక్త మగు ననెను. "నామమం దుండువిశేషణము దెల్పుచు నటఁగా నామవిశేషణ మగుచుఁ గ్రియతో నన్వయించునది విధేయవిశేషణ ముగాఁడు పల్కెనది న్యాయముగా నున్నది. ఇట్టియెడల కాన్- కన్‌శబ్దములు వాక్యమున నన్వితములై యున్నవి" (తి.427) ఏ మైన విధేయవిశేషణముమీఁది "కాను" అన్వయించు నని వీరు నిశ్చయించుట స్పష్టము. కావున నిట కాను అనుప్రయుక్త మనరామి నట సూరి యనుప్రయుక్తముగాఁ జెప్పకుండుట యుచితమే కదా. [యూ.త్రి.శే.] కాన "విధేయవిశేషణముల" నని వేఱుచేసి విధింప నవసరము లేదు.

మంత్రులనుగా నొనరించితె - మంత్రుల నొనరించితె, వికేతనాతిథిని గాఁ జేసె, వికేతనాతిథిని జేసె ననునవి సమానార్థకములె. క్రియయందలివిశేషమును దెల్పుచు నివి క్రియావిశేషణము లనఁదగియున్నవి.

సూరి "యనుప్రయుక్త" మనఁగా వీరు "విభాషను విల్చు" ననిరి. విల్చు ననఁగా మీఁదఁ జేర్చి ప్రయోగింపఁబడు ననియే యర్థము. "కొన్నిట నివి యన్వితతము లగును, కొన్నిట వ్యర్థము లై యనుప్రయుక్తము లగును" అని వీరిసూత్రము కాఁగా గొన్నియెడ నివి యన్వితము లగును గావు నను నవి యనుప్రయుక్తము లనరాదు గావునను వీరు "విల్చును" అనిరా?

ఆన లన్వితము లగువానిని వీ రీసూత్రమున నేల విధింపవలె? ఇట్టి స్థితి యెందైన నున్నదా? ఆయాపదము లెల్ల నన్వయమునఁ బ్రయోగింపఁబడుటను బ్రత్యేకముగా సూత్రింపవలెనా? అన్వితమగు "కాను"ను విధింపఁబూనుట యనవసరము. కావున సూరి యది విడిచి యనుప్రయుక్తస్థలమును మాత్రమె పేర్కొనుట యుచితముగా నున్నది.

విధేయవిశేషణముల వి ట్లన్వితము లగు ననిరి. కావుననే సూరి విధేయవిశేషణములుగాఁ జెప్ప లే దది యుచితమే కద. అన్వితము లగు స్థలముల ననవసరముగాఁ జేర్కొని వీరు సూరిసూత్రమును మార్చుట సరిగాదు. కావున "కొన్నిట నివి యన్వితము లగు" ననియు సూత్రింప నక్కఱ లేదు.

అనుప్రయుక్తము లగునవి యర్థవంతములుగా వని వీరు స్పష్టము చేసిరి. అయ్యు సూత్రముననే "కొన్నిట వ్యర్థము లై యనుప్రయుక్తము" లనుచో వ్యర్థశబ్దము వివరణాత్మకము. ఈరెండుచోట్ల, గొన్నిట" నను దానిచే బ్రధాన మగునచోట మాత్ర మస్పష్టత.

"సుబ్యంతములమీఁద ననుప్రయుక్తములె యన్నగును. [సూ.427] అని వివరించుటనుబట్టి [సూరి పేర్కొన్న] క్రియావిశేషణములపై విధి

యనుప్రయుక్తము గా దనియు నట నన్వితమగు ననియు వీరు భావించి రనఁదగును. కానుశబ్దము క్రియావిశేషణస్థలమున ననుప్రయుక్త మగు నని చెప్పెనే కాని యిట్టికానుశబ్దమునకు వాక్యమున నన్వయము సుసంగతముగఁ గన్పట్టుచుండుటంజేసి యిది యనుప్రయుక్త మన నక్కఱ లే దని యున్న నగును. (వ్యా.సం.స.1676) అయ్యు "ననుప్రయుక్తము గా" దని నిశ్చయింపకుండుట విశేషము. అయినఁ గ్రియావిధేయవిశేషణములపై నెల్లెడ నన్వయించు నని తలఁచినవీరు వానిని సూత్రమునఁ బేర్కొనుటయు నసంగతమె యని నిశ్చయింపఁదగును. అన్వితము లగుస్థలములను గూడఁ జెప్పఁదలఁచుట యనవసరము. అట్లయ్యు భాషలో "కాను" అను నది క్రియావిధేయవిశేషణములపైఁ దప్ప నెచ్చటను బ్రయోగింపఁబడ దనునపార్థమునకు వీరిలక్షణ మవకాశము నిచ్చుచున్నది.

ఇఁక వీరు క్రియావిశేషణములపై నన్వితమగు ననుటయు సరి గాదు. "తెన్నగఁ బల్కె" ననుచో "తెన్న యగునట్లుగఁ బల్కె" నని వీరు చెప్పినయర్థము సహజము గాదు. పల్కుట (పలుకు క్రియావిధానము) బాగున్న దదియె కాని బాగు అగునట్లుగఁ బల్కె నని యర్థమా?

ఇట "కాను" అన్వయించుట లే దనుట స్పష్టమె. ఇట్లె "న్యాయ ముగా నున్నది" అనుచో నుండుట న్యాయ్య మనియె కాని న్యాయ మగు నట్లుగా నున్న దని యర్థము కాదు.

కావునఁ గ్రియావిశేషణముల కనుప్రయుక్తముగఁ జెప్పినసూరిలక్షణ ముచితము, దానిని తిరస్కరింపరాదు.

"కానుశబ్దము నిత్యముగఁ గ్రియావిశేషణముల కనుప్రయుక్త మవు ననియు నుజ్యంతక్రియారూపములకు విభాషగా ననుప్రయుక్తము లవు ననియు 115సూత్రమునకుఁ దాత్పర్యము" (వ్యా.సం.స.1670) అని

తలఁచుచుంటేని వీ రిట" సూరి క్రియావిశేషణములకు నిత్యముగా నను ప్రయుక్త మగు నని సూత్రించుట సరి గాదు. పెల్లుదొరఁగు నెత్తురునై (ఉ.427) యనిరి. అందుచే వీరు దమయీసూత్రమున నుజ్యంతములపైఁ వలెనెఁ గ్రియా(విధేయ)విశేషణములపైఁ గూడ విభాషగాఁ జెప్పిరి. కాని వీ రిట నుద్ధరించినప్రౌఢవ్యా"కర్తవాక్యము "కొన్నియెడల నని చెప్పు చుండఁగా వీ రెల్లయెడల సామాన్యముగా "విభాష" యనుట లక్ష్యసాధార ణమునకు విరుద్ధ మనక తీఱదు గదా. ప్రాయికముగా నను నన్నఁ గవిప్రయో గానుగుణ మైయుండెడి దనవచ్చు. అచ్చి.క్రి.87 స్థలములలో సూరి 'యగు' నన్నఁ గ్వాచిత్కమగు లగుతద్భిన్నప్రయోగములను వివరించెను. ఆట నట్లు వివరింపలేదు. అయ్యుఁ బైవి నుజ్యంతములకు విభాష యనుటంబట్టి యిచ్చటియగునకు (విభాష గాకుండుట) నిత్య మని యర్థము చేయవలెనా యున్నదియుఁ బరిశీలనార్హము. ఏ మైన నిట్టిక్వాచిత్కప్రయోగములకై యెల్లయెడల 'విభాష' యనువచులవారినవరణము మాత్రము సరి కాదు.

క్రియావిశేషణములపై నన్వితములే యగును. కాని యివి యగుట విభాషయె కొన్న నన్వయమును విభాషయె యగునా? 'పెల్లుగా' నని కాను ప్రయుక్త మైన నన్వయించు, విభాష యనుటచే రాకున్న 'కాన్' అను శబ్దార్థము లేకయు వాక్యార్థము పొసఁగునా? లేక కాను అధ్యాహారము చేసి కొనవలెనా? అన్విత మగు నని తలఁచినవీరు 'విభాష' యనుట యింకను వింత.

సూరిలక్షణము సూత్రము. 115,116సూత్రము లట్లు గ్రహించి పెల్లుదొరఁగు నమరీతిని వివరింపఁదగును. కాత ప్రౌఢ.లక్షణము(క్రి.22) ననుసంధింపఁదగును.

ఈఁతఁ దమసూత్రమున వీరు చివరఁగా 'ఇది ప్రథమమీఁద నిల్చు నప్పుడు గకారాదేశము నిత్యము' -అని చేర్చిరి. ఇది సూత్రమునఁ జెప్పుట యనవసర మని వరుఁలవారివాక్యములచేతనె గుర్తింపవచ్చును. 'ఇట. నర

శంబు నిత్యం' బనుసూరివివరణమె యిట్లు వీరిసూత్రమున కెక్కిన దనుట స్పష్టము. దీనింగూర్చి సం.లో వీరు "ఇట్లిపి (క్రియావిశేషణములు) ప్రథమాంతము లగుటచేతనె యావిశేషణములమీఁది కొనుకసుశబ్దములకకా రము బా.సంధి.18సూత్రముచొప్పున నిత్యముగా గకార మగుచున్నది." (వ్యా.సం.స.1677) ఇటఁ గూడ (బా.)సంధి.14 సూత్రము చూడు మనిరి. అనఁగా నిచ్చోటిగకార మీసూత్రముచే నగునది గాదు. ప్రథమమీఁదిపరుష ములకనుసూత్రముచే (నందలిబహుళశబ్దముచే నిత్యముగా) నగునది. ఒక సూత్రముచే నీకార్య మగుటను వే ఱొకసూత్రమున విధింపవలెనా? వీరు 'సమా.72' సూత్రమున నిట్లు పేర్కొనుట యసంగతముగా గుర్తించియుం టిమి. కాఁగా నీసూత్రమునఁ జివరివాక్యము వ్యాఖ్యానమునందుఁ జేర్చుకొను టయే యుక్తము.

సూరి 'చూడఁగాను ఇట స్వత్వము లేదు' అని వివరించెను. దానిని గూడ వీరు సూత్రములోని కెక్కింపకుండు టుచితముగా నున్నది. కాని వివ రణమునను బేర్కొనకుంట విశేషమె. 'చూడనుగాను' అనురీతిస్వత్వ మ తదు గదా.సంధి.17.సూత్రమందలివిభాషాపదమున కీయర్థము వ్యవస్థ చేయఁ బడినట్లు సూరిమతమును గుర్తింపఁదగు.

## తచ్ఛబ్దవలోపము :

'ఉన్నకలవవర్ణకంబులమీఁదితచ్ఛబ్దవకారంబునకు లోపంబు విభాష నగు' (117)ననుసూరిలక్షణమును వీరు కొన్నిప్రౌఢలక్షణములను గూర్చి కొన్నిస్వీయవిశేషములను జేర్చి వివరణాత్మకముగా నిట్లు సూత్రించిరి.

1. ఉన్నకలవవర్ణకములమీఁదితచ్ఛబ్దపువకారంబునకును,
2. అట్టిఇట్టిఎట్టిశబ్దములమీఁదితచ్ఛబ్దపువాకారంబునకును,
3. వీనిమీఁది యమహత్తచ్ఛంబువకును,
4. కొంకుపొంతకంటెకోలెశబ్దపరకత్వమందలిధాతుజవిశేషణముల

మీఁది యమహత్తచ్ఛబ్దమునకును.

5. తనపర్ణకపదకత్వమున విశేషణముల మీఁదితచ్ఛబ్దమునకును, లోపంబు విభాష నగు (ఉ.సమా.83)

ఇందలి మొదటియంశము ప్రస్తుతసూరిసూత్రమునభిప్రాయ మగుట స్పష్టమే. 'తచ్ఛబ్దవకారంబునకు' ననుసూరిపదమును 'తచ్ఛబ్దవువకారమునకు' నని షాష్ఠీసమాసము చేయుటలో వీరు విశేషార్థమును సాధించి రనరాదు గదా. సూరిసూత్ర మట్లె గ్రహింపఁదగు. వీ రిట భేదించినదియు లేదు.

వీరిసూత్రమందలి రెండవయంశము. 'అట్టియిట్టియెట్టివిశేషణంబుల మీఁదితచ్ఛబ్దవకారంబునకు లోపంబు విభాష నగు [సమా,?] నను ప్రౌఢ. లక్షణము 'తచ్ఛబ్దవకారంబు'ను 'తచ్ఛబ్దవాకారము'గా వీరు సవరించు టుచితమే. 'అట్టిఇట్టియెట్టివిశేషణంబులు' అను ప్రౌఢ.ప్రయోగము 'ఆదియవిశబ్దంబులు' మున్నగుసూరిప్రయోగములవంటిదె.

బాల,ప్రౌఢ.లక్షణసందర్భములందు ద్వితీయాదివిభక్తులలో నీకార్య మగుట కల దేమో వెదుకవలె. వచ్చుచున్నాఁడు వచ్చుచున్నారు అని యున్నట్లుగా వచ్చివానిని, వచ్చినారియం దనురీతిని గానరావు. వచ్చినవానిని వచ్చినవారియందు. ఇట్లె అట్టిఁడు అట్టిరు అన్నట్లుగా అట్టినిని, ఇట్టిరికొఱకు ఎట్టిరియందు నని గానరావు. అట్టివానిని అనురీతిని యుండును. [విభాషా వ్యవస్థితో?] ఈలోపము ప్రథమయందే యని నిశ్చయించుటకు బాధకాంశములు గల వేమో పరిశీలింపవలె.

ఈసూత్రమున మూఁడవయంశమున అట్టియిట్టియెట్టిశబ్దముల పై నమహత్తచ్ఛబ్దమునకు లోపము చెప్పిరి ఇది.బాల.ప్రౌఢ.లలోఁ గానరాదిది ప్రథమయందు అట్టిది అట్టివి యనుచో నమహత్తచ్ఛబ్దము లోపించు నను టొప్పునా? [తచ్ఛబ్దాతః అని తచ్ఛబ్దాకారమునకు లోపము విహితము] 'ఆదియవిశబ్దంబులయత్తునకు' [బా.సంధి.42] అని వీరును జెప్పిరి. ద్వితీ

యాదులందు అట్టిదానిని, అట్టివానిని- అట్టిని, అట్టిదానిచేత, అట్టిచేత- ననురీతిరూపములు గల వనుట కాధార మేదియు లేదు.

అమహత్తచ్ఛబ్దలోపమునకు వీరు అట్టిదానియందు అట్టియందు అను రీతి నందుపరకరూప మొందఁ జూపిరి. దీనికై సామాన్యముగా నమహత్తచ్ఛబ్దలోపమును జెప్పినఁ బై రీతి నపరూపములకే ప్రాధాన్యము గల్గుచున్నది. అందుపరకతయందే యీలోప మని విభాషకు వ్యవస్థ చేయవలె నంతకంటె నందుపరకతయందు మాత్రమె యీలోపమును విధించుట యుచితము గదా. ఈతచ్ఛబ్ద మెట్లును విభక్తిపరకతలో ననుప్రయుక్త మగునదే. కావున నందుపరకతలో నట్టియనుప్రయోగ మమహదర్థమున నరుదుగ లేమి గుర్తింపరాదా? ఇచ్చటి 'అందు' అవ్యయముగా నీరూపము సాధింపఁబడునా యన్నదియు నాలోచింపఁదగును.

వదులవారిస్వీయలక్షణము సముచిత మనరాకున్నది.

వీరిసూత్రమున నాలుగవయంశము- ఇట 'కాలకుతంజెపోంలు' పరంబగునపుడు భావార్థకటవర్ణంబునకు లోపంబు విభాషనగు [క్రి.14] కంటెవర్ణకంబు పరంబగునపుడు విశేషణనవర్ణకంబుమీఁదియమహత్తచ్ఛబ్దారమునకు లోపంబు విభాష నగు [క్రి.21] వసుప్రౌఢ.లక్షణములను దృష్టియం దుంచుకొని చెప్పినది. 'కొలె' వీ రదనముగాఁ జేర్చిరి. 'ట' లోపమును జెప్పినప్రౌఢ.మతముకంటె, నమహత్తచ్ఛబ్దలోపమును జెప్పిన వీరిలక్షణముకంటె నమహదర్థమున నీదా.వి.లకుఁ దచ్ఛబ్దానుప్రయోగమె యరుదుగ లేదను టుచిత మని గుర్తించియుంటిమి. [చూ.బాల.క్రి.85]

దానిచేతనో [అము.2.43] పన్నిద మాడిన కోసము (వై.జ.96) మొదలగుచోఁ నితరస్థలములను నీకార్యము గానవచ్చును.

కాని 'పౌడవుగఁ బెరుగుట చెల్లను బరుటకొఱకై, కూడు పెల్లఁ

వాయుటకొంటకె. [సమి.4.1-9] అనుచో ముందటి 'ట' ప్రయోగమును బట్టి 'అందుకొంటకె' యనుచో ప్రౌఢ. పేర్కొన్నట్లు 'ట' లోప మను టుచితమా? యనిపించు.

ఇక వీరిసూత్రమందలి మొదటియంశము తద్ధితపరిచ్ఛేదమునఁ జూచితిమి. చూ. త్రి. శే. కాఁగా నిది యనవసరము.

## శబ్దపల్లవములు :

'ధాత్వాదులకు ధాతువు లనుప్రయుక్తంబు లయి విలక్షణార్థాభిధాయకంబు లగునేయవి శబ్దపల్లవంబులు నాఁబడు' (118) ననుసూరిలక్షణమును వీ రిట్లు వివరించిరి. "పూర్వావయవము ప్రథమాద్వితీయాన్యతరవిభక్తిగ నుండునామ మయియుండ నుత్తరావయవము ధాతు వగు జంటశబ్దము శబ్దపల్లవసంజ్ఞఁ గలఁ దగును" (ఉ.120సూ.)

'ప్రథమాద్వితీయాన్యతరవిభక్తిగ' ననుటవలన 'నామ మయియుండు' ననుట పేర్కొనుట స్పష్టతకే. ప్రాతిపదికలు గాని విట్లు ప్రథమాదివిభక్తులతో నుండుట యసంభవము గదా. పూర్వావయవము, నుత్తరావయవము నని పేర్కొనుటచేతనె స్పష్ట మగుచుండ 'జంటశబ్దము' అనుదళమును వీరు సూత్రమున నిల్పుట యింకను స్పష్టతకే యనవలె.

శబ్దపల్లవములలో రెండవయవయవము ధాతు వై యుండుటను సూరి వలెనె వీరును పేర్కొనిరి. అంత భేదము. సూరి 'ధాత్వాదులకు' ననుటచేఁ బూర్వావయవము ధాతువును గావచ్చు ననె. (దానికిఁ ప్రాధాన్యము నిచ్చెనేమో) జారుచుండు- (కొనిపోవు) అనురీతి నుదాహరించె. దానింగూర్చి వీరు "శబ్దపల్లవములలో నాద్యవయవము ధాతు వై యుండరాదు. క్త్వార్థకాదికము గాను. అట్టివి ద్వ్యవయవక్రియ లనిపించుకొనునే కాని శబ్దపల్లవము లనిపించుకొన" (ఉ.429) వనిరి. వీరియభిప్రాయమునకు ప్రమాణ మేమి? సూరి ద్వ్యవయవక్రియ లని చెప్పుటను వ్యవహరింపలేదు.

ఇట్టిసంజ్ఞను చేయుటచేతఁ దక్కినద్వ్యవయవము లగుటంతశబ్దములను (112 మొ॥119 క్రియా) శబ్దపల్లవము లనుట సంప్రదాయము గా దనియు వానిని ద్వ్యవయవక్రియ లనియె వాడవలయు ననియు చెప్ప నగును. చూ. ప్రౌఢ. క్రి. 25. (ఉ.429) ప్రౌఢవ్యాకర్త ననుసరించి ద్వ్యవయవక్రియ లని మీరు పేర్కొనియుందురు. ఈసంజ్ఞ వేసికిఁ గల్గునో మీరు సూత్రింపలేదు. ఇట్టిసంజ్ఞ చేయఁబడిన నెట్లు గ్రహింపుట? మీ రింతకు ముందు పేర్కొన్న ఘటకక్రియలు నీద్వ్యవయవక్రియలు నొకటి యగునో భిన్నములో. మీ రన్నఘటకక్రియలు ప్రౌఢ. పేర్కొనలేదు.

మీరు ద్వ్యవయవము లన్నవానిని మాఱి శబ్దపల్లవము లనుట నేర్పఱిన యవరోధము లేమియో మీరు పేర్కొనలేదు. ద్వ్యవయవక్రియలకు (ఘటకక్రియలకు) ప్రత్యేకముగాఁ జెప్పినప్రక్రియ గాని యది మాఱెశబ్దపల్లవము లన్నచోట వర్తింపకవిరోధ మేర్పడుట గాని యొదియు యేని నష్టమును వివరింపక సూరిలక్షణమును దిరస్కరింపవలె నన్న నెట్లు?

శబ్దపల్లవములను జెప్పుచోఁ బూర్వావయవము నుత్తరావయవము నని మీరును జెప్పితిరి. ఇందు రెండవయవము లుండుటచే మీరు పేర్కొన్నశబ్దపల్లవములు ద్వ్యవయవక్రియలు గావా? రెం డవయవములను గ్రియలే యైయున్నచే ద్వ్యవయవక్రియ లగు నని చెప్పవలెనా? అట్లని వివరింపలేదు. (అనఁగ మున ఘటకక్రియలకు వీనికి భేద మేమో) అట్లు తలఁచినను నిట్టిభేదమును గల్పించుటవలన శాస్త్రమునకుఁ గల్గిన ప్రయోజనమును జెప్పవలసియున్నది గదా. అదియు లేదు. మఱి సూరిచెప్పని. మీరు కల్పించినభేదము నంగీకరించుట కాధార మేమి?

ఇఁక మీ రుద్ధరించినప్రౌఢ.లక్షణమునుబట్టి గ్రహింతమన్న మీరు నియమించినరీతిశబ్దపల్లవములనే యాతఁ డుదాహరింపలేదు. ఆత నుదాహరించినచనుదెమ్ము, చననిచ్చు- యనువానిలో 'చనుదెంచు' శబ్దపల్లవ మన వలె. మీరిలక్షణ మది శబ్దపల్లవ మనునా? పూర్వావయవము ధాతు వగునదే?

కాక అట్టి ప్రౌఢ.శబ్దపల్లవమున కుదాహృతి చూపలే దందురా? మఱి సూత్రమున శబ్దపల్లవములను బేర్కొన నేల?

వ్యాఖ్యాతలు "చనుదెంచు" శబ్దపల్లవముగనె ప్రౌఢ. తలంచినట్లు పేర్కొనిరి. (తత్త్వ.౩౬౧,పుం.౩౨౧ మొ॥) ఇం తేల? వీరు ఇందు చనుదెమ్ము అనునది శబ్దపల్లవక్రియ యనియు. చననిచ్చు ద్వ్యవయవక్రియ యనియు నుదాహరింపఁబడెను.(వ్యా.సం.ప.౧౮౮౬) అని "చనుదెంచు" శబ్దపల్లవ మని ప్రౌఢవ్యాకర్త అభిప్రాయమును స్పష్టము చేసిరి. దీనింబట్టి ప్రౌఢవ్యాకర్తయు శబ్దపల్లవములలోఁ బూర్వావయవము ధాతువు నగు నని సూరియభిప్రాయము నంగీకరించినట్లై కదా. ఆలక్షణము వీరినిర్ణయమునకు బాధక మై యుండఁగా దానిని ప్రమాణముగాఁ జూపు టెట్లు?

ఇక చనుదెమ్ము శబ్దపల్లవక్రియ యని సూరికి సమ్మతము గాదు. సూరి శబ్దపల్లవముల నుదాహరించుటలో చనుదెంచు మున్నగుపూర్వసాధితరూపములలో నొక్కటి నేని చూపలే (వ్యా.సం.ప.౧౮౮౬) దనిరి. సూరి చెప్పినశబ్దపల్లవలక్షణ మిం దున్నవు దిది సూరి శబ్దపల్లవముగాఁ దలఁపలే దనుట కాధార మేమి? 'పూర్వసాధితరూపములుగా' నుపేక్షించియుండ నవు. కాకయు సూరి యుటఁ జూపినవి మాత్రమె శబ్దపల్లవము లనుటకును వీలు లేదు గదా. ఇంకను సూరి తనసూత్రమున 'ఈయుప యనుట యిట్టి లక్షణములు గలవి (శబ్దపల్లవములు) కొన్ని పూర్వోక్తము లగుటయుఁ నుద్దేశించెనా యనియు నాలోచింపవలసియున్నది. ...విలక్షణార్థాభిధాయకంబు లగునవి శబ్దపల్లవంబులు. బొఁబడు" నన్న విరోధ మేమి? దీనినిబట్టి బాలవ్యాకరణ ప్రౌఢవ్యాకరణముల కైనను నైకమత్యము కాసరా [వ్యా.సం.ప.౧౮౮౫] దనుట నిరాధారము.

పూర్వావయవము ధాతు వైన నది శబ్దపల్లవమె యని చెప్పినవాఁ డగుటచే సూరి "శబ్దపల్లవం బగుపదునకు"- (క్రి.౬౩) నని సూత్రించె వీరు దానికి "నిలువరించు నిల్వరించు నిలుచు + పడు. నిల్పడు. (వ్యా.సం.ప.

1607) చూపిరి. ఇందుఁ బూర్వావయవము ధాతువే. శబ్దపల్లవమునఁ జెప్పిన కార్య మైనది. ఉ.లోను జై సూత్రమునొద్ద ఏర్పరించు- ఏర్పఱచు (ఉ.409 అని యుదాహరించిరి. ఇట ద్వ్యవయవశబ్దములు- కూరుచుండు (కూరుచు +ఉండు) ఏఱు+పడు (ఏఱు-క్రింద నున్న గింజల నేఱు మొ॥) [ఉ.429 అని యిది ద్వ్యవయవశబ్దమె కాని శబ్దపల్లవము గా దనిరి. దీనింబట్టి వీరి భేద కల్పనము ప్రయోజనవంకము గా ననుటలోఁ దప్పు లేదు గదా. ఇట్లే 'అందిచ్చు ఇట అందు ఇచ్చు అను ధాతువు లేకీభవించిన అందిచ్చు అనుశబ్ద పల్లవమును పోమంగాఁజ ప్రయోగించె నన్నదగును.' (వ్యా.సం.స.242,243)

అయ్యూనుపీ రి ట్లేల నిర్ణయించిరి? 'శబ్దపల్లవధాతువులలోనిపూర్వావయవము ధాతువు కావచ్చు ననుటను స్థాపించు ప్రాచీనప్రామాణికవచన ప్రమాణము కానరాదు' (వ్యా.సం.స.1690) అనిరి. వికృతివివేకమునకుఁ బూర్వము 'శబ్దపల్లవసంజ్ఞ' గల దేమో పరిశీలింపవలె. ఇటుఁ బ్రాచీనప్రామాణికవై యాకరణు లధర్వణుని వ్రాయుందురు.

"ధాతువులును నవ్యయములును బూర్వావయవములుగా నున్నవి శబ్దపల్లవము లనుట యధర్వణసమ్మత మని యాతనిపై వివరణమువలనఁ దోఁచనేరదు" (వ్యా.సం.స.1685) (అందుకే వీ రిట క్త్వార్థకాదులను గారా దని యుందురు ఉ.429) అధర్వణుఁడు చెప్పినట్లే చెప్పవలయునా? ద్రుతాంతములును ద్రుతప్రకృతికములు. ద్రుతోపజీవు లనురీతి వేఱుచేయుటలో ననవసర మైన ద్రుతోపజీవివిభాగమును విడిచిపుచ్చినట్లే ఘటకక్రియలు శబ్దపల్లవములు నని విభాగింపక నూరి ఘటకక్రియలను విడిచి యవసర మైన వానిని శబ్దపల్లవములుగా గుర్తించుట శబ్దశాస్త్రప్రయోజనమున కనుగుణమై యున్నది. వీరు ఘటకక్రియల నధర్వణుఁడు చెప్పినవిధముగనె చెప్పిరా? 'పోవు'స్వార్థమునఁ జెప్పలేదా? చూపలేదా?

కావున నధర్వణుఁడు (ప్రాచీనవైయాకరణులు) పేర్కొనలే దను

కారణముచే నీయంశమును దిరస్కరింపఁబని లేదు. 'అథర్వణుఁడు తలఁపని యొకనూతనలక్షణము వికృతివివేకానుసారి సూరిచే నుద్దేశింపఁబడుట' (వ్యా.సం.న.1685) శాస్త్రప్రయోజనానుగుణముగా సముచితమై యున్నది. కదియుంబడి యనుదాని నిట సహో. (కవిశి.748) మార్గాంతరమున నిమన్వయించి యుదాహరించె.

(శబ్దపల్లవశబ్ద) వ్యుత్పత్తినిబట్టియు బాలవ్యాకరణప్రౌఢవ్యాకరణాదులనుబట్టియు శబ్దపల్లవపూర్వావయవము నామమే కానక్కఱలే దవియు ధాతువైనను గావచ్చు ననియు —దోఁచుచున్నది (వ్యా.సం.న.1683) ఇటఁ ప్రౌఢవ్యాకరణమును గూడఁ జేకొనుట యుచితముగా నున్నది. శబ్దవ్యుత్పత్తికంటె శాస్త్రప్రయోజనము ననుసరించి యి ట్లంగీకరించుట యుచితము. కాఁగా ఉ.లో వీరు తిరస్కరించుట సరి కాదు.

ఇంక వి ట్లని పూర్వావయవము ధాతువుగా నున్న వెల్లశబ్దపల్లవములే యని సూరి తలంచె ననుటయు సరి కాదు. వజ్ఝలవారు బా.క్రి.109 మొదలు 117వఱకుఁగల సూత్రములందు నిలువఁబడు పండుకొను అగుడెంచు అరుదెంచు (రాఁదమ్యేము) రాఁదగు లెస్సయగు (లెస్సగ) వండుచుండు వండఁగల్గు మున్నగు వివిధము లగుజంటశబ్దములతో దిధాతువులు ప్రయోగింపఁబడెనే కాని యవి శబ్దపల్లవము లని వచింపఁబడలేదు (వ్యా.సం.న.1685) అనుట విచార్యము.

109-117 అని యిచ్చిరి గాని యితరసూత్రస్థలములు గూడ వీ రిట నుదాహరించిరి. వండుచుండు -వండఁగల్గు, అనునవి లట్లృదంతముల నుద్దేశించినవి, ఇట సూరి, ఉన్న, కల యనుబంధములు చెప్పెనే కాని ఉండు కలుగు ధాతువుల నప్రయుక్తము చేయలేదు. కాఁగా నివి శబ్దపల్లవములు గావు. వీరు వండుచుండు, వండఁగల్గు అని చూపుట సరి కాదు. వండుచుండెను, అనురీతివి వి రుద్దేశింపలేదు. అవి భిన్నములు. (వండుచున్ ఉండు)

ఇట్లె లాఁతఁగు, లెస్సయగు నన్నవి లాఁతయ్యెను, లెస్సగా ననువాని నుద్దేశించి చెప్పుట యొప్పదు. లాఁతయ్యెను అనుచో లిడంత మనుప్రయుక్తము చేయఁబడినది గాని అనుధాతువు కాదు. అట్లె లెస్సగా ననుచో నుజ్యంత మగునగుధాతువు (కాను) అనుప్రయుక్తముగాఁ జెప్పఁబడినది గాని కేవల మగుధాతువు గాదు. శబ్దపల్లవములపై లడాదు లెల్ల నగు. లాఁతయ్యెను, లెస్సగా ననురీతివానిపై లడాదులు వచ్చునా? వచ్చుట కివి ధాతువులు గావు గదా. శబ్దపల్లవములు ధాతువులు.

నిలువఁబడి, పండుకొను, అగుదెంచు, అరుదెంచు అనునవి శబ్దపల్లవము లనుటకు విరోధము లేదు. కర్మార్థమందును, నాత్మనేపదార్థమందును నగుపడుటకొఱకు స్వార్థమునం దగుట విశేషము గాక పేర్కొనె. కేకేరులు మున్నగు ననేకవిశేషములనుబట్టి అగుదెంచు, అరుదెంచు అనురీతివి ప్రత్యేకముగాఁ బేర్కొనఁబడె: తదుపరు అనురీతివియు శబ్దపల్లవలక్షణములు గలిమి శబ్దపల్లవములె. వీనింగూర్చి ప్రత్యేక మయినప్రస్తావన గలుగకుండు ఉనే వీనిని శబ్దపల్లవములుగా సూరి వ్యవహరించియుండక పోవచ్చును. శబ్దపల్లవములయెడ సూత్రపూర్వములు గాక విశేషరూపము లుదాహరించుట పూర్వోక్తముల శబ్దపల్లవములు లేనేలే వని తెల్పెదు. ఈసూత్రమున 'ఈయవి' యనుట పూర్వోక్తస్థితిని సూచించు ననఁదగు. లక్షణ మేర్పడు వ్వదగినయవకాశమున్న మేర శబ్దపల్లవములను వర్ణవికారాదులతో సూరి సాధించె నని గ్రహింపఁదగును.

'కొనిపోవు' అనునుదాహరణమునుబట్టి (కదియఁబడు,) చనిచ్చు ననురీతివియు శబ్దపల్లవములే యని సూరి తలఁచె ననిపించు.

కాఁగా శబ్దపల్లవములఁ బూర్వావయవము ధాతువు నగుట నిర్విరోధముగా నంగీకరింపఁదగును. ధాత్వాదుల కనుసూరిలక్షణము సూత్రము. వీరు దానిని మార్చుట నిష్ప్రయోజకము.

పిదప సూరి 'ధాతువు లనుప్రయుక్తంబు లయి' యనఁగా నది నని

గా దని వీరు తమసూత్రమున నట్లు చెప్పలేదు. 'శబ్దపల్లవములోని యుత్తరావయవమును దానియర్థములోఁ గొంతభాగము కలదై యుండును గాన నది యర్థము లేనిది గాదు. కాన దాని ననుప్రయుక్త మనరాదు' (పు.429)

కాని సూరి చూపినదప 'విలక్షణార్థాభిధాయకత్వమును జెప్పియుండుటచే ననుప్రయుక్తములుగాఁ జెప్పుటవలనఁ గల్గినవిరోధ మేమి?

అరుగుప్రభృతులను వీరు అగ్వాదులలోఁ జేర్చి తెంచుధాతువు ననుప్రయుక్తము చేసిరి. అయ్యుఁ 'బ్రాచీను లాగమార్థమందె వాడుదు' రని యర్థవిశేషమును జెప్పిరి. అట్టియర్థవిశేష మెట్లు? అట తెంచు అనుప్రయుక్తము కదా. అట్లే యిట సూరియు 'విలక్షణార్థాభిధాయకత్వమును' జెప్పుటచే ననుప్రయుక్త మనుట నెట్టి విరోధమును లేదు.

విజయము+చేయు అనునవి రెండును గలిసి (విజయంచేయు) 'వచ్చు' అని విలక్షణ మైనయర్థము నిచ్చుచున్నవి. ఇటు మీఁదఁ జేరిన 'చేయు'ధాతువు స్వార్థమునందు లేదు గదా. వీరిపద్ధతి ననుసరించియు ననుప్రయుక్త మనుట దొసఁగు గాదు. కాక యిట్టియర్థవిశేషము గలవానిని శబ్దపల్లవములనుండి వేఱుచేసి వానికిం గొకసంజ్ఞ నేర్పఱచు కొనవలయును వీరు.

ఇంక వీరు 'విలక్షణార్థాభిధాయకంబులగు' టనే తిరస్కరించి తమ సూత్రమునుండి తొలఁగించిరి. కాని యంగీకరింపవలయు నని వారివివరణమే నిరూపించు.

శబ్దపల్లవములయర్థము వానియవయవభూతశబ్దములలో నొకదానిదై యుండిన నుండును లేదా రెండింటిమేళనమునఁ గల్గఁదగునుచిత మగు నర్థ మేని కానోపును, ఇది యర్థవైలక్షణ్య మనిపించుకొనదు. అది శబ్దమేళనమునఁ గల్గనుచిత మయినపరిణామమె యనఁదగును (వ్యా.సం.స.1692, పు.478).

అర్థమున మార్పు గల దని వీరు నంగీకరింతురు కాని యది సూత్రింప నక్కఱ లే దఁట. ఏల? సహజ మందురు. దానిని లక్షణబద్ధము చేయుట దుష్ట మగుట యెట్లు? 'సహజ' మన్నది యెంతమేర లక్షణము చేయ నక్కఱ లేనిది? క్రియా 43,44,45 సూత్రములందు వీరు కొన్ని జంట శబ్దములయర్థవిశేషమును పేర్కొన లేదా.

పై మైన "అవయవభూతశబ్దద్వయార్థముకన్న భిన్నముగా విలక్షణార్థము కలుగవలె ననుటయు నిరాధారమె" (వ్యా.సం.స.169?) యని యథర్వణవచనవిర్బంధముచేఁ బేర్కొని కూరుచుండు మొదట గుచ్చోట్లఁ జేసినయర్థసమన్వయమునందలియసహజత్వమును గుర్తించి దానిని విడిచి పుచ్చుకొని శబ్దపల్లవములవిలక్షణార్థాభిధాయకత్వమును వరుసలవారు నంగీకరించుట యుచితముగా నున్నది. మిగిలినజంటశబ్దములవిషయ మటుంచి యుట నర్థవిశేషము గల దని గుర్తించినవీరివివరణము ననుసరించియు సూరి 'విలక్షణార్థాభిధాయకంబు లగు' అని పేర్కొనుట యుచితము నవసరము నని నిశ్చయింపఁదగును. వీరిక్రియా.43ము న్నగుసూత్రములా నియంశమును స్పష్టము చేయు. ఆయాజంటశబ్దములయర్థవిశేషబోధకత్వము వీరు చెప్పవచ్చును గాని సూరి చెప్పరా దనుట యెట్లు? సహజ మన్న వీరు చెప్ప నక్కఱ లే దని తలఁచిన నేల చెప్పిరి?

"ప్రథమాయా ద్వితీయాయా స్స్యాంబంధ స్త్రత్ర సమ్మతః" అను.వివి. లక్షణము ననుసరించి 'ప్రథమాద్వితీయాస్థితరవిభక్తిగ' నని వీరు చెప్పి రనుట స్పష్టము. 'ధాత్వాదు' లనుచోటియాదిశబ్దముచే సూరిమతమున నిట్టి వెల్ల సంగ్రహింపఁబడుట స్పష్టమె.

సూరిలక్షణ మెంతయు సముచితము.

## ఌట్టునకు - లిట్టు :

చేదర్థయోగంబున ఌట్టునకు లి ట్టగు (119) ననుసూరిలక్షణమును వీరు చేదర్థయోగంబున భావిని లిట్టు విభాష వగు' (క్రి.53సూ) నని సవరించిరి. విభాష యనుట ప్రధాన మగుమార్పు. దీనింగూర్చి..

"సూరి యిట్టిలిడంతత్త్వము నిత్య మని సూత్రించుట సరి గాదు. రెండుక్రియలును భావ్యర్థకము లై నం గావచ్చును. కడఁగి సమబుద్ధి గల్గె నేని కాదు శాపఫలం బిట్లు గాక బుద్ధిహీనుఁ డై గర్వితుం డగునేని శాప హావ్యవాహఫలంబు నీఁ డనుభవించు' (వ్యా.సం.స.1472) ఇటఁ గల్గె నేని ననుచో లి ట్టయినది. 'అగు నేని' ననుచో లిట్టు రాలేదు. కావున లిట్టు నిత్యము గా దని వీరియభిప్రాయము. కాని సూరి లిట్టు చెప్పినది ఌట్టునకు" అట సూరి వీరివలె విభాష యన్న లిట్టు రానిపక్షమున ఌ ట్టే యుండ వలెను. 'అగు నేని' అనుచో 'అగును' అన్నది ఌడంతమా? ఌ ట్టయి నచో 'గర్వితుండు కాఁగలఁ డేని' అని యుండవలె. వీ రట్టిప్రయోగము నెటనుండి యేఁ జూపఁగల్గిన నప్పుడు సూరిలక్షణమున దోష మెన్నవచ్చును. అట్టిది వీరు చూపలేదు. ఉండవు.

సూరి ఌట్టునకు లిట్టు నిత్యముగాఁ జెప్పుటవలన 'అగు నేని' ననురీతి లడ్రూపము. సూరిలక్షణమును విరోధింపదు. భావ్యర్థమున ఌట్టు వచ్చిన నట లిట్టు నిత్యముగనె యగును. తద్ధర్మాదులందును భావ్యర్థము గలదు గాన లట్టును వివక్షించిన సూరి ఌట్టునకు లిట్టు చెప్పలేదు గావున నది యట్లే యుండును. 'అగు నేని' ననురీతి నగును. కాఁగా సూరిలక్షణము సూక్తమే.

ఇఁక వీరిలక్షణము చూతము. వీరు భావిని లిట్టు చెప్పిరి. ఈవిశేష విధివలన భావ్యర్థమున రావలసినఌట్టు బాధింపఁబడి (ఌట్టు లాకయె) యనుసూత్రముచే ధాతువునకు లిట్టు వచ్చును. కల్గె నేని. విభాష యనిరి గదా. లిట్టురానపు డేమి కావలె. ఌట్టునకు బాధ లేదు గావున ఌట్టె వచ్చును. ఌట్టు వచ్చిన 'గర్వితుండు కాఁగలఁ డేని' యనురీతిని గావలె. ఇట్లె కల్గఁగలఁ డేని. ఇట్టిప్రయోగమును జూపఁగలరా? లాడర్థములలో

భావ్యర్థముండుట బాట్టుచే 'ఆగు నేని' నని యగుటను వీరిమతమునను బాధ లేదు. కాని భావ్యర్థమున సాధారణముగఁ గావలసిన 'లృట్టు' రాకుండుట యెట్లు? కావున కాఁగలఁ డేని అనురీతిరూపముల నీయర్థమున సాధించువీరిలక్షణము సరి గా దనకతప్పదు గదా.

ఇంకను వీరు లిఙంతత్వము నిత్యము గా దనుచు రెండును భావ్యర్థకము లయిన, గావచ్చు నమటయు సరి కాదు. లిఙంత మైనంతమాత్రమున నది లిఙర్థక మగుట యెట్లు? ఈలిఙ్టు లృఙ్ఙుస్థానమున నైనది గావున లృఙర్థకమె. అనఁగా భావ్యర్థకముమాత్రమె యగును. ఋషీశ్వరుండు వచ్చెనా కార్యముబు ఫలించు ననఁగా నప్పటికె ఋషీశ్వరుఁడు వచ్చె నని యర్థమా? వీ రైనను లిఙ్ఙు 'భావిని' విధించిరి గాన నది భావ్యర్థకమె కావలె. భూతార్థకమె యగుచోఁ బ్రత్యేకముగా నిం కొకసారి లిఙ్ఙు విధింప నేల?

పిదప వీ 'రిఙ్టియెడలఁ జేదర్థకప్రత్యయము నిల్చినను నిల్పవచ్చు' ననిరి.

ధాతువునందుఁజేదర్థమును వివక్షించినయెడఁ జేదర్థకప్రత్యయ మగుట మాత్రమె యుండును. ఋషీశ్వరుండు వచ్చినన్ గార్యముబు ఫలించును.

కాక చేదర్థకము లగు ఆ. ఏని మున్నగుశబ్దములతో యోగ మున్నపుడు మాత్రము ధాతువునకుఁ బై సూత్రమునఁ జెప్పినకార్యమె కాని చేదర్థకప్రత్యయము రాదు. ఋషీశ్వరుండు వచ్చె నేని అనుస్థలమున 'వచ్చిన నేని, వచ్చిన నా' అనురీతిగాఁ జేదర్థకప్రత్యయము రాదు. పై వివరణమున వరుసలవా రిట్లు తలఁచిన నది యుచితము. తోఁచిన నైనను మున్నగుస్థలముల నర్థవిశేషము స్పష్టమె. (వ్యా.సం.ప.1467)

**భావసము-నంజీ :**

బాల.క్రి.120,121,122సూత్రములను దాదా పద్లై గ్రహించిరి. (ఉ.క్రి.121,6.47)

"పెక్కుసుబంతములకొక్క వలయ్వాదిశబ్దము నిల్చుటయుఁ గలదు" అగ్నిశిఖయుఁబోలె వంటను దాయను జూడ రావియట్టికుభవదీశ్రీ (అర.2.91) (ఉ.378) ఇట వలయ్వాదులలోని దగు 'రావిది' అనుదానికి అంటు, దాయు, చూచు అను పెక్కుధాత్వర్థములు కర్త లయియుండుటం జేసి 'కర్త యగుభావంబునం' దను (క్రి.122) సూరిలక్షణముచే షష్ఠిధాతువుల కన్నింటికిని నుఙీ యైన దని వరులవారియభిప్రాయము నెన్నఁదగును.

"ఒక్కొకయెడల వలయ్వాదియోగము లేకయె భావంబున నీనుఙీ ప్రయోగింపఁబడుటయు నచుదుగఁ గలదు. చేయఁ బాడియే చేయుప్-చేయుట (సభా.2.10)(ఉ.378) "వలయ్వాదిక్రియలకు" అనులక్షణమునకు భిన్నముగా నిట 'పాడి' క్రియ కాదు గావున 'చేయుప్' అని నుఙీ యగుట సూత్రముచే సిద్ధింపదు. వరులవారు విశేషముగాఁ జూపుట సముచితముగా నున్నది.

ఏ రీతి సందర్భవశమునఁ గావచ్చును 'భావార్థకసుబంతముపైని షష్టివర్ణకము నిల్చుటయుఁ గలదు. నీవు గల్గఁబట్టి దీనిచే నీభావార్థకము మీఁద నితరవిభక్తులు నిల్వవని విశద మగుచున్నది'(ఉ.378) యని వివరించిరి. కాని వీ రింతకుముందే 'హేతు వగుసుబంతక్రియమీఁద షష్టివిభక్తి మాత్రమె నిల్చును' [ఉ.కార.18] అని కారకపరిచ్ఛేదమున సూత్రించి యుండిరి. ప్రస్తుతవివరణమునభిప్రాయమును గూడఁ గలిపి యట 'హేతు వగుభావార్థకసుబంతక్రియమీఁద' నని చెప్పఁదగు నేమో.

వీరు తమసూత్రసంఖ్య నిటఁ జూపి దానిచేఁ బట్టిప్రత్యయ మగుచున్నట్లు పేర్కొనవలసినది. అట 'మాత్రమె' అనుదానికి వివరణమె యుట నితరవిభక్తులు నిల్వ వనుట. [ప్రౌఢ.కార.12].

### అనభిహితకర్త - షష్ఠి :

బాల.క్రి.123.సూత్రము నిట్లు గ్రహించిరి. [ఉ.కార.3.సూ.]

'అనభిహితకర్త కొకానొకచో షష్ఠి బహుళంబుగా నగు' [124] ననుసూరిలక్షణమును సవరించి యిట్లు సూత్రించిరి. 'అప్రేరణకర్తృవాచకము ప్రేరణమున ద్వితీయాంతము కానప్పు డది కొన్నియెడలఁ దృతీయాంతమును గొన్నియెడల షష్ఠ్యంతము నగును' [తి.కార.4]

వీరిలక్షణమును బరికింతము. పూర్వసూత్రముచే నప్రేరణమునఁ గర్త యగునది ప్రేరణమునఁ గర్మ మగును. దానికిఁ 'గర్మంబున ద్వితీయ యగు' నని ద్వితీయ కావలెను. 'ద్వితీయాంతము కానప్పు డన ద్వితీయ రానపుడు ద్వితీయ రాకుండుట కవకాశ మేది. (వ్యా.సం.న. 974] అది వికల్పము గాదే. ముందు దాని కవకాశము కల్పింపవలె. ఇట్లనుటచేతనె ద్వితీయ రాకుండుటయుఁ గల దని యూహింపవలె. దీనికంటె ద్వితీయకుఁ గొన్నియెడలఁ దృతీయయుఁ గొన్నియెడల షష్ఠియు నగు నని చెప్పు టుచితము గదా.

అప్రేరణకర్త ప్రేరణమునఁ గర్మ యగును గావున అప్రేరణకర్తృవాచకము ప్రేరణమున (ఇంతవఱ కెల్లను పూర్వసూత్రసిద్ధార్థానువాదమె) 'కర్మ మై' ద్వితీయాంతము గానప్పు డన్న స్పష్టముగా నుండెడిది. అది యంతయు నేల? 'దానికి' అని మాత్రమె చెప్పిన తచ్ఛబ్దముచేతనె పూర్వపరామర్శక మఱియు యీయర్థ మెల్ల సిద్ధించి సూత్రము సూత్రమువలె నుండెడిది.

కర్మ యగుటను బ్రస్తావింపకపోవుటచే అప్రేరణకర్త ప్రేరణమునను గర్తయే యుండు నేమో. కర్తకుఁ దృతీయ గదా రావలసినది. ద్వితీయాంతము కానప్పు డందు రేమి యనురీతిసందేహములకు నవకాశము గల్గు. సూత్ర మసందిగ్ధముగఁ గూడ నుండవలెఁ గదా.

అట్లె ద్వితీయాంతము గానపుడు. తృతీయాంతము షష్ఠ్యంతము

అనుటకంటె ద్వితీయ రానపుడు (ద్వితీయకు) తృతీయ, షష్ఠి యగు నని చెప్పుట యింకను నుచితము.

ద్వితీయాంతము గానపుడు కొన్నియెడలఁ దృతీయాంతము, కొన్ని యెడల ననుట నవి రానపు డెట్లును ద్వితీయ రానిస్థితి కావున నిం కేవిభక్తి యగు నని సందేహము. కావున ద్వితీయాంతము కానిచోఁ దృతీయాంతమో షష్ఠ్యంతమో యేదో యొకటి కావలసినదే కాని యాయర్థము సూరిసూత్రముచే స్పష్ట మగుట లేదు.

వీ రిటఁ దృతీయాంతము నై యుండు నని లక్షణమునఁ జెప్పిరిగాని యట్టి దుదాహరించినజాడలేదు. 'రాముఁడు భరతుని రాజ్యమునేలించె' ననుచో రాముఁడు భరతునిచే రాజ్యము నేలించెను. అని యుండ నవు(వ్యా.సం.స. 375) అది వీ రిటఁ జూపలేదు. ఇట్టితృతీయ పూర్వసూత్రోదాహరణములలో గ్రహింపఁదగు నని యెంచి రేమో. (చైత్రుండు మైత్రునిచేఁ బడమి నేలించెను) కాని యిది యచ్చటిగతిబుద్ధిప్రత్యవసానశబ్దకర్మాకర్మకములలో నేది యుఁ గాదు. అందుకే సూరి(వీరును)'ల్యాతిచోసహితము గానంబడియెడి' ననెను కాఁగా నీతృతీయ పూర్వసిద్ధ మగుటచే నిటఁ బ్రత్యేకముగాఁ జేర్కొనవల సినయవసరము లేదు.

ఇంక వీ రిచటఁ జూపినయితరలక్ష్యములలోఁ దృతీయ లేదు. 'కష్టుఁ డర్జునునకుఁదర త్త్వంబుం దెలిపె' ననుచో నర్జునునిచేఁ దెలిపె నని యుండదు గదా. ఇట నెల్ల వీరు షష్ఠినే యుదాహరించిరి. తృతీయావిధానమునకుఁ బ్రయోజనమును జూపిన బాగుండెడిది.

వీరియీలక్షణము 'తత్ర తృతీయా షష్ఠీ చ విభక్తి సమ్మతే ఉభే' అనునధర్వణుని కారిక (వీరివ్యాఖ్యవ్యా.సం.స.374) ననుసరించియున్న దని గ్రహింపవచ్చును.

"అప్రేరణకర్తృవాచకము ప్రేరణమున ద్వితీయాంత మగుటయు (కర్మసంజ్ఞను బొందునవి?) గానపుడు తృతీయాంత మగుటయు (కర్మ

సంజ్ఞను బొందనిచో) సంస్కృతవ్యాకరణమునందియు తెలియఁగల దన్న వి.వి.లోను నిచ్చటను మీరు తృతీయ యేల విధించిరి? అట్లు ద్వితీయ రానపుడు తృతీయ మాత్రమె వచ్చుట కాక కొన్ని యెడల షష్ఠియు వచ్చుట'- (వ్యా.సం.స.374) అని విశేష మగుషష్ఠి యొక్కటి విధింపఁబోలదా?

ఇట విశేషముగా వసులవారు పూర్వసూత్రముచేఁ గర్మమగునవియు నట లక్ష్యములు గాక కర్తయె యగునవియు రెండు నుద్దేశించినచో నీసూత్రమునఁ గర్మమును బేర్కొనకుం టుచితమె. కాని ద్వితీయాంతము గానప్పుడను 'పెట్లు? పూర్వసూత్రము ననుసరించి కర్మసంజ్ఞను బొందనివానికిఁ దృతీయతుః గదా షష్ఠి యవునది. పైఁగా నీసూత్రమున మీరు తృతీయయు విధించిరి. కావునఁ బూర్వసూత్రానుసారముగాఁ గర్మనే యుద్దేశించి రనవలె. అట్టి యవు 'కర్తరి' యని యిటసూత్రమున స్పష్టముగా లాఘవముతోఁ జెప్ప వచ్చును.

ఇఁక సూరి అనభిహితకర్తకు షష్ఠిని బహుళముగాఁ జెప్పె. తిఙాదులచే నభిహితము కాకుండుటయే యనభిహితత్వము. మీ రిట సూరిలక్షణలక్ష్యము లను రెండును బొరపాటుగ గ్రహించిరా యనిపించు.

ఇచ్చట షష్ఠి తృతీయాస్థానిక మనుట సరి గా దని వీరియభిప్రాయము. (రాముడు వేదములను వినెను.) వేదములు వినఁబడెను. రామునకు వేదము వినఁబడె నన్నవి సమానార్థకములు గావా? ఇట వేదములా కర్త యగునా?

సూరిలక్షణమున దోష మేమో స్పష్టము గాకున్నది. సూరి కన్వాది యోగమునఁ బ్రయోజ్యకర్తకు షష్ఠి నిత్య మనుటయు సరి గా దని వీరి యభిప్రాయము. [వ్యా.సం.స.378] "తపయున్నాఁడఁ దమ్ముఁడుఁ గానిపించె నయ్యుత్తరు నడుగుచు" అనుచో నుత్తరుఁడు ప్రయోజ్యకర్త. దీనికిఁ దృతీయ కాక ద్వితీయ యే ల్లఘుమ? గతిబుద్ధిప్రత్యవసానాదులలో నేదియుఁ గాదు గదా యిది. దీనిని మీరు ఉ.దోఁ దమసూత్రమున కుదాహరించుటయు

విశేషమె. అది యెట్లు లక్ష్యమైనదో వీరు వివరింపలేదు. ఉత్తరుఁడు కనెను. అనుచో అర్జునుఁ డుత్తరునకుఁ గానిపించెను అని షష్ఠియె యుండును. "కర్మ" కామి ద్వితీయ రాక కర్తృత్వమునుబట్టి తృతీయయే రావలసియుండ సద్దానికి షష్ఠి నిత్యముగా నైనది.

షష్ఠి నిత్యము గా దన్నచో నది రానిపక్షమునఁ గర్తృత్వమునుబట్టి తృతీయ యై ఉత్తరునిచేతఁ గానిపించె నని కావలెఁ గాని 'ఉత్తరుని గానిపించెను' అని ద్వితీయ యగుట యెట్లు?

మైత్రుఁడు వందెను, చైత్రుఁడు మైత్రునిచేత వందించె ననుచో 'మైత్రుని వందించెను' అని మైత్రశబ్దము కర్మ మై ద్వితీయ నందుచున్న దా? అట్లె యైకనుధాతువువిషయమునను.

వీరే అన్వభిహితకర్తృవాచకమునకు రావలసినతృతీయ పాక్షికముగ నైన దా దనియు షష్ఠియె నిత్యముగా వచ్చు ననియు' (వ్యా.సం.స.877) సూరివివరణము తాత్పర్యమును పేర్కొనిరి. అట్టియెడల 'షష్ఠీనిత్యత పొనఁగ' దని (వ్యా.సం.స.878,ఉ.213) చెప్పఁదలఁచుచో షష్ఠి రానపుడు రావలసినతృతీయతోఁదిరూపమును బ్రదర్శింపవలెఁ గాని యవకాశమె లేనిద్వితీయను జూపు టెట్లు? ఇఁక నిట్టిప్రయోగములను బూర్వసూత్రమునొద్ద 'లాఁటి' స్థలములలోఁ జేర్చి సాధించుకొను టే సుచిత మైయుండఁగా వరుసవారు తమవ్యాకరణమున నీసూత్రమునొద్దఁ జూపుట వింత.

కుశలవులు రాముని రామాయణము వినిపించిరి. అనురీతిస్థలములు గూడఁ గ్వాచిత్కమె యనక తప్పదు. "రామునికి వినిపించిరి" అనురీతిని షష్ఠియె ప్రసిద్ధము.

గతిబుద్ధ్యాదిపూర్వసూత్రమునకు సంబంధించినదిగాఁ గాక కృష్ణుఁ డర్జునునకుఁ దెలిపెను- [అర్జునుని దెలిపెను] కృష్ణుఁ డర్జునునికిఁ గానిపించె ననురీతిగా నెల్లయెడల సంగ్రహింపఁబడునట్లుగా "అన్వభిహితకర్తకు" అని సూత్రే పేర్కొన్నలక్షణ ముచితమె.

శిష్యులను జదివించెను. శిష్యులచేతఁ జదివించె ననురీతియు సాధింప వీరు తృతీయను బ్రత్యేకముగాఁ దమసూత్రమునఁ బ్రస్తావించి రేమో. కాని యసమగ్రముగాఁ జెప్పుటచే నీయర్థము సిద్ధింపకున్నది.

సూరిసూత్రమం దున్న బహుళపదమును "ఒకానొకచో" ననుదళమును శిష్యులను జదివించెను, శిష్యులచేతఁ జదివించె ననురీతిని ద్వితీయకును సాధకమైయున్నయివిశేషములు. గవిప్రయోగానుసారముగా గుర్తించుటకు వీలుగా సూరిలక్షణమునూక్త మైయున్నది.కాన విశేషములు ప్రయోగములం దెలియవలె.

ఇది త్రియకాపరిచ్ఛేదము.

# కృదంత పరిచ్ఛేదము

### కృత్తులు-అర్థములు :

'కృత్తుల కర్థంబులు యథావ్యవహారంబుగ గ్రాహ్యంబులు' (1) అనుసూరిసూత్రమును వీరు 'ఆచ్ఛికకృత్తులయర్థములు యథావ్యవహారంబుగ గ్రాహ్యంబులు' (ఉ.1) అని చెప్పిరి. 'ఆచ్ఛిక' విశేషణము నధికముగాఁ జేర్చుట విశేషము. ఇది సూరియభిప్రాయమునకు వివరణమె. వీరు సంస్కృత కృత్తులను గూడ నిరూపించిరి గావున నిట నాచ్ఛికవిశేషణమును జేర్చిరేమో' కాని సంస్కృతకృత్తులవిషయమునను కృత్తులును వానియర్థములును సాధారణముగాఁ బ్రయోగవేద్యములె' (ఉ.4467) యనుట గమనార్హము.

సంస్కృతతద్ధితాంతములు సిద్ధసమాసములవలెనె సంస్కృతకృదంతములు లక్ష్లై తెలుఁగునఁ బ్రాతిపదికముగా నిల్చి తత్సమము చేర్పఁడును. 'రామ' మొదలగున వ్లై. రాముఁడు. వీరు నిరూపించుట ప్రయోజనవంతమె యనవచ్చు.

### కృత్తు :

'కృదతిఙ్' అనులక్షణము ననుసరించియే సూరి 'ధాతువునకు విహితం బగుచుఙ్భిన్నప్రత్యయం' బని వివరించెను. దీనింగూర్చి వఝలవారు ఈపక్షమున ఇంచుక్కు మున్నగునవియుఁ గృత్తు లనుభ్రాంతి కల్గును' (ఉ.432) కావున సూరివివరణము పొరపా టని వీరినిర్ణయము. అందుకే వీరు "ధాతువునకుఁ బరముగా విహితము లగుప్రత్యయములతో" దుఙ్జును (క్రియా.16) ఇంచుక్కును (క్రియా.2,73) చుక్కును (క్రియా.78)

పుక్కును (క్రియా.77) పత్వనుబంధమును (క్రియా.59)కొనుశబ్దంబును (క్రియా.82) అనునవి తప్పఁ దక్కినయావలకు నుపదేశించిన టు మున్నగు (క్రియా 48సూ. మొ 57సూ.వ) ప్రత్యయములును విట పైనిఁ జెప్పఁబడు కప్రత్యయాదులును కృత్తు లనఁబడును' (ఉ.432)

అనఁగా సూరివివరణము ననుసరించి ఇంచుక్, చుక్ మొద లగునవి యెల్లఁ గృత్తులు గావలయు నని వీ రెంచి రనుట స్పష్టము. కాని యిది యసంగతము. సూరి ధాతువుకంటె విహిత మైనట్టి 'ప్రత్యయమును' గదా కృత్తు అని చెప్పినది. ఇంచుక్కు, చుక్కు పుక్కు అనునవి ధాతువు కంటె విహితము లయినను నాగమములే కాని ప్రత్యయములు గావు గదా. కిత్త్వముచే ధాతువున కంతాగమము లై ధాత్వవయవములే యగును. ఆగమములు ప్రత్యయము లగుట యెట్లు? కాక వీ రాగమములు కృత్తు లని యూహించిరి. ఇక్కడ 'కొను' శబ్ద మాత్మనేపదార్థమున ననుప్రయుక్త మయిన ధాతువే కాని ప్రత్యయము కాదు. ఇక్కడ "పదు" అనుబంధము. కాఁగా నివి కృత్తులు గావలసివచ్చు నని వీరు వ్రాయుట కేవలము పొరపాటు.

ఇంక వీరివివరణమే ప్రమాదములతో ననర్థక మై యుండుట గమనింపవచ్చును.

ఇంచుక్చుక్పుక్కు లాగమము లగుటచేతను. పదు అనుబంధ మగుటచేతను, కొనుశబ్దము ధాతు వగుటచేతను, వీనిని "ఈవల నుపదేశింపఁబడిన ప్రత్యయములు" అని ప్రత్యయములుగాఁ జెప్పుచోఁ బ్రస్తావించుట యనుచితము. ఇవి ప్రత్యయము లైనఁ గదా, యేతద్భిన్నము లగుప్రత్యయము లనుట యొప్పును.

ఇంచుగాదులను జేర్చునపుడో వీరు తద్విధాయకసూత్రములను గూడ నిర్దేశించిరి. కాఁగా నిపుడే వీరు చూపినవానికంటె వేఱుసూత్రముల విధింపఁబడినవో (ప్రత్యయేతరముల యయ్యును) గృత్తు లగు నని చెప్పవలసియున్నది.

క్రియా 2,73,76,77లచేఁ జెప్పఁబడినయించుకప్రత్యయములను వీరు నిర్దేశించిరి. అయిన క్రియా.79,84,85,86. మొదలగుసూత్రములచేఁ జెప్పఁబడినయాయవి కృత్తులే కావలె. అడఁచు, మాపు పెలువరించు మొ॥ కృదంతములు గావలె.

ఇట్లె పడుకొనుట క్రియా.56,62లచేఁ జెప్పఁబడినవి నిర్దేశించుటచే క్రియా 118చేఁ జెప్పఁబడినయవి కృత్తు లవును. నిలఁబడు పండుకొను ఇత్యాదులు (ధాతువులు) కృదంతము లవవలె.

ఇట్లే వీ రిటఁ జేర్కొనవివి కొన్ని యుట్టియనుబంధాదులు గలవు. అవి యే మగును? కర్మార్థమున పడువలె వర్తమానమున ఉన్న ధానిని కల అనుబంధములుగాఁ జెప్పఁబడినవి. ఇవి కృత్తులా? లడాదిపరకత్వమునఁ జెప్పుటఁ గృత్తులు గా ననుకొందమా? కాని క్రియా 114చే ననుప్రయుక్త మన్న తెలచుధాతువు, (ఘటకక్రియలు) శబ్దపల్లవములా? కృదంతము లగునా?

ప్రత్యయేతరము లెల్లఁ బ్రత్యయములుగాఁ దలఁచి సూరి నిర్వచనమును దిరస్కరించినవీరిలక్షణము మిక్కిలిగా నతివ్యాప్త మగుచు నసర్థక మైనది. కాన విది యగ్రాహ్యము.

సూరివివరణమున నన్న ప్రత్యయేతరమునకుఁ బ్రసక్తియే లేకుంట వీసూత్రముచే నైనను వించుగాదిప్రత్యయభిన్నములకుఁ గృత్సంజ్ఞ లేకుంట సముచితముగా సిద్ధించును. సూరివివరణమె సమంజస మై గ్రాహ్య మై యున్నది. సూరిలక్షణమున వీరు చూపినదోష మందు లేదు గాని దానిని దొలగింపఁబూనినవీరివివరణమున విస్తరించినది.

## లోపవిధి :

'ఇటం గృత్కగతపవేములు పరంబు లగునప్పుడు కగచయవలకు లోపం బగు' (2) ననుసూరిలక్షణమును 'ఇటం గృత్కగతపవేములు

(వ + ఇమి) పరంబు లగునపుడు ధాతువుతుది నున్న కగచయవలకు లోపం బగు' (౨)నని చూపిరి.

(వ + ఇమి) అని చూపుట వివరణము. ఇది సూత్రమున సవవ నరము. వివరణ మెట్లును విడవ వ్రాయుచున్నారు గదా. 'ధాతువుతుది నున్న' అనుభాగమును సూరికంటె నధికముగాఁ జెప్పిరి. ఇదియు వివరణమే. ఈకగతపవేములు కృత్తులు. ఇవి ధాతువునకే విహితములు. కావున ఇవి పరంబు లగునప్పు డవిఁగా ధాతువున కనునర్థము స్పష్టమే. ధాతువులు గాని వాని కివి రావు గావున నటఁ బర మగుట సంభవింపదు గదా. ఈపరము లగునప్పు డనుటచేతనే ధాతువునకుఁ దుది నున్న (కగచయవ) లనికే యాకార్య మగుట స్పష్టము. ఆగమాన్యదేశాంబుల కద్విరుక్తములకు ముత్తు పరం బగునపుడు వవ లగు' (ఉ.క్రి.౯౧) ననుచో ధాతువుతుది నున్న యాగమాన్యదేశముల కనిరా? అయితను "పచింపఁడు" అనుచో ధాతువుతుది నున్నదానికె కదా ప్రత్య మయినది. వే తొకదాని కయినదా? ఇట్లే ఉ.క్రి.౬౯మొ॥ కాఁగా నిటఁ గూడ "ధాతువుతుది నున్న-" అనవి సూరిలక్షణమున ననసిద్ధాంత మేమియు లేదు. అయ్యు వీరి ట్లనుట విశదించుటయే. అయ్యది వివరణమునఁ జెప్పఁదగు.

సూరిలక్షణము సూక్తము.

## వ్రేలిమి :

బాల.కృ.౩,౪సూత్రము లట్లు గ్రహించిరి (ఉ.౩.౪సూ) వీరాయా కృత్తుల నర్థముతోఁ జూపుట ప్రశంసార్హము.

సూరి- వ్రేలుచు- వ్రేలిమి అని యుదాహరింప వీరు "వేలుచు-" అని దేఁపను దొలఁగించిరి. "వ్రేలుచు- అనుదానికి హోమము చేయు అను అర్థము లేదు. (ఉ.౪౩౪)(వ్యా.సం.స.౧౭౧౮) అందుకే వీరు సం.లో సూరి

వచనములందును వీని రేఫరహితములుగాఁ జూపిరి. (వ్రేలిమి అనెడుపకార రేఫసంయుక్తరూప మేకోశములందును లేదు. (వ్యా.సం.ప.1718) కాని సూ.ని. వేలుపతోపాటు వ్రేఁపు (వ్రేలిమి)శబ్దము నీయర్థముతోఁ జూపినది. వ్రేల్మి వ్రేల్మిబొట్టు మొ॥ మారిపేర నున్నయాంధ్రధాతుమాలలో వ్రేల్చు- వేల్చు రెండును జూపఁబడినవి.

## పోరాటు :

బాల.కృ.5,6,7,సూత్రము లిట్లు గ్రహించిరి. (తె.5,6,7) "పోరాట అనియుఁ గలదు. నీటిపోరాటం దోటమిపాటు (భాగ.గజేంద్రో)-కానియాట అనియే యున్నది. (తె.436) సూరి ననుసరించి 'అనుప్రయుక్తం బగు ఆటశబ్దము ప్రాయికముగాఁ గ్లీబసమ'మనుచో టిప్రాయికశబ్దమున కిది ఏప కరణముగా నుచిత మైయున్నది.

## పవర్గకాంతములు :

బాల.కృ.8.9సూత్రము లట్లు గ్రహించిరి. (తె.8,9,సూ.) "ఈపవర్గకాంతములు ప్రాయికముగా నపుంసకలింగసమములు." (తె.437)పి దిట సూరి ననుసరించి యుదాహృతు లిచ్చిరి-అవి యెల్లఁ గ్లీబసమములే-పువర్గకాంతము లై యున్నవి. 'ప్రాయిక' మనుటకుఁ గ్లీబసమము గానిపవర్గకాంతము నుదాహరించిన బా గుండెడిది.

ఇట సూరి కలియున కత్వమును జెప్పుటంగూర్చి "కలియుధాతువు నకుఁ బర్యాయ మగుకలయుధాతువు సూరిగారికి స్మృతి గోచరము కాలేదా యని యాలోచింపవలసియున్న" [వ్యా.సం.ప,1724] దనిరి. అట్టియెడల 'కలపము' కలయుధాతునిష్పన్నముగా గుర్తించి 'కలియు'ను తిరియ్యాదు లతోఁ జేర్చుకుందు రొక్కొను. కాని వీరు తె.లో. 'కలియు- కలయు- ప- కలపము' అని చూపిరి. [437] కలియు- కలయు- కావలె నన్న వీరు సూరివలె నిట నత్వమును వివరింపలేదు. మఱి యిటఁ 'గలియు' నేల చూపిరో.

## అప్పాదులు :

బాల.కృ.10,11,12,సూత్రము లట్లె గ్రహించిరి.[ఉ.10,11,12సూ.]

'అప్పాదులకు నజీ యగు' [13]సను సూరిలక్షణమును వీరు 'పీచు ప్రకృతులకు నజీ యగు' [ఉ.13సూ] అని సవరించిరి. 'సూరి అప్పాదులకు నజీ యగు' అని సూత్రించుట సరి గాదు. అవి కృదంతము లనరాదు' [ఉ.428] అప్పన- ఒప్పన- ఉజ్జన గట్టన గడన మన్నన అనుశబ్దములు అర్పణాదిభావార్థకాంతసంస్కృతశబ్దభవము లగుటచేత వీనిలోని "న"అనునది యాచ్ఛికకృత్ప్రత్యయ మనుట సరి కా దని తోఁచుచున్నది. సూరి భ్రమించి యిట్టిప్రకృతిప్రత్యయవిభాగము చేసె ననఁదగును' [వ్యా.సం.న.1751]

ఇవి తద్భవములుగా విశ్లేషమేర్పడియుండవచ్చును, కావి సూరి యిట్లు ప్రకృతిప్రత్యయవిభాగము చేయుటలో భ్రాంతిపడె ననరాదు.

ముఖమ్- మొగము ఇత్యాదులందు మొగప్రకృతి, "ము"ప్రత్యయ మని విభాగింతురు గదా. "ముఖ" యనుదానినుండి"మొగ"యనియే తద్భవ మేర్పడె ననలేము. అట్లె అప్పన అర్పణాశబ్దభవ మైన నవర్ణము కృత్తుగాఁ జెప్పుటలో దోషము లేదు. అవసరమును.

సూరివలెనే వీరును క్రి:సూ.81సూ.వద్ద అప్ప- అప్పగించు అప్పించు అప్ప [అర్పణ] [ఉ.407] అని చూపిరి. దీనినుండి అప్పగింత ఒప్పగింత యనురీతికృదంతములు నేర్పడును. అట్టియెడల అప్పించు, ఒప్పించు, ఉజ్జగించు, గడించు, మన్నించు, గట్టించు [శ.ర] అనుధాతురూపములనుబట్టి "అప్ప" ఇత్యాదు లాచ్ఛికధాతువు లనుట స్పష్టమే. అట్టియెడల అప్పన ఇత్యాదులలోనియప్పాదు లాచ్ఛికధాతువులే అయినపుడు మీఁదినవర్ణకమును [నాచ్ఛిక]కృత్తుగా విధించుట యొప్పును గదా. అప్పాదులు తెలుఁగునఁ బ్రత్యేకముగా ధాతువు లై యుండుటనుబట్టియే సూరి యీరీతి నవర్ణమును కృత్తుగా విధించె ననియు నద్యాది యుచిత మనియు గుర్తింపఁదగు.

వప్పులవా రిట అర్పణాశబ్దభవ మప్పన అని చూపిరి. క్రియా 81.సూ.వద్ద అప్ప.(ఒప్ప) అప్పణ అని చూపిరి. అప్ప ఒప్ప అన్నవి

అర్వాణకశబ్దభవము లని కాక తదర్థకము లని చెప్పుట యుద్దేశ్య మేమో.

కాన సూరి యప్పారవుల కనుట సూక్తమె. వీరె పీచుప్రవర్తకు లనుట వారిపద్ధతికి బాధకము. (చూ.ఉ.క్రి.117)

## పుట్టువు :

బాల.కృ.14నుండి17సూత్రము లట్లె గ్రహించిరి.(ఉ.14-17)మన్వాదులలోఁ బుట్టుధాతువును జేర్చి 'పుట్టువు' అని వీరు విశేషముగా నుదాహరించిరి. (ఉ.441) (వ్యా.సం.స.1736) 'పుట్టుగు' అనియు రూపము గలదు. అట వకారమున గకార మైన దనవలె. విచార్యము.

## గీర్వాదులు :

బాల కృ.18 20సూత్రముల నట్లె గ్రహించిరి (ఉ.18-20) కాని యట గీర్వాదుల మున్నగుచోట్లఁ 'ర్వా' అనుదానికిఁ బదప (ర్వ) యని కుండలీకరణమునఁ గూర్చి చెప్పుట వీరిలక్షణముల విశేషము. ఇట్లు చూపు టనవసరము.'అలఘురేఫంబు లుష్ట్రాద్యంబగుచో లఘురేఫం బగు'(ప్రౌఢ. ము.ల.2) నని సాధురేఫ మగు నని యనుమానింప ['ర్వా' యని ప్రధానముగాఁ జూపిరి గదా] ననవసరము లేదు. [ఇట యణాదేశకారణమున నలఘురేఫముపై వచ్చు లోపించు ప్రసక్తి లేదు] ''గీరు' మొద లగు నీశబ్దములు సంస్కృతమున ననుకరింపఁబడుటంజేసి యణాదేశము మొద లగుసంస్కృతలక్షణమె యందు వర్తించును గాని (యలఘురేఫమునకు లఘురేఫ మగు నను) నాంధ్రలక్షణము వర్తిల్లరాదు. కావున వీరు ['ర్వ'] యని చూపుట సరి కాదు. అనుకరణ మగుటంజేసి శకటరేఫ మం దుండుట యుచితమె.

## మఱికొన్నికృత్తులు :

బాల.కృ.21,22సూ. లట్లె గ్రహించిరి. [ఉ.21,22] పిదప వీరు 23-29 ప్రౌఢ.నుండి 30-33 బాలవ్యాకరణమునుండి లక్షణములు ప్రస్తావించిరి.

పిదప వీరు "తెలియుటకు విడియు కొనుటకు కోలు నగు" (ఉ.౨౯౬సూ) నని చెప్పిరి. "ఇందు కొనుటకు కోలును" అని సామాన్యముగాఁ జెప్పుట యుచితముగా లేదు. దీనివలనఁ గొనుట కెల్లయెడల -ప్రత్యేకముగా నున్నను 'కోలు' రావలసియున్నది. కాని వీరు పొగడికోలు మున్నగురీతి నను ప్రయుక్త మగుకొనుటకే కోలు అగుటను జూపిరి. కొనుట యనునర్థమున 'కోలు' అని యుండదు. కావున నీ 'అనుప్రయుక్తం' బగుకొనుటకుఁ జెప్పుట యవసరము. అనుప్రయుక్తమునకును నెల్లయెడల లేదు. వండికొనుట యనుదానికి 'వండికోలు' అనురూప ముండదు. 'కొన్నియెడల' ననుటయు నవసరము.

ఇంక వీరు 'కొనుటకు కోలును' అగు ననఁగాఁ గొనుధాతువుపైఁ గోలు అను (కృత్) ప్రత్యయ మగు నని యర్థ మగును. ఈసూత్రమునఁ బూర్వార్థమునందుఁ 'దెలియుటకు విడి' యనఁగాఁ దెలియుధాతువుపై 'విడి' కృత్తుగనే గదా యవునది. ఇంక వీరిలక్ష్యములనుబట్టి 'కొను' అనుదానికిఁ గోలు ఆదేశముగా వచ్చుట యుద్దేశించి రనవలె. ఆయంశము సూత్రమున స్పష్టము గాదు.

'కొను' ధాతువు కావున దాని కాదేశ మైన 'కోలు' అనునదియు ధాతువే యగును. 'కోలు' కృదంతముగా (భావార్థకము) వీ రుద్దేశించి రనుటకు వివరణమునను నాధారము లేదు. పొగడికోలు- (పొగడు + కొను) అను రీతిగనె 'కొను'నే చూపిరి. పొగడికొను- పొగడికోలు అనునవి సమానార్థకము లని చెప్పవలసివచ్చుట వీరిలక్షణమున నింకొకయనర్థము. ఇటుఁ గృత్ప్రత్యయ మనుక్త మైన దనక తప్పదు.

పొగడికోలు- పొగడికొనుట కావున 'కోలు' కొనుటకుఁ గాక భావార్థకప్రత్యయాంత మగు 'కొనుట' కాదేశించు "భావంబునం దనుప్రయుక్తం

ఉనుకొనుచున్ గోలు విభాష నగు" నను ప్రౌఢ.లక్షణము దీనికంటెఁ గొంత యుచితము. ఇట సమ్ప్రయుక్తము "కొను" అనునదే. "కొనుట" మొత్తముపై సంప్రయుక్తము గాదు. అసంప్రయుక్త మైనకొనుపై "ఉ"వర్జిత మగును గావున ప్రౌఢ.లక్షణము నించుక మార్పు నపేక్షించుచున్న దని తోఁచు. (సూ.ప్రి.శే.)

దీనింబట్టి చూడఁగా పోఁగడికోలు అనుశబ్దమునఁ బొగడికొనుట యని యు నుండనవు. కావున కోలాదేశమును విభాషగాఁ జెప్పవలె. ప్రౌఢ. అట్లు చెప్పు టుచితమె. మొత్తముపై వీరు "కొనువకు కోలు నగు" నని చెప్పినలక్షణము వా రుద్దేశించినయర్థము నీఁజాలదు. సరి కాదు.

వేఁడికో లుచితంబు (ఆది.5.218) ప్రాణంబుల్ నాఁచికోల్ దప్పదు (సౌప్తి.2.14) అచ్చిం బుచ్చికోలున్ [ఉద్యో.1.232] ప్రాణంబు రక్షించుకోలు (హరి.పూ.7.65) మొదలగుచోట్ల వేఁడికొనుట యనురీతి నర్థము స్పష్టము. తెచ్చికోలేడ్పులు [కాశి.4.30] అనుచో [తెచ్చికొనునట్టివి యగునేడ్పులు] నర్థమున భేదము గోచరించు.

ఇంపు-అడ :

ఇంపు అడప్రత్యయాంతములను వరులవారు సాధువులుగాఁ దలఁచు టుచితముగా నున్నది. అయ్యవి విధింపఁదగినవి. [ఉ.377]

దాకొలితాటింపులు (శృం.శా.1.89] తాలింపులు [జై.3.56] మాటలలో వందగింపు [కువ.5.5] వీని కారగింపు సేయఁగా [శుక.3.191]కోటమట్టడము దక్కి [హరి.ఉ.1.25] సోలడములు [శృం.శా.3.220] చల్లడములతోన్ [కువ.2.398] మొ॥

వీరును "ఇవ" మొదలగుకృత్తులు వివరించిరి. ప్రౌఢ.ప్రభృతిలక్షణముల వీట సంగ్రహింపఁదలఁచియే యుండిరి కావున "వది ప్రభృతులు లిఙ్గ లుంగునది యనుపరిచ్ఛేదాంతలక్షణమును వీరు నిట నీపరిచ్ఛేదముచివరఁ

వేఱొక్కన్న బా గుండెడి దనిపించు.

"ఇది అచ్ఛికకృదంతపరిచ్ఛేదము" అని దీనిని ముగించి పిదప సంస్కృతకృదంతములు చెప్పి చివర "ఇదిసంస్కృతకృత్పరిచ్ఛేదము" అనిరి. ఇది యెల్లఁ "కృదంతపరిచ్ఛేదము"లోనివిషయమే. దాని నాచ్ఛికకృదంతము సంస్కృతకృదంతమును గలయవి ప్రకరణములుగాఁ వేఱొక్కన్న బా గుండెడి దేమో యని తోఁచును.

కావునో మొదటనే కృదంతపరిచ్ఛేద మని సామాన్యముగాఁ గాక "అచ్ఛికకృదంతపరిచ్ఛేదము" అని ప్రారంభించి, సంస్కృతకృదంతములను "సంస్కృతకృదంతము" అని కాక సంస్కృతకృదంతపరిచ్ఛేదము" అనుపేర "కృదంతపరిచ్ఛేదములు" రెండు చెప్పవలె.

ఇట్లై తద్ధితపరిచ్ఛేదవిషయమునను.

రెండుతద్ధితపరిచ్ఛేదములు రెండుకృదంతపరిచ్ఛేదములు చెప్పుటకంటె నొకపేర[తద్ధిత]పరిచ్ఛేదమున నాచ్ఛికతద్ధితప్రకరణము, సంస్కృతతద్ధిత ప్రకరణము, ఇట్లై [యొకే కృదంతపరిచ్ఛేదమున] అచ్ఛికకృదంతప్రకరణము. సంస్కృతకృదంతప్రకరణము" నని నవాంతరవిభాగము,ప్రకరణములుగాఁ జెప్పిన బా గుండెడిది గదా.

ఇది కృదంతపరిచ్ఛేదము.

# ప్రకీర్ణకపరిచ్ఛేదము

తద్గ్రంథమున నీపరిచ్ఛేదమె లేదు. ఇందు, పెక్కు విషయము లాచ్ఛిక శబ్దసంబంధు లగుటచే వీ రందుఁ జేర్చిరి. "ప్రకీర్ణకముగా" నీపరిచ్ఛేదమును బేర్కొనుటలోనె సూరియు నిందలిలక్షణము పూర్వోక్తము లగునాయా పరిచ్ఛేదములతో సంబంధించియుండుటను సూచించెను.

## ఋౠ-రలతుల్యత :

"సదావ్యంబుల ఋౠవర్ణంబులు రలతుల్యంబులు" [1] అనుదాని నట్లె గ్రహించిరి. [సంధి.2] వీ రిది యుత్వసంధికిఁ బిదపఁ జూపిరి. ఇది యుత్వసంధికి మాత్రమె కాక ద్రుతకార్యాదు లగునితరాంశములను బ్రయోజనవంత మగుట యిటనే స్పష్టము.

## నత్వైరం :

"ఆచ్ఛికపదంబులం దుత్తమంబు లగురుబుధుల ముందటియేత్వంబునకు హ్రస్వంబు విభాష నగు" [2] ననుసూరిలక్షణమును వీరు "ఆచ్ఛికసమానపదంబులం దుత్తమంబు లగురులుధులముందటి"ఏ"త్వంబునకు హ్రస్వంబు విభాష నగు" [ఆచ్ఛి.32సూ] అని చూపిరి. "ఏ"త్వంబున కనుచో యడాగమాభావము స్పష్టతకె. ఇది యవిందక్షగ్రామ్య [ఉ.సం.24] మని వీరిమతము సూరి "ఆచ్ఛికపదంబులం దనఁగా వీరు "ఆచ్ఛికసమానపదంబులం" దని సమానపద మధికముగాఁ జెప్పిరి. "ఉత్తమంబు లగు" ననుతరువాతమాటలనుబట్టియే కాక "ఆచ్ఛికపదంబునం దన భిన్నపదముల నను మ నని యర్థ మగునవకాశమె లేదు. "సంస్కృతసమేతరంబు లయిన తెలుఁగుశబ్దములయందు". [ఉ.సం.16] మొదటిస్థలములో సమానపద మున్న

దా? ఇది లేనిసూరిలక్షణమున నెట్టియుపసిద్ధాంతమును లేమి వీరు "సమాన" శబ్దమును జేర్చుట వివరణప్రాయ మనఁదగు.

సూరిలక్షణము సూత్రమె. ప్రాతిపదికాంత్యవికారము, మొదట లగు నాచ్ఛికపరిచ్ఛేదోక్తలక్షణములకు భిన్నముగా నిది ప్రాతిపదికసరిమివికార మగుట గమనింపవచ్చును.

## ఉయ్యేల :

బాల.ప్రకీ.8.4సూత్రము లట్లె గ్రహించిరి. [ఉ.అచ్చి.33,34సూ]

"ఉయ్యేల — వీనియందు సమా 78వసూత్రపుద్విత్వపరకహ్రస్వము గల్గుచున్నది" [ది.173] ఇట "78వ"యనుట యనిందద్యగ్రామ్యముగా నేమో. ఇఁక నిట్టివివరణము సూరిలక్షణమున [సమా.13] సరిపడును. వీ రాలక్షణమును మార్చి ప్రస్తుతస్థలమున నుపయోగపడకుండఁ జేసికొన్న విషయము మఱచిరి. "ద్విరుక్తం బగుహల్లు పరం బగునపుడు పదద్వయ సంధిలో నాచ్ఛికం బగుదీర్ఘంబునకు హ్రస్వం బగు (ఉ.సమా.78) నను వీరిసూత్రముచేఁ పదద్వయసంధియందే హ్రస్వము. "ఊచు + ఏల-ఏల-ఎల-ఊయెల ... అని చేవ మనియు నివి సమానపదములు గా వనియుఁ జెప్పెడియుప్పకవ్యాదులవ్రాఁత సరి కాదు" (ఉ.173) గదా, ఊయేలాదు లెల్ల సమానపదములే గావున వీటఁ బదద్వయసంధిప్రసక్తియే లేదు, వీరి సూత్రముచే నిట హ్రస్వము రాదు. "ఊయ్యేల" యనుదీని సపరూపములే వీరిలక్షణము నిరూపించును. సమా.78సూత్రముతో వీరు సూరి అచ్చి.13.లక్షణమును సవరించుట యసమంజస మనియే యంగీకరింపవలె. లేదా సమాన పదములం దిట్టియెడల హ్రస్వము నిం కొకసూత్రముచే విధించుకొనవలె.

ఇట సూరిచూపినఓయశబ్ద మేకోశమందును గానరా(వ్యా.సం.స.1758) దనిరి. ప్రయోగములం బరిశోధింపవలె.

## అక్కటాదులు :

బాల.ప్రక.5,6,7,8సూత్రముల నట్లు గ్రహించిరి. (ఉ.అచ్చ.35.36,25.26)

అక్కటాదులలో (సూరి పేర్కొన్నయిత్యాదులలో) వీరు 'అద్ది ఇద్ది ఎద్ది ఎవ్వఁడు ఎవ్వాఁడు'లను జేర్చిరి. వీనిం జేర్చినవీరు అవ్వి ఇవ్వి ఎవ్వి యనునుపహాంతపదానంతరూపము లేల పేర్కొనలేదో. ఇట దివిప్రత్యయము లను, నట ద్విత్వమును జెప్పి ప్రౌఢ. అద్ది ఇద్ది ఎద్ది అనువానిని సాధించినది.

అద్ది ఇత్యాదులలో ద్విత్వలోపమునకై వీని నక్కటాదులలోఁ జేర్చవలె నన్నఁ బ్రత్యయము 'ద్ది' అని చెప్పవలె. ఇట్లు చెప్పినచో అయ్యది ఇత్యాదులలో ఇద్దలోపము నిత్య మనవలె. విభాష కట్టివ్యవస్థ చేసికొన వీలు లేకపోలేదు. కాని ప్రత్యయము నద్విత్వముగా విధించుకొన్న నేల? కొన్ని యెడల నిత్యముగను గొన్ని యెడల వికల్పముగను లోపమును జెప్పుకొన నేల? [నన్ను ఇత్యాదుల నిత్యలోపమును జెప్పనవసరము లేమి గమనింపఁ దగు-నన్నైటె) కావునఁ బ్రౌఢ. పేర్కొన్నట్లు ప్రత్యయములు దివి యని పేర్కొని యవసర మైనచోట ద్విత్వము వికల్పముగా విధించుకొనుటయే యుచితము. కావున వీని నటఁ జేర్పరాదు.

## మన సేకాగ్రత :

'జడ్డక్కారంబుతోఁ బదాది స్వరంబు గూడుచో జడ్డకు లోపంబు లేదు. (9)అనుసూరిలక్షణమును వఝలవారు 'జడ్డక్కారంబుతోఁ బదాదిస్వరంబు గూడుచో 25.26(అచ్చ)సూత్రములకు లక్ష్యము లగుజడ్డలకు లోపములేదు' (ఉ.అచ్చ.27)అని సవరించిరి. సూత్రముగా దీనిస్థితి విలక్షణమె. "25,26 సూత్రములకు లక్ష్యము లగు" అనుటచేత మనసేకాగ్రత (శాంతి.5.121) మున్నగునవి విరోధింపనేర [ఉ.170]వని తమసవరణమునకుఁ బ్రయోజనమును వివరించిరి. సూరిలక్షణమున కివి విరోధించు నని తాత్పర్యము.

ననుచో మాత్రమె యిష్టరూపసిద్ధి మిగిలినచోట్ల జడ్డలోపముచేఁ బరరూపసంధి లే దనుటవలన అఱు + ఎత్తె = అఱెత్తె నని సంధి జరుగదు గాని సంధి లేనప్పుడు రావలసినయడాగమము రాదా? పరరూపసంధి లే దనిరే కాని యడాగమము లే దనలేద వీరు. అఱుయెత్తె. కనుయదరె నని యుండదా? యడాగమము లే దందురు గాక అఱు ఎత్తె కను అదరె నని యుష్టియుండవలె నట్టివి మాత్ర మున్నవా? అఱెత్తె నని మాత్రమె యుండును గాని యుం కొకతీఱుగా నుండ దనియే సూత్రపుఁబర్యవసితార్థము. జడ్డలోప మైనఁ బరరూపసంధి కా దని కాదు పరరూపసంధి యగుచో జడ్డలోపము లే దని. (చూ.త్రి.శే.) కావున వీరియీవివరణ నమంజసము.

## తొలిహల్లులోపము :

'హాదులయు నీలుగులోనగువానితొలిహల్లునకు లోపంబు బహుళంబుగ నగు' (10) అను సూరిసూత్రమును వీరు 'హాదులయు నీలుగుప్రభృతులయుఁ బదాదిహల్లు వికల్పముగ లోపించు' (అచ్చ.28) ననిరి.

'లోనగువానితొలిహల్లున' అను సూరివచనమునకు వీరి "ప్రభృతులయుఁ బదాదిహల్లు" అన్నది వివరణమా? సూరివచనముల నపసిద్ధాంతమేమొ? వివరణముగానే యైనను వీ రధికముగాఁ జేర్చిన "పద"శబ్దము వలన చిక్కుంది. "హాదు లైనపదము లయు, నీలుగుప్రభృతు లైనపదము లయు" ననురీతిగా నన్వయింపవలెఁ గదా. కాని నీలుగుప్రభృతులు పదములా? సూరివలెనె వీరును నీలుగు నెగయు అనురీతిని ధాతువులనే ప్రకృతులనె చూపిరి.] ఇఁక నీయవి క్రియావిభక్తులో కృత్తులో చేరి పదము లైనపుడే తొలిహల్లు లోపించు నని యెంచిరా? అది యనవసరము. వీరు నట్లు తలఁచినట్లు లేదు.

సూరిసూత్రము సూక్తమె కదా.

## పూను-పొదవు :

పూనుపొదవుల కాదిలోపమును సూరి తిరస్కరింపఁగా రవ్వాఁడిని నీలుగుప్రభృతులలోఁ జేర్చిరి. అనఁగా సూరియభిప్రాయము సరి గా దన్న మాట.

ఆద్యక్షరలోపముఁ జేర్పరిన దని యంగీకరించినశబ్దములకును నాద్యక్షరలోపము లేని మొదటిశబ్దములకును నర్థములం (సకర్మకత్వాదులం) దించుకేని భేద ముండరా దని సూరిగారియాశయము -- ఇది గ్లగుటం జేసియె సూరి -పూనుపొదవు- అని వ్రాసెను' (వ్యా.సం.స.797) సూరి యాశయము సమంజస మై యెల్లరు నంగీకరింపవలసిన దై యున్నది. ఏ మైన విట వీరు సమంజస మైనసూరియాశయము ననుసరించి పూనుపొదవుల నాదిహల్లోపము లే దనునంశము నంగీకరించి రనవలె. అంతే గాక సూరిని సమర్థించుచు శ.ర.అభిప్రాయమును దిరస్కరించిరి. (వ్యా.సం.స.798] మఱి యట్టియెడల విటఁ బూనుపొదవులను నీలుగుప్రభృతులఁ జేర్పు టెట్లు? పూను యథాతథముగా గ్రహించిరి. పూను-సకర్మకము సకర్మకమునుగా ఊనుసకర్మకము మాత్రమె. సూ.వి. ఊనుధాతువునకు కకర్మకత్వమును నంగీకరించినను సకర్మకత్వమున పూనుధాతువునకు 'కదలుగు' అని యర్థముగా ఊనునకు నాటుకొను అని యర్థము -కొన్ని యర్థ విశేషములం దైక్యము నంగీకరించుటుచిత మని శ.ర. గు.ప్ర. ఆశయము -(వ్యా.సం.స.797)అనఁగా సూరి యాశయమును దిరస్కరించి శ.ర.,గు.ప్ర.లయాశయమును మోదించిరాయెను. సం.లో వీరు "పూను" నిందుఁ జేర్ప లేదు. (వ్యా.సం.స.797)

సూరి యుదాహరించినశబ్దముల నెల్ల సట్టియభేదస్థితిని వీరు గుర్తించిరి. వర్ణలోప మైనంతమాత్రమున నర్థభేద మెట్లు (చిలుక-చిల్క- నేరిచెను- నేర్చెను మొ॥ సూరియాశయ మెంతయు నుచిత మైయుండఁగా దానిని

వీరు తిరస్కరించుట కేవల మసమంజసము. 'పూను'ను జేర్చుట సరి గా దని వారిసం.వివరణమె స్పష్టము చేయు.

ఇంక వీ రిట పొదవు చేర్చినను 'సంభవించు, కలుగు' అనునర్థములు చూపుటచే నీయర్థములందే యాదిహల్లోప మగు నని చెప్పఁదలఁచి రన్నమాట. సం.లోను నీయర్థములం దిది నీలుగుప్రభృతులలోఁ జేర్పఁ దగిన దనిరి. (వ్యా.సం.స.789.800) కాఁగాఁ బొదవుధాతువునకు వీ రంతకు ముందు చూపిన వ్యాపించు పయికొను ఇత్యాద్యర్థములు ఒదవుధాతువునకు లేవు. ఒదవుధాతునకుఁ గల లభించు, వర్ధిల్లు, నెఱవేఱు (సూ.ని.) ఇత్యాద్యర్థములు పొదవుధాతువునకు లేవు. అట్టియెడలఁ బొదవులో నాదిహల్లోపముచే "ఒదవు" ఏర్పడిన దను టెట్లు? లభించు ఇత్యాద్యర్థములం దెట్లును ఒదవు ధాతువును ప్రత్యేకముగా నంగీకరింపవలసినదే కదా. సూరియాశయము సముచిత మైయుండ సరి గా దనుట కెట్టిప్రమాణములు చూపకయె వర్ధుల వారు తద్విరుద్ధముగాఁ బేర్కొనుట సరి గాదు గదా.

కావున వీరు పూనుపొదవులను నీలుగుప్రభృతులలోఁ జేర్చుట సరి గాదు. సూరిమతము సమంజసము.

సూరి నీలుగుప్రభృతులలోఁ బొందును జూపుటనుగూర్చి వీరు "పొందుశబ్దము క్రియయు, సంధి, మైత్రి యనునర్థములలో విశేష్యము నై యుండగా ఒందుశబ్దము క్రియమాత్రమె యగుచున్నది. ఇది సూరి చూచికొనలేదు గాఁబోలు" [వ్యా.సం.స.797) ననిరి. సూరి నీలుగు మొదలుగాఁ జూపిన వెల్ల ధాతువులె యగుట స్పష్టము. పొందునకు ముందువెనుకల నున్న వెల్ల ధాతువులె యైయుండ నడుమ నున్నపొందును ధాతువు మాత్రమె యగుట సహజము. పొందు విశేష్య మైయున్నను నది యీధాతువులనడిమిపొందుశబ్దముచే గ్రహింపఁబడ దని చెప్పుట యుచిత మైయుండ వీరు పొందును జేర్చుటను విమర్శించు టేల? సూరి చూచుకొనియె ధాతు

నగుపొందును ధాతువులనడుమఁ గూర్చినట్లు గుర్తింపవలెనా? ఉ.లో నట్లు గుర్తించి "పొందు"ను మూలవలెనె చూపు టుచితముగా నున్నది.

## పెండ :

బాల.ప్రకీ.11,12సూత్రము లట్లు గ్రహించిరి. [ఉ.అచ్చు.37,38] పేఁడశబ్ద మొయ్యారాదులలో నుండి తొలిదీర్ఘమునకు హ్రస్వము నొందును. ఇటు వట్టులవారు 'పేఁడశబ్దాదిదీర్ఘము హ్రస్వము కాఁగాఁ బిందాదిహ్రస్వము మీఁద ఖండబిందు వుండనేరదు గాన నది పూర్ణముగాఁ బరిణమించును. పేఁడ పెఁ+డ పెండ [వ్యా.సం.స.1783] ఉ.లోను పేఁడ-పెండ [సంధి.22వసూ] అనుటలో [ఉ.174] సం.లోనిపై యభిప్రాయమె యుద్దేశించి రనవచ్చు.

కాని యఖండబిందువున్నగా మారిన దని యూహింగాఁ జెప్పుట కంటె లక్షణముచే సాధించు టుచితము గదా. 'పేఁడ' యనుచో హ్రస్వము కాఁగా '(పెఁడ' అని యగు) ఖండబిందువు హ్రస్వముపై నుండును గాన 'హ్రస్వముమీఁదిఖండబిందువునకుఁ బూర్ణబిందువు వైకల్పికముగ నగును' (సం.14) అనుసూత్రముచే నిండుసున్న వచ్చి 'పెండ' యగును. వైకల్పిక మనుటచేఁ బూర్ణము రాక యొకపక్షమున ఖండ మట్లే యుండవలసియున్న ను 'అఁటయిఁచుఁదుశబ్దంబులం దప్ప'.. నుడితొలిహ్రస్వముపై ఖండబిందువు (సంధి 22) ఉండరాదు గావున ఖండ మట్లు యుంచుస్థితి వారింపఁబడి పై (సం.14)సూత్రముచే నిండుసున్నయే నిత్యముగా నగు నని గ్రహింపఁ దగును. వట్టులవారును 'పూర్ణముగాఁ బరిణమించు' ననుటలో నీప్రక్రియ యుద్దేశించిన ట్లనుట సమంజసమే.

## సిరుకోళ్ళ :

బాల.ప్రకీ.13,14,15సూత్రము లట్లు గ్రహించిరి. (ఉ.అచ్చు.40, 41,39)

'పదాంతంబు లయి యసంయుక్తంబు లయినసులురులయుత్వంబునకు లోపంబు బహుళంబుగ నగు' (౧౯) ననుసూరిసూత్రమును 'పదాంతంబు లగుసులురుల' యుత్వంబునకు లోపంబు బహుళంబుగా నగు' [ఉ.అచ్చి. 24] అని చూపిరి.

కాఁగా సూరిలక్షణమునందలి 'అసంయుక్తంబులయిన' అనుదళమును దొలఁగించి రన్నమాట. దీనింగూర్చి సంయుక్తములందును నీలోపము గలదు. వీరుకోళ్ళు- వీరుకోళ్- -[ఉ.౧౯౪][వ్యా.పం.స.౭౯౧] అద్విరుక్తములయం దీలోపము ప్రచురము. ద్విరుక్తములందు నొండురెండుచోట్లఁ గలదు గదా యని ద్విరుక్తాద్విరుక్తవివక్ష లేక సాధారణముగా నుత్వలోపము చెప్పుట లక్ష్యానుగుణమా? స్పష్టతను దగ్గింప నేల? కన్నెఱచి ఇత్యాదులలో ముందు క్రిందిహల్లు లోపింపఁజేసి [కన్ను-కను] యూపిదపనె యుట నుత్వ లోపము చేసిరి. [అసంయుక్తముల నని కవిభల్లైః మున్నగుచిం. లక్షణము నెడవలెనె] కాఁగా వీరుకోళ్, అలువుళ్ అనురీతి నొండురెండుప్రయోగములకై బహుళపద మాశ్రయింపఁదగియుండ లక్షణము నస్పష్టము చేయ నవసరము లేదు గదా.

'అసంయుక్తంబు లయి' అనుటచే ద్విరుక్తములందే కాక భిన్న హల్పరయుక్తస్థితిలోను నీలోపము సూరిలక్షణము వారించుచున్నది. తేర్లు తేర్(ల్) గోర్లు- గోర్[ల్] అనురీతి నుండవు గదా. ద్విరుక్తములందయినను అత్తు-అత్. కత్తు-కత్ అనురీతి నవునా? వీనిని వారించుటకై వీరు బహుళపదము నాశ్రయింపవచ్చును. కాని 'యసంయుక్తంబు లయిన' యనుదానిం దొలఁగించి ద్విరుక్తస్థలముల నొండురెండింటఁ దప్ప సాధారణముగా నీలోపమున కప్రవృత్తి యని చెప్పుకొనుటకంటెఁ బ్రయోగప్రాచుర్యము ననుసరించి 'యసంయుక్తములయం' దని స్పష్టము చేసి యూయొండు రెండుప్రయోగములు బహుళపదసాధ్యము లనుట మేలుగదా? కను కనే యేమో ముం దిట్లును జెప్పిరి.

"బహుళగ్రహణముచే సురులు అనువాదికి భిన్నస్థలములందును స్వరలోపము ..మాఋ+పల్కాన్.. మార్పల్కాన్.. ...పీటకోళ్ళు- పీట కోళ్ (అమ.1.71) అఱువుళ్ళు.. అఱువుళ్ (భాస్క.యుద్ధ.548) (ఉ. 188) ఇట్లివి బహుళపదసాధ్యము లని వారే నిరూపించియు 'అసంయుక్తంబు లయిన' అనుదానిచే నీరూపములు సాధ్యములు గా వనుట విరుద్ధము గదా.

కాఁగా పూర్వసూత్రమందలి "యసంయుక్తంబులయిన" అనుదళము ప్రయోజనవంతమై యుండఁగా వీరు దానిని దొలఁగించుట యసమంజస మని వారిమాటలచేతనె స్పష్ట మగుచున్నది.

"సుబురులయుత్వమాత్రమునకే లోపమును విధించుటచే మార్పులు కంగ, కీర్తురతల్పుగుండు, కీర్పడన్ మున్నగురూపములు బాలవ్యాకరణ సాధ్యములు గానేరవు" [వ్యా.స.సం.791] అని సం.లోఁ బేర్కొన్నను నిట వీరు వ్రక్తి మాత్రమునఁ జెప్పుటనుబట్టి వారి "సుబురుల" కుల్లోపము చెప్పుట సమంజసమె యని ఉ. ననుసరించియు గుర్తింపవచ్చు. బాలవ్యాకరణసాధ్యములు గా వన్న మార్పులుకంగ మున్నగునవి బహుళపదసాధ్యము లని ఉ.లో నిరూపించి యీయవి బాలవ్యాకరణసాధ్యము లగుట [బాల. లోను బహుళపదము గలదు గదా.] స్పష్టము చేసిరి.

కాని "మార్పులుకంగ" నన్నది బహుళపదముచే నిట సాధించిరి. అచ్చి.12.సూత్రమునందలి"ర"అనునది కొన్ని యులఘుఅకారములకును నుపలక్షణము [ఉ.158] అనిరి. అట్లే యిట నేల చెప్పలేదో. ఆసూత్రము [అచ్చి.12]నను బహుళపద మున్నది.

"మఱియుఁ గవిత్రయమువారు పలుమాఱుఁ బ్రయోగించిన విన్, వన్

తన్ అనురూపములను బాలవ్యాకరణమున సంగ్రహింపఁబడవయ్యె [వ్యా.సం.వ.౯౧] చిం.లో సాధించినట్లు బాల.లో సాధింపరాదా?

"నిన్,నన్,తన్, అనురూపములు నిన్నున్ నన్నున్ తన్నున్ అను వానినుండి కవిఖల్లటసూత్రముచే సంపాదించుకొనవలయును" [వ్యా.సం.వ.210] కవిఖల్లటసూత్రార్థము నీబాల.సూత్రము చెప్పదా? కవిఖల్లటసూత్రముచే నివి యగుట యెట్లు? వాక్యాన్తగతపదాన్త్యాచ్చ యని ద్రుతలోపము చేసి [నను] అన్యత్రలుక్చ యుక్తస్య యని జడ్డలోపము చేసి [నన్ను] అపిదపఁ గవిఖల్లటసూత్రముచే నుల్లోపము చేయవలె. "నన్నున్" అను దానిలో 'న్ను'వర్ణము కవిఖల్లటసూత్రముచే లోపింపదు గదా. నన్నైతె ననురీతిరూపములు నన్న యాధర్వణీయసమ్మతములు చేయవలె నన్న "నెల్లోల్ల" చేయవచ్చు నని యామార్గము చూపిరి. వా రనట్లిది యెల్లెల్లో యున్నది గాని సత్క్రమముగా లేదు. అది తద్గ్రంథపరామర్శనమున జ్ఞాతము.

ఉ.లో ఏ రిట నన్ను -నన్ -నిన్ను (న్)నిన్ తన్నున్- తన్ అను వనియు నుదాహరించిరి. నద్విత్వము లయ్యును నుత్వలోప మందిన దని చెప్పుట వీరియుద్దేశ్య మేమో. నిన్ను-నిన్ అనుచోవలె నన్నున్ తన్నున్ అనుచోఁ గూడ నవసానద్రుతలోపానంతరరూపమే చూపిన బా గుండెడిది. అయ్యెఁ దివర ద్రుతము లోపించిన దని యూహించుకొనవలె. కాని యిట నద్విత్వములందే యుత్వము లోపించిన దని చెప్పవక్కఱ లేదు. అకా రంబు క్రిందిది-[ఆచ్ఛి.25]సూత్రమునొద్ద విల్లు-విలు అనుదానితో నన్నున్ ననున్ అని యుమూర్ఖటిని జూపిరి. [సూచియు నను ఇత్యాదిగా జూపె] -కోఁగా నాసూత్రముచే జడ్డ [అవసానమున ద్రుతము] లోపింపఁగా ననం యుక్తి మయిన నువర్ణమునందే ప్రస్తుతసూత్రముచే నుత్వలోప మయిన దనఁదగు. వీరు నిట విల్లు-విలు- విలుప్పెవె అని జడ్డలోపానంతరపు టనంయుక్తస్థితినె చూపిరి. అట్లె నన్ను- నను- నన్ అని యేల చూపరాదో

వీరు స్పష్టము చేయలేదు. సూరియు మిస్వడె నని యుదాహరించె.

కాని యిట్టిప్రక్రియ సూరిసమ్మత మనలేము. వస్ బిలిచి ఇత్యాదు లందు నిట్లు నవసానద్రుతలోప మైన దనుసమన్వయము గుదురదు గదా. ఇట్లు దైన నవసానద్రుతలోప మై నాకొలకు + ఇచ్చె నాకొల కిచ్చె ద్రుతము లోపింప కున్న నాకొలకు నిచ్చె. ప్రథమేతరవిభక్తివిధ్యుత్తయేల, 'న్ను'వర్ణ మరుదుగ రాకుండుట గల దని యీసర్వనామములప్రక్రియ యం దూహించుట యుక్త మని తోచు.

ఇట సూరివివరణమం దొకదోషము నిట్లు పేర్కొనిరి.

"తత్పాలుర్ (అర.2.92) వలువుర్ (ఆమ.1.316) చింతుర్ (శాంతి.2.180) మున్నగునవియు సూరిచే సంగ్రహింపఁబడలేదు" (వ్యా.సం.ప.791) తత్పాలుర్పయం బందఁగన్, వలువ ర్తనయులు, చింతు ర్స్వామి- అని యిట వైశ్లైకల హల్పరకత్వమున నుత్వలోప మగుటంజేసి యీవిమర్శ సరి గా దని గుర్తించి ఉ.లో దానిని విడుచు టుచితముగా నున్నది.

"ఏనిలో పాలుర్ మున్నగు ప్రథమాదువర్ణోల్లోపమును ప్రౌఢ. సంగ్రహించె" (వ్యా.సం.ప,791) ననుటలోఁ బయిని సూరి ప్రథమా దువర్ణకమునం దుత్వలోపము చెప్పలే దని యెంచి రనిపించు. చింతుర్ అను నదియు [సూరి,ప్రౌఢ.]చే సంగ్రహింపఁబడలే దనిరే. సూరి దువర్ణోదాహృతులు వత్తుర్వారు కొర్కొనియె నని రెం డిచ్చెను. వత్తుర్వారు వంటిది గాదా చింతుర్స్వామి యన్నది. ఇది వీరు గమనింపలే దేమో. వత్తుర్వారు అనుచోఁ బ్రత్యయదువర్ణమునందును, కొర్కొనియె ననుచో శబ్దగతదు వర్ణమునందును నుత్వలోపమును సూరి స్పష్టము చేసె. చింతురు అనుచో వలె తత్పాలురు అనుచోటిదువర్ణమును బ్రత్యయమె. సూరి యిట నుత్వ లోపమును సంగ్రహింపలే దనుట సరి కాదు.

ఉ.లో నిట్టివిప్రస్తావింపకుం డుచితముగా నున్నది. కాని మఱియు నీవిధి హల్పరకత్వమందే నురులకు వర్తించు నని సూరి వ్రాసెను. అది సరి కాదు. ద్రోహిఁగాన్ [పద్యాంతము.] ఎట్లు సహింతుద్ [పద్యాంతము] అనిరి. [ఉ.168]

ఇదియు సరి గాదు. సూరి నురులకు హల్పరకత్వమం దీవిధి వర్తించు ననలేదు. "ప్రాయికంబుగా హల్పరకంబులకుఁ జూపఁబడియె" ననెను. వీ రవధారణార్థకము చేర్చి విపరీతార్థమును దెచ్చిపెట్టిరి. హల్పరమున్న [అవసాన] స్థలములయం దీవిధి వర్తిల్ల దనియే సూరి తలఁచిన ప్రాయికంబుగా నన నేల? [చూపఁబడె ననుటయు] బాహుళకంబుచే నీలోపము నురుల కవసానంబున లే దనిస్పష్టముగాఁ జెప్పఁడా? కాఁగా సూరిలక్షణము నకు విరుద్ధమైనవీరివిమర్శ యసమంజసము.

అవసానమున లోప మైనందులకు వీరు చూపినయుదాహరణములలో మొదటిది సరి యైనది గాదు. 'ద్రోహిని గాను' అనుచో 'కాను' అను క్రియాపద ముత్తమపురుషైకవచనాంతము. కావున నియ్యది ద్రుతప్రకృతి కము. అనఁగా నిందుఁ జివరినువర్ణము ద్రుతము. ఈద్రుతస్వరమునకు 'అవసానంబునందు ద్రుతస్వరలోపవిధి వేఱుగా నుండఁగా నది ప్రస్తుత సూత్రమునకు లక్ష్య మగుట యెట్లు? ద్రుతేతర మగు'ను'వర్ణకమున కుత్వ లోపమును జూపఁగలిగిన నది యీసూత్రమునకు లక్ష్య మగు. దీనింబట్టియు నిట సూరివివరణ ముచిత మని స్పష్టము. ప్రౌఢవ్యాకర్తయు (శబ్ద.16) నురువర్ణకములయందే చెప్పుట గమనింపఁదగు.

వీ రీసూత్రమునకు నేను-నేన్- తాను-తాన్ అనునవియు లక్ష్యము లుగాఁ జూపిరి. నేను, తాను అనునవి కళలుగా భావించియుండుటవలన నీ రీసూత్రముచేతనే యుత్వలోపము చేయఁదగును. కాని సూరి సముచిత ముగా వీనిని ద్రుతప్రకృతికములుగాఁ జెప్పెను గావున నవి సూరిమతమున దీనికి లక్ష్యములు గావు.

అనుస్వరంబు, సస్వరము అన్నవి బాల,సాధ్యములు గా పని చిం. లక్షణమును మూరి సంకుచితము చేసె నని (వ్యా.సం.ప.791) వరుసలవారు పేర్కొనుట సరి గాదు. ఈసూత్రముచే నట నుత్వలోప మేల రాదు? (చూ.త్రి.శే.)

## ఏకే ప్రాంతియే :

'బహుళగ్రహణముచేతనె ఏమి ఇంద్రుని మున్నగువానితుదిఇకా రాదులు లోపించును. ఏకే ప్రాంతియే, (ప్రౌఢ.సంధి.18) ఇంద్రున్వలెన్, (ప్రౌఢ.సంధి.17) పల్కాల్వంటి- (ఉ.189) అని ప్రౌఢ- చెప్పినవిశే షాంశము లిచ్చటిబహుళశబ్దముచే వీరు సంగ్రహించిరి.

'ఏమి ఇంద్రుని మున్నగువానిలోనితుదిఇకారాదులు' అనుటలో నిందు మొదటి దైనఏమిశబ్దమునందు ఇకారము లోపించు నేమో యని పించును. కాని లక్ష్యము ననుసరించి ఇకారాదు లనుచోటియాదిశబ్దముచే ఏమిలో 'మి'వర్ణమే లోపించు నని గ్రహింపవలెను. ఏమ్ప్రాంతియే యని యుండవలె గదా. ఇంద్రుని అన్నది మొదటఁ బేర్కొన్న బా గుండెడిది.

'ఇంద్రున్వలె' ననుచోఁ దత్సమమున నిత్యలోపము. ఇవి యెల్ల నాచ్ఛికవిధుల య్యును నిట బహుళశబ్దముచే సాధింపఁబడును గావునఁ దత్సమ మైనను బాధ లే దేమో. ప్రౌఢ.విధానము లట్లె గ్రహించిన బాగుండు నేమో కదా.

## పదమధ్యస్వరలోపము :

'ఆచ్ఛికంబులం బదమధ్యంబుల నలడరలయుత్వంబునకు లోపంబు బహుళంబుగా నగు' (17) లాంతియచ్చునకునహిత మొకానొకచో నరి

నడుమ లోపంబు గావంబడియెడి (18) అఖ్ఖరాదులం దుత్వంబునకు లోపంబు విభాష నగు (19) సనుసూత్రలక్షణములను గలిపి యీ రీతిఁ జెప్పెనిరి

"ఆచ్ఛికంబులం దమధ్యంబుల

1. సలదరలమీఁదిఉత్వంబునకు లోపంబు విభాష నగు

2. తద్భిన్నాక్షరములమీఁదను ఉకారేతరస్వరంబులును గొన్ని చోటఁ లోపించును.

3. ప్రత్యయపూర్వస్వరములును యథాప్రయోగముగ లోపించును

అచ్చి.29సూ.(బాప్రకీ.18,19సూ)

ఒకసూత్రముగా నెన్నిరి గాని సూరి మూఁడుసూత్రములయంతయు నిది యున్నది. ఇందలి మొదటియంశము దాదాపుగా బాల.ప్రక్రీ.17 సూత్రమే. ఈ రీతి నది మూలముగాఁ జెప్పనియే యుండుదు. అచ్ఛపౌర పాటునఁ బోయియుండును.

సూరి యట బహుళ మనఁగా నీ రీతి విభాష యనిరి. బహుళపద ముచే సిద్ధించువస్తు మితమసూత్రమందలి రెండవయంశముచేఁ జెప్పఁబడిన వని యెంచియుండుదు. విభాష యన్నమాత్రమున నాచ్ఛికపదము లన్నింట నడుమ సలదరల కే నుత్వము వికల్పముగా నగు ననరాదు" కొన్ని శబ్దముల లోవిసలడాదులలోపమీఁదియుకారమునకు నైతము క్వాచిత్కముగఁ బాక్షిక లోప మేని రాకపోవచ్చు నని వ్యక్త మగుచున్నది" ఉదా. పడుగు పదుగు పొలుగ మొ॥ (వ్యా.సం.ప.807) అంయర్థ మిట వీరు విభాషాపదమునకు వ్యవస్థ చేసికొనవలెను. తరువాతి2,3అంశములు నీవిషయమును సాధింపఁ జాలవు గదా. బహుళపదమువలనియువస్తు మేదో వీరు చెప్పలేదు. స్పష్టత నుద్దేశించి రన్నను విభాషకు వ్యవస్థ యవసర మైనది గదా. కాఁగా నీ(ప్రకీ. 17)సూత్రలక్షణము సూక్తము.

సూరి నలదరలయుత్వమున దన వీరు నలదరలమీఁదియుత్వమున కనిరి. ఇది వివరణమె. విశేషము లేదు.

ఇఁక వీరిసూత్రమందలి రెండవయంశము బాల. ప్ర. క్రి. 18 సూత్రము నుద్దేశించిన దనవచ్చును. కాని సూరి లాఁతియచ్చున కనుటచేతను, కల్కి- పొల్తి యనురీతి నుదాహరించుటచేతను నాచ్చికపదమధ్యమున నుచ్చి న్నస్వరమునకు మాత్రమె, నలదచేతరములపై లోపము నుద్దేశించె ననవలె. వీరిలక్షణముచే నలదరేతరములపైఁ గూడ నుచ్చిన్నస్వరమునకు లోపము వచ్చును.

నలదరలపై నుచ్చిన్నస్వరము గ్వాచిత్కముగ లోపించు ననుసూరి 'సూత్రాభిప్రాయము సమ్మతమె కద. అట్టియెడ బాసూత్రము నట్లు విల్చి వీరు విశేషముగాఁ జెప్పఁదలఁచినయర్థమును వేఱుగా సూత్రించిన మేలు గదా. నలదరేతరములపై నుత్తును దచ్చిన్నస్వరమును గొన్నియెడల లోపించు ననుట యింకను స్పష్టముగాఁ జెప్పఁబడిన ట్లగును గదా. కాని వీ రీరెండవయంశమునకుఁ జూపినలక్ష్యము లన్నియు సూరిసాధించినవే కావి వేఱు గావు.

2. ఆబ్బురము- అబ్రము. కప్పురము. కప్రము. నెత్తురు- నెత్రు. అప్పుడు- అప్డు ఇప్పుడు- ఇప్డు, ఎప్పుడు- ఎప్డు మొ॥ వలచు-వల్చు, కలికి -కల్కి- పొలితి- పొల్తి ములికి-ముల్కి- బదిపి-బద్పి మొ॥(ఉ 171)

ఇందు వీరు చూపిన కల్కి- ముల్కి- ఇత్యాదులు సూరి ప్రకి. 18 సూత్రమునొద్దఁ జూపినవే. వీరు చూపిన 'పొలితి' అచ్చు పొరపా టేమో, పొలఁతి' యని యకారమధ్యముగఁ బైని ఖండబిందువుతో నున్నశబ్దమునె వీ రుద్దేశించి రేమో. 'పొలితి' యనుశబ్దము గానరాదు. కలికి-ములికి యను వికారమధ్యము లగుశబ్దములవడువ నిచ్చుటనుబట్టి సందేహము. వలచు వల్చు అనుదానివెంట నుదాహరించిన దా గుండెడిది. దీనిని సూరి చూపె. వలచు-వల్చు అనునది పొలఁతి-పొల్తి వలె నీసూరిసూత్రముచే సాధ్యమె.

అల్పురము-అప్రయము ఇత్యాదిగా వీరు చూపిన లక్ష్యము లెల్ల 'అల్పు రాదులందు' (ప్ర.కీ.19) అనుసూత్రమునొద్ద సూరి యుదాహరించినవే కాని భేదము లేదు.

భేద మొకం డున్నది. సూరి యల్పురాదులలో 'చప్పుడు' శబ్దమును జూపెను. చప్పు అనురూపమునకుఁ బ్రయోగము కన్పట్టలేదు. అయినను నిది కోశములందుఁ జేర్పఁబడియున్నది' (వ్యా.సం.స.817) కోశములు సూరి నను బ్రయోగము కన్పట్టలే దని వీరు నిటుఁ బరిహరించి రన్నమాట. సూ.ని. వారె నది నప్పు లేక పాతాళమునకు (కాశీ.5.288) అను ప్రయోగమును జూపినది.

"ఒనర నపుడిప్పుడును జప్పు డనెడునుడుల, నుండెడుపువర్ణశృంగంబు లుడు పఁబడును, సరవి వప్పును చిప్పును జప్పు చనంగ, కోటికోటీందుపంకాశః కుక్కు-జీశ.(స.సా.సం. సంధి.44)నది నప్పు లేక పాతాళమునకు (కాశీ)"

కాఁగా సూరి చప్పుడు- (చప్పు-) అనుదాని నల్పురాదులలోఁ జేర్చు టుచితమే. వీరు పరిహరించుట సరి కాదు.

మొత్తముపై వీ రిటుఁ జూపినలక్ష్యము లెల్ల సూరి చూపినవే. మఱి సూత్రము లేల మార్చిరి? అం తే మే వపసిద్ధాంత మున్నదా? సూరి మూఁడు సూత్రములు చెప్ప తా మొక్కదానితో (రెండంశములతో) సాధించుటలో లాఘవము గల్గిన దని యెంచిరా?

సూరిలక్షణమునందలిస్పష్టత వీరిలక్షణమున నున్నదా? ఉత్వలోపము నలదరలయందుఁ బ్రచురప్రసిద్ధము. నలదరేఫములందుఁ 'గొన్ని మొదలనే' అకొన్నిపదలును నొకగణముగా నేర్పఱచి అల్పురాదు లని యం దుత్వలోపమును సూరి వేఱుగఁ జెప్పె నం దనౌచిత్య మున్నదా?

"నలడాదిసూత్రము(చిం.)నందలియాదిశబ్దముచే గ్రహింపఁదగిన వివిధవర్ణములలో నొక్కరేఫమునే సూరి గ్రహించుట యుక్త మైయుంద

లేదు. పలుకులఁజెయ్యుల— కాయ్యు— మున్నగు—వెనుకనుదాహరించిన నన్నయతిక్కనాదులప్రయోగములు సూరిపక్షమున సంగ్రహింపఁబడనేర వయ్యె. ఇంక నిట్టి వెల్ల బహుళగ్రహణముచే సూరిపక్షమున సాధించుకొన వలసియుండును' (వ్యా.సం.ప.81(ర)) అనునభిప్రాయముతోనె మీ రిట నిట్లు సూత్రించిరా?

సూరి నలదర లన వీరును నట్లె రేఫ మొక్కటే గ్రహించిరే. కాయ్యు మొద లగువానింబట్టి "నలదయుర" ఇత్యాదిగా నావివిధవర్ణములు నిందు నేలైన గ్రహింపరాదేమి? సూరి "నలదర" లనుట యుక్త మనియే గదా వీరు నట్లు చెప్పినది?

ఇట్లని సూరి నలదరేతరముల నుత్వలోపము చెప్పలేదా? సూరి సాధించిన అత్రుబము మున్నగునవే గదా మీ రిట నుదాహరించిరి. సం.లో చూపిన చెయ్యు, కాయ్యు అనునవి (యిటఁ జూపఁదగు) సాధించుటకు బహుళపదము నాశ్రయింప నేల? (అవి దగునిట్టిరూపములకై బహుళపదము నాశ్రయించినను దప్పేమి?) చెయువు. కాయు వనువాని నబ్బురా దులలోఁ జేర్పరాదా? ఇత్యాదు లనెనే కాని సూరి యబ్బురాదిని నియతగణముగాఁ జెప్పలేదే.

కాఁగా నలదరేతరముల నుల్లోపమును సూరి ప్రకీ.18సూ.చే సాధించియే యున్నాఁడు. కాఁగా సూరి ప్రకీ17సూ.చే నలదరలమీఁద 18చే నలదరేతరములమీఁద నుత్వలోపమును, 18చే నలదరలపై నుద్భిన్నస్వర లోపమును సాధించె.

ఈయర్థములు వీరు వంగీకరింతురు. అట్టియెడ నాసూరిసూత్రము లట్లే గ్రహింపరాదా?

ఇంక వీరు నలదరేతరములయందును నుద్భిన్నస్వరమునకు

